వాహినీపతి వంశజుల చరిత్ర

యను నామాంతరము గల

# చంద్రవంశజుల చరిత్ర



ఇయ్యది

శ్రీ సద్గురు సేవానందభరితుండును శ్రీ బుధజనవిధేయుండును

యజుశ్శాఖాధ్యాయ ఆపస్తంబసూత్ర విశ్వామిత్ర

గోత్రోద్భవుండగు


టి. ఏ. ఆగయ్యవర్మచే


రచింపబడి

పండిత పరిష్కృతానంతరము


బెజవాడ, ఆంధ్రగ్రంథాలయముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె

1936




[ వెల రు. 2-0-0

# ఉపోద్ఘాతము

[illegible]దూరమందున్నయట్టి వస్తువులఁ జూచి
[illegible]ముసి దగ్గరగలవాని వదలఁబోకు
పిన మె దూరపుఁగొండలు నునుపటంచు
నంద అనుకొనుచుండెడియట్టి పల్కు॥

ఇదివఱకు మార్గ మేర్పడని మహారణ్య మధ్యమునగల నొక పారిజాతవృక్షమును వెదకునట్లు కవీంద్రుల రసప్రవాహములలో, వాక్చాతుర్యములలో, కల్పనాకౌశల్యములలో, మునిగి త్వరితముగ గుర్తించదగినంత యవకాశములో లేక 'నివురుగప్పిన నిప్పువోలె' అణగియున్న 'మున్నీరుకాపు' కుల చరిత్ర వ్రాయుట సులభసాధ్యముకాదు. ఐనను వెదకువానికే దొరుకునను న్యాయము గలదు.

క్రీ. శ. 1926 సం॥లో మహాజనసభ సమావేశమై కులనామముయొక్క పూర్వరూపము తెలియనికారణమున మహాజనితవాదములు బయలుదేరెను.

దీనిపై సర్వవిధములను మన హిందూదేశమునకు మేలు కలిగింపఁగోరి సర్వేశ్వరుం డనుగ్రహించిన చొప్పున నీ దేశంబు నాంగ్లేయులు స్వాధీనముచేసికొని తమ రాజ్యమును దిరంబుగ నిందు స్థాపించిరి. వీరిలో తెలుగుభాషను లుప్తముగాకుండ కాపాడిన మహాత్ముఁడు, సి. పి. బ్రౌను దొరగారు. వీరు ఇంగ్లండ్ యందు జన్మించినను రాజ్యతంత్రము నడుప నీ దేశమున

# ఉపోద్ఘాతము

గీ॥ దూరమందున్నయట్టి వస్తువులఁ జూచి
భ్రమసి దగ్గరగలవాని వదలఁబోకు
వినమె దూరపుకొండలు నునుపటంచు
నంద అనుకొనుచుండెడియట్టి పల్కు॥

ఇదివఱకు మార్గమేర్పడని మహారణ్య మధ్యమునగల నొక పారిజాతవృక్షమును వెదకునట్లు కవీంద్రుల రసప్రవాహములలో, వాక్చాతుర్యములలో, కల్పనాకౌశల్యములలో, మునిగి త్వరితముగ గుర్తించదగినంత యవకాశములో లేక 'నివురుగప్పిన నిప్పువోలె' అణగియున్న 'మున్నీరుకాపు' కుల చరిత్ర వ్రాయుట సులభసాధ్యముకాదు. ఐనను వెదకువానికే దొరుకునను న్యాయము గలదు.

క్రీ. శ. 1926 సం॥లో మహాజనసభ సమావేశమై కులనామముయొక్క పూర్వరూపము తెలియనికారణమున మహాజనితవాదములు బయలుదేరెను.

దీనిపై సర్వవిధములను మన హిందూదేశమునకు మేలు కలిగింపఁగోరి సర్వేశ్వరుం డనుగ్రహించిన చొప్పున నీ దేశంబు నాంగ్లేయులు స్వాధీనముచేసికొని తమ రాజ్యమును దిరంబుగ నిందు స్థాపించిరి. వీరిలో తెలుగుభాషను లుప్తముగాకుండ కాపాడిన మహాత్ముఁడు, సి. పి. బ్రౌన్ దొరగారు. వీరు ఇంగ్లండ్ యందు జన్మించినను రాజ్యతంత్రము నడుప నీ దేశమున

కొచ్చి తెలుగుభాషయం దభిరుచి కలిగి కావ్యములను చదివి చక్కని సాహిత్య మలవఱచుకొని మిక్కిలి ధనవ్యయము గావించి మనుచరిత్ర వసుచరిత్ర మొదలగు కావ్యములకు టీకవ్రాయించి శిథిలములగు తాళపత్రగ్రంథములను చక్కని కాగితములపై వ్రాయించి దొరతనము వారి ప్రాచీన లిఖిత గ్రంథభాండాగారంబునఁ జేర్చి ప్రతిపుస్తకమునం దుపోద్ఘాతమును తన స్వహస్తముతో వ్రాసెను.

ఈ మహానీయుడు విశేషప్రయాసతో సేకరించి పదిల పఱుపకున్న నేడు చరిత్రకారు లిచ్చుచున్న గ్రంథాధారము లనాధారములై యుండును. మన భాష కిత డొనర్చిన మహోప కారమును తెలుగు దేశపుజను లెన్నడును మఱువజనదు.

ఇట్టి శోధనాసమర్థులగు నాంగ్లేయులుగాని ఇతర పాశ్చాత్యులుగాని ద్రవిడకర్ణాటాంధ్ర పండితులుగాని ఎట్లు నిర్ధరించి వ్రాసియున్నారో యని వారివారి అముద్రితా ముద్రిత గ్రంథములను, కులపత్రికలను, దానశాసనములను, స్థలపురాణములను పరిశోధింపఁగ

మున్నీరుకాపులు ద్రవిడమున మూర్ వెళ్లాన్మెవారనియు ఆంధ్రదేశమున వెలమవీరులనియు కన్నడదేశమున వక్కలిగర్ లేక సముద్రకులకాపులనియు నైజాంరాజ్యమున మున్నీరు కాపులనియు ఇట్లొక్కొక్క దేశమున నొక్కొక్క పేర పిలువఁబడు చున్న వీరెల్ల నొక్కజాతివారై దేశభాషాభేదములఁ బట్టి పేళ్లు మారుట సంభవించినదనియు చాళుక్యరాజులు మూర్ నీరు కులకాపులేయనియు స్పష్టముగ తెలియవచ్చెను.

మున్నీరుకాపువీరులు తమ చారిత్రికవిషయములను గుఱించి పరిశోధింపకుండుటచే పామరులు పలువిధముల "రత్న పరీక్ష తెలియనివాఁడు రత్నమును ఱాయి అన్నటుల" బలుకు చుండిరి.

అక్షరజ్ఞానములేని పామరుల పలుకులనెల్ల బాటింపక నిజచరిత్రాన్వేషినై సత్యమునే పెల్లగించి బయలునకు తీసి వ్రాసితిని. వెంబడే

నాకు పరమమిత్రులైన బ్రాహ్మణులు, విశ్వబ్రాహ్మ ణులు, వైశ్యులు మొదలగువారినిగుఱించి ఇంతకుపూర్వము వైరవర్గములచే వ్రాసిన విషయములను తొలఁగించి నిక్కమైన చరిత్ర చక్కని శైలిలో పెక్కు యాధారములతోఁగూడినది గను వ్రాసితిని.

ఈచరిత్ర వ్రాయునపుడు దోడ్పడినవాటిలో ముఖ్య మైనవి కొలనుపాకయందలి 18 జాతుల దానశాసన పత్రము లును, అముద్రిత బ్రహ్మాండగోళపురాణమును, హారవిలాసమును మఱియు బ్ర. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారియు చరిత్ర పరిశోధకాగ్రేసరులయిన శ్రీయుత ప్లీటుదొరగారి థర్స్టన్ దొరగారియు ద్రవిడకర్ణాటాంధ్రాంగ్లభాషచరితములనెల్ల పరి శోధించిన యు.సుబ్బారాయభట్టు ఎం. ఏ., యల్. టి. గారియు కె. రామకృష్ణయ్య యం. ఏ. గారియు ఇటు లనేక గ్రంథము లునుకైయున్నవి.

పైగ్రంథకర్తలకును కొలనుపాక బ్ర.శ్రీ నీలకంఠయ్య గారికిని కృతజ్ఞతావందనము లర్పించుచున్నాఁడను. గ్రంథరచన

యందు నాకు తోడునీడగానున్న బ్ర.శ్రీ కే. వెంకటరామయ్యా పంతులుగారికిని బ్ర. శ్రీ పాండురంగారావుగారికిని వందనసహస్రము లర్పించుచున్నాడను.

ఈకార్యమునకు అభిమానులై ముద్రితానంతరము తప్పక తక్షణమే వెలయిచ్చి పుచ్చుకొనునట్లు స్వహస్తలిఖితాక్షరములతో అభయ మొసగిన వారలకెల్ల వందనము లొనర్చుచున్నాడను.

ప్రస్తుతము కొలనుపాకకు తహశీలుదారుగానున్న శ్రీయుత నవ్వా నారాయణరావు మస్తైదార్ గారు చుట్టుగ్రామములనుంచి తాళపత్రగ్రంథములను కులపత్రికలను తెప్పించి నాకు తోడునీడయై సాయమొసరించినందులకు వందనశతము లొనర్చుచున్నాడను.

గ్రంథ మందునంతవఱకు నిరుత్సాహమును విచారకరమును సమీపమునకు రానివ్వక ధైర్యముచే సంఘకార్యములను సక్రమముగా నెరవేర్చుచుండిన మున్నీరు కాపు సంఘనాయకులకును సంఘసభికులకును వందనసహస్రము లొనర్చుచున్నవాడను.

టి. ఎ. ఆగయ్యా వర్మ,
హైద్రాబాద్. డక్కన్.

---

# పండితాభిప్రాయములు

సంస్కృత ద్రావిడాంధ్రములయందు విద్వాంసులగు
కోవెల్ కందాళ్ శ్రీరంగాచార్యులుగారు.

సీతారాంబాగ్ దేవస్థానం ఆస్థానపండితులు హైదరాబాద్
(డక్కన్)

వైద్యభాస్కర. పి. వి. వరదాచార్యులుగారు.

ఆసూరి మరింగంటి శ్రీనివాసాచార్యులుగారు.

డాక్టర్ ప్రి. భ. ఆరావముధాచార్యులు. ఎ. ఐ. ఎ. వి.
ఆయుర్వేదభిషక్

అచ్చి నరసింహాచార్యులవారు, కాగిదాలగూడెం, హైదరాబాద్
(డక్కన్)

టి. ఎ. ఆగయ్యావర్మగారు రచించిన "వాహినీపతివంశజుల చరిత్ర" యను నామాంతరముగల "చంద్ర వంశజుల చరిత్ర" అనే గ్రంథము యథార్థచరిత్రయైయున్నది.

ఇది పూర్వసంప్రదాయముచొప్పున తేటతెలుగున చదువుటకును, వినుటకును కూడ యింపుగా నుండేటట్లు రచితమైనది.

ఈ గ్రంథము తెలుగుదేశమందలి కాపులకందరికిని ఉపయోగకరమై సన్మానింపదగినది.

ఇందులో జూపఁబడిన గ్రంథాధారములను గురించి ఆయాగ్రంథములనవలోకించితిని.

అరవమునందు "దివాకరమ్" అను పేరుగల కోశము గలదు. ఇది ౯-౧౦-వ శతాబ్దమున కంటెను ప్రాచీనమైనది. ఇందు "చళిక్య" (చాళుక్య) రాజులు "ముఽ వేళ్‌కుల నృపతులు" అనగా "మున్నీరుకుల రాజులు" అని యీపదమున కర్థము. వీరినే "ముఽ వెళ్లాళ్ళ" వారనియెదరు.

ముణ్ వెళ్ళం అనగా (మున్-నీరు) మున్నీరు.

అనమాయ్ అనగా? ముని జలార్గళ శాస్త్రప్రకారము జలముందు స్థలమును పరీక్షించు "కాపు" వృత్తిగలవారాటచే "మున్నీరుకాపు" లను నామము సార్థక నామమై యున్నది.

చాళుక్య రాజవంశజులే తెలుగులోని "మున్నీరుకాపులు" "వెలమ కాపులు" కన్నడములోని "వక్కలగర్" మొదలైనజాతులుముణ్ వేళ్ కుల జాతులనియేమున్నీరుకులకాపుజాతివారనియే చెప్పవలెను. వీరందరును మొదట నొక్కజాతివారే కాని, ఆయాదేశభేదములఁ బట్టి ఆయాదేశ భాషలలో పేళ్లు మారుట సంభవించినను అర్థమొక్కటియేయై బోధపడుచు నొక్క జాతివారేయని సిద్ధాంత మైయున్నది.

పురాణాదులయందు సహా నామ రూపభేద మైనటుల గాన్పించు చున్నది.

ప్రాచీన నామపరిశోధనావిషయమున విశేషాదరము జూపబడు చున్న యీకాలమున ప్రస్తుతముపయోగించుచున్న కులనామములపూర్వరూప చరితమును దెలిసికొనుటకు గుతూహల మెల్ల వారికిని మెండుగా నుండక మానదు. ఇట్టితరి దమబుద్ధివిశేషముచే సత్యమునే వెల్లగించి బయలునకు దీసి ప్రకటించిన కదా నిజనామమును నాచరించుకొని యుం డిన యవిద్యాకారణ శబ్దోచ్చారణచే నేర్పడిన తమంబంతయు గ్రమ క్రమముగా దొలగిపోవుచున్నది. గావుననే

టి. ఎ. ఆగయ్యావర్మగారు శాసనములను పురాతన గ్రంధరాజములను నాధారములుగా గొని సత్యాన్వేష పరుడై విశేషపరిశ్రమజేసి వ్రాసిన ఈ గ్రంధము మున్నీరుకాపుకుల సోదరులయం దాత్మశక్తియు, నాత్మ గౌరవమును బురిగొల్పుచు, తమవెనుకటి చరిత్రయందలి యథార్థసిలిని భావియభ్యుభ్రయమందు విశ్వాసమును ఉజ్జీవింప చేయుగలదనియు, ఇందు గల గ్రంధాధారములు, శాసనాధారములు స్వజాతీయుల సంతృప్తిపరుప గలవని నాదృఢమైన విశ్వాసము.

——

బ్రహ్మర్షి కవిరాజ పండితేత్యాది బిరుదాంకితులగు

## బ్రహ్మశ్రీ దంతనాల నాగేశ్వర శాస్త్రులవారు, బెజవాడ.

ఈ వాహినీపతివంశజులచరిత్ర అను నామాంతరముగల "చంద్రవంశజులచరిత్రము"ను గ్రంథకర్తగారు నాకు జదివి వినిపించిరి. కొన్నిభాగముల నేను స్వయముగ చూచియుంటిని. పూర్వ చారిత్రరచనయందు శ్రద్ధ వహించినారనుట సత్యదూరము గాదు. పురాణములయందు చరిత్రాంశములకంటె వర్ణనావిశేషము లెక్కుడుగనుంటచే నవి చరిత్రగ్రంథములుగ పరిగణింపఁబడుట కవకాశము లేకపోయెను. ఇప్పటి పాశ్చాత్యపద్ధతి ననుసరించి, ఆధునిక కవులు, పండితులు ననేక చరిత్రములను వ్రాయుచున్నారు.అయిన నింక హైందవలోకమున కాచరిత్రల కొంత తీటియుండ లేదనుట యథార్థము.

టి. ఎ. అగయ్యవర్మగారు రచించిన యీ చరిత్రమునందు ప్రత్యేకముగ తమ జాతినిగూర్చి సంపూర్ణముగ జర్చించియుండిరి. వీరు దేశచరిత్రలు పురాణములు మొదలగు పెక్కుగ్రంథపరిశోధన మొనరించి యీ గ్రంథమును వ్రాయ సమకట్టినట్లు పాఠకలోకము గుర్తెఱుంగకతప్పదు.ఇందుతో బాటు విశ్వబ్రాహ్మణ వైదికబ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లాదిగాగల జాతుల చరితములు క్లుప్తముగ వ్రాయబడియుండెను. ఇందు శ్రుతిస్మృతి చోదితములగు విషయములను జేర్చుటచే సామరస్యభావముతో నబాధితములై సర్వజన హృదయాహ్లాదజనకంబుగ నలరారుచున్నవి. జలార్గళశాస్త్రాభ్యాసకులు "మున్నీరుకాపు"వారని విస్పష్టముగ నిర్వచించియుండిరి. చాళుక్యులు "మున్ వేళ్ కుల" కాపులని చరిత్రకారు లనేకులు వ్రాసియుండిరి. అందు ద్రావిడభాషాచరిత్రలు మిక్కిలి యాధారముగ గన్పట్టుచున్నవి. అట్లు పండిత పరిష్కారమైన విషయమును ముందిడుకొని యీ చరిత్రము వ్రాయబడినదనుట నిస్సందేహము.ఈగ్రంథము సర్వజనాదరణీయమని చెప్పక తప్పదు. శైలి సులభము. వ్యాకరణసందర్భము లిందు ముఖ్యమైనవిగ గ్రహింపబడలేదు. విషయము మృదుమధురములగుమాటల జక్కగ నేర్చి పండిత పామర జన హృద్యముగ గూర్చిరి.

అమితవ్యయప్రయాసలకోర్చి వీరొనరించిన చారిత్రకకృషి మిక్కిలి శ్లాఘాపాత్రము. ఇట్టి గ్రంథకర్తలకు ప్రజలు సర్వవిధముల దోడ్పడి వారి సద్గ్రంథప్రయత్నమునకు దగినంత దోహదక్రియలాచరింతురుగాతమనియు నింక చారిత్రక పరిశోధన కనువగుబుద్ధివైశద్యమును దీర్ఘాయురారోగ్యంబులను భ్రసాదించి శ్రీ వప్పర్తేశ్వరుండనవరతము రక్షించుగాత.

## —♦ పుస్తకములు కొనుటకు అభయమిచ్చినవారి పేర్లు ♦—



### విశ్వబ్రాహ్మణులు
### శికింద్రాబాద్

కాసాల బ్రహ్మయాచారి సభాపతిగారు
మంగోలు బ్రిహ్మయాచారి „
మంగోలు నారాయణాచారి „
మేడిపల్లి యంకయాచారి „
దుబ్బాక నారాయణాచారి „
చెన్నోజు బాలకృష్ణయాచారి సభాపతిగారు
సుదాపిరం లక్ష్మినర్సయాచారి „
రామేశ్వరం బాలరాజయాచారి „
శెరిపల్లి నరసింహాచారి „
రుద్రివరం శేఖరాచారి „
కొల్లూరి పాండు ఆచారి „
మిడిదొడ్డి వెంకన్నాచారి „
గంభీరావుపేట భుజంగాచారి „
కట్టడం శ్రీధరాచారి „
చిట్టాపురం రామయాచారి „
కడియాల రామయాచారి „

### హైదాబాద్

మంగోలు రామచందాచారి గారు
పంజకాడి తల్లోజు యంకట రామయాచారి „
ములుకాల గంగయాచారి „
ములుకాల వెంకటాచారి „
నంబిగారి చెన్నయాచారి „
బేగంపేట వీరాచారి గారు
వెలిజాల గంగదాస్ ఆచారి „
వెలిజాల అనంతాచారి „
చొల్లేటి సత్యనారాయణాచారి „

### పెంజర్ల

పెంజర్ల మయాచారి „
మేడిపల్లి లక్ష్మినర్సయాచారి „
యాచరేని కిష్ణయాచారి „
శిద్దిపేట బాలయాచారి „

### ధూల్‌పేట

కడియాల చంద్రియాచారి „
కణతాల వెంకటాచారి „

### బాలాపురం పట్వారి

మియ్యాపురం రంగయాచారి „
యిందిరాల రాఘవాచారి „
కొండల రంగయాచారి „
మైలారం యంకటాద్రి ఆచారి „
కుందారపు నరసయాచారి „
కాసోజు యతిరాజాచారి „
కాసోజు రంగయాచారి „
తంగెళ్లపల్లి రాజయాచారి „
మేడిపల్లి సీతారాములు ఆచారి „
కౌయిదాలగూడెం వీరాచారి „
రాజపేట రాజయాచారి „
మంగోలు లక్ష్మికాంతయాచారి „
మంగోలు సీనయాచారి „
పంజకాడి తల్లోజు రంగయాచారి „

అబ్బలుగంజు పీలుకానకారువాన
ధూల్ పేట యాదవకిడికి మొద
లగు వీధులు

దుబ్బాక లక్ష్మయాచారి గారు
నల్లనాగుల సత్యనారయణాచారిగారు
కుందారపు మాణిక్యాచారి ,,
వల్లపు దుర్గయాచారి (జి-గు) ,,
దేవరకొండ నారాయణాచారి
సభాపతిగారు
భసువోజు నరసింహ్మాచారి ,,
చెప్యాల రాజయాచారి ,,
చింతమడక రాములు ఆచారి ,,
తుక్కాపురం రాజలింగాచారి
కొ॥ నరసింహాచారి ,,
మద్దికుంట రాజయాచారి ,,
లేమూరి చన్నయ్య శంకరయాచారి ,,
శిద్దిపేట బాలయాచారి ,,

యాకుతుపుర డబ్లీపుర

గంభీర్రావుపేట వెంకటేశాచారిగారు
రామయాచారి ,,
తిమ్మాపురం జోగయాచారి ,,
చెన్నోజు బళ్ళారి తిరుమలాచారి ,,
యెల్కటూరు చంద్రియాచారి ,,
కుందనగరిరామయాచారిత్వష్టాచారి ,,
తాడూరి బాలాచారి ,,
బళ్ళారి శేషయాచారి ,,
హన్మకొండ సత్యనారాయణాచారి ,,
తాడూరి కిష్టయాచారి ,,
తాడూరి లక్ష్మణాచారి గారు
తుక్కాపురం నర్సయాచారి ,,
మెతుకు వెంకటేశంగారి యంకయా
చారి ,,
తిరుమలగిరి రామలింగాచారి ,,
అవుజుమీది కిష్టయాచారి ,,
తూపురాక రంగయాచారి ,,
కోడిమ్యాల మునిరాజేంద్రాచారి ,,
మంకోజు కంచరి బ్రహ్మయాచారి ,,
మంచిరేవుల వెంటయాచారి ,,
తంగెళ్లపల్లి కిష్టయాచారి ,,
తంగెళ్లపల్లి కంచయాచారిగారి
సానకొలుగారు ,,

ఇతరగ్రామములు

చింతలతడపు లక్ష్మణాచారిగారు
నారుశింగు
ఈశ్వరోజు ముత్తయాచారి ,,
చంచలగూడ
రంగన్నఆచారి (కొత్తగడి)
కల్పగూరు॥ తా॥ ,,
బార్దానమశ్శివయాచారి ,,
శంకరయ్య ఆచారిగారు ,,
రాజంపేట
దురిశెడు యాదగిరిఆచారి ,,
కొండమడ్గు
గండ్రిమళ్ల చలుమయాచారి ,,
భువనగిరి
తంగళ్ళ ధర్మయాచారి భువనగిరి ,,

దరిశెడు వరదయాచారి గారు
(కొండమడ్గు)
దరిశెడు తిరుపతియాచారి ,,
(కొండమడ్గు)
పంజకొండి తల్లోజు యంకయాచారి ,,
(రావిరాల)
తొగటి రామబ్రహ్మచారి ,,
(ఓరుగల్లు)
అయిలరాజయాచారి (పెంబర్తి) ,,
రాజంపేట క్రిష్ణయాచారి ,,
(రాజంపేట)
నారాయణదాస్ తిమ్మయాచారి
నేగేదార్ మాల్ (దేవరకదిరె)
గోలకొండ రామయ్యగారి
లక్ష్మయాచారి (శంశాబాద్) ,,
మండలోజు వీరాచారి కొ॥ రాఘువా
చారి (వరుకుడుపల్లి తాలూక)
బొడ్డుపల్లి బ్రహ్మయాచారి ,,
(కేశవగిరి)
బొడ్డుపల్లి శ్రీరాములు ఆచారి ,,
(కేశవగిరి)
అంటె రామచంద్రయాచారిగారు
(మోదీన్ పాషాదేవిడి)
ధర్మపురి అన్మయాచారిగారు
(ఆసపునగరు)
మల్లయ్యాచారిగారు (ఆసపునగరు) ,,

బెజవాడ

పెదప్రోలు సూర్యనారాయణగారు
డి-తాలూకాబోర్డు వైస్ప్రెసిడెంట్
మద్దుర్తి శివబ్రహ్మచార్యులు గారు
అనుపోజు అప్పలాచారి ,,
వానపల్లి సత్యనారాయణాచారి ,,
కేసనికుర్తి లక్ష్మికాంతాచారి ,,
పట్నాల చిరంజీవాచార్యులు ,,
బంగారు కుమారస్వామి ఆచార్యులు ,,
కోసూరు రాజాచారి ,,
పట్నాల సత్తెరాజు ,,
గన్నాభక్తుల నారాయణబాబు
ఆచారి ,,
గానాల అప్పల నరసయ్యాచారి ,,
బంగారు అప్పారావు ఆచారి ,,
చేపూరు వెంకట రత్నాచారి ,,
చింతాడ పార్వతీశాచార్లు ,,

వైశ్యులు (గుప్త)

హైద్రాబాద్

అరుగొండ లక్ష్మయ్య గారు
బచ్చు మల్లయ్య ,,
లింగ వీరయ్య ,,
యిరుకుళ్ళ బాలరాజయ్య ,,
మిరియాల నారాయణ ,,
జయిన బుచ్చయ్య ,,
కాపర్తి నరిసింహులు ,,
మాణిక చంద్రయ్య ,,
చీల అనంతయ్య ,,
తేరాల నారాయణ ,,
కాపర్తి ముత్తయ్య ,,
పార్శి లింగయ్య ,,

నేతి రాజయ్య గారు
బూసం ఈశ్వరయ్య ,,
గరుడపల్లి శివలింగయ్య ,,
దెబ్బడి భూమయ్య నారాయణ
కౌర్వాన ,,
రెడ్డిశెట్టి రాజన్న గారు ,,
బూచ పాపయ్యగారి వీరయ్య ,,
బిజ్యాల రామన్న సముద్రాల
రాఘవులు ,,
సముద్రాల రాఘవులు ,,
బిజ్జాల చినయీరయ్య ,,
కూర సుబ్రమన్యం ,,
వుప్పల యంకయ్య ,,
ముక్కా యల్లయ్య బాలగంజు ,,
చింతల వీరయ్య ,,

ఉస్మాన్‌గంజు

లోకుల లక్ష్మయ్య గారు
మిరియాల రామలింగయ్య ,,
బిజ్జాల లక్ష్మయ్య పద్మరామయ్య ,,
కోడారపు లక్ష్మీనర్సయ్య ,,
మొగుడంపల్లి వెంకటరామయ్య ,,
తమ్మి మల్లయ్య యంకయ ,,

బా ల గం జు

గట్టు అన్నయ్యగారి
రామయ్యచౌదరి గారు
శాతవెల్లి యంకయ్య ,,
శాతవెల్లి నారాయణ ,,
నంగునూరి వెంకటరాజయ్య
సరపికాస్ ,,

పా త వా ర ధి

వంగపల్లి లింగన్న గారు
వంగపల్లి నాగభూషణం ,,

బె జ వా డ

వనమా బాపనయ్య గారు
గుఱ్ఱం సుబ్బారావు ,,
రాయపూడి విశ్వనాథం ,,

శి కిం ద్రా బా ద్

పుడుత శంకరయ్య గారు
గుండా బాలకిష్టయ్య ,,
తేలుకుంట నరిసిములు ,,

ఉ స్మా న్ గం జు

గుబ్బ రామలింగయ్య గారు
కొక్కొండ బుచ్చయ్యసోమరాములు

చాత్తాద వైష్ణవులు

రామానుజయ్య చాదరుఘాట్
స్కూల్ హెడ్మాస్టర్
తిరుళఖురి రంగస్వామిగారు
కోవెల రంగయ్య సమాధి
తిరువాన్కూర్ కృష్ణదాస్
హరికథ సంగీత వైద్య కావ్య
విద్వాన్ గారు
తిరునగరి రంగయ్యగారు కైంకీపరు

N. S. R

బెల్లంకొండ నర్సయ్యగారు గుమాస్తా
పట్వారి మలకపేట
కణుతాల వెంకటప్పయ్య
పట్వారి భాగుమాసారాం

### మున్నీరుకాపులు
### శికింద్రాబాద్

మండల రంగయ్య గారు
పోరెడ్డి రాజయ్య ,,
అనంతుల రాజయ్య ,,
సాకల్లి సత్తయ్య ,,
ఏనుగుల నరసింహ్మలు ,,
గుడికందుల రాజన్న ,,
కైలాస నరసింహ్మం ,,
గంప కన్నయ్య ,,
ధర్మపురి నరసింహ్మలు ,,
మల్లం రామన్న ,,
పొన్నాల కుప్పుస్వామి ,,
నారదాసు బుచ్చయ్య ,,

### బాగ్ లింగంపల్లి

తోట రంగన్న గారు
హజారి సాంబయ్య ,,
పటేలునోముల రామయ్య ,,
బుడుమని రాజయ్య ,,

### హైద్రాబాద్ మున్నీరుకాపులు

అకుల నరసయ్య గారు
పుప్పాల బాలయ్య ,,
కొలనుపాక బాలయ్య ,,
జాల మల్లయ్య ,,
కాశి దుర్గయ్య ,,
బుర్రి వెంటయ్య ,,
వేముల గోపాలకృష్ణయ్య ,,
నీలకంఠం రాజయ్య ,,
ఏన్గుల తులుజయ్య గారు
యెల్లం సీతారామయ్య ,,
అమిదాల చంద్రియ్య ,,
మద్దుల అంజయ్య ,,
కోలస్వామి ,,
పసులరంగయ్యగారు మొ॥ కాపు ,,
నీలకంఠం రామన్న ,,
యేచని వెంకటస్వామి ,,
బందరు చంద్రయ్య ,,
పొంగలిగారి వెంకన్న తురుపుబజార్
ముత్యాల మంకయ్య ,,
దూసచంద్రియ్య ,,
పుంజరి కిష్టయ్య ,,
చిట్టం అంజయ్య ,,
పట్టెం నాగయ్య ,,
ఏచని గౌరయ్య సుబేదార్
యి॥ సరవ్ కాస్ ,,
రావుల బాలకిష్టయ్య ,,
సకినాల శెట్టయ్య ,,
ప్యాట పురుషోత్తం ,,
తాడిశెట్టి భాషయ్య ,,
గాండ్ల రంగయ్య ,,
చెల్మల సత్యనారాయణస్వామి ,,
చెల్మల బలరామయ్య హకీం ,,
దేపాల సత్యనారాయణ ,,
కల్లూరి నాగయ్య ,,
కల్లూరి విఠలయ్య ,,
కల్లూరి యంకయ్య ,,

### అజ్జలుగంజు

మేడిశెట్టి మాణిక్యం గారు
శేరు జగ్గయ్య ,,
ఆకుల సత్యనారాయణ ,,
బండారు ముత్యాలు ,,
కూరెల్లి బాబయ్య ,,
పల్లి నరసయ్యగారు

### యాకూతుపుర

జాలమల్లయ్య గారు
కావేటి వెంకటరామయ్య ,,
కాసుల వెంకన్న ,,
మడిగెల నారాయణస్వామి ,,
చామకూర శ్రీరాములు ,
వల్లం మల్లయ్య ,,
తోట రామస్వామి ,,
పుట్నాల లక్ష్మయ్య ,,
ఆవుల వెంటయ్య ,,
ఏచనిరామయ్య ,,
పద్మ ఈశ్వరయ్య ,,
ఏచని బాయన్న ,,
పూజల వెంకటస్వామి ,,

### పీల్ఖాన

గుట్టాల వీరన్న గారు
రాచకొండ నారాయణ (అల్వాల) ,,

### దన్సిచౌరాహ

హకీం పుప్పాల బాలకిష్టయ్య గారు

### పీల్ఖాన

గంధం లక్ష్మినారాయణ గారు

### శంశరుగంజు

### సుల్తాన్‌శాయి గౌలీపుర లాల్ దర్వాజ అలియాబాద్ మొదలగు వీధులు.

పగుడాల నరసింగరావు గారు
కొలుకుల సత్తయ్య ,,
కాటికె ముత్యాలు ,,
పయ్యంశెట్టి పాపయ్య ,,
కాసుల బాలకిష్టయ్యగారి గుడాటి కాపు ,,
లవంకాల రంగయ్య ,,
పసుపునేటి అంతయ్య ,,
కొప్పుల వెంకటస్వామి ,,
పఱ్ఱశెట్టి బాషం ,,
చల్లానారాయణస్వామి ,,
మాదాసు క్రిష్ణయ్య ,,
చవ్వా రంగయ్య సుబేదారు యి॥ సర్ ఆస్మాజా బహద్దురు ,,
పెద్దబోనె స్వామి ,,
కజ్జం బాలకిష్టయ్య ,,
కజ్జం అనంతస్వామి ,,
నాతిరాఘవులు ,,
బండారు కిష్టయ్య ,,
అంగీల కిష్టయ్య ,,
కుంట బాలరాజయ్య ,,
గల్ల రంగయ్య .
మారశెట్టి రామన్న ,,

## ఇ త ర గ్రా మ ము లు

### మున్నూరుకాపులు

గవ్వల అంజయ్యగారు (వికారాబాద్)
కూరం రాజయ్యగారు (మల్కపేట)
నవ్వా రంగారావు మఖ్తెదార్ రిటైర్ తహశీలుదార్ కొలనుపాక
నవ్వా నారాయణరావు పేష్కర్ ,,
నవ్వా రామచంద్రరావ్ మఖ్తెదార్ పెద్దిరెడ్డిగూడ
సాదునేను అచ్చయ్య మఖ్తెదార్ ,,
తోట భుజంగరావు మొకద్దం ప॥రహీంఖాన్ గూడ
టి. కూర్మారావువర్మ ,,
యన్. శ్రీనివాసరావు ముఖ్తెదార్ పెద్దిరెడ్డిగూడ
పలుగుల రాజయ్య మొక్కద్దం మాలీపటేలు వాసాలమఱ్ఱి
బాలకుల రాజిరెడ్డిగారు వకీలు కొలనుపాక
అంతిరెడ్డిగారి వెంటారెడ్డిగారు కన్కమామిడి (మొ॥ ప॥) గుడాటికాపు
రుద్రారపు శింగారెడ్డిగారి సత్యనారాయణరెడ్డిగారు (చింతుల్ల) పా॥కాపు
రుక్మారెడ్డిగారి రుక్మారెడ్డిగారు మొ॥ కొ॥ పటేలు (శంశాబాద్) గు॥కాపు
కొండపల్లి గురుమూర్తిరెడ్డిగారు (గుడివాడ) పంటకాపు
తన్నీరు మల్లికార్జునరావుగారు (కంకిపాడు) ,,

### చా ద రు ఘా టు మ న్నూ రు కా పు లు

పులుప బాలయ్యగారు
పులుప వెంకయ్య ,,
పల్లె రంగయ్య ,,
గుండా జగ్గయ్య ,,
జల్లి కిష్టయ్య ,,
శాశం స్వామిగారు మలకపేట ,,
యేలూరు యంకటరాజయ్య ,,
పర్వతాల యంకయ్య ,,
పర్వతాల నారాయణగారు

కొమ్మనేని వెంకటేశంగారు
తోట నారాయణగారు
యెల్లల చన్నయ్యగారు
సవారి రామస్వామిగారు
కూరగాయల స్వామిగారు

### హైద్రాబాద్ ముదిరాజులు

బి. రంగయ్యగారు
పసుల బాబయ్య (నారాయణగూడ)

హకింశంకరు గంగయ్య జాగీరుదార్
యి॥ శివురాజు బహద్దరు
పూల సత్తయ్య బాగు అంబరపేట

హైద్రాబాద్ యాదవులు

సంఘం సతారామయ్యాగారు
కె. మల్లయ్యాగారు
ఆకుల నరసింహులుగారు
గోవు కేశవయ్యాగారు (యాదవకిడికి)
చన్నాల వెంకటస్వామిగారు
(ఉస్మాన్ శాహి)
సంగెనబోయిన మల్లయ్యాగారు
సానెం వెంకట రాజారాం జాగీర్
దార్ గారు
చన్నాల వెంకటస్వామిగారు
నందెనబోయిన మల్లయ్యాగారు
సానెం వెంకట రాజారాం జాగీర్
దార్ రామలింగంపల్లి
పర్గి కిష్టయ్యాగారు
గంగబోయిన రంగయ్య రిటైర్డ్
అకౌంటెంట్ యస్. యస్. రైల్వే
శికింద్రాబాద్

హైదాబాద్
కు రు వ యా ద వు లు
శిద్ది అంబర్ బజారు,
జియ్యాగూడ, ఉస్మాన్ గంజు.

ఆకుల అనందముగారు
దేవర రాజయ్యాగారు
ఆకుల వీరస్వామిగారు
రావుల శాయన్నగారు
బండారు మైసయ్యాగారు
మంగలారపు యంకన్నగారు
అచ్చిన ముత్తన్నగారు
దర్గపాండురంగం దుర్గయ్యాగారు
మాపూరు యంకన్నగారు
కజెల కిష్టయ్యాగారు
రావుల మల్లయ్యాగారు
గోటి నారాయణగారు
చిలక రామయ్యాగారు
దాసరి మల్లయ్యాగారు
చీలంపల్లి ముత్తయ్యాగారు
చిట్టం శ్రీశైలంగారు
కొంగళ్ళ లక్ష్మయ్యాగారు
దేవర మల్లయ్యాగారు
దడిగె పెంటయ్యాగారు
జెక్కుల బాలయ్యాగారు
వల్లం బాబయ్యాగారు
అలకంటి రాజమల్లయ్యాగారు

గా లీ పు రం

కొరిడె శేవన్నగారు
అద్గల చన్నమల్లయ్యాగారు
బెలిగిరి శంకరయ్యాగారు
అద్గల బండప్పగారు
శీర సాంబయ్యాగారు
యట్టి అగయ్యాగారు
శేరి బాలరాజయ్య
శేరి శివరాజయ్యాగారు
చీర మల్లయ్యాగారు

కోటి వెంకయ్యాగారు
బాల్ల వీరయ్యాగారు
బాల్ల దన్నయ్యాగారు
కోటి శంకరయ్యాగారు
శిద్దల్లి నాగమల్లయ్య బొగుడ
నూతుల సత్తయ్య బెస్త

పద్మశాలీయులు

దేవసాని రంగయ్యాగారు
నక్కా సుందరయ్యాగారు

గౌడులు

హైద్రాబాద్

బద్దం యల్లయ్యాగారు
హరిదాసుపల్లె శంకరయ్యాగారు
రంగ లక్ష్మయ్యాగారు
లద్దిపల్లి యీరయ్యాగారు
నిర్మల్ నరసయ్యాగారు సదర్ గౌడ్
కందూరి బుచ్చయ్యాగారు
బండి సాయన్నగారు
యీదులకంటి గాలయ్యాగారు
తొడుపు నూరిబుచ్చయ్య చౌదిరిగారు
లింగాల శంకరయ్యాగారు
కుంట్లూరు రాజన్నగారు
నూనెముంతల యంకన్నగారు
మక్తల చన్నయ్యాగారు
తొడ్పునూరి బస్వయ్యాగారు
మాడ్గుల బాలరాజయ్యాగారు
పుంజాల రంగయ్యాగారు

బాగు అంబరుపేట

కౌసుల స్వామిగారు
ఇందిరాల శివరాంగారు
బింగి శివరాజయ్యాగారు
పంజాల నరసయ్యాగారు
పంజాల సత్తయ్యాగారు
నిర్మల్ యంకయ్యాగారు
రాజగౌడుగారు (మెదకు)
మనికొండ నరసయ్యాగారు
(దేవునిపల్లి తాలూకా)
దిండి మల్లయ్యాగారు హయాత్‌నగరు
భూమనిగారి దుర్గగౌడ్ గారు
(తూపురాణ)
రాముని గారి యల్లగౌడ్ గారు
(మెదకు)
గురుదేవుని గోవిందస్వామిగారు
(తావుద్దార్ చన్నరాయనిగుట్ట)
న్యాతి నరసింహలుగారు
(సాహుకారి కార్వాన)
మూల అచ్చయ్యాగారు తారామతిపేట
బొడ్డు లచ్మయ్యాగారు
దూసరి బాలరాజయ్యాగారు సరునగర్
రంగ బాలయ్యాగారు
బండ్లగూడెము బాలయ్యాగారు
(కొత్తగూడెముల)
తోకకిష్టన్నగారు రాజూదార్ కానిపేట

# విషయసూచిక

మొదటి ప్రకరణము.

## రెండవ ప్రకరణము.

మూడవ ప్రకరణము.

## నాలుగవ ప్రకరణము

అనుబంధము (4వ ప్ర.)



## ఐదవ ప్రకరణము



## ఆఱవ ప్రకరణము



## ఏడవ ప్రకరణము



## ఎనిమిదవ ప్రకరణము



## తొమ్మిదవ ప్రకరణము



## పదవ ప్రకరణము



## పదునొకండవ ప్రకరణము



## పండ్రెండవ ప్రకరణము



## పదమూడవ ప్రకరణము



## పదునాలుగవ ప్రకరణము


ఈ గ్రంథమును
శ్రీ॥ శే॥ నా తల్లి ఆగమాంబ గారికి
సమర్పించుచున్నాను
గ్రంథకర్త.

ఓమ్.

పరబ్రహ్మణే నమః.

# చంద్రవంశజులచరిత్ర

## మొదటిప్రకరణము

### పరబ్రహ్మస్తుతి.

ప్రపంచమున గల సాంఖ్య - సేనేశ్వరసాంఖ్య - పాణిని-చార్వాక - విరోచక - లోకాయత - హిరణ్యగర్భ - వాచస్పతి - మీమాంసక - వైశేషిక - అక్షపాద - భాట్ట - ప్రభాకర - నింబార్క - రాధావల్లభ - హరిదాసు - ఉదాసీన - మాలక్ దాసు - దామక్ - ఆనంద - మీరాబాయి - కబీరు - వీరశైవ - లింగాయత - పాశుపతశైవ - శివాద్వైత - సమ్మేళితశైవ - మహావ్రత - శివసమవాది - ఐక్యవాది - సంక్రాంతివాది - ప్రవాహేశ్వరవాది - అవికారవాది - ఊర్ధ్వశైవ - అనాదిశైవ - ఆదిశైవ - మహాశైవ - గుణశైవ - క్రియాశైవ - చతుష్పాదశైవ - శుద్ధశైవ - యోగి - అభినవగుప్తాచార్య - చైతన్య - వల్లభ - మహానుభావ - ఆర్య - దివ్యజ్ఞాన - బ్రాహ్మణ - లోకైక - శాక్తేయ - బౌద్ధ - మాధ్య

మిక - యోగాచార - సౌత్రాంతిక - వైభాషిక - జైన - ఆర్హాత - యాదవ - భాగవత - మనస్సాక్షి - అచల - అద్వైత - విశిష్టాద్వైతము మొదలగు మతములవారిచే సనేకనామరూపములచే, మరియు నామరూపరహితుడవుగా ఉపాసింపబడుచు, బ్రహ్మాండమునకు కారణకర్తవును జ్ఞానస్వరూపుడవును షడ్గుణైశ్వర్యసంపన్నుడవునునై ఎట్లు ప్రభాకరుడు భూగోళమున గల సమస్తరాజ్యములకు అరణ్యములకు గిరులకు సురలకు అసురులకు నరులకు గొప్ప-కొద్ది-జాతి-మత-భేదములులేక ప్రతిజీవులకును తన తేజఃప్రకాశముచే సంతోష మొసగి జాతిమతభేదములుగలవా రెన్ని నామములచే ప్రార్థించుచున్నను నందఱి కేకరూపముగ ప్రకాశించు చుండున ట్లీ త్రిలోకములకు కర్తవై, దుఃఖమునకు వెలగా నుండునట్టి గుణాకారాశ్రయుడవై - అపరిచ్ఛేద్యుడవై - వికారరహితుడవై -ఉత్పత్తిస్థితిలయములకు కర్తవై - పంచభూతములతోగూడినబ్రహ్మాండమును ధరించువాడవై - నిరంతరధ్యానముచే తెలిసికొనగలవాడవై-మహాబలముగలవాడవై-బ్రహ్మ-విష్ణు - మహేశ్వర - సదాశివు లను కల్పితనామములచే చెప్పబడు నామనిర్ధారణలేని యట్టి నిర్మలనిరాకార పరబ్రహ్మ వగు నీకు నమస్కరించుచున్నాను.

## పరమేశ్వరీ స్తుతి.

స్థావరములు - క్రిమి కీటకాదులు - జలచరములు - పక్షులు - పశువులు - దేవదానవ మనుష్యులు మొదలగు ప్రాణికోట్లయొక్క నామములు - రూపములు - గుణములు - క్రియలు - ఆహారములు మొదలగువాని భేదములుగల పదు నాలుగులోకములయొక్క సృష్టి స్థితిసంహార తిరోధానాను గ్రహములనెడు పంచకృత్యములను జేయుచున్న పంచమూర్తు లనెడు పంచకర్తలయొక్క ప్రజ్ఞలకు కారణస్వరూపమై - సచ్చి దానంద నిత్యనిర్మలములనెడు పంచలక్షణములుగల పరబ్రహ్మ మునందలి చిల్లక్షణస్వరూపమై అప్రాకృతమై వెలుగుచు పరాపశ్యంతిమధ్యమా వైఖరీరూపములుగల దైన, సరస్వతీ దేవియగు-భారతీదేవి మొదలగు మహాచతుష్షష్టి కోటియోగిను లనెడు పరిచారికల సమూహమునకు నెల్లపుడు శుభముల నిచ్చుచు మున్నీటిపట్టియగు పూర్ణచంద్రుడే కిరీటముగా గలిగి శ్రీమదశేషసమంచిత లోకకార్యకృచ్ఛేముషీ హేతు భూతపరచిన్మయ దివ్యశరీరిణియగు పరమేశ్వరికి నమస్కరించు చున్నాను.

## లక్ష్మీదేవి, మరియు, వాహినీపతియొక్క ప్రార్థన.

జగన్నాయకుని చతుర్థతత్వమై - శ్రీమత్సకల చరా చరాత్మకుండగు భగవంతునిచే సృష్టింపబడిన ఈ ప్రపంచము

నందలి జంగమరూపప్రాణులును - స్థావరరూప వృక్షాదులును జీవించియుండుట "ప్రాణావా - ఆపః-" అను శ్రుతిరీతి ఉదకమే సమస్తప్రాణుల జీవాధారంబునకు స్నానపానాద్యుపభోగంబులకును మూలంబుగ నున్నయది. అయ్యుదకంబులు ప్రథమమున జలరాసియను మున్నీరునుండి జలనాడి వెడలి నానామార్గములు గలిగి బహుముఖములతో వ్యాపించి, ఎట్లు పరబ్రహ్మ సుషుమ్నాయను నాడియందు నివసించి, నానామార్గంబులు గలిగి - బహుముఖములతో వ్యాపించి, శుద్ధబ్రహ్మమునకు రూపాంతరములుగ నుండెడి సూర్య చంద్రాగ్ని పరమేశ్వరులకు - పృథివ్యాది పంచభూతంబులకును - చతుర్దశభువనములకును - ప్రాగాది దశదిక్కులకును - కాశ్యాది ధర్మక్షేత్రములకును - లవణాది సప్తసముద్రములకును - మేర్వాది పర్వతములకును - రత్నాది శిలలకును - సప్తద్వీపములకును - గంగాదినదులకును - చతుర్వేదములకును - మీమాంసాది సకలశాస్త్రములకును - చతుష్షష్టి విద్యలకును - బ్రాహ్మణాదిజాతులకును - అకారాదివర్ణములకును - ఉదాత్తాదిస్వరములకును - సప్తకోటి మహామంత్రములకును - బ్రాహ్మాదిపురాణములకును - సత్వరజస్తమోగుణములకును - మహదాది చతుర్వింశతితత్వములకును - జీవునికిని - క్షేత్రజ్ఞునికిని - ప్రాణాది పంచవాయువులకును-సమస్త ప్రపంచమునకును నాధారంబుగనున్నదో అట్లీసమస్తజీవకోటులకు

ప్రాణాధారమై యెంతలోతున్నదియు సందేమున్నదియు దేవ
దానవ మనుష్యులకుసహా తెలియరాకయున్నయట్టి సముద్రునికి
పుట్టిన లక్ష్మీదేవిని స్వయంవరవిధానముగ నపు డచ్చటనుండు
దేవదానవులలో దగినవరున కొనగుటకు నేసముద్రుడు
(మున్నీరు) సన్నద్ధుడై యుండ నా సర్వాలంకారశోభితయగు
లక్ష్మీదేవి తనకుదగియున్న దేవదేవుండగు నారాయణు డని
విలోకించి యమితానందముపొంది ప్రేమాతిశయంబున నానంద
బాష్పముల విడువగా న బ్బాష్పములవలన - లక్ష్మీదేవి
ప్రేమాత్మకంబును పరమాత్మ కానందదాయకమై పరమాద్భు
తంబునగు ఫీరథ ముద్భవించెను (ఫీరథ మనగా నాకులు దట్ట
ముగానుండు పసుపుచెట్టు).లక్ష్మీదేవి హరిని పరించిన సమయో
త్పన్న మగుటచే హారిద్రియని కీర్తి జెందెను. ఇది సాక్షాత్
లక్ష్మీదేవి ప్రేమవృక్షమగుటచే శ్రీహరి కత్యంతప్రియంబై
యున్న - దివ్య డద్రానిని ధరించునో యట్టి భక్తునియందు
శ్రీహరికి ప్రీతిగల్గును. దీనిలో శ్రీవర్ణా - ఆదిత్యవర్ణ -
అగ్నివర్ణ - అరుణవర్ణ - పద్మవర్ణ - అను ఐదువర్ణములుగలవు.
ఇట్టి శ్రీచూర్ణమును మోక్షప్రదమగు చూపుడువ్రేలుతో
లలాటమున ధరించువారు పరమపదప్రాప్తులై పరమానందము
జెందుదు రిట్టిహరిద్రాకారణురాలైన మున్నీటిపట్టియగు
శ్రీలక్ష్మీదేవికి, మరియు ఇళ- పింగళ- సుషుమ్న- నాడులకు
స్థానమైన త్రికూటమున కుండలీశక్తిస్వరూపిణి యగు ఆది

లక్ష్మికిని నమస్కరించుచున్నాను. ఇట్టి లక్ష్మీదేవిజనకుడైన మద్వంశమునకు కర్తయగు సముద్రునకునుసహా నమస్కరించుచున్నాను.

## సరస్వతీస్తుతి.

శా. నీరేజాసనురాణి గొల్చెద మహానిష్ఠన్ మనంబందు ని
న్నారాధించెడువారికెల్ల సుకలాహ్లాదంబు నర్పింతు వం
బారూఢిన్ జగమెల్ల వాక్కొనఁగదా యత్యంతము న్నాదు జో
హారుల్ సేకొని నన్ను సత్కవిని జేయంబూనుమా చెచ్చెరన్.

## గంగప్రార్థన.

ఏతల్లి తొలిజన్మంబున గర్దమపుత్రికయైన కళయందు మరీచివలన బుట్టి పూర్ణిమ యను నామమును ధరించెనో, ఏతల్లి జన్మాంతరమున హరిపదప్రక్షాళితజలమున గగనమునుండి గంగయను పేరున బుట్టెనో, ఏతల్లి ప్రథమమున దేవకుల్యయను కుమారితను విరజుడనుపుత్రుని గనెనో

ఏతల్లి రెండవజన్మమున వ్యవసాయశాస్త్ర నిపుణుండై లోకమందలికృషీవలులు సులభముగా తమవృత్తి నేర్పుదలతో చేయుమార్గ ముపదేశించినట్టి ఆదిరేడును గనెనో

ఏతల్లిమూడవజన్మమున(ద్వాపరయుగమున)శంతనునిచే భీష్మాచార్యునిగనెనో, ఏతల్లి త్రిపథగయై స్వర్గమర్త్యపాతాళ

ములలో బ్రవేశించి - దేవదానవ మర్త్యులకెల్లప్రాణాధారమై త్రిలోకములందలి సుమంగలినులచే పూజింపబడుచున్నదో, ఏతల్లి గంగా - గోదావరి - భాగీరథి - జాహ్నవి - యను నామములతో పిలువబడుచు వసిష్ఠ - విశ్వామిత్ర - భరద్వాజాదిమహామునులచే వందనములుగొనుచున్నదో, ఏతల్లి తన్నారాధించువారి కెల్ల వరంబులొసంగుచు ఘృతక్షీరాదులచే పూజింపబడుచున్నదో, ఏతల్లి గరకంఠుని గళాంతర్గత విష జ్వాలలవేడిమిని శాంతిగావింప చల్లనిరూపమున హరునిజటాజూటమున అమరులు గొనియాడ అలంకరింపబడియున్నదో, ఏతల్లి మెట్టిపాపాత్ములనైన పావనులజేయుశక్తిగలిగియున్నదో,

ఏతల్లి సగరచక్రవర్తి యజ్ఞాశ్వము వదలినపుడు ఇంద్రుడు వాయువుచే రసాతలమందు తపముచేయుచున్న కపిలుని యాశ్రమమున గట్టింపగ నట్టిహయమునకై సగరుని (౬౦౦౦౦) అరువదివేల పుత్రులు సముద్రమును వేయియోజనములు త్రవ్వి రసాతలమున గట్టబడియుండుట జూచి అచ్చటనే తపోతేజముతో నొప్పుచుండు కపిలుని జూచి పరుషధ్వనులు గావించుచు కపిలునితపోభంగముజేయ కపిలమునికి గోపము వచ్చి కన్నులు తెఱచి చూచిన మాత్రముననే అరువదివేలసగర పుత్రులు భస్మమై పడియుండ సగరుని ప్రపౌత్రుడు (ముని మనుమడు) నగు భగీరథుడు ఘోరతప మాచరించి ఈశ్వరుని

వరంబున (గంగను) దివిజలోకమునుండి రావింప భస్మమైపడి యున్న వారిపై బ్రవహించి, సగరపుత్రులనెల్ల స్వర్గమున కంపెనో,

తొల్లి పదునాల్గులోకములును ప్రళయకాలమున నంత మొందినపుడు నేతల్లి (గంగ) మిగిలి యుండెనో,

## గంగ యొక్క పరీక్ష.

గంగానది పరమపవిత్రమనియు, దాని జలము పరిశుద్ధ మైనదనియు, అది యెన్నటికిని చెడిపోదనియు, భారత దేశ మందలి పుణ్యక్షేత్రము లన్నిటిలోను కాశీక్షేత్రము ప్రథమ గణ్యము. అచట గంగానదిలో ప్రతిదినము లక్షలకొలది యాత్రికులు స్నానము చేయుచుందురు. గంగాస్నానము లభించుట గొప్పఅదృష్టమని యేపవిత్రులు నమ్మెదరో, వారి శరీరారోగ్యమునకు మూలకారణ మేతల్లియో,

డి-హారెలు అను ఫ్రాన్సుదేశపు వైద్యుడు కలరా మొదలగు నంటువ్యాధులవల్ల మృతినొందినవారి శవములను గంగలోనే పడవేయుచుండుటచే ఈ శవములు తేలుచున్న ప్రదేశమున కోట్లకొలది వ్యాధిక్రిము లుండుట సహజ మగుటచే గంగలోని నీరును తీసి పరీక్షించెను. శవముక్రింద నున్న నీటిలో పై భాగముననున్నదానిలోగూడ నొక్క క్రిమి యైనను కనబడలేదు. తరువాత నతడు అంటువ్యాధులచే బాధ

పడుచున్న వారినుండి విషక్రిములను తీసి సీసాలోనుంచి వాటిపైన గంగాజలమును పోసిపరీక్షించెను. ఆజలము పోసినకొన్ని నిమిషములకే ఆక్రిము లన్నియును చచ్చిపోయెను. సీసాలోనినీటిలోనొకచుక్కను బ్రతికియున్న విషక్రిములుగల మరియొక సీసాలోవేసి చూడగా కొన్ని గంటలలో నవియున్న వెల్ల చచ్చిపోయినవి. రెండవసీసాలోని నీటిబిందువును మరియొక సీసాలోనున్న క్రిములపైని వేసిచూడగా నవిగూడ చచ్చి పోయెను. కావున కలరామున్నగునంటువ్యాధులుగలవారికి దీనితో (గంగాజలముతో) చికిత్సచేయుట కవకాశముకలదని డాక్టరు డి- హారెలు - గారిపరిశోధనవలన తెలియుటచే ఇతడే యితరవ్యాధిక్రిములతోగూడ పరిశోధనలను చేసి వాటినిగూడ నీరీతిగా చంపవచ్చునని కనిపెట్టెను. ఇపు డిట్టిఅంటువ్యాధులు గలవారికి యీరీతిగనే చికిత్సచేయుచున్నారు. 24 గంటలలో వ్యాధి కుదురుచున్నది. ఈద్రివమున కతడు "బాక్ట్రియో భేజి" అనిపేరుపెట్టెను. పాశ్చాత్యాయుర్వేదపండితశిరోమణు లేతల్లి పవిత్రతను పొగడుచు ఆసియాఖండమునందలి కలరాక్రిముల వలన కలుగునట్టి గ్రహణి - టైఫాయిడు-మొటిమెలు - కురుపులు - రాజరణములు - బిడ్డకు వేసవిలో వచ్చువిరేచనములు- చిరకాలమునుండియున్న పూయము (చీము) వ్యాధులు- ఎముకల వ్యాధి-మూత్రద్వారములో పూయముకలుగుట - అంత్రవేష్టవ్యాధి మున్నగువారి కిదియే ముఖ్యద్రవమై రోగనివారణ

మున కేతల్లి మూలాధారమో, త్రిలోకపావనియని యేతల్లి కీర్తిని గాంచెనో, యట్టి గంగామహాదేవియగు మద్వంశ మాతకు వందనము లొనర్చుచున్నాను.

## శ్రీ ఆంజనేయస్వామి ప్రార్థన.

కాంచనాద్రిమధ్యశృంగముకడ బ్రహ్మ తపము చేయు చుండగా నతనికన్నులనుండి యశ్రులు రాలెను. వానిని తాశ దోసిటంబట్టగ నందుండి వానరరూపుడు ఋక్షవిరజుడు పుట్టి అచ్చటి కాననమందలి ఫలములను దినుచుండెను. ఒకనా డచటి సమీపమున గల కొలనునకు బోయి యందు తన ప్రతిబింబ మునుజూచి యది మరియొకవానరమని నీటిలోదిగెను. అం దే మియుగానక బైటికివెళ్లి తన్నుతాజూడగ స్త్రీయై గనుపడ నిలచి యుండ, సాయంకాలము మరలివచ్చుచున్న సూర్యుడు, బ్రహ్మను దర్శించి వచ్చుచున్న ఇంద్రుడు ఈ స్త్రీనిజూచి మోహించిరి. సూర్యుని తేజస్సు ఈమెకంఠముపై బడెను. దాన సుగ్రీవుడు పుట్టెను. ఇంద్రుని తేజ మీమెతలపైబడి వాల మున్నచోటికిదిగెను. దాన వాలి పుట్టెను. మరునాడు ఋక్ష విరజుడు తన పూర్వరూపము నొందెను. ఆమార్పుల కాశ్చ ర్యము జెంది అజుని విరజు డడుగగా:

బ్రహ్మ—నీవుదిగిన కొలనులో పూర్వము పార్వతి స్నానము చేయుచుండగ రాక్షసులు స్త్రీరూపములతోరాగ

పార్వతి తెలిసికొని నేటినుండి ఇందుదిగినవారలు స్త్రీలగు దురుగాకయని శపించెను. కాన నేటినుండి కిష్కింధకుపోయి అచట రాజ్యమేలు, పొమ్మనియె. నీవంశమున ముప్పదిమూడు కోట్ల దేవతలు మొదలగువారు అవతరించగలరు. మీరు రామ కార్యనిర్వాహకానంతరము రాజ్యాధిపతులై యుందురని ఆశీర్వదించెను.

ఈ వాలిసుగ్రీవులు తామ్రమువంటి కేశములుగల్గి కోరినయపుడు పెరిగి రెండవసమయమందు దగుపడకయుండు వాలములు కలిగి, మహాసౌందర్యాకారులై గంధర్వులను మించిన స్వరూపములు గలవారు.

ఒకనాటి సమయమున మందరనగమున సుగ్రీవుడు విహరించుచుండగ బృహస్పతితనయుడైన తారుడనువాని కూతురయిన తార జూచి, యాతనిసౌందర్యాతిశయమునకు, మోహించి వీనిని బరిణయమయ్యెను. రామాయణమున వాలిని బరిణయమయ్యెనని గలదు.

సుగ్రీవునికి ముఖ్యమంత్రియగు కేసరికి అంజనయందు పుట్టినవాడు ఆంజనేయుడు. పుట్టినతోడనె యీబాలుడు ఉదయించుచున్న సూర్యబింబమును జూచి ఫలమని మ్రింగ బోయెను. అచ్చటికి రాహువువచ్చి యీబాలుని బెదరించెను. రాహువునే మ్రింగబోవ, యతడింద్రునికి భయదాయకముగ

జెప్పుకొనియె. ఇంద్రు డైరావతము నెక్కి-రాగ దానిపై కెగిరి కొట్టబోయెను. అంతట ఇందు్రిడు వజా్రియుధమును ప్రయో గించెను. ఇతనిహనువులకు దెబ్బతగిలి హనువులు కొట్టబడు టచే హనుమంతుడను నొక విశేషనామము గల్గెను. ఇతడు సూర్యునివలన, చతుర్వేదములు - సమస్తశాస్త్రములు చదివెను. సూర్యుడు విద్యనేర్పునపుడు, "నే నుదయాద్రి నుండి అస్తాద్రికి నిలువక నిత్యము పోవుచుండెడువాడ. నీ వెట్లు నావెంబడివచ్చుచు విద్య నేర్వగల"వని ప్రశ్నింపగా నంతట ఆంజనేయుడు ఉదయాద్రిపై నొకపాదము, అస్తాద్రి పై రెండవపాదము పెట్టి నిలువబడివంగుచు, సమస్త విద్యలు నేర్చి అందు తర్క-వ్యాకరణ పండితు డైనవాడు. సుగ్రీవునికి మంత్రిగానుండి సుగ్రీవుడు ఋష్యమూక పర్వతముపైనుండి రామలక్ష్మణులజూచి "వారెవ్వరైనది వారిగుణస్వభావము లెటువంటివి తెలిసికొనిర"మ్మని పంపగ చతుర్వేదవేదాంగ ములనెల్ల చదివిన శ్రీరామచంద్రుని తన వాక్చాతుర్య పరం పరలచే వశపర్చుకొని ఉభయులకు అగ్నిసాక్షిగ సఖ్యమేర్ప ఱచి, యనంతరము లంకను జేరబోవుచు మార్గమున మున్నీటి యందుగలమైనాకముమీద. గొంతసేపు విశ్రమించి ముందుకు పోవుచు మార్గమున సురసయను ఛాయాగ్రహమును సంహారించి, లంకాపట్టణముచేరి, ద్వారముకడనుండిన లంకిణియను రాక్షసిని మోది అశోకవనములో రాక్షసపరివేష్టితమై దుఃఖించు

చుండిన సీతను జూచి, రాక్షసులు వెడలినపిమ్మట చెట్టుదిగి, శ్రీరామునిభటుడనని తెల్పి యానవాలుగ రామముద్రిక నిచ్చి, "నాభుజముపై కూర్చుండుముతల్లీ తక్షణమే నిన్ను రాముని సాన్నిధ్యమున దింపెద"ననిన, సీత "పరపురుషుడునన్ను స్పర్శింప జాలడు గావున నిదుగో కొన్ని యానవాళ్లను గొనిపొమ్ము. రామనామామృతమే జీవాధారముగా గొని జీవించియున్న దనుము. ఇంతవరకు దిన మొకవత్సరముగ గడుపుచుంటి ననుము. నేటినుండి నిమిష మొకవత్సరముగ గడచుచుండు ననుము. వెళ్లుము. త్వరగా రాఘవునితో కూడ రమ్ము. మరువక యానవాళ్లనిమ్ము" అన తక్షణమే సముద్రముదాటి రామున కానవా లొసగి సమస్తవానరులతో రామలక్ష్మణసహితుడై లంకకుజేరి యుద్ధమందు లక్ష్మణునకు సంజీవి కావలయునన్న ద్రోణాద్రినే తెచ్చెను.

## వా న ర నా మా ర్థ ము.

ఇతడు ఇతనివంశజులు వానరులనబరగుదురు. 'వా' యనగా: నూతన (క్రొత్త), నరులు=మనుజులు అందు వాలి సుగ్రీవులు కిష్కింధాపట్టణము పాలించుచుండుటచేతను బ్రహ్మ ఇంద్ర సూర్య వాయు వంశసంభూతులగుటచే వీరి కాయాదేవ గుణ స్వభావములు గల్గియుండుట సహజము గావుననే నలుడను వానరుడు నీళ్లమీద రాళ్లను నిలిపి కట్టగట్టెను. అంగదుడు

రాముచే రావణునకు రాయబారము సూచించినవాడు. రావణుని సేనాధిపతియగు మహాకాయుని జంపెను.

సుగ్రీవుడు తన సేనలతో రామునివెంబడి వెళ్లి రాక్షసులతో యుద్ధము చేసెను.

వాలి మిక్కిలి బలాఢ్యుడు; రావణునితో యుద్ధము చేసి వాని జావగొట్టెను. దుందుభియనువాని జంపి కళేబర మెత్తి క్రిందబడవేసెను. వాలితో నెవ్వరును నెదురుగ నిలిచి పోరాడలేరు. అట్లు పోరాడినచో నెదుటివాని సగముబలము వాలిని జేరునట్లు వాలికి వరము కలదు.

వానరులు సంస్కృతమునుసహా చదివియున్నవారు. అశోకవనమునందున్న సీతతో ఆంజనేయుడు సంభాషించునపుడు సంస్కృతములో మాటాడుచునేని రావణుడు తెలిసికొనునేమో? యని శంకించినటుల రామాయణమున గలదు. దీనినిబట్టి పరిశీలింపగ వానరులు సంస్కృతవిద్యాధురంధరులైన నూతననరులే యని స్థిరపడుచున్నది.

వనములయందు నివసించి సాత్వికాహారమగు ఫలాదులు మాత్రమే దినువారై ప్రథమదశయందున్నటుల విశదమగుచున్నది.

పిమ్మట రామునిసహవాసమున దండకారణ్య నివాసులగు రాక్షసులవంటి అనాగరికులకంటె శ్రేష్ఠులై నాగరికతగల

వారై త్రేతాయుగమున నేయుండి రావణుని సంహారానంతరము జనకునిచే జేయబడిన విందునకు రామలక్ష్మణ-సీతా పిరాట్టితోకూడ డెబ్బదిరెండుకోట్ల వానరులలో మిగిలినవారు జనకపురికిబోయి జనకునిచే సన్మానింపబడి పంచపక్వాన్నములతో రుచికరశాకములతో భుజించిరి. నాడే రామునిసహవాసమున పంచపక్వాన్నముల తిననెఱిగినవారు.

నేటికి (౧౨) పదురెండుకోట్ల ఏబదియైదులక్షల అరువదిరెండువేల తొమ్మిదివందలయెనుబదిపైచిల్లర సంవత్సరములు గతించియు వానరలు నాటివలెనే యుందురా? అందు రామునకు సహాయులుగానుండ నంగీకరించి, దేవలోకము నుండి మర్త్యలోకమున యవతరించిన కామరూపులైన వానరులు, ఆకారణముచేతనే ఇంద్రజిత్తుచే లక్ష్మణుకు యుద్ధము చేయునపుడు మేఘమండలమువర కాంజనేయుడు తనకాయముపెంచెను. దేవతలయొక్క హంశసంభూతులై సంపూర్ణజ్ఞానముగల వాలిసుగ్రీవనలనీలాంజనేయాది నూతన వానరులు వేఱు. ప్రస్తుతమరణ్యములలో తోటలలో నడవిమనుష్యులవలె దిగంబరత్వముగ చరించు పశుజాతిమర్కటములు వేఱు. రామకార్యనిర్వాహకసమయముననే వీరివాలములు పెంచుటచే పెరుగుచుండెను, తగ్గించుటచే తగ్గుచుండెను. తుదకు కనుపడకుండసహా యుండదలచిన యటులే కనపడకుండెను.

ఇట్టిశక్తిగలదేవతాసంభూతులగు వానరులు నేటికి పశుజాతిఁ జేరినవారేయని తలంచుట, గాఢనిద్రయందలి మతి యని తలం పవచ్చుననుట నిక్కమని వక్కాణించు కర్తలు భారతిపత్రికయం దభిప్రాయ ప్రశ్నోత్తరము లనేకములు వ్రాసి యున్నవారు.

ఇంచుమించు (౧౦౦౦) వేయిసంవత్సరములవరకుముందు మనుష్యులను మనుష్యులు చంపి తిను అడవిమనుష్యులు అర ణ్యములయందు ఆకులచే అంగములు దాచుకొని అనాగరికత గలవారుసహా ఆంగ్లేయప్రభుత్వప్రకాశవికాసముచే దిగం బరులైయున్నవారు సహా దిగ్గునలేచి వస్త్రముల గట్టు కొని వనవిహార మొదలి జనవిహారులైనపుడు ఇంచుమించు ౧౩ కోట్ల సంవత్సరములకు ముందే శ్రీరామమూర్తిచే సమస్తకార్య నిర్వాహకశక్తిగలవారై యొకసైన్యముగ నేర్పడి సేనానాయకులుగా సేనాధిపతులుగనున్న నూతన నరులు ఏద్వీపమం దగోచరముగ నున్నవారో తెలియ నలవి గాకయున్నది.

ఇట్టివానరవంశమున నేమహానీయుడు, యుద్ధసమయ మున ప్రళయాంతకుని భంగి భీమరూపము పెరిగినిలచెనో ఏమహాబలపరాక్రమమూర్తి దండిరాక్షసుల మెండుగా దును మాడి బ్రహ్మపిశాచములకు బలియిచ్చుచు, భేతాళాది

గ్రహములు బెదరిపాఱ సింహనాదముచేయుచు, కాలభైర వునిరీతి గంతులువేయుచు, ఇంద్రగ్రహ-కోటిగ్రహ- శాకిని - డాకినీ - కామినీ - మోహినీ - భైరవి - గణములు ఝుడిసిపడ నార్భాటము చేయుచు, భూభాగము బగుల పాదఘట్టనము జేయుచు, ప్రళయకాలజ్వాలలవలె నేత్రములు గనబడ పగ తురశిరంబుల నుప్పరమున కెగురగొట్టుచు, పారిపోవువైరుల వాలవేగమునబట్టి కట్టి వింధ్యాద్రిపైకి విసరివేయుచు, రావ ణునిధైర్యమ్ధైర్యానలంబుల బడద్రోచుచు అపుడపు డశోక వనమధ్యంబునగల జానకిని జూచుచు, అపజయసూచకముగా అతినిద్రగలిగి యిటునటు సోలురక్షకులగు రాక్షసస్త్రీలనాసికా కర్ణములయందు నతిత్వరగ వాలము ద్రింపుచు, దేవి కుత్సా హముగల్గించుచు యుద్ధానంతర మయోధ్యకు జేరి, మనోజ్ఞ యోపాయము మైథిలితో ఉపదేశింపబడి, యేమహానీయుడు తపోవనమున కేగి చిరజీవుడై యున్నవాడో అట్టి శ్రీ ఆంజ నేయస్వామికిసహా నమస్కరించుచున్నాను.

## సృష్టిక్రమము.

ప్రస్తుతము మన మేభూభాగమున నివసించియున్నా రమో, ఇట్టిభాగమెల్ల సృష్టికిపూర్వము జలమయముగా నున్నతటి

తమిద్గర్భం ప్రథమందధ్ర ఆపో। యత్ర దేవాఃసమగచ్ఛంత విశ్వే। అజస్య నాభావధ్యే కమర్పితం।యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః॥

బ్రహ్మాండమున దేవతలందఱు చేరియుండిరి. ఆబ్రహ్మాండము తొలుత మహాసముద్రము (మున్నీటి) నం దడగి యుండెను. అందే సకలభువనములును - సమస్తజీవరాసులును సృష్టికిబూర్వమునం దణగియుండెను. అతడే సమస్తభువనములను పరమాత్ముని యాజ్ఞానుసారము సృజించెను. అతని యందే దేవతలంద ఱణగియుండిరి.

## పూర్వకాలమహిమ.

అక్కాలంబున మానవులకు జాతిమతభేదములు లేక యొక్కతల్లిబిడ్డలవలె నుండిరి. పశుపక్ష్యాదిజంతువులు తఱచుగ లేవు. కందమూలములు ఫలములు పుష్పములు మానవుల కుపయోగార్థమై వెలసియుండెను. ఇవి జ్ఞానప్రదములు గావున నాకాలపుమానవులు వీనిని స్వీకరించి సాత్వికులై సత్ప్రవర్తకులై సకలేంద్రియజయులై సమస్తజనులు నిర్భయులై సత్యవాదులై సత్యసంకల్పులై జ్ఞానపరిపూర్ణులై యుండిరి.

పృథివి అధికఉష్ణతకాని లేక, అధికశీతలతగాని లేక సమానశీతోష్ణత గల్గియుండెను. అప్పుడు మానవు లేదిమనస్సున కోరిన నది వారికి లభించుచుండెను. దేవవిమానములపై కొందఱు మఱికొందఱు భూమినుండి ఆకాశమునకు పాతాళమునకు ఖేచరగమన భూచరగమన మను విద్యలచే పోవుచు వచ్చుచుండిరి. ఏదికావలయునన్న నది సంకల్పమాత్రమున

లభించుచుండెను. అప్పటివారు చిరకాలము జీవించువారలై యుండిరి, ఒకరిపై నొకరికి ద్వేష మనుమాటయేలేక విశ్వాస పాత్రులై యుండిరి. వీరు సృష్ట్యాదిస్వాయంభువమన్వంతర మందలివారు.

| | | |
|---|---|---|
| సృష్ట్యాదిస్వాయంభువమన్వంతరము | (306720000) | సం॥ములు |
| స్వారోచిషమన్వంతరము | (306720000) | ,, |
| ఉత్తమ మన్వంతరము | (306720000) | ,, |
| తామస మన్వంతరము | (306720000) | ,, |
| రైవత మన్వంతరము | (306720000) | ,, |
| చాక్షుష మన్వంతరము | (306720000) | ,, |

ఒక మనుకాలమునుండి, రెండవమనుకాలమునకు

మధ్యయందు, సంధికాలమని కొంతకాలము

అరాజకముగనుండును. సంధికాలసం॥ లు (1728000).

ఇటుల (6) మనువులకు సంవత్సరములు - (10368000)

వెరసి (మొత్తము) 1850688000

ఈయారు మన్వంతరములు గడచిన పిమ్మట ఏడవ దగు వైవస్వతమన్వంతరమున జనపతిగాయుండిన నీవైవస్వతునకు క్షుతముచేయునపుడు (తుమ్మినపుడు) నతని నాసిక (ముక్కు) నుండి ఇక్ష్వాకు పుట్టెను. ఇక్ష్వాకువంశము

ననే రఘువు, రఘువంశమున శ్రీరామచంద్రుడు పుట్టెను. ఈవంశజులే సూర్య (అర్క) వంశక్షత్రియులు.

డెబ్బదియొక్క మహాయుగములు ఒక మన్వంతర మనబడును. ఒక్కమహాయుగమునకు (4320000) సంవత్సరములు నియమితము. ఇట్లు వైవస్వతమన్వంతరమున 43 మహాయుగములు గడచి 44 వ మహాయుగమున 426977వ సంవత్సరమునందలి కృతయుగమున అనగా:

| | |
|---|---|
| గడచినమహాయుగములు నలువదిమూడు | 43 |
| ఒకమహాయుగమునకు సం॥ | 4320000 |
| | 185760000 |
| నలువదినాల్గవ మహాయుగమున గడచినసంవత్సరములు | 1728000 |
| వెరసి (మొత్తము) | 187488000 |

(నలువదినాల్గవ మహాయుగమున వైవస్వతమనువుచే అయోధ్య నిర్మింపబడియె.)

త్రేతాయుగ మారంభమైనపుడు మేఘములు వర్షించుటయు నదులు ప్రవహించుటయు స్త్రీలకు ప్రతిమాసమున ఆర్తవము (ఋతుసంబంధమైనది) కలుగుచుండెను. వృక్షముల నుండి యనేక ఫలములును దివ్యవస్త్రములును అలంకార వస్తువులును పరిగ్రహించుచు చెట్లనుండి దిగజారి కాలువలై పాఱుచుండెడి తేనె (మధువు)ను ప్రతివృక్షమునుండి ప్రతి

యాకులనుండి ఉత్పన్నమౌ క్షీరము (పాలు)ను కడుపారగ్రోలి సుఖజీవులై వర్తించుచుండిరి. ఈ కాలమునవలె పదార్థములను నిలువ (శేషము) యుంచువారుకారు.

ప్రజలయందు లోభగుణ మంకురించుట.

ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట వారియందు లోభగుణ మంకురించెను.

లోభమనగా (లోభము (సం) వి.అ॰పుం॰ పిసినితనము (కాంక్ష) అకారాంత స్త్రీయాం॥అమరః॥ఇచ్ఛాయాం ఆస అమరః॥ నానార్థః స్త్రీయాం తృష్ణాయాం పేరాస - (తృష్ణక్ - లుబ్ధే - లోభి) ఆశచేత నిలువయుంచుటకై ప్రమాణమును మించి తీసికొన మొదలుపెట్టగనే, అనగా లోభగుణ మంకురించగనే అపారముగ వెల్లునవి అతిస్వల్పముగ లభించుటచే బలాత్కారముగ స్వీకరింపనారంభించిరి. మఱియు కాలగతిచే ప్రజలు క్షుత్పిపాసలచే పీడింపబడుచుండిరి. స్వల్పముగ లభించు యాహారముచే క్షుధతీరక తత్ శ్రమనివారణమై వరిధాన్యములను పండింపనవసరమయ్యె.

ఆదితేడు జన్మము.

ఒకనాడు బ్రహ్మయు గశ్యపుడు మున్నీటి (సముద్రము) దరి విహరించుచు ముచ్చటించుచుండగ, సముద్రుడు వారిని దడిపెను. సముద్రుడా! నీవు శాంతుడవుకమ్ము. అని,

బ్రహ్మపలికెను. బ్రహ్మకు భయపడి సముద్రుడొక రాజ రూపమున వచ్చెను. నీవు రాజువలె వచ్చితివిగావున రాజువై పుట్టుమని చెప్పెను. సముద్రుడు నలువకు నమస్కరించి మిమ్ముల దడుపుట నా స్వభావముచేతనేగాని నేను గర్వించియుండుటచే గాదు. నన్ను శపింపకుము-అని వేడెను. నీవు రాజువైనను, గంగ యే నీకు భార్యయగును. నీకు సంతానము కలిగినపిదప, శాప విమోచనమగును. అని అజుడు నుడివెను. (హరవిలాసము)

సముద్రుడు, రాజరూపముతోడనే గంగాతీరమునుజేరి ఆలోచించుచుండగ గంగ స్త్రీరూపమునవచ్చి పతికినమస్క రించి తన దివ్యదృష్టిచే శాపకారణమును తత్ శాపనివార ణోపాయమును తెలిసికొని, నాథా గడచినపని కెంతమాత్రము చింతింపవలదు. అని తనపతి కతిసంతోషము గలుగునటుల సరససల్లాపయుతహితవచనములాడుచుండుగంగలావణ్యముపై దృష్టిసోకి మన్మథబాణపరంపరలచే మోహితాత్ముడై శాప వ్యసనమును మఱచి రూపవశుడై దాపుననున్న గంగను దా నాలింగన మొనర్చి ఆననమున ఆననముంచి కలయుచున్న వారైరి.

అనంతరము తొమ్మిదిగడియలలో నొకముద్దుకుమా రుడు కల్గెను.

పూర్వము పార్వతీపరమేశ్వరులు అంతఃపురమునఆనంద పరవశులై యుండునపుడు విశ్వకర్మ ఆజ్ఞలేకుండ లోనికి

ప్రవేశించెను. దాన ఉమాపతి ఉగ్రస్వరూపుడై ప్రభాస పుత్రా! ("ప్రభాసుడను వసువుకుమారుడు. ఇతనితల్లి బృహస్పతిచెలియలగు యోగసిద్ధి యను ప్రభ") నాభక్తుడు. భూలోకమున గంగాతీరమున పుట్టి నిన్ను చంపుగాక! యని శపించెను.

విశ్వకర్మ అంజలిబద్ధుడై దేవదేవా! అత డేప్రదేశమున పుట్టునో అనుగ్రహించి దెల్పుడని ప్రార్థింప,

ఈశ్వరుడు గంగాతీరమున గంగకుపుట్టి నిన్ను ఖండించగలడనియె.

విశ్వకర్మ విమానారూఢుడై గంగాతీరమును జేరి ఏకాగ్రదృష్టితో చూచుచు వేచియుండ,

గంగాసముద్రు లుభయులు అంతర్ధానమైరి.

విశ్వకర్మఆదిశేడుపై వజ్రాయుధము ప్రయోగించుట.

శిరమున కిరీటమును కంఠమునపుష్పహారము ఒకచేత పసిడి హలాయుధమును (నాగలి) రెండవహస్తమున కోదండమును ధరించి సింధునగుముఖముతో ఎట్టిశూరుడైన దిగులుజెందునట్టి యాకారముతో ప్రకాశించుచున్న ఆదిశేడు అతిశీఘ్రమున లేవబోవ విశ్వకర్మ తనవజ్రాయుధ మాసుందరాకారునిపై ప్రయోగింప కిరీటమునకు దగిలి యాకిరీటము భూమిపైబడ విశ్వ

కర్మ రెండవఖడ్గమును ప్రయోగింపనున్న యంతలో రేణుకి త్వరగా నరిగి ఖడ్గమున్న కరంబును బట్టుకొనియె.

అంతలో బ్రహ్మ విష్ణువు మొదలగు దేవతలొచ్చి ఆది రేడునకు నిరోధముగా (అడ్డముగా) నిలువబడి యిట్లనిరి.

రేడుఆజ్ఞలో పంచదాయులవా రుండునట్లు దేవతలు నియమించుట.

ఓ విశ్వకర్మ! నీవొకసారి ప్రయోగింప ప్రయత్నించి, రెండవమారుసహా ఖడ్గమును ప్రయోగింప బూనుట తగదు. ఏలననగా వజ్రాయుధ మొక్కసారియే ప్రయోగించెదనని ప్రతిజ్ఞ చేసియున్నవాడవు. ప్రతిజ్ఞను తప్పి రెండవసారి ప్రయోగించుట నీబోటి సత్యసంధుని పని గాదు. మొదటనే ప్రతిజ్ఞ భంగమయ్యె, గావున లోకకల్యాణార్థమై యవతరించిన రేడునకు జీవదాన మొసగిరక్షింపవలయు. నిన్ను యతడు చంపకుండ శాప ముపసంహరించుకొనుచున్నార మని హరునితోకూడ అమరులెల్ల అభయమిడిరి. అనంతరము నీవు నిర్దోషిని చంపుటకు నిశ్చయించినందులకు నీవంశజులైన మను మయ త్వష్ట శిల్ప విశ్వజ్ఞ లను పంచదాయులవారు పంచకర్మలు జేయుచు రేడుయొక్క ఆజ్ఞానువర్తులై యుండవలయునని శాసించి తమ తమ లోకములకు విమానారూఢులై వెళ్లిరి.

ఆ ది రే డు నా మ క ర ణ ము.

అబ్బాలుఁడు (ఆదిరేడనియు భూపాలుడనియు మురుడ _ పాలుడనియు నాగలియే ప్రథమాయుధమగుటచే ఈనామము గల్గెను.) గంగకుపుట్టినవాడుగావున గంగవంశజుడనియు గంగకు సముద్రునివలన బుట్టినవాడగుటచే సముద్రకులజుడనియు (మున్నీరుకులమువాడనియు) పిలువబడుచుండెను.

అనంతర మా దేవతలెల్ల ఉపనయనసంస్కారము గావించి సమస్తవిద్యలు కరతలామలక మగునట్లు వరమొసగిరి.

ఆ ది రే డు వి వా హ ము.

ఇట్లుగొంతకాలము జరిగినయనంతరము ఇంద్రుడును కుబేరుడును తమపుత్రికలనిచ్చి వివాహముగావించిరి. కుబేరుని పుత్రికకు (52) ఏబదియిద్దరు పుత్రులు ఇంద్రుని కూతురునకు (54) ఏబదినల్గురు పుత్రులు బుట్టెరి.

అందు (35) ముప్పదేగురు భూపాలురనియు వీరివృత్తి సేద్యము (కృషి) చేయుటమాత్రము (36) ముప్పదార్గురు మున్నీరుశ్రేష్ఠులనియు వీరివృత్తి వ్యవహారము (35) ముప్పదేగురికి గౌశ్రేష్ఠులనియు వీరివృత్తి గోసరిపాలనము. పైమూడు వృత్తులు గలవారికి (౧౨౦౦౦) పదిరెండువేల పుత్రులు బుట్టిరి. మిగిలిన నొకడు ఆగమరేడనువాడు పైముగ్గురితో వేరుగా దండనాయక వృత్తియందుండి అపరాధుల దండించుచుండు

టయే వృత్తిగాగల్గి దండనాయకుడని పిలువబడుచుండెను. ఇతనికి (2500) పుత్రులు బుట్టిరి.

ఆదిరేడువంశజులు శ్రీరామునకు కిరీటము పెట్టుట.

ఆదిరేడును వారివంశమువారు క్రిందబడిన కిరీటము తిరిగి పెట్టమని కృతయుగమున దీక్షచేయుటచే నీవంశజులు కృతయుగాంత్యమువరకు కిరీటమును ధరింపకుండిరి. కాని వీరి వంశజులచేతనే ప్రతిరారాజు కిరీటమును ధరింపవలయునని దేవతలచే నియమింపబడియె.

ఆకారణముచే శ్రీరామచంద్రమూర్తి సీతాదేవితో కూడ రావణసంహారానంతరము పట్టాభిషేకమహాసమయమున కోదండరామున కెవరు కిరీటము పెట్టనర్హులని సభయందొక సంశయము గల్గెను. అపుడచటగల వశిష్ఠ విశ్వామిత్రి యాజ్ఞవల్క్యాది మహాఋషులెల్ల ఆదిరేడువంశజులగు మున్నీరుకాపులచే పెట్టింపవలసియున్నది. ఏలననగా కృతయుగాంత్యమున సమస్తదేవతలలో విశ్వకర్మసమక్షమున నొకసారి తీర్పు గావింపబడినదనిరి.

కిరీటము మున్నీరుకాపువంశమువారే పెట్టవలయునను విషయము కంబర్ యను ద్రవిడ కవిసార్వభౌముడు తా రచియించిన కంబరామాయణమున వ్రాసియున్నవాడు.

## కంబరామాయణకాలనిర్ణయము.

"కంబరామాయణము అనునది- యేశకమునాటిది? ఏభాషలో వ్రాయబడినది?"

కలియుగాది నొకమాసముపైన (13) పదమూడుదివసములు గడువగా ప్రమాదిసంవత్సర వైశాఖశుద్ధ చతుర్దశీ లక్ష్మీవారము విశాఖనక్షత్రయుక్త కర్కట లగ్నమున నాథనాయికగర్భమున భగవత్సేనాపతి (దండనాయకుడు) యగు విష్వక్సేనుడు (విష్ణుమూర్తిసేనానాయకుడు) దివ్యతేజోవిరాజితుడగు నమ్మాళ్వారు (మాయాళ్వారు) జన్మించిరి.

ద్రవిడ దేశపురాజు పరీక్షాపలకపైన నమ్మాళ్వారి ప్రబంధములలోనుండి యొకపాశురము (శ్లోకము)ను వ్రాయించి సభాస్థానమున పెట్టియుండ

నక్కాలమున సుప్రసిద్ధులైన కంబర్ మొదలగు (300) మున్నూరుపండితులు పాశురమును చదివి యది తమకవనములను మించియుండుటచే మున్నూరుగురు మాయాళ్వారునకు నమస్కరించి వెళ్ళిపోయిరి. కావున, కంబర్ ఇంచుమించు(5000) ఐదు వేలసంవత్సరములకుముందున్న వాడుగా తెలియుచున్నది. రామాయణము ద్రవిడభాషయందే వ్రాయబడియున్నది.

మున్నీరు కాపులను గురించి వ్రాయబూనిన కంబర్ యనుకవి తమిళభాషలో వ్రాసియుండుట కొకకారణముగలదు. ఏలననగా?

ద్రావిడభాషలలో, వాఙ్మయోపయోగిగా సంస్కరింపబడ్డ నాగరికభాషలు తమిళము, తెలుగు, కన్నడము, మళయాళము అనునవి. కాల్డువెల్లు మళయాళము తమిళమునకు కూతురుగాని సోదరికా దనెను.

మిగిలినభాషలలో తమిళము, తెలుగు, కన్నడము, పరస్పరసన్నిహిత సంబంధం గలిగినవనియు ప్రాచీనమైన ద్రావిడభాష తొల్దొలుతి తమిళము తెలుగుగాను, కొలది కాలములో తమిళము తెలుగుకన్నడము గాను, మారిపోయె ననియు, యనంతరముచాలకాలమునకు తమిళమునుండి మళ యాళము పుట్టువొందినదనియు,

నేటికున్న వాఙ్మయముబట్టి చూడగ, కన్నడము తెలుగున కంటె ప్రాచీనమైనభాష యని విమర్శకులు అభిప్రాయ మిచ్చు చున్నారు.

విమర్శకులఅభిప్రాయములచే,

తమిళము కన్నడముకంటె ప్రాచీనభాష యని విశద మగుచున్నది.

"సంస్కృతం ప్రాకృత మపభ్రంశపైశాచిక మెంబ మూఱువరే భాషెగళోళ్ పుట్టువ ద్రవిడాంధ్రకర్నాటాది షట్పంచాశత్సర్వవిషయభాషాజాతిగళక్కుం" యని నాగవర్మ 990 A. D. నాటివాడు వ్రాసినాడు.

984 లో పరిపాలించిన రక్కసగంగని ఆస్థానపండితుడు. అజితసేనదేవుని శిష్యుడు. కన్నడములో ఛందోంబుధి అనే ఛందస్సున్నూ బాణుని కాదంబరీభాషాంతరీకరణమునూ గావించినవాడు అని ఛందోంబుధియను గ్రంథమువలన తెలియుచున్నది. ఇతను తనఛందోంబుధిలో భాషలనుగురించి ప్రసంగించిన పై వాక్యంవల్ల ద్రావిడకర్నాటకాంధ్రాది భాష లన్నీ సంస్కృతమునుండి త్రివిధప్రాకృతములనుండి పుట్టినవని విశదమగుచున్నది.

## భాషలు - వాటియుత్పత్తి.

"(1) సంస్కృతము (2) ద్రావిడము (3) కన్నడము (4) తెలుఁగు (ఆంధ్రము)" ఇట్లుపుట్టినవని పండితాభిప్రాయములచే సిద్ధాంతమగు చున్నది.

సంస్కృతము—వ్యాకరణలక్షణయుక్తమైన శబ్దములు గలభాష. దీనికే దేవభాషయనియు గీర్వాణభాషయనియు నామములుగలవు.

దేవనగరమునందు (ఇంద్రునిరాజధానియైన అమరావతియందు) మొదటఁబుట్టెఁగాన దేవనాగరియనియు కొందఱు. తంత్రశాస్త్రమునందు శ్రీచక్రమునకు దేవనగరమనిపేరు. దానిలోనే దేవతాదుల చిత్రాంకనములు వ్రాయబడుచుండె. అందుండియే యీ లిపి (నాగరి - దేవనాగరి) పుట్టెను. గాన దీనికి దేవనాగరి యన్న పేరు వచ్చెను.

అథర్వణవేదమునందు - దేవనగర మిట్లు వర్ణింపఁబడినది.

అష్టా చక్రా నవద్వారా దేవానాం పూరయోధ్యా
తస్యాం హిరణ్మయః కోశః స్వర్గో జ్యోతిషావృతః॥
తస్మిన్ హిరణ్మయే కోశే త్ర్యరే త్రిప్రతిష్ఠితే
తస్మిన్ యద్యక్షమాత్మన్వత్ తద్వై బ్రహ్మవిదోవిదుః,
ప్రభ్రాజమానాం హరిణీం యశసా సమ్పరీవృతామ్,
పురం హిరణ్మయీం బ్రహ్మా ఆవివేశాపరాజితామ్. (10-2, 32-34)

అర్థము:—ఇతరులచే గెలువఁబడుటకు నశక్యమైన దేవతలపురమునకు (8) చక్రములును, (9) ముమ్మాలలు గలద్వారములును కలవు. వానినడుమ జ్యోతిర్మయమైన బంగారుకోశముకలదు. త్రికోణములయందును, మూడుకోశములయందును ఒకనేత్రముఉండును. బ్రహ్మజ్ఞానులీనేత్రమునే ఆత్మయందురు. ఈ అపరాజితహిరణ్మయపురంబునే బ్రహ్మ ప్రవేశించెను.

అథర్వణవేదమునందు మఱియొకచోట (5, 28, 11, 11-4, 22) తైత్తిరీయారణ్యకమునందును; (1-27) దేవనగరము వర్ణింపబడియున్నది. కావున, దేవనగరశబ్దమునుండియే దేవనాగరి యన్నపేరు వచ్చినటుల విశదమగుచున్నదనియు, దేవభాష సంస్కృతమనియు, సంస్కృతభాష దేవనాగరిలిపియందు వ్రాయబడియెననియు అథర్వణవేదమునహా దేవభాషయగు సంస్కృతభాషయందు నాగరిలిపియందుండెననియెదరు.

## వ్యా క ర ణో త్ప త్తి.

ఇక వ్యాకరణము పుట్టుటకు కారణమునుగురించి తైత్తిరీయ సంహితలో నొక యితిహాసమున నీ క్రిందివాక్యమున్నది.

"తామిన్ద్రో మధ్యతోఽవక్రమ్య వ్యాకరోత్ తస్మాదియం వ్యాకృతా వాగుద్యతే తదేవవ్యాకరణస్య వ్యాకరణత్వమ్."

ఈ యితిహాసముయొక్క తాత్పర్యమేమనఁగా: పురాతన కాలమందు అవ్యాకృతమైన వాక్కు గలదు. అనఁగా మేఘగర్జనవలె అఖండాకారమైయుండె. అందుచే వాక్యమేదియో పదమేదియో తెలియక దేవవాక్కుయొక్కయర్థము దేవతలకుఁ దెలియదయ్యె. అందుచే దేవతలు ప్రార్థింపనిందుఁ డు వేదవాక్కులను విఱిచి (ఇది పదము ఇది వర్ణము ఇది ప్రకృతి ఇది ప్రత్యయము) అని విడఁదీసి వ్యాకరణముచేసెను. ఇదియే వ్యాకరణముయొక్క వ్యాకరణత్వము.

ఇందువలన సంస్కృతభాషకు మిక్కిలిపురాతనకాలమున వ్యాకరణము పుట్టినదనియు తైత్తిరీయ సంహితాకాలముననే అనగా క్రీస్తుకు పూర్వము (3000) మూడు వేలకుపైకాలముననే యీశాస్త్రము మిక్కిలి పురాతనముగా నెంచబడుచుండెను అని తేలుచున్నది. లిపిశాస్త్రమెప్పుడును

వ్యాకరణశాస్త్రమునకు పూర్వవర్తి గనుక నప్పుడు ఉ
యుండెనని వేఱుగ జెప్పనక్కఱలేదు. ఇంద్రవ్యాకరణమొక
కలదనియు, నవవైయాకరణులలో నిందుడు ప్రథము
డనియు బూర్వపరంపర కలదు.

ఇందుడు దేవలోకమునకు నాథుఁడు. అట్టి ఇంద్రుడు
వ్రాసిన వ్యాకరణము దేవభాషయందే యుండుట నిక్కము
దేవభాష దేవనాగరిలిపియం దుండుట సహజము. ఈ దే
భాషకే సంస్కృతభాష యను ప్రతినామము గలదు.

తుదకు ఏలిపియందు వ్రాయబడినను దేవభాషయే
సంస్కృతభాషయనియు సంస్కృతభాషయే దేవభాష
యనియు విశదమగుచున్నది.

## నాగరిభాష.

మఱియు 'నాగరి' యని గాని 'దేవనాగరి' యని గా
పేరెట్లువచ్చినదను ప్రశ్నకు పలుగురు పలువిధంబుల వచించియ
న్ననునగరమున బుట్టినది, అనఁగా మొదటఁ బల్లెటూరివారిచే
గాక పట్టణవాసులచే నుపయోగింపఁబడెను. కావున నాగ
యయ్యె. దేవనగరమందు (ఇంద్రుని రాజధానియైన అమరావ
యందు) మొదటఁబుట్టినదగుటచే దేవనాగరియనియు మఱికొం
దఱు 'తంత్రశాస్త్రమందు శ్రీచక్రమునకు దేవనగరమని పేరు
దానిలోని దేవతాదుల చిత్రాంకనములు వ్రాయబడుచుండె

అందుండియె యీలిపి పుట్టెను. కాన దీనికి 'దేవనాగరి' యన్న పేరువచ్చెనని శ్రీయుత శ్యామశాస్త్రిగారి అభిప్రాయము. ఆ దేవనాగరము అథర్వవేదమునందు వర్ణింపఁబడియున్నటుల పైన వ్రాసియున్నాడను. లిపులన్నిఁటిలోను ప్రస్తుతముసహా విశేషప్రచారమువలనను దేవలిపియన్నఖ్యాతివలనను దేవనాగరి ముఖ్యమైనది యని చెప్పఁదగును. హిందీభాష మాట్లాడువా రందఱును, మరాటిమాట్లాడువారందఱును నీలిపినే వాడుచున్నారు. ఇదియే ఆర్యలిపి యనఁదగును.

### శ్రీహర్ష చక్రవర్తిచేవ్రాలు.

క్రీస్తుశకము 7 వ శతాబ్దమం దుండిన శ్రీహర్ష చక్రవర్తియొక్క శాసనమందును నాగరాక్షరస్వరూపము కానవచ్చుచున్నది. ఈరాజుయొక్క స్వహస్తాక్షరి యీ క్రిందగనఁబఱుపఁబడినది.

స్వహస్తో మమ మహారాజాధిరాజశ్రీహర్షస్య

నాగరలిపినుండి వేఱు వేఱులిపులమిశ్రమమునుండియు, నుత్తరహిందూదేశమందలి వివిధలిపులు పుట్టెనవి. వాని వివరము వ్రాయుట అనావశ్యకము.

ఇక—

# దాక్షిణాత్య లిపులు.



క్రీ. శ. 250
అశోకలిపి
క్రీ. శ. 100
గుహాలిపి
గుప్తలిపి
క్రీ. శ. 350
చేరలిపి
చాళుక్యలిపి
వేంగిలిపి
నాగరలిపి
క్రీ. శ. 1000
పురాతన గ్రంథాక్షరములు
వట్టెళుత్తులిపి
పశ్చిమచాళుక్య లిపి
పూర్వచాళుక్య లిపి
పురాతన జావాలిపి (కావి)
క్రీ. శ. 1300
మధ్యకాలపు గ్రంథాక్షరములు
సంధికాలపులిపి
ప్రాచీన నంది నాగరి
పురాతనతుళు మళయాళ లిపి
క్రీ. శ. 1400
ఇప్పటి గ్రంథాక్షరములు
హళకన్నడలిపి
ప్రాచీనతెలుంగులిపి
ఇప్పటిజావాలిపి
ఇప్పటి నంది నాగరి

పై లిపులవృక్షమును జూడగ క్రీ- శ- 100 గుహాలిపి, గుప్తలిపి యుండెననియు, క్రీ. శ. 250 అశోకలిపి, క్రీ-శ- 350 చేరలిపి, చాళుక్యలిపి, వేంగిలిపి, నాగరి, క్రీ-శ- 1000 పురాతన గ్రంథాక్షరములు, వట్టెళుత్తులిపి, పశ్చిమచాళుక్య లిపి, పూర్వచాళుక్యలిపి, పురాతన జావాలిపి, క్రీ.శ. 1300 పురాతనతుళుమళయాళలిపి, హళకన్నడలిపి, ప్రాత తెలుగు లిపి, క్రీ- శ- 1400 అఱవములిపి, ఇప్పటి కన్నడములిపి, ఇప్పటి తెలుగులిపి, ఇప్పటిజావాలిపి, ఇప్పటి నందినాగరిలిపి, క్రీ-శ- 1600 తుళుమళయాళము పుట్టెనని కొందరు పండితులు వ్రాసియున్నారు. మఱియొకచోట—

## చాళుక్యుల పూర్వప్రస్తుత లిపి.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ

1 వేంగిలిపి క్రీ. శ. 4 వ శతాబ్దము
2 చేరలిపి క్రీ. శ. 467
3 పశ్చిమచాళుక్యలిపి క్రీ. శ. 578
4 పూర్వచాళుక్య లేక కళింగలిపి క్రీ. శ. 680
5 పశ్చిమచాళుక్యలిపి క్రీ. శ. 690
6 పూర్వచాళుక్యలిపి క్రీ. శ. 945
7 పూర్వచాళుక్యలిపి (మార్పుకాలము) క్రీ. శ. 11 వ శతాబ్దము
8 పూర్వచాళుక్యలిపి క్రీ. శ. 1134
9 పురాతనలిపి క్రీ. శ. 1334
10 హళకన్నడము క్రీ. శ. 1428

పై పతకమున క్రీ, శ, (4) వ శతాబ్దమునగల లిపికి వేంగిలిపి యనియు పూర్వ మాంధ్రదేశమునకు వేంగి దేశ మను పే రుండె నని చోళమండలమునకు రాజధానియగు కాంచీపురమునకు నైఋతిభాగమున వేంగియను నొకచిన్నగ్రామ మిప్పటికిని గలదు. ఆప్రదేశము మొదట నిర్జనంబయి పులులు సంచరించెడు ప్రదేశ మగుటంజేసి యక్కడివారు దానిని వేంగి యని పిలుచుచువచ్చిరి. (వంగై - యనగా - నఅవములో పులియని యర్థము. దీనినే కన్నడములో వేంగియందురు) వేఁగియనగా దెలుగులో పులియని యర్థము.

ఈమూడుభాషలయందు, నీపద మించుకభేదముతో వ్యాఘ్ర (పులి) పర్యాయమున మొదటినుండియు వాడఁబడు చున్నది. వేంగికిఁ జుట్టుప్రక్కలనుండు ప్రదేశమంతయు వేఁగి నాడని వ్యవహరింప బడుచుండెను. వేఁగినాటి బ్రాహ్మణులు మొదట నీప్రదేశములోనివారే యనితోచుచున్నది. తొలుత నీవేఁగినాటిబ్రాహ్మణులు ద్రావిడాచారమునే కలవారై క్రమక్రమముగా నిప్పుడిప్పుడు గొంతయాంధ్రాచారము నవలంబించు చున్నారు. ద్రావిడులలో వలెనే వేఁగినాటిస్త్రీలలో గొందఱికిఁ గుడిపైఁటలుం గలవు. కావుననే వేఁగినాడునకు తెలుఁగునాడునకు భేదమేర్పడినది. (ఆ·దే-శ-సం- 3 ౨ పుట)

వేంగి దేశము కన్నడదేశప్రాంతమనియు ఈ భూమి (వేంగిదేశము) ద్రావిడజాతులలో నొకరగు పల్లవులచేఁ బరి పాలింపబడుచుండెననియు, వారిరాజ్యము వేఁగిరాష్ట్రమనియు, వారిరాజ్యమును వేఁగిపురము లేక కళింగనగరమని బిలువ సాగిరనియు, జైనపాలకుల సంస్కృతనామంబులకు వర్మ యను విశేషణము జేర్పబడుచుండెననియు నాగవర్మ క్రీ-శ- 777 సంవత్సరప్రాంతమువఱకు వారివంశము వ్యాప్తముననుండె ననియె. (ఆంధ్రదేశకథాసంగ్రహము క్రీ-శ- 1910 ముద్రిత (32) పుట) యందు గలదు.

నాగవర్మవిరచిత కన్నడఛందము 1875 సం॥ రెవరెండు ఎఫ్ కెటిక్కు దొరగారి పీఠిక గలదిగా నుండుటచేతను,

క్రీ- శ- 630 సంవత్సరమునకుఁ దరువాతఁ దుంగభద్రా తీరమున నున్న కల్యాణపురపు జాళుక్యరాజును బరిమార్చె ననియు క్రీ శ- 1000 సంవత్సరప్రాంతమున వేగిరాజ్యమును శైవుడును నప్పటిదక్షిణ హిందూస్తానపుఁ ప్రబలరాజుననగు రాజేంద్రచోళునకుం జెందెనని యుండుటచే కన్నడమున ఛందము వ్రాసిన నాగవర్మ, వారివంశమువారు పరిపాలించు నంతవరకు కన్నడభాషయే వ్యాపించినట్లు విశదపఱచెను. (ఆంధ్ర-దే-క-సం- (32) పుట). అంతవరకు కన్నడభాషయే రాజభాషగానుండి యనంతరము,

## వేంగిలిపి.

పై లిపి పరిశీలించిచూడగ వేంగిలిపి క్రీ. శ- 4 శతాబ్దమున (అ) యను స్వరూపము అఱవమున ఇట్లు, (ఆ) యను స్వరూపము (అఱవమున ఇట్లుండడముచే వేంగిలిపి అఱవలిపియనియే సిద్ధాంత మాచున్నది. వేంగిశబ్దము ద్రావిడశబ్దమని ఆంధ్రదేశకథాసంగ్రహమున బ్ర. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు సిద్ధాంతపరచి యుండుటచే, పూర్ణవిశ్వాసముతో నమ్మదగియున్నది. అనంతరము కన్నడము, అటుపిమ్మట బ్ర - శ్రీ - కే - వి-లక్ష్మణరావు, ఎం, ఏ, గారు. వ్రాసిన మహమ్మదీయ మహాయుగము రెండవకూర్పు 378 పుటయందు రెండవ బుక్కరాయలు లేక మొదటిదేవరాయలు క్రీ - శ - 1404 - 1422 పాలించిన కాలములో సంస్కృతాంధ్ర కర్నాటకభాష లభివృద్ధి యయ్యెననియు జక్కయకవిచే రచియింపఁబడిన విక్రమార్క చరిత్రమను కావ్యమును గృతినొందిన సిద్దన్నమంత్రియు నతనితండ్రియగు జన్నయమంత్రియు నీరాజునొద్ద మంత్రులుగా నుండిరని వ్రాసియుండుటచే ఆంధ్రభాష పదునాల్గవ శతాబ్దమున యభివృద్ధిజెంది ఆంధ్రలిపి వాడుకలోనికి వచ్చెనని తెలియుచున్నది.

క్రమక్రమముగా అథర్వవేదకాలమునకు ముందే యుండిన దేవనాగరిమొదలుకొని ద్రవిడము (అఱవము) కన్నడ తెనుఁగులిపులు అభివృద్ధిజెందినవని తెలియుచున్నది.

శాసనములయందు నేటివరకు దేవనాగరిలిపినే ఉపయోగించుచున్నారు. దిగువ నొక శాసనము నుదహరింపఁబడినది.

గుంటూరు బ్రాడిపేటలో ఉప్పుటూరు గురునాథంగారిచే నిర్మింపఁబడిన (నాగరిలిపి) శాసనము.

శ్రీమదంబికాసహిత గురునాథేశ్వరాయ నమః.

స్వస్తిశ్రీ శా. శ. 1847 క్రోధననామసంవత్సర జ్యేష్ఠ బహుళ షష్ఠి శుక్రవారమున నీతిలక్పేటయందు (బ్రాడిపేట) నీ గుంటూరువాస్తవ్యులును, వైశ్యవంశీయులును, ఆంగిరస, శాకల్య, ద్వ్యార్షేయ ప్రవరాన్విత, సనకసగోత్రులు, యజుశ్శాఖాధ్యాయులు, ఆపస్తంబసూత్రులును, అచ్చమాంబప్పయార్యపుత్రులు, రోషమాంబాదయితులు, దానకర్ణులును, సర్వాభీష్టప్రదాయకులునైన ఉప్పుటూరి గురునాథముగారు శాశ్వతముగా నన్నసత్రము, చలివేంద్ర, కన్యకాపరమేశ్వరీ నిత్యనైవేద్యము, భిక్షుకులకు సదావృత్తి బెజవాడకొండపై మఠము నేర్పరచి, సప్తసంతానములు సంకల్పించి, తాడికొండ, అమరావతి మార్గము (రోడ్)లమధ్య తటాకప్రతిష్ఠ గావించి

ధననిక్షేప, బ్రహ్మస్థాప్య, ధర్మోపనయనాద్యనేక ధర్మంబు లాచరించి, యీయాలయము గట్టించుచుఁ బరలోకగతులు కాగా, వారిధనముతో ఆలయముపూర్తిగావించి సాంగముగా నమ్మహాత్ముని పేర నాచంద్రార్కము తత్పుణ్యమునకై, వారి యన్న నరసింహంగారిపుత్రుడు వెంకటపున్నయ్య శివుని ప్రతిష్ఠించి వ్రాయించిన ధర్మశాసనము. శ్రీగురునాథేశ్వరార్పణమస్తు. శ్రీ. శ్రీ. శ్రీ.

శాసనము వ్రాసినవారి నామము.

శ్లో॥ పళ్ళెవంశోద్భవోమాధ్వః । పూర్ణ ప్రజ్ఞోనిధిర్గిరాం ।
పాణినీయవిదేతాని । శాసనాన్యలిఖద్బుధః॥

దీనికి సరిగా సంస్కృతభాష తెలుగులిపిలోను క్లుప్తముగా - దేవనాగరిలిపిలోను శాసనములందు గలదు. (వాసవి-విభవ-వైశాఖ-క్రీ-శ-1928-మే - (3) సంపుటము (2) సంచిక (67) పుట) యందు వ్రాసియుండుటచే - ఆంధ్రదేశమున సహా నేటివరకు గీర్వాణభాష నాగరి లిపియందు ఉపయోగించు చున్నవారని విదితమగుచున్నది.

ఉత్తర - దక్షిణ లిపులలో ముఖ్యమైనవి 48. వానిని ఈ క్రింద అకారాదిగఁ జేర్కొనుచున్నాను.

(1) అబవము . (2) అకారా ( సింధుప్రదేశము ), (3) ఆసామీ, (4) ఉడియా (ఓఢ్రము), (5) ఓర్ఝూ ( బేహారు

లోని బ్రాహ్మణులలో), (6) కన్నడము (7) కరాడీ (కరాడ్ దేశము), (8) కాయథీ (ఈజాతివారుపయోగించునది), (9) గుజరాతీ, (10) గురుముఖీ (పంజాబులోని సిక్కులది), (11) గ్రంథలిపి (అరవదేశమునందు సంస్కృతము వ్రాయుటకు), (12) తిబ్బతీ (13) తుళు (14) తెలుఁగు (15) థల (పంజాబులోని దేరాజాతివారుపయోగించెదరు), (16) దోగ్రీ (కాశ్మీరము), (17) దేవనాగరి (దీనినే నాగరికూడ అందురు), (18) నిమాడీ (మధ్యపరగణాలోని నేమాడ్‌జిల్లాలోనిది), (19) నేపాల్, (20) పరాచీ (భేరాయ్) (21) పహాడీ (కుమాఊన్, గడవాల్), (22) బనియా (శిర్సాహిసారే), (23) బంగాలి, (24) బహ్వాలపుర్ (25) బడియా, (26) బిశాతి (27) మణిపురి (28) మలయాళము (29) మార్వాడి (30) ముల్తానీ (31) మైథిలీ (32) మోడీ (మరాఠీ దేశమందలిది), (33) రోరీ (పంజాబీ)(34) లామావాసీ (35) లుంగీ (శియాల్‌కోట), (36) సరాఫీ (లేక శ్రావకీ,) (37) సారికా (పంజాబునందలి దేరాజాతియందు) (38) సఈసీ (39) సింహాలి (40) శికార్‌పురి (41) సింధి, (42) బ్రహ్మ (బర్మా), (43) శ్యామ (సయాం) (44) లేయస్ (45) కాంభోజ (46) పేగుయార్ (47) యవ (జావా) (48) పిలిపయిన్.

(49) ఖరోష్టిలిపి, (50) బ్రాహ్మిలిపి.

అశోకుని శాసనములు రెండువిధములైన లిపులలో

వ్రాయఁబడియున్నవనియు, నందు ఒకదానికి బ్రాహ్మిలిపి యనియు, నొకదానికి ఖరోష్టియనియు బండితులునామమిడిరి.

ఖరోష్టిలిపి యుత్తరమునందు హిమాలయప్రాంతము నందు మాత్రము ప్రచారములోనుండెను. ఆఫ్గనిస్థాను, తుర్కిస్థానులోగూడ నీలిపితో వ్రాయఁబడిన శాసనము లున్నవి. అప్పు డార్యులంతవఱకు వ్యాపించియుండిరని యర్థము. హిమాలయమునకు దక్షిణముననున్న శాసనము లన్నియు బ్రాహ్మి లిపియం దున్నవి.

ఖరోష్టి బ్రాహ్మిలిపులు కలసిన సంధి స్థలము పంజాబులోని జాలంధర్ జిల్లా. ఈలిపికే పండితులు ఇరాన్ పాలి(Ariano Pali) లిపియనికూడఁ బేరుపెట్టిరి.

ఇది యపసవ్యలిపి. ఈ ఖరోష్టిలిపినుండియే యపసవ్యలిపు లన్నియుఁబుట్టినవని 'విశ్వకోశ' కారుఁడు వ్రాసినాడు. కాని యీ విషయము చింత్యము.

## పాశ్చాత్య, పౌరస్త్య, వర్ణభేదసూచి,
## లిపిపోలిక వర్ణమాల.

| ఆంధ్రము | బ్రాహ్మి లిపి | ఖరోష్టి లిపి | పురాతన ఫోనీషియను లిపి | మోబైట్ లిపి | ఆంగ్లము | దేవనాగరాక్షరి |
|---|---|---|---|---|---|---|
| అ | ੨ | 7 | ≮ ≮ ≮ | ≮ | A | अ अ अ |
| బ | ◇◇ | ς | 9 9 | 9 | B | ◻ ◻ ◻ ब ब |
| గ | ∩ | ዋ | 7 7 | | G | ∧ ∩ ग ग |
| ద | ◁ D | ς | ◁ ◁ | △ | D | ১ ১ ट द द |
| హ | ᒪ ᒪ | ? | ∃ ∃ ∃ | ∃ | E | ᒪ ᒪ ह ह ह |
| వ | ᕳ ᕳ | 7 | 4 4 | 4 | F(W) | ढ ढ व व |
| జ | E E | Y | I Z N | I | Z | E E ᑭ ज ज |
| ఘ | ᒪ ᒪ | Ⴖ | 8 H ㅂ H | ㅂ | H | ᒪ ᒪ घ घ घ |
| థ | ⊙ | ∧ | ⊕ ⊕ | | TH | ⊙ ○ ○ थ थ थ |
| య | ⊥ ⊥ | ↗ | ₹ ϰ Z | Z | I | ⊥ ⊥ य य य |
| క | + + | ᖻ | 7 Ꮍ Ꮍ | Ꮍ | K | + + क क क |
| ల | ↲ | × × ᒪ | ፘ ν | 6 | L | ᒍ ᒍ ल ल ल |
| మ | ४ ४ | ς | ᙎ ᙎ | ᙎ | M | ४ ४ म म म |
| న | ⊥ | ∀ | ५ ५ ५ | ५ | N | ⊥ ⊥ न न न |
| క్ష | ⱷ | Γ Þ | ≢ ≢ ≢ ≢ ≢ | ≢ | X(SH) | क्ष क्ष क्ष क्ष |
| ఓ(ఔ) | D ◁ | ℨ | O | O | O | |
| ప | ᒐ | ς | ⅁ 9 7 | 7 | P | ᒐ ᑌ प प |
| స | ᑯ ᑯ | ↗ | ᒍ ᒉ | ᒉ | S | ᑯ ᑯ च च च |
| ఖ | ℧ ? | ⊤ | φ φ φ | φ | Q | ᘐ ᘐ ख ख ख |
| ర | ʃ ʃ | 7 | 9 ◁ | ◁ | R | ɪ ɪ ɪ र |
| శ | ᐱ ᐱ | | W | W | S | ᙏ ᙏ श श श |
| ట | λ λ | | + X | X | T | λ λ त त |

పరమాత్మునియాజ్ఞానుసారము సముద్రుడే సృష్టిగావించెను.

శ్లో॥సోఽభిధ్యాయ శరీరాత్స్వాత్సిసృక్షుర్వివిధాః ప్రజాః। ఆపఏవ ససర్జాదౌ తాసు బీజమవాసృజత్ ॥ 8 ॥ తదండమభవద్ధైమం సహస్రాంశు సమప్రభమ్ । తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః ॥ 9 ॥ ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః। తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః ॥ 10 ॥ యత్తత్కారణమవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్ । తద్విసృష్ట స్స పురుషో లోకే బ్రహ్మేతి కీర్త్యతే ॥ 11 ॥ తస్మిన్నణ్డేతు భగవానుషిత్వా పరివత్సరమ్। స్వయమేవాత్మనో ధ్యానాత్తదణ్డ మకరోద్ద్విధా ॥ 12 ॥ తాభ్యాం స శకలాభ్యాం చ దివం భూమిం చ నిర్మమే । మధ్యే వ్యోమ దిశశ్చాష్టావపాం స్థానం చ శాశ్వతమ్ ॥ 13 ॥ ( మనుస్మృతిః (1) అధ్యాయము.

అర్థము : పరమేశ్వరుఁడు తనయొక్క శరీరమునుండి (సంకల్పమునుండి) అనేకప్రజలను సృష్టించవలయునని కోరికచే మొదట జలమును(మున్నీరును)సృష్టిజేసెను. మరియు నాజలము నందే వీర్యమును బీజము (తేజము) కూడ నారోపణజేసి సృష్టించెను. అటుపిమ్మట పరమేశ్వరునియిచ్ఛవలన నావీర్యము (తేజము) వర్ణమయ మనగ బహుళ ప్రకాశమై అండముగ నాయెను. ఆయండముయొక్క ప్రభ (వెలుఁగు) సూర్యునిసదృ

శముగనుండెను. అందుండిసర్వలోకములలోను మొదటివాడ
పితామహుడైన స్వయంభ్రహ్మయను నామము గలవాడై
హిరణ్యగర్భుడుగ పుట్టెను. పూర్వోక్తమైన పరమేశ్వ
డాఖండమును తనసంకల్పమువలన రెండుభాగములుగ జేసి
ఆరెండుఖండములలో నుండునట్టి పైభాగమునకు దివమని
(స్వర్గమనియు) దేవలోకమనియు, అధోభాగమునకు భూమి
మనియు, మధ్యభాగమునకు అంతరిక్షమనియు, (ఆకా
నియు) మరియు నెనిమిదిదిక్కులనియు, వీర్యముతోనుండు (
మాత్మని తేజముతోనుండు) జలభాగమునకు (మున్నీరు
సముద్రిడనియు ఇట్లుగ నేర్పడునట్లు జేసెను.

ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః,
తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః

తా॥ ఆపములు (నీరు) (మున్ + నీరు) మున్నీరు నార
లనబడును. ఆపములు (నీరు) నరసూనువులు (నర-న
అనగా మున్నీరు) సూనువులు (కొడుకులు - పుత్రులు)
రనియు అందు మొదట లోకపితామహుడగు బ్రహ్మ పుట్టె

అట్టినారములు (మున్నీరు) పరమాత్మకు నునికి
లగుటచేత నీ పరమాత్మ నారాయణుడనబడియె.

## బ్రహ్మవాక్యము.

అహం ప్రజాస్సిసృక్షుస్తు తప స్తప్త్వా సుదుశ్చరమ్,
పతీః ప్రజానామసృజం మహర్షీ నాదితో దశ. 34

ఏను ప్రజలను సృజింపఁగోరి చేయనలవిగాని తపం బొనర్చి. మొదట బదుగురు ప్రజాపతులను సృజించితిని.

మరీచిమత్ర్యంగిరసౌ పుల స్త్యం పులహం క్రతుమ్
ప్రచేతసం వసిష్ఠం చ భృగుం నారదమేవ చ. 35

వారెవరన——మరీచి, అత్రి, అంగిరసుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, ప్రచేతసుఁడు, వసిష్ఠుఁడు, భృగువు, నారదుఁడు.

ఏవమేతైరిదం సర్వం మన్నియోగాన్మహాత్మభిః
యథాకర్మతపోయోగాత్సృష్టం స్థావరజంగమమ్. 41

మహాత్ములగు మరీచ్యాదిప్రజాపతులు తపంబొనర్చి నాయానతివొప్పున వానివానికర్మానుసారముగా నీ కనుపడు చున్న స్థావరజంగమరూపమగు ప్రపంచమెల్ల సృజించిరి.

### ఋగ్వేదానుకూల క్షత్రియనామ నిరూపణము.

శ్లో॥ వీర్యం తేజఃప్రభావయోః॥..............

తేజస్సు అను శబ్దము బల, వీర్య, సామర్థ్యము లను శబ్దములకు పర్యాయవాచకమై యున్నది.

శ్రు॥ ప్రాణః ప్రాణో వై బలం తత్ప్రాణే ప్రతిష్ఠి తమ్। (శతపథ, బ్రా, కా 7- అ8 బ్రాహ్మణము 1 ఈ మంత్రమునందును శ్రు॥ ప్రాణో వై బలమ్॥ అను మంత్రము ననుసరించి ప్రాణశబ్దమనగ సామర్థ్యము. ఇయ్య బలమను శబ్దవాచకమైయున్నది. ఆ బలమను శబ్దము ప్రా శబ్దవాచకమైయున్నది.

శ్రు॥ రయి సుక్షత్రం స్వపత్యమాయుః సువీర్యం నా సత్యావహన్తాం॥

ఋగ్వేదము - మం (1) సూ (1)

విద్యారణ్యభాష్యము, సుక్షత్రం శోభనం బలమ్॥

సాయణాచార్య భాష్యము. అతః క్షత్ర = బల బల = క్షత్ర, ఇపుడు క్షత్రియ శబ్దము, బలమను శబ్దము ఈ రెండు శబ్దములు సామర్థ్యమను అర్థమునందు పరస్ప మొకటి కొకటి తుల్యార్థములై పర్యాయపదములై యున్న వను విషయము స్పష్టపడినది.

బ్రహ్మాండము తొలుత సముద్రమునందే యణగియుండెను

"తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమ గచ్ఛంత విశ్వే।

అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః"

బ్రహ్మాండమున దేవత లందఱు చేరియుండిరి. ఆబ్ర హ్మాండము తొలుత మహాసముద్రమునం దడఁగియుండెను. అందే సకలభువనములును సమస్తజీవరాసులును సృష్టికి పూర్వ మునం దణఁగియుండెను. అతఁడే సమస్తభువనములను పరమా త్మునియాజ్ఞానుసారము సృజించెను. అతనియందే దేవతలంద అడఁగియుండిరి.

పై వాక్యములవలన విశ్వమునంతఁదొలుత భగవంతుని యాజ్ఞానుసారము సముద్రుఁడు సృష్టించెనని తెలియుచున్నది. ఇతఁడొకఆదిబ్రహ్మ యనఁబడును. ఇందరిత్వమువలెనే బ్రహ్మ త్వమును నొకపదవి. కావున బ్రహ్మలు మారుచుందురు.

నారాయణునికుమారుడు సముద్రుడు.

బ్రహ్మ నారాయణునికుమారుఁడు. క్రీడాసక్తులైనశివ శక్తులవలన విష్ణుమూర్తి జన్మించెను. ఇతనినిదపముచేయు మని మహాదేవు డానతిచ్చెను. విష్ణువొనర్చిన నిరంతరతపః క్లేశమువలన వానిశరీరమునుండి (దేహమునుండి) నారము లొచ్చెను (జలములు వచ్చెను.) ఆకారణముచే మహాదేవుడు విష్ణువును నారాయణుఁ డనియె. నారాయణునికుమారుఁడు సముద్రుఁడు. (శివపురాణము)

సముద్రుఁడు విష్ణుమూర్తి (నారాయణుని) దేహము నుండి బుట్టె సృష్టిచేయుటచే ఆదిబ్రహ్మ యయ్యె.

శివునియొక్క దక్షిణాంగమువలన జన్మించి అప్పటికి విష్ణునాభినుండి కమల మొకటి యుద్భవించియుండ బ్రహ్మ

లీలచే ఆకమలము ప్రవేశించి దానియాది చూడగోరెను. కనుగొనలేక బైటకువచ్చి తపసుచేసి విష్ణువును దర్శించెను అని యొక గాథ కలదు. పై బ్రహ్మల పుట్టుక (జన్మము)ను గురించి పరిశీలన మొనర్పగా సముద్రుడు (బ్రహ్మ) విష్ణు మూర్తిస్వశరీరమునుండియు, రెండవబ్రహ్మ శివునియొక్క దక్షిణాంగమువలన జన్మించి యనంతరము విష్ణునాభినుండి పుట్టిన కమలము ప్రవేశించెనని యుండుటచే వంశవృక్షము యందు 'శివుడు' యతనికి బ్రహ్మయని యొకటి, 'విష్ణు' లేక - నారాయణుఁడు - యతనికి సముద్రుఁడు, నతనికి బ్రహ్మ చంద్రుఁడు యని రెండవది. ఇట్లు రెండుమార్గము వంశవృక్షముల వ్రాయుట విధియై యుండును. (శివ పురాణము.)

## నవబ్రహ్మలు.

ఇంద్రత్వమువలెనే బ్రహ్మత్వమును నొక పదవి (1) బ్రహ్మహృదయమునుండి పుట్టిన భృగువు (2) బ్రహ్మ కర్ణములనుండి పుట్టిన పులస్త్యుఁడు (3) బ్రహ్మమానస పుత్రుఁడు(బ్రహ్మనాభినుండి పుట్టిన) పులహుఁడు (4) బ్రహ్మ మానసపుత్రుడయిన అంగిరసుడు (5) బ్రహ్మమానసపుత్రు డైన అత్రి (6) బ్రహ్మమానసపుత్రుడైన క్రతువు (7) బ్రహ్మ దక్షిణాంగుష్ఠమునఁ బుట్టిన దక్షుడు. (8) సప్తఋషులలో నొకఁడైన వసిష్ఠుఁడు (9) బ్రహ్మమానసపుత్రుడైన మరీచి అను నవబ్రహ్మలు.

## ఆ ది బ్ర హ్మ స ము ద్రు డు.

నవబ్రహ్మల కాదిబ్రహ్మ సముద్రుఁడుగా నున్నటుల మనుస్మృతి 2 వ అధ్యాయము 8-9-10-11-12 శ్లోకముల యందు ఆదియందు పరమేశ్వరుడు జలము (మున్నీరు)ను సృష్టిజేసెననియు నాజలమునందే తన తేజము నారోపణ జేసెననియు అందుండి సర్వలోకములలోను మొదటివాడగు పితామహుడైన సాక్షాద్బ్రహ్మమను నామముగలవాఁడొకడు పుట్టెననియు వీర్యము (తేజము)తో నుండు మున్నీరు యీ బ్రహ్మకంటె మొదటిబ్రహ్మయని దెలియపఱచుచున్నది.

శివునియొక్క దక్షిణాంగమువలన జన్మించి విష్ణువు నాభియందుఁ బెరిగి యనంతరము సృష్టి పెంపొందించుటకై తనవలన జన్మించిన సరస్వతినే పరిణయమయ్యెనని బ్రహ్మ పురాణమున గలదు.

సముద్రుడన్ననో పరమాత్మునియాజ్ఞానుసారము సర్వ లోకములలోను మొదటివాఁడగు (ఆది)బ్రహ్మను బుట్టించెనని మనుస్మృతియందుండుటచే బ్రహ్మలలో మొదటి (ఆది) బ్రహ్మ సముద్రుడు. ఇతడే విశ్వము నంతయు దొలుత సృష్టించెనని తెలియుచున్నది.

మొదట నారాయణునివలన సముద్రుఁడు, వానికి మొదటివాడగు పితామహుడైన సాక్షాద్బ్రహ్మమను నామము గలవాఁడొకడు పుట్టెను. అనంతరము క్షీరసాగరసుతవమైన పిమ్మట చంద్రుడు పుట్టెను.

## వంశవృక్షము.

ఆదిబ్రహ్మకు సూర్యచంద్రులు

నారాయణుడు

|

సముద్రుడు (ఆదిబ్రహ్మ)

- బ్రహ్మ
  - 1. మరీచి
    - కశ్యపుడు
      - సూర్యుడు లేక ఆదిత్యుడు, అదితి కుమారులనే ఆదితేయు లందురు. వీరినే పురాణము లందు దేవతలని వర్ణించిరి.
      - కశ్యపునిభార్యయైన దితికి దైత్యులు, వీరిని రాక్షసులని పురాణములయందు వర్ణించిరి.
  - 2. అత్రి
- చంద్రుడు
  - బుధుడు వీనికి వైవస్వత[illegible] కూతురయిన ఇ[illegible]
  - పురూరవుడు
  - నహుషుడు (ఒక ఇంద్రుడు)
  - యయాతి
  - పూరుడు
  - అంతిసారుడు (2) వ వంశవృక్ష[illegible] చూడుడు.
  - సుమతి
  - దుష్యంతుడు
  - భరతుడు
  - భూమన్యుడు వీనికి మా[illegible] కుమారుడు
  - ఋక్షుడు
  - సంవరణుడు
  - కురువు [illegible] పేరనే కురు[illegible] మనబరగె.

అదితి, దితి యనువారు ధరణీదక్షుల కుమారితలు, కశ్యపుని భార్యలు. వీరికి పుట్టిన దైత్యులు ఆది తేయులు ఒక్క తండ్రిబిడ్డలే; తల్లులిద్దరు. ఆ కారణముచే వీరిలో వైరవర్గ మేర్పడియె.

కశ్యపబ్రహ్మ దేవదానవులకు మూలపురుషుడు. ఇతనికి దితి అదితియని ఇద్దరుభార్య లుండిరి. దితికి గలిగిన సంతానమువారినే "దైత్యు"లందురు. వీరినే పురాణరచయితలు రాక్షసులని పేర్కొనిరి.

అదితియొక్క సంతానమువారినే "ఆదితేయు"లందురు. వీరినే పురాణములయందు దేవతలని వర్ణించిరి.

### దేవదానవులు నొక్కతండ్రిపుత్రులు.

పైవంశచారిత్రమువలన దేవదానవులందరు మొట్ట మొదట ఒక్కలోకనివాసులే యని తేలుచున్నది. ఆలోకమే దేవలోకముగ వర్ణింపఁబడియున్నది.

పద్మపురాణమందు . మొట్టమొదట దైత్యులు విదేశములకు బోయి సుఖజీవనము సేయ సంకల్పించుకొనినట్లు సూచింపఁబడియున్నది. దైత్యులు రెండుజట్లుగ దేవలోకము నుండి వలసబోయిరని చెప్పఁబడినది. దైత్యులు మోటువారగుటచే వీరిని శిలాయుగప్రజలనియు శల్యయుగప్రజలనియు (Stone and bone ages) చెప్పుదురు. దైత్యులు రెండుజట్లుగా బయలుదేరి విదేశములకు బోయిరని సూచింపఁబడెను. మూడవజట్టొకటికూడ దేవలోకమునుండి వచ్చి మొదటి రెండుజట్లవారిని తమకు లోపడునట్లు చేసిరి. మూడవజట్టు వారు మొదటిరెండుజట్లవారికంటె మెక్కువనాగరకతగలవా

రగుటచేతను, ఇంచుక యింగితజ్ఞు లగుటచేతను వీరిని తామ్రయుగప్రజ (Copperages)లని చెప్పుదురు.

పద్మపురాణ రామాయణములు రాక్షసజాతియొక్క పూర్వసాంప్రదాయము నొక్కింత తెలియజేయుచున్నవి. మనుసంభవమునకు పూర్వము భారతభూమికి వలసవచ్చిన దితి సంతానమువారు విష్ణువుచేతను అతనికుమారుడగుమనువు చేతను అణచివేయబడినట్లు (లోపడునట్లు) పయిరెండుపురాణములు స్పష్టముగ తెలుపుచున్నవి. దైత్యులు ఓడిపోయి శరణుజొచ్చుటచేతను వారిని ద్రావిడు లనియు, వా రుండు దేశమునకు ద్రవిడదేశమనియు పిలుచుచుండిరి. "దేశీయ" పదముయొక్క వికృతరూపము "దస్యు" అయినదని తెలియుచున్నది (దస్యుడు=శత్రువు, సం. వి.) సవతితల్లిబిడ్డలగుటచే జ్ఞాతివైరమున దస్యులని ఆదితేయులు బిలుచుచుండిరి.

దస్యులనువారు రాక్షసులు కారు, దాసులుకారు, శూద్రులుకారు. ఈ వంశచారిత్రమును పట్టి చూడగ ద్రావిడులు సముద్రునికి మూడవతరమువాడయినకశ్యపునిసంతతివా రగుటచేత వీరుగూడ దేవతలసంతతివారే యని దృఢపడుచున్నది.

కశ్యపుడు కూడదనుచుండినను దితి కామోద్రేకముచే భర్తను సంధ్యాకాలముననే గవయుచుండెడిది. బలిమిచే గవయుచుండుటచే ప్రజలను బాధించుస్వభావముగలవారైరి.

ఎల్లకాలము దేవతలను బాధించుచు వారిపై యుద్ధమునకు పోవువారు. గావున వీరికి ద్రవిణులని నామము గల్గెను.

ద్రవిణ॥ ద్రవత్యనేన శత్రుంప్రతి ద్రవిణ= ద్రుగతౌ॥ దీనిచేత శత్రువునుగూర్చి పోవుదురు. (శత్రువునిపైకి యుద్ధమునకు బలాత్కారముగ పోవునట్టి బలముగలవారు.) ద్రవిణము సం - వి - అ - న - బలము.

26 వ పుటయందు 'దేవదానవులు' యను వ్యాసమున దైత్యులు (ద్రావిడులు) రెండుజట్లుగా బయలుదేరి విదేశమునకు బోయి రనుటానిలో రెండవ సమూహామే ఆదిరేడువంశమువారు, వాహినీపతివంశజులనియు గంగవంశజులనియు మున్నీరువా రనియు దండనాయకులనియు చతుర్విధనామములచే పిలువబడుచుండిరి. అందు మున్నీరువారు సముద్రకులమువారని నొక నామాంతరము గల్గియుండిరి.

వైవస్వతమనువుయొక్క (44)వ యుగమున(426977)వ సంవత్సరమునందలి కృత యుగ ప్రమాణాంత్యమువరకు అప్పటి మనుజులు తేనెపట్టులనుకూడ గ్రహించి తేనె నాహారముగా నుపయోగించుచుండిరి. జవసంఖ్య హెచ్చినకొలది గ్రమక్రమముగా కందమూలాదులు చాలకుండెననియుగలదు. ఆంధ్రసంచిక 1930 సం॥రం (197) పుట.

ఇట్లు (1728000) సంవత్సరములు గడచినపిమ్మట ప్రజలయందు లోభగుణ మంకురించెను.

## లోభ గుణమనగా నేమి?

లోభగుణమనగా: లోభము (సం) వి- అ- పుం- పిసినితనము (కాంక్ష) అకారాంత స్త్రీయాం॥ అమరః॥ ఇచ్ఛాయాం॥ ఆస-అమరః॥ నానార్థః॥ స్త్రీయాం॥ తృష్ణాయాం॥ పేరాస (తృష్ణక్ లుబ్ధే - లోభి). ఆసచేత నిలువయుంచుటకై పరిమాణమును మించి బలత్కారముగ వృక్షములనుండి స్వీకరింప నారంభించుటచే అపారముగ వెల్లువాలు దిగజారి కాలువలై పాఱుతేనె అతిస్వల్పముగా లభించుచుండెను.

కాలగతిచే ప్రజలు క్షుత్పిపాసలచే బాధింపఁబడుచుండిరి. తద్బాధనివారణమునకై ఆదిరేడు తన పుత్రులతో గూడ సస్యాధిపతియై మున్నిటికి పట్టియైన బాలచంద్రుని జటాజూటమున ధరించిన చంద్రమౌళినిగురించి ఘోరతపమాచరింప నపుడానిష్ఠాగరిష్ఠునకి ష్టంబగునటుల ప్రత్యక్షమై తనయాజ్ఞప్రకారము చంద్రుని సస్యములఁ గల్పింపుమనియు, యట్టిసస్యముల నెట్లు వృద్ధిజేయవలయునని యెఱుంగుటకై తన భక్తాగ్రేసరుండగు - చంద్రవంశ శిరోమణియై - విశ్వమునకు మిత్రుడైన - విశ్వామిత్ర మహర్షిచే,

## విశ్వామిత్ర నామార్థము.

'విశ్వామిత్రః॥ విశ్వం సర్వం జగత్ మిత్రం యస్య స

తథా, మిత్రేచక్షా ఇతి విశ్వశబ్దస్యదీర్ఘః, అయమ్ఇతిఇదంశబ్దేన పురోవర్తివస్తువాచినా సర్వజనసన్నిహితత్వేన సర్వమిత్రత్వమ్॥ (విద్యారణ్య భాష్యము)'

సాకల్యముగఁ దెలిసికొనునటుల ఆజ్ఞనొసఁగి కాలకంఠుడు కైలాసమునకుఁ జనియె.

అనంతర మీవంశజులు గోధుమలు యవలు పెసలు సెనగలు కందులు బొబ్బరలు నువ్వులు మినుములు ఉలవలు మొదలగు ధాన్యములలో కొన్నిటిని భూమిపై చల్లిరిగానియవి దున్నకయే జల్లినందున ఫలింపమిచే చింతానలపరితప్త హృదయులై విశ్వామిత్రమహర్షి సన్నిధానమునకు వెళ్లి శిరసాష్టాంగదండములర్పించి వినయవిధేయులైనిలుండి నవధాన్యములు సంపూర్ణముగ అభివృద్ధి జెందకుండుటకు కారణము తమతో విచారణీయమని విన్నవింప అపుడా మునిపుంగవుఁడు తనదివ్యదృష్టిచే వృషభమే ఈకార్యనిర్వాహకానుకూల జంతువని యెరింగి పలుమారు వీరెల్లరును తనతపోసమయములందు రాకుండునట్లు ఆదిరేడునకు ఈశ్వరోపాసనానుకూల మార్గము బోధించి వారెల్లరులు స్వస్థానమునకు బోవుటకై యాజ్ఞనొసగెను.

ఆ ది రే డు త ప మా చ రిం చు ట .

ఆదిరేడు ఇలుజేరి సమస్తవరంబులు కరంబున గలహరునిగురించి తపమాచరించుచుండ శివుడు ప్రత్యక్షమయ్యె.

రేడు తనకు వ్యవసాయశాస్త్రములనెల్ల నెఱిగినయొకపుత్రుడు కలుగవలయుననియు సదా ఈశ్వరునియందే ధ్యానముగలిగి యుండునట్టివాడై యుండవలయునని కోరెను. శివు డద్దానికి సమ్మతించి ప్రమథగణములలోనుండి నొకనికి వ్యవసాయ శాస్త్రములనెల్ల నెఱుఁగ వరమిచ్చి ఆదిరేడునకు పుత్రుడుగ జన్మింపుమని ఆజ్ఞయిచ్చెను.

శివునివరమునఁ జొక్కమాదేవియందు ఆదిరేఁడునకు జన్మించిన పుత్రుడే ఆగమరేడు (ఆగమః ఆగతౌ=వచ్చుట) ఈశ్వరలోకమునుండి వచ్చినవాఁడు గావున ఆగమరేడని నామ కరణముచేసి కొన్నివత్సరములయందే ఉపనయనాదిసంస్కా రములఁగావించి వసిష్ఠాశ్రమమునకు పంపగా వారు రచించిన ఋగ్వేదమందలి 6 వ మండలము 3 వ గీతములయందు వర్ష మునిమిత్తము ప్రార్థింపఁబడినవియు మరియు యందే 3 వ మండలము 5 వ అధ్యాయమునందలి ప్రార్థనలలో కడ పటిగీతములందు 6 వ మంత్రములో పరమాత్మను ఓంకార గాయత్రిగా మరియు 6 వ మండలము 3 వ గీతముల యందు పరమేశ్వరుని సూర్యునిపేరుతో స్తుతించినవియును అందే

2 వ మండలము 3 వ అధ్యాయముకడపట గృహ ములు మొదలగునవి నిర్మించునపుడు స్తుతించుమంత్రములను నేర్పెను.

## విశ్వామిత్రునియొద్ద విలువిద్య నేర్చుట.

అనంతర మా రేడు విశ్వామిత్రునియాశ్రమమును జేరి శిరస్సాష్టాంగవందనము లర్పింపగ ముని యాశీర్వదించి నీ వొచ్చిన కారణము నాకుఁ జెప్పవలయును. అని యడిగెను. వ్యవసాయశాస్త్రానుకూలవిద్యయు దండనాయకవిద్యయును నేర్పి నన్ను కృతార్థుని జేయుఁడనియె. తపోధనుఁడు గాధినంద నుడు యతనిరాకకు కారణము యోగబలముచేఁ దెలిసికొనియె

## దండనాయకవిద్య విశ్వామిత్రుడు నేర్పుట.

యజుర్వేదమున కుపవేదమయిన ధనుర్వేదమునకు తాను కర్తగావున యందలి భిండి వాలాసి కోదండ భల్లా తక నారాచ రోహణ నఖన వజ్ర ముష్టిముద్గర శూలముసల భుసుండిక ప్రాస పరికూర్మ కప్పట కటారి కాగరా యోదండ పరశు తోమర చక్ర పరిఘ పట్టసములు వంకిణికాదిసబళం బులు బవ్వాలె సెలకట్టె యాదిగాగల ముప్పదిరెం డాయుధ ములు నొసగి

జిఱుత చెయ్యమ్మ గండకత్తెర ఇనుపకోవి భృంగి పటలము పైసరపుదండ ఎడమవరభృంగి కుడివరభృంగి భృంగి దండ గజదండ సమదండ సింగంపుదండ పొదలికదండ యుదు గడుగుపొదలికదండ మద్దెలసంచుదండ కుక్కుటపుదండ మొద లగుపదిరెండుదండములయం దఖండ పాండిత్యము నేర్పి

ఎడమయడుగుపరువడి కుడియడుగుపరువడి కదలు పరువడి దాటుపరువడి కోపుపరువడి అంతరిటీక సైన్యమధ్య నాట్యము దారు దారుతోడ ఉరుదోడ ఝాటు ధాణు కపాలు ధారుకదారుక ధాకధాణు దాకిరు ఝాటు మొదలైన పదునాల్గువిసరులమర్మంబులు గరపి

కక్కి కొక్కిన డొక్కెర ముత్తెరడొక్కెరము గుమ్మ రింపు బోడింపు సందుసీసంబును గొంతుమారును సమసంబును సురాపంబును చేవయు కందనంబును కల్లంబును తొట్టును తిర్ల యుంబడిపొర్లుటయు రొండివేటును ఫణంబును కన్నాతుసుభా రంబును సొంగిణియు పెట్లాగును రాణింపును సరిబిత్తరంబును లాగును విట్టాలయంబును తిణింగిణియును పాదనివారణంబును పాదగళాప్తియు గళకత్తెరయు కాళనిల్కడయు నృసింహంబు నను ముప్పదిరెండువిన్నాణంబులనాణెంబులఁ గరపి

వంట్యడుగుకత్తెర సర్వబంధకత్తెర పొదలికకత్తెర చిట్ట డుగుకత్తెర పావుపావులు జాగినపావులు మొదలగు పదిరెండు పరువళ్ళయందు ప్రావీణ్యునిజేసి

హరిగతి గజగతి వ్యాఘ్రగతి మహిషగతి జంబుకగతి మర్కటగతి మార్జాలగతి హరిణగతి చటకగతి పక్షిగతి తాండవగతి నరగతి మొదలగు పదిరెండుగతులయందవార్య చాతుర్యమునేర్పి

విష్ణుచక్రింబును శీఘ్రరామబాణంబును నాగబంధనంబును తోలకరిమెరుపును అల్లిమత్తును విస్సందును హస్తాభరణంబును పదఖండనంబును పరితాడ్రిను లోభిత్తరి వెలిబిత్తరి సర్పాంకుశము మొదలగు పదిరెండుగాయమానంబుల భేదంబులను దెలిపి

లోమొనవెలి మొనయుసి మొనము మొన చతురుమొన పుణ్యామొన పాపపుమొన చాటడుగుమొన కదలుమొన అఱమీటుమొన నెఱమీటుమొన సరితాళపుమొన యాదిగా గల పదిరెండుమొనలమర్మములు గఱపి

లోవెలిగజ్జదుముకు చూరణసరుకు మొదలగు సరుకు మర్మంబుల నేర్పి

దండనిల్కడ కదలుతుటుము కలయు మెలకువయు లింగళింపు దిశావదిశలు పాదపుసారువ హస్తపుసారువ దేహపుసారువ నయనసారువ దిగిరాకడ ఏకసర పైసరఝంపు టెక్కు కరలాఘవము మొదలుగా గల షోడశోపవీతంబులరీతులు జూపి

భ్రాంతంబును దాంతంబును ఆప్లుతంబును ఆవిష్కృతమును అష్టికంబును ఆకరంబును అవికరంబును మిశ్రితంబును మానుషంబును నిర్మర్యాదయు విచిత్రంబును ఛిన్నంబును సవ్యజానువు అపసవ్యజానువు క్షిప్తంబును ధృతంబును గుడం

బంబును లంబనంబును సవ్యబాహువు విపీతబాహువు త్రిబాహువు తుంగబాహువు సవ్యోత్తరంబును ఉత్తరంబును సవ్యకరంబును ప్రధితంబును యాధికంబును అపృష్టపరిహారంబును వల్గితంబును స్వస్తికంబును మొదలగు ద్వాత్రింశత్ప్రచారంబులవిచారము వివరించి

పరాక్రమమున నీ సాటిలేక జగత్కోటిలో మేటివై దండనాయకులలో ఆచార్యుడవై యుండుమని

## జలమర్మస్థానపరీక్షాశాస్త్రము.

విశ్వామిత్రుడు రాబోవు ద్వాపర కలియుగాంతము వఱకు మేఘములు సంపూర్ణవర్షమును కురిపింపకున్నను వాపీకూప తటాకముల నిర్మించి భూయంగమున గల జలనాడుల నుండి పరిశుభ్రమగు జలము పరిగ్రహించెదరని తనమనంబున నిశ్చయించి నాజలార్గళశాస్త్రముసహా సాకల్యముగ వివరింప ప్రారంభించెను.

శ్రీమత్సకలచరాచరాత్మకుఁడగుభగవంతునిచే సృష్టింపబడిన ఈప్రపంచమునందలి జంగమరూప ప్రాణులును స్థావరరూప వృక్షాదులు జీవించి యుండుట "ప్రాణా వా ఆపః" అను శ్రుతిరీతి నుదకమే ప్రాణులజీవాధారము.

అయ్యుదకంబులు గంగాదిజీవనదులుగ ప్రవహించుచు దూరప్రదేశములగుటచే జనులుండుస్థలంబుననే జలము చిక్క

వలయునన్న గప్తతరంబు. అట్టితటి గొలంకులు బావులు నడ బావులు దిగుడుబావులు నిర్మించినయెడల సులభసాధ్యంబై యుండు. ఐన నాజలంబులు కొన్నిభూములయం దతిలఘువుగ దొరకియు మఱికొన్నిమరుప్రదేశములయందు జిక్కకుండుటం జేసి జలశూన్యంబగుప్రదేశంబులయం దాయాభూస్వభావం బులను వానిలక్షణంబులను జలంబులుండు స్థలంబులను నెఱుం గుటకును మఱియు వాపీకూపతటాకారామ నిర్మాణవిధియు యాబావులయందు పాషాణాదు లుండినను పఱుపుబండ లుండి నను బగులగొట్టు నుపాయంబులును ఉదకం బుప్పగనుండిన మధురంబగునటుల జేయు తెఱంగును దెలిపెదను. మఱియు

## పూర్వము పృథివీపతి ఎవ్వరు?

స్నానపానజలక్రీడాది సమస్త సౌఖ్యంబులఁ గలుగ జేయునదిగను మిగుల సౌందర్యగర్వంబుజెంది నానావిధ జల క్రీడాదులొనర్చెడిసుందరాంగులమనంబున కుల్లాసముగలుగ జేయునదిగను ఝుంకారంబులొనర్చు భృంగంబులతోఁగూడి వికసింపఁబడిన కమలంబులచే నలంకరింపఁబడినదిగను సంపూ ర్ణోదకంబుగలిగి విస్తారంబుగ నుండునట్టి నడబావులును స్త్రీలు నెవనికి గలిగియుండునో నతఁడే పృథివీపతి యనబడును.

శ్లో॥ పుంసస్సర్వసుఖైకసాధనపరాసౌందర్యగర్వోద్ధుర
క్రీడాలోలవిలాసినీజనమనస్స్ఫీతప్రమోదావహాః

గుంజద్భృంగవినిద్రపంకజభృతస్ఫారోల్లసద్దీర్ఘికా
యుక్తాస్సంతిగృహేషుయస్యవిపులారామాస్సపృథ్వీపతిః॥

తా॥ సంపూర్ణోదకము గలిగి విస్తారంబుగనుండు నడబావులు సౌందర్యవతులగు స్త్రీలు నెవనిగృహంబున నుండునో యతడే పృథివీపతి యని పిలువబడునని యుండుటచే,

అనేక జలనాడులతో గూడినదిగను అందు సుఖంబుగ దిగునట్టిసోపానమార్గంబులు గలదిగను కిలకిలాదిశబ్దంబుల గావించు నానావిధపక్షులతో గూడిన పుష్పవృక్షంబులుగలదిగను మిగుల చిత్రింబులగుపడవలుగలదిగను అనేకవిధంబులగు కమలములు కలువలును గలిగి గృహారామసమీపముల యందు నిర్మింపవలయు. క్షేత్రపాలకుఁడ వగు నీవు మంగళార్థమై మనోరమ్యంబగు కూర్మంబును నంచుంచవలయు. "కూర్మో మంగళార్థం నరేంద్రైః" నరేంద్రా! నీమంగళార్థమై మనోరమ్యంబగు కూర్మంబును బావియం దుంచవలయు.

ఆబావికి సమీపమున పుష్పలతాదులచే మిగుల దట్టంబులై ప్రేమానురాగుడైనపతికి సతి సమీపవాసురాలైనపుడు జిహ్వాంతరమున యమృతధార నుత్పత్తియొనట్టి కొమ్మ స్పర్శవలె కొమ్మలతో వ్రేలాడుచుండెడి వృక్షముల కభిముఖమై జలనాడులనుండి యమృతసమానమగు జలంబులుత్పత్తికాగల యుద్యానవనరాజంబుల నొనర్పుము. అందు-

పుష్పఫలాదులచే మిగుల క్రిక్కిఱిసియుండుకొమ్మ లతో వ్రేలాడుచుండి సర్వసంపదలుగల మానవుఁడు నిట్లుండుట విధియని బోధపఱచునట్టి దిట్టము లగు వృక్షముల వేయుము. "ధనముగలవాఁడు బూరుగుఫలమువలె నిరుపయోగుఁడుగాక సంపూర్ణముగ ఫలించిన వృక్షమునందలి ఫలంబులు శుకపికాదిపక్షిజాలంబుల కుపయోగార్థమై వ్యర్థము గాకుండునట్లు" ధనికుఁడు సకలప్రాణులకు హిత మొనరింప సూచించు ఫలవృక్షముల వేయుము. అనంతరము గ్రామమందలి సర్వజనుల కుపయోగింప ననుకూలమగు నొక తటాకంబు (చెఱువు)ను గట్టుము. అట్టి తటాకనిర్మాణవిధి వచించెద వినుము.

## చె ఱు వు లు క ట్టు టె ట్లు ?

చెరువులకట్టలను మిగుల బలంబుగల కొయ్యలచేనైనను రాళ్ళచేనైనను ముందుప్రక్క దృఢంబుగ నుండునటుల కట్టి వెనుకప్రక్క మన్నువేసి గజంబులుమొదలగువాటిచే ద్రొక్కించవలయు. తూర్పుపడమరలు కట్టగట్టిన యాచెరువునందు బహుకాలము జలం బుండు. దక్షిణఉత్తరంబులుగ కట్టగట్టినయెడల పడమటిగాలి కొట్టుటచే అలలులేపఁబడి కట్ట శిథిలంబగును. కావున అట్లు గట్టక శాస్త్రోక్తముగ గట్టిన కట్టపై వంకమద్ది మఱ్ఱి మామిడి జువ్వి కడిమి యెఱ్ఱగన్నేరు నేరేడు ప్రబ్బలి

వేప ఎఱ్ఱగోరింట తాటి అశోక ఇప్ప పొగడ మొదలగు వృక్షముల వేయుము.

మఱియు ఱాళ్లతో గట్టిగా కట్టబడినదిగను సున్నము చక్కగా పూయబడినదిగను సందులులేనికవాటంబులు గల దిగ నుండు జలద్వారంబులను నొనర్చి యందుపై మట్టివేయ వలయు.

## బావిత్రివ్వుటకునక్షత్రిములు.

శ్రివణ - అనూరాధ - పుష్యమి - ధనిష్ఠ - ఉత్తర - ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్రి - రోహిణి - శతభిషము ఈ నక్షత్రిములయందు బావులు త్రివ్వివ శుభము గలుగు.

## దిక్కులనిర్ణయము.

నిరృతిదిశయందు త్రివ్వినపుత్రినాశనమును వాయవ్యదిశ యందు త్రివ్విన భార్యామరణంబును గలుగు. కావున నీరెండు దిశలేగాక మూడవదిశయగు నాగ్నేయ దిశయందు త్రివ్విన యందు జలము లస్థిరము లగుటయగాక సంతాపమును గలుగ జేయు. కావున నిమ్మూడుదిశలను వదలి ఇతరదిక్కులయందు త్రివ్విన శుభము కలుగును.

బావులు, దిగుడుబావులు నిర్మించునపుడు పశ్చిమ దిశాపాలకుండైన వరుణునికి బలియొసగి జలనాడి వెడలుమార్గం బున మట్టిగూటమైనను ప్రిబ్బలిగూటమైనను నాటి దానిని

ఫలపుష్పతాంబూలాదులచేఁ బూజించి మున్నీటిపట్టియైన బాలచంద్రుని బహువిధముల ప్రార్థించి ధూపదీపనైవే ద్యాదు లొసఁగిన క్షీరములవలె(తెల్లని)జల మందుండి వచ్చును.

దిక్పాలకులనామములే జలనాడుల నామములు.

తూర్పు మొదలగు నెనిమిదిదిక్కులకు ఇంద్ర - అగ్ని - యమ - నిరృతి - వరుణ - వాయు, సోమ, శంకరులు అధి పతులు. కావున నీదిశలనుండి యేతెంచు జలనాడు లీదిక్పాల కుల నామసంబంధములచే నామంబులు గలిగియు, పాతాళంబు నుండి మధ్యవెడలు తొమ్మిదవనాడి మహాసిరయను నామం బును గలిగియు వెలయుచుండు. ఇదియునుగాక నన్యంబులగు ననేకనాడులు నామాంతరములచే బఱఁగుచుండు. పాతాళము నుండి యూర్ధ్వంబుగ వెడలు మహాసిరయను నాడియు ప్రాగ్ద క్షిణ పశ్చిమో త్తరంబులనుండి వెడలునాడులును శుభప్రదం బులు. ఆగ్నేయ, నైరృతి, వాయవ్య, శాంకర దిశలనుండి వెడలునది స్వల్పజలంబులును గలిగియుండు.

ఉదక మాకాశమునుండి మేఘంబులచే నేకస్వాదువిశి ష్టంబై యేకవర్ణము గలిగి భూమియందు వర్షింపఁబడుచున్నది. అయినను అయ్యాయిభూవిశేషసంబంధముచే ననేకరసంబులు గలదిగను నానావర్ణంబులు గలదిగ నున్నయది. కావున వక్ష్య మాణ క్రమంబున భూములం బరీక్షించి బావులు మొదలగు వాటిం బడయవలయు.

ఉప్పునీరును మంచినీరుచేయు నుపాయము.

ఏదైన నొక బావియందు క్షారోదకము (ఉప్పునీరు) గలిగినయెడల లేక అడుసు (బురద) యుండినను వగరుగ యుండినను దుర్గంధముగ నుండినను అందు వంకమద్దిచెట్టుపట్ట, తుంగగడ్డలు, వట్టివేళ్లు, శొంఠి, మంచిబీరవిత్తులు, ఉశిరిక పొట్టు, చిల్లగింజలు మొదలగునవి చూర్ణించి వేయుము. అపుడాజలంబులు మధురంబులగును. జలదోషమం దేమియు నిలువకపోవును.

జలస్థానభూపరీక్ష.

జలనాడులయొక్క మర్మస్థానంబులు గుర్తెరుంగ భూమిపై కొన్నిచిహ్నములు గలవవి సులభముగా బోధపడునట్లు వచించెద.

(1) పుట్టతో చుట్టబడిన బొట్టుగు, అంబాళ, ఏనుగు - జీడి-మారేడు - తిందుక - ఉలిమి - తుముకిముంగ - ప్రిబ్బలి - ఊడుగ - శింకార - దిరిశన - మద్ది - కల్మాషక - ఉబ్బ - చిట్టాముదము - ఈచెట్లలో నేదైన నుత్తరభాగంబున 3 మూరలదూరమున నాల్గున్నర (4½) పురుషప్రమాణము త్రవ్వినయెడల జలము లభించును.

(2) జలములేనిచోట గడ్డి మొలచి యందొకచోట మొలవకయున్న మొలవనిచోట కించిత్తు మొలచిన నట్టిచోట ధనంబయినను, జలంబయినను లభించునని తెలియుము.

(3) జలములేనిచోట ముండ్లజాతిచెట్లమధ్య ముండ్లు లేనిచెట్టు మొలచినయడల, లేక ముండ్లులేని చెట్లయందు ముండ్లుగల చెట్టుండిన, దానికి పశ్చిమమున 3 మూరలదూరమున (1¾) పురుష ప్రమాణమున జలమయినను ధనమయినను లభించును.

(4) మనుష్యుడు నడచునపుడు భూమియందు గంభీర ధ్వని గలిగెనేని, అచట 3½ పురుషప్రమాణమున ఉత్తరదిశ నుండి ప్రవహించెడు కౌబేరియను జలనాడి యుండును.

(5) గొప్పవృక్షము కొమ్మలు యథాక్రమముగయుండి అందొకకొమ్మమాత్రము భూమియందువంగిగాని లేక తెల్లగాగాని యున్నయెడల యా కొమ్మక్రింద 3 పురుషుల ప్రమాణమున జల ముండును.

(6) ఏవృక్షంబయినను నైజంబగు స్వభావము వీడి అందు చిగురు పుష్ప ఫలంబులు భేదమైన నట్టివృక్షమునకు తూర్పుదిశయందు 3 మూరలదూరంబున 4 పురుషులప్రమాణమున జలముండును. ఆయియు తెల్లనిమన్ను యుండును.

(7) వాకుడుచెట్టు, ములుక వీటికి ముండ్లు లేక తెల్ల పూలుయున్న వాటిక్రింద 3½ పురుష ప్రమాణమున జల ముండును.

(8) ఎచ్చటనయిన నెల్లపుడు ఊష్ణంబును, పొగయు

వెడలుచుండిన, నచట 2 పురుషుల ప్రిమాణమున మహా ప్రివాహముతోఁగూడిన జలనాడి యుండును.

(9) ఎచ్చటనయిన పైరు చక్కగా మొలచి మధ్య యొకచోటమాత్రిము మొలవకుండినను తెల్లబారినను మిగులకోమలంబైనను నచట 2 పురుషులప్రమాణమున జలనాడి ప్రివహించుచుండును.

(10) నాలుగుపుట్టలేకంబులై యుండి వాటిమధ్య వేరొక తెల్లపుట్ట యుండిన యచట 5½ పురుషులప్రమాణమున జల ముండును.

(11) నేరేడు, చాగ,సుగంధిపాల, ఉశిరిక, తెల్లతెగడ, పాచితీగె, వెలుతురుచెట్టు, వరాహాక్రాంతి, కారుమినుములు మొదలగుచెట్లు గుల్మంబులు మొదలయినవి, పుట్టకు నికటంబున (సమీపమున) నుండినయడల నాపుట్ట కుత్తరమున 3 మూరలదూరమున 3 పురుషులప్రిమాణమున జల ముండునని తెలియుము.

(12) ఒకే వర్ణముగల భూమియందు గడ్డి వృక్షములు పుట్టలు పొదరిండ్లు మొదలైనవి లేక యచటనేదైన నొక వికారంబగుపడెనేనినాభూమియందుజలముండునని తెలియుము.

(13) మెత్తనిభూమియు పల్లంబులును ఇసుకయు గంభీర ధ్వనియు నెచటగలిగియుండునో అచట 5 లేక 5½ పురుష ప్రిమాణముననే జలము లభించునని తెలియుము.

(1) ఏస్థలమున ఉష్ణకాలమున శీతలముగను శీతకాలమున నుష్ణంబుగను నుండునో నాస్థలసమీపమున ఇంద్రధనుస్సుగాని మత్స్యంబుగాని వల్మీకంబుగాని యుండెనేని దానికి 4 మూరలదూరమున లేక పురుష ప్రమాణము ద్రవ్విన జలంబుండు.

(2) పుట్టలమధ్య గొప్పపుట్టయుండిన నాక్రింద జలంబుండు.

(3) వృక్షము శుష్కించి యుండినను నచట ఏవృక్షము మొలవకయుండినను పైరుపెట్టిన నందు మధ్యపైరు మెండినను నాక్రింద జలము లభించును.

(4) మెట్టగనుండు భూమియందు నెట్టని చిగుళ్లతో గూడి పాలుగలిగియుండు వెణుతురుచెట్టుండెనేని నందుత్రవ్విన మొదట ఱాయి యనంతరము దానిక్రింద జల ముండును.

(5) మనోజ్ఞంబులగు వృక్షంబులు పొదరిండ్లు తీగెలు దట్టమగు ఆకులతో గూడినచెట్లు ఇవిగలచోట జలనాడి యుండును. మఱియు నేలతామర నీరుగొలిమిడి వట్టివేరు ప్రేంకణము గుండుఱెల్లు దర్భ తుంగ ఒంటెకనుపు ఖర్జూరము నేరెడు మద్ది నీరుప్రబ్బలి పాలచెట్టు పాలతీగెలు గొడుగుకనుపు నాగదంతిచెట్టు తామర కడమచెట్టు కానుగ వావిలి తాండ్రమంగచెట్టు మొదలగు నీవృక్షంబులు పచ్చగ నుండుచోట్లను

కొండమీద కొండయుండు స్థలంబునను మూడుపురుషుల ప్రమాణము ద్రవ్విన జలము లభించును.

### కొండారణ్యములయందు జలస్థల పరీక్ష.

కోమలంబులగు వృక్షములున్న యచట 4 పురుషుల ప్రమాణముద్రవ్విన జలంబులుండు. మఱియు వికారంబులగు వృక్షములమధ్య నొక మనోహర వృక్ష ముండిన యచట 4 పురుషుల ప్రమాణముననే జలంబులుండును.మఱియు ముండ్ల చెట్లుండినయడల వాటికి దక్షిణమున 4 పురుషుల ప్రమాణ ముననే జలముండును. పల్లపుభూమియున్న యెడల 1½ పురుష ప్రమాణముననే జలముండునని దెలియుము.

### జలముండని స్థలపరీక్ష.

శాకోటి, మద్ది, వంకమద్ది, మారెడు, నెల్లి, గుమ్మడి, వేప, తెల్లపుల్లి, ధనము, యిరుగుడు, తిప్పతీగె, పొన్నగంటి మొదలయినవియుండు స్థలంబునను, జీర్ణంబయిన పర్ణంబులు గల వృక్షంబులుండుచోట్లను బొత్తిగ జలంబులుండవని నెఱుంగ వలయు.

బాలసూర్యునికాంతి, అగ్ని, భస్మము, ఒంటె, గాడిదె వీటివర్ణముగల భూమియందును నుదకంబు లుదయింపవని నెఱుంగవలయు.

## దివ్యోదకముగల భూపరీక్ష.

ముంజతృణములు, రెల్లు, కుశలు, సున్నపురాళ్ళతో గూడిన నల్లనిమట్టి ఎఱ్ఱనిమట్టియు వీటిలో దేనితోడనైనను గూడియుండుభూమియందు త్రవ్విన దివ్యోదకము లుదయించును.

## వగరుగ, ఉప్పగ, కారముగ జలముగల భూపరీక్ష.

(1) సున్నపురాళ్లతోగూడి యెఱ్ఱగనుండు భూమియందు జలము వగరుగను

(2) కపిల (గోరోజనమువంటి) వర్ణముగల భూమియందు కారముగ అతియుప్పగను

(3) తెల్లనిభూమియం దొకింత యుప్పగను

(4) నల్లని భూమియందు మధురముగను జలం బుండును.

## ఊళ్ళుగల భూపరీక్ష.

పావురపుపిట్ట, తేనె, నెయ్యి, తెల్లనివస్త్రము, తిప్పతీగె, వైడూర్యము, పెసలు, మేఘము, దోర అత్తికాయ, నలుపు, కపిలవర్ణము, తుమ్మెద, కాటుక, వీటి వర్ణముగల ఊళ్ళుండుచోట ద్రవ్విన నందు మిగుల సమీపమున సమృద్ధిగ జల ముండును.

నానావిథవర్ణముగల రాళ్ళుండుచోట అనావృష్టి యుండదు.

ఎఱ్ఱనిచుక్కలును, నానావిధ వర్ణములును, తెలుపు, బూడిద, గాడిదవర్ణములవలె, సూర్య, అగ్ని వెన్నెల, స్ఫటికము, ముత్యము, బంగారు, వెండి, నీలమణులు, ఇంగువ, బాలసూర్యునికిరణము, హరిదళము మొదలగువాటి వర్ణములుగల ఱాళ్ళుండుచోట దివ్యోదకము లుదయించును. ఇటువంటి రాళ్ళుగల రాజ్యము మంగళకరమైయుండి అనావృష్టి (దేశమునకు హానిగలుగునట్లు బొత్తిగా వానలేకపోవుట) భయమెన్నటికిని సంభవింపదు.

వాపీకూపాదులు నిర్మించునపుడు పాషాణాదులడ్డంబైన వాటినిబగల్చు అనఁగా ఱాళ్లంబగల్చు విధంబును వివరించెద.

ఱాళ్ళపై మోదుగకట్టెలు తుమికికట్టెలు గూర్చిపెట్టి అగ్నిచే ప్రజ్వలింపఁజేసి పిమ్మట సున్నపుజలంబుచే జల్లార్చిన పాషాణంబులు పగులును.

పైక్రమముగ కాల్చినబండను మొక్కపుచెట్టుకట్టెల భస్మమునైనను లేక దర్భలభస్మంబైనను ఉదకంబున వైచి చక్కగా కాఁచి యాజలమును కాల్చిన పాషాణము (ఱాయి)లపై ఏడుమారులు చల్లినయెడల బండ పెట్లిపగులును.మఱియు నుదకంబున మజ్జిగ కలి కల్లు (మద్యవిశేషము) ఉలవలు

శేగుకాయలు వీటిని జేర్చి కాంచి ఱాళ్లయందుపోసి ఏడుదినంబు లుంచిన యనంతరము పగులును.

## ఱాళ్లను బగల్చుట కుపయోగించు ఆయుధముల పదను జెడకుండుటకై.

జిల్లెడుపాలు శృంగిభస్మము పావురపుపెంటికలు ఎలుక పెంటికలు వీటిని నువ్వులనూనెతో మర్దించి పనిముట్లకు లేపనముచేసి కొంతకాల ముంచి యట్టివాటిచేపాషాణము(ఱాయి) లు బగులకొట్టినను పదను (వాండి) జెడక యుండును.

అరంటిపట్టలను గాల్చిన భస్మము మజ్జిగలో కలిపి పనిముట్లను నెఱ్ఱగా కాల్చి అందులో వేసి యొకదిన మూర బెట్టిన యాపనిముట్లచే ఱాళ్లు మఱియు నితరలోహములను ఖండించినను పదను (వాండి) చెడకయుండును.

జలస్థానపరీక్షాక్రమంబెల్ల నీమతియం దుంచుకొనుము. వాపీకూపతటాకారామనిర్మాణవిధియును, ఱాళులం బగల్చు నుపాయంబును, ఆయుధముల పదును చెడకుండునట్టి క్రమంబును, ఉదకంబుప్పగనుండిన మధురంబగునటులం జేయు తెఱంగును, చెరువుల నొనర్చువిధంబును, జలాశయ లక్షణంబును, తూముల లక్షణంబులును, వాపీకూపాదుల నొనర్పందగిన శుభాశుభ నక్షత్రంబులును, దిశలును దెలుపబడియె. కావున, సమస్త జనరక్షక దీక్షావ్రతనిష్ఠాగరిష్ఠుడవై విశ్వ

మునకు మిత్రుడవై మున్నీరును జలార్గళశాస్త్రప్రకారము జలనాడులనుండి రావింపుము. అనంతరము భూశుద్ధిగావించి, అందు నే నిచ్చునట్టి ఈబీజముల వేయుమనియె.

## జలార్గళశాస్త్రోత్పత్తికాలనిర్ణయము.

ఈ జలార్గళశాస్త్రము (మున్నీరుశాస్త్రము) (మున్ = మును, నీరు=జలము, నియమనము=నియమించిన, గ్రంథము= ఈ శాస్త్రము,) మొదట వసిష్ఠ, విశ్వామిత్ర మహాఋషులచే రచింపఁబడియె. అనంతరము

దధీచివలన సరస్వతీనది గర్భమును దాల్చెను. ఆమెకు పుత్రుఁడు గలిగె. వానికి సారస్వతు డను పేరు పెట్టి యాముని కిచ్చెను. ఇతఁడు వానిని ముద్దిడుకొని 12 ఏండ్లు అనావృష్టి కలిగినను నాపద రాకుండ నితఁడు కాపాడగలడని చెప్పి యా కుమారుని నామె కిచ్చెను. (బ్రహ్మపురాణము)

సారస్వతాచార్యుఁడు (సారస్వతముని) జలార్గళశాస్త్రమును వ్యాఖ్యానము గావించెననియు దానిసారంబెల్ల వరాహమిహిరాచార్యుఁడు ఆర్యావృత్తంబులతో రచించితి నని తన జలార్గళశాస్త్రమున వ్రాసినదియేగాక మనువుచే రచింపఁబడిన యొకజలార్గళశాస్త్రము సహా గలదని వక్కాణించెను.

సారస్వతాచార్యుడు పండ్రెండేండ్లు అనావృష్టికలిగినను

నాపద రాకుండ కాపాడగల జలార్గళవిద్య నేర్చియుండుటచేత నే దధీచిచే పలుకఁబడియె.

శ్రీమజ్జ్యోతిశ్శాస్త్రపండితసార్వభౌముం డగు వరాహమిహిరాచార్యుఁడు

శ్లో॥ సారస్వతేన మునినా జలార్గళం యత్కృతం తదవలోక్య।
ఆర్యాభిః కృతమేతద్వృత్తైరపి మానవం వక్ష్యే॥98॥

తా॥ ఇదివరకు సారస్వతమునిచేఁ జెప్పఁబడిన జలార్గళశాస్త్రంబును గాంచి దానిసారంబునెల్ల ఆర్యావృత్తంబులతో రచించితి. ఇక మనువుచే రచింపఁబడిన జలార్గళశాస్త్రము వచించెదనని వ్రాసియుండుటచే మొదట మనువు అనంతరము వసిష్ఠ విశ్వామిత్రి సారస్వతమునీంద్రుడు మొదలగువారు రచించిరనియు అనంతరము వరాహమిహిరాచార్యుఁడు లోకంబుననుండుజనులు సులభోపాయంబుగ జలంబుండు స్థలంబుల నెఱుంగుటకై తెనుగుతాత్పర్యముతోడ రచియించినటుల విదితమగుచున్నది.

ప్రపంచమున అన్నిశాస్త్రములలో జలార్గళశాస్త్రము మానవజీవనమున కాధారమని చెప్పనొప్పును.

(మున్ = పూర్వము, నీరు = జలము, కాఁపు) బాధలు తొలగించి రక్షించుటచే మున్నీరుకాపులను నామ మీకులసంభవులకు వృత్తినామమై యున్నది.

ఇట్లు జలార్గళశాస్త్రమెల్లయు బోధించి భూశుద్ధి గావించి యందు ఈ బీజముల పండింపుమని.

విశ్వామిత్రమహర్షి తేఁడునకు బీజముల (వి త్తనముల)నిచ్చుట.

1 బంగారుతీగెలు 2 గంగాజలంబులు 3 కస్తూరినిగ రాలు 4 కటకసరులు 5 ఇప్పపూరాజనాలు 6 ఏనుగుకొ మ్ములు 7 మల్లెలు 8 మదనగంధులు 9 శ్రీగంధులు 10 వెలికె రాజనాలు 11 ఈశ్వరప్రియములు 12 రావిపూరాజనాలు 13 రత్నసరులు 14 కుసుమపూరాజనాలు 15 గుత్తులు 16 బల్ గుత్తులు 17 కస్తూరిపట్టలు 18 గంధసరులు 19 మందిగం డ్రలు 20 నాగమల్లెలు 21 తీగెమల్లెలు 22 కృష్ణనీలాలు 23 వెలుడాలు 24 మన్మథబాణాలు 25 మరువంపుమొలకలు 26 సన్నమణింగాలు 27 జున్నపాలు 28 పొన్నశ్రీరాజనాలు 29 పునుగురాజనాలు 30 ముద్దుప్రాలు 31 ముత్తెపుసరులు 32 సన్నసూదులు 33 పచ్చగన్నేరులు 34 కేసరములు 35 కో డండరామములు 36 రాయసరులు 37 రామసాగరములు 38 చంద్రవంకులు 39 జీవసరులు 40 కాంభోజులు 41 కాకి తెక్కలు 42 వంగాకుబుడుమలు 43 వట్టిబుడుమలు 44 పొంగు ప్రాలు 45 జిలకరరాజనాలు 46 చింతపూలు 47 గోరురా జనాలు 48 బూదప్రోలురాజనాలు 49 గొబ్బికాయలు 50 పాల మీగడలు 51 శ్రీరంగాలు 52 కామదార్లు 53 రామబా ణాలు 54 తెక్కపాయలు 55 వెన్నముద్దలు 56 జిల్మబుడుమలు 57 దాళువాలు 58 పుష్పమంజరులు 59 సీతాభోగసరులు

60 గారులు 61 కుంకుమలు 62 రణములు 63 పెండ్లికొడుకులు 64 పిట్టగోళ్లు 65 ప్రియాగలు 66 గొజ్జంబ్రాలు 67 గరుడసరులు 68 పోతుగంట రాజనాలు 69 మోదుగతొడిమలు 70 మోదుగమాడలు 71 ముదుకసరులు 72 పచ్చసరులు 73 రెడ్డిపాలవంకలు 74 సుఖభోగులు 75 పచ్చకర్పూరసరులు 76 నివ్వరులు 77 దిబ్బసరులు 78 నీరుకుప్పలు 79 గాజుకప్పెరలు 80 కునడాల్లు 81 కంఠసరులు 82 సాలంకలు 83 అలుగు రాజనాలు 84 సంభావులు 85 సరదార్లు 86 మోహనపుసరులు 87 మణిసరులు 88 మసరులు 89 మంకెనలు 90 పగడంపుతీగెలు 91 మడిప్రాలులు 92 దేవసరులు 93 లత్తుకబొత్తులు 94 లక్ష్మీమనోహరులు 95 భారతీసేనలు 96 బాహువురులు 97 వజ్రితళుకులు 98 వాసనరాజనాలు 99 జవ్వాజివంకులు 100 గవ్వలసరులు 101 సంపెంగపూపండ్లు 102 జాజిరాజనాలు 103 గంభీరరాజనాలు 104 కన్నెసరులు 105 తుమ్మిపూరాజనాలు 106 అమ్మిదుకొణిగెలు 107 జీనువముక్కులు 108 చిలుకముక్కులు 109 ఏదకట్లులు 110 ఇసుకరాజనాలు 111 పులుగోరువంకులు 112 పొగడసరులు 113 జిలితొగరాజనాలు 114 నలవరులు 115 నల్లచెన్నంగులు 116 తెల్లచెన్నంగులు 117 దీపసరులు మొదలగు వరిబీజములే గాక కాయలబీజములు గడ్డలు ఆకుకూరబీజములు మొదలగున విచ్చి వాటి నేకాలంబున నెట్లు విత్తవలయునను వ్యవసాయమునకుం దగు ఋతుకాలభేద మర్మంబు లెల్ల బోధించి కామధేనువాంశమున౹ బుట్టిన నొక

కరియావును బసవేశ్వరాంశమునఁ బుట్టిన తెల్లనివృషభము (ఎద్దు) ను తాను పునర్ సృష్టియందు బుట్టించిన పెంటిమహిషములనున్ను కృషికి తగిన యన్నిఉపకరణముల నొసగి సేమముగ ఇలు జేరుమని సెలవిచ్చెను.

ఆగమరేఁడు సవినయుఁడై శిరసాస్టాంగ వందనము లొనర్చి మద్‌ప్రియజనకా! కల్యాణప్రదంబైన నీయాశ్రమము నొదలి మదీయబంధుజనబృందమునకు వెళ్లుమని యాజ్ఞ నొసఁగితిరి. వారిపూర్వజు డెవడు?

వత్సా! సకలచరాచరాత్మకమైన భూతంబు లంతంబు నొందినను శేషించి క్షయింపకుండుటచే మున్నీరునకు శేష మని యొకనామము గలదు.

విష్ణు వొనర్చిన నిరంతరతపఃక్లేశమువలన వానిశరీరము (మేను, దేహము) నుండి నీరు (జలము) వచ్చెను. తొలుత విష్ణుమూర్తిమేనునుండి పుట్టినకారణముచే విష్ణువు మూలపురుషుడు (శివపురాణమున).

ఆదిశబ్దనిరూపణము.

"తొలుత = మున్ను, ముందు = మునుపు, మున్ = మును, మొదలగు పదములును, తొలి = తొల్లి, మొదటిది (తొలిముద్ద) మొదలగుపదములు ఆదిశబ్దమునకు పేళ్ళు.

గురుబాల ప్రబోధికయనెడు నామలింగానుశాసన
వ్యాఖ్యాన రత్నము.

తృతీయకాండే విశేష్యనిఘ్నవర్గే ఏకతానాదినామాని ॥7॥

ఆదీయతే ప్రారంభసమయ ఏవ వ్యవహ్రియత ఇతి ఆదిః. డుదాఞ్ దానే, ముందుగా వ్యవహరింపబడునది. నియత పుల్లింగము. 1 పూర్వతీతి పూర్వః పర్వ పూర్వ పూరణే. పూరించునది (పూరగించు, నెరవేర్చు,)2పురోభవతీతిపౌరస్త్యః మొదట = ముందరఁబుట్టినది. 3 ప్రథతఇతి ప్రథమః – ప్రథ ప్రఖ్యానే ప్రసిద్ధ మగునది. 4 ఆదౌ భవ ఇత్యాద్యః మొదట బుట్టినది. 5 ఈ ఐదు ఆదిశబ్దములు.

ఆంధ్రశబ్ద రత్నాకరము బ. సీతారామాచార్యుల గారిచే (క్రీ॥ శ॥ 1885) న వ్రాయఁబడినదానియందు దే-వి. 1 ఆది."

పరమేశ్వరుఁడు అనేకప్రజలను సృష్టించవలయునని మొదట (ఆది) మున్నీరు (జలము)ను సృష్టించెను. ఆమున్నీరు (జలము)నందే తన తేజము నారోపణజేసియుండెను. అందుండి మొదటివాడగు పితామహుడైన బ్రహ్మ పుట్టెను.

మనుస్మృతిః ౧ అధ్యాయము.

బ్రహ్మకంటె ముందుపుట్టి, బ్రహ్మను పుట్టించుటకు నేర్పడిన సముద్రుడు ఆదిబ్రహ్మ యనబరఁగె.

## క్షత్రియ నామ విమర్శన.

సముద్రుఁడు (మున్నీరు) పరమాత్ముని తేజమువలన బ్రహ్మను పుట్టించినవాఁడౌటయు పరమాత్ముని తేజమును తన యందు కలిగియున్నవాఁడగుటచే.

శ్లో॥ వీర్యం తేజః ప్రభావయోః శుక్రే శక్తౌ చేతి హైమః । వీర్యం ప్రభావే శుక్రే చ తేజః సామర్థ్యయోరపి ఇతి మేదినీ; శుక్రం తేజో రేతసీ చ బీజవీర్యేంద్రియాణి చ వీర్యే బలే ప్రభావే చ ఇత్యమరః । తేజః ప్రభావే దీప్తౌ చ బలే శుక్రేప్యత త్రిషు ఇత్యమరః॥ ద్రవిణం తరః సహో బలశౌర్యాణి స్థామ శుష్మం చ శక్తిః పరాక్రమ ప్రాణౌ విక్రమ స్త్వతిశక్తితా ఇత్యమరః.

ఈ ప్రకారముగనే తేజస్సు అను శబ్దము బల, వీర్య, సామర్థ్యములను శబ్దములకు పర్యాయవాచకమైయున్నదని పూర్వోక్తములైన కోశములయందు జెప్పఁబడియున్నది. ఆయభిప్రాయమునే పై వివరించిన శ్లోకములయందు గనఁద గును. అందువలన తేజస్సు, బల యీమొదలగు శబ్దములు పరస్పరము సమానార్థకములైనపర్యాయపదములై యున్నవని దెలియుచున్నవి. తేజస్ బల మనుశబ్దములకు తుల్యార్థమై యున్నదనియే సిద్ధాంతమాచున్నది.

ప్రొఫెసర్ మానియరు విలియంగారు తమ సంస్కృత

ఇంగ్లీషు డిక్షనరీయందు బలశబ్దవాచకము క్షత్రశబ్దవాచకమని జెప్పియున్నారు.

శ్రు॥ కథాక్షత్రాశ్రియం నరమావరుణం కరామహే మృడికాయోరుచక్షతమ్.

ఋగ్వేదము (1) మండలము (1) సూక్తం.
ఋగ్వేదమంత్రమగు పైమంత్రమున క్షత్రశబ్దము బలవాచకమై యున్నదని చెప్పఁబడియున్నది.

ఇందులకు అతః, క్షత్ర = బల, బల = క్షత్ర, ఇపుడు క్షత్రియశబ్దము బలమను శబ్దము ఈరెండుశబ్దములు సామర్థ్యమను అర్థమునందు పరస్పర మొకటికొకటి తుల్యార్థములై పర్యాయపదములై యున్నవను విషయమును విద్యారణ్యభాష్యము సాయణాచార్యభాష్యములవలన స్పష్టపడియున్నది.

సముద్రుడు విష్ణువువలన తేజమునుఁ జెందెను. ఆ తేజః ప్రభావమువలన జగత్ సృష్టియయ్యె. తేజోబలయుక్త శక్తిచే సముద్రుడు క్షత్రియు డనబరగె.

బ్రహ్మకశ్యపులు జూచుచుండ సముద్రుడు
రాజరూపమున వచ్చెనని హరవిలాసమున
శ్రీనాథుడు వ్రాసియున్నాడు.

సముద్రుడు వీర్యము (తేజము) లేక బలముగలవా

డుగా నుండి బలవీర్య తేజము లను శక్తిచే క్షత్రియుఁడని ఋగ్వేదమంత్రమునుఁబట్టి తెలియుచున్నది.

ఇందు కొందఱు నారాయణునికి సముద్రుడు (మున్నీరు) సముద్రునకు బ్రహ్మ 1 అనంతరము చంద్రుఁడు 2 బ్రహ్మకు మరీచి, యతనికి కశ్యపుడు, ఇతనికి సూర్యుడు మరియు చంద్రునకు బుధుడు వీనికి పురూరవుడు నితనికి నహుషుడు. ఇట్లు సూర్య చంద్రవంశజులును సముద్రునిసంతతి వారైయుండ ప్రత్యేకముగ మున్నీరుకాపు సముద్రకుల కాపుకులావతంసమునుగూర్చి చెప్పుట యనవసరమని చెప్పి. నచో ఇచ్చట నట్టిశంకకవకాశముగలుగజాలదని మాత్రము వ్రాయుచున్నాను. ఏలయనినచో నేను ప్రత్యేకముగ మున్ముందు జెప్పబోవు ప్రమాణవచనములయందును మున్నీరుకాపు కులావతంసులగు క్షత్రియవర్గమునుగూర్చి మాత్రమే వ్రాయుచున్నాను.

కాబట్టి పై శంకకవకాశమెంతమాత్రము గలుగజాలదు.

## భూపతినామ విమర్శన.

ఇపుడు భూపతిః, వీర్యవాౘ్, తేజస్వీ, అను నీశబ్దములు క్షత్రియపదమునకు సమానార్థకమైన పర్యాయపదములై యున్నటుల స్పష్టపడినవి.

వీర్యంబలే ప్రభావేచ పరాక్రమము తేజము ప్రభావము.

ప్రభావము (1) కోశబలమువలన గలిగిన తేజము' (2) శక్తి.

శక్తి : ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి.

శ్రు॥ త్వమిన్ద్రాధిరాజః శ్రవస్యు స్త్వభూరభిభూతిర్జనానామ్ । త్వం దేవీర్విశ ఇమా విరాజ యుష్మత్ క్షత్రమజరం తే అస్తు. 2

అథర్వణవేదము 6 కాండము 99 సూక్తము 5 అనువాకము 2 మంత్రము 2 సంపుటము 201 పత్రము.

ఈమంత్రమునందు 'త్వమిందాధిరాజః' అనునప్పుడు ఇంద్రుడన రాజనియు రాజనునప్పుడు క్షత్రియుఁడనియు క్షత్రియుఁడనునప్పుడు బూర్వోక్తవిధిని (వాహినీపతిః=వాహినులనెడు నదులకు, పతి = ప్రభువు, సముద్రుఁడు = మున్నీరు) మున్నీరుకాపుకుల సముద్రకుల క్షత్రియ శబ్దవాచ్యుఁడనియు ఇట్లు పర్యాయపదములుగ జెప్పుచున్నవి.

వాహినీపతివంశజులు దండనాయకులని సహా పిలువఁబడువారు.

గురుబాల ప్రబోధిక యనెడు నామలింగానుశాసన వ్యాఖ్యారత్నము. ద్వితీయకాండే క్షత్రియవర్గే అశ్వారో

హాదినామాని 517 శ్లోకముయొక్క వ్యాఖ్యానము : సేనానీ వాహినీపతిశబ్దములు దళవాయి(సేనానాయకుఁడు) పేళ్లు. సేనాం నయతీతి సేనానీః. ఈ. పు. నీఞ్ ప్రాపణే, సేనను నడిపించువాఁడు, వాహిన్యాః పతిః వాహినీపతిః. ఇ. పు. వాహినీయనఁగా దండు (సేన). దానికి దొర, దండనాయకుఁడు, సం. వి. పుం.

గురు. బా. ప్ర. యనెడు. నా శా. ప్రథమ కాం. సముద్ర భేదాదినామాని (238-17) అమతి గచ్ఛతీత్యంభః స. స. అంభస్సు జలము నీరు (మున్నీరు) అంబువు ఉదకము నీరు (సముద్ర), అంబతే అంబు. ఉ. న. ధ్వనియుక్తమై యుండునది.

అంబు. వై. వి. అమ్ము = బాణము.

అను నీపై వాక్యముల ననుసరించి వాహినీపతి యను శబ్దము దండనాయకశబ్దమునకు ప్రకృతియైనటుల గన్పడు చున్నది.

1 దండ 2 నాయక.

(1) సహో బలం తత్ప్రభవం సాహసం, సహస్సనఁగా బలము, అందు బుట్టినది. 1 దమనం దమః దండశ్చ, శిక్షించుట దమము దండము. ఇట్టి దండమును ధరించువాడు దండధారి. దండధారియనుశబ్దము రాజునకునుదండనాయకునకును ప్రత్యేక పర్యాయములని చెప్పబడును.

(2) నాయకః నాయకుఁడు సం. వి. అ. పుం. అధిపతి. (ఇందు సాధారణనాయకులు నలుగురు: 1 ధీరోదాత్తుఁడు 2 ధీరోద్ధతుఁడు 3 ధీరలలితుఁడు 4 ధీరశాంతుఁడు). యనునవి 4 పర్యాయనామములు.

వాహినీశబ్దము నదికిని అపిశబ్దమువలన సేనకు సేనా విశేషమునకు పేరు.

ఇందువలన వాహినీపతి (సముద్రుఁడు) నామము దండ నాయకశబ్దవాచకమై యున్నదని పూర్వోక్తనామమువలన దెలియుటచే దండనాయకశబ్దవాచకము వాహినీపతినామ (సముద్రుఁడు) మైయున్నటుల స్పష్టపడినది.

వాహినీపతివంశజులు దండనాయకులని పిలువబడుట సహజమాటచే దండనాయకశబ్దవాచకము అతిప్రాచీనశబ్దమై యున్నదని తెలియబడినది.

శ్లో॥ బ్రాహ్మణో భగవాన్ రుద్రో — 1. బ్రహ్మ
క్షత్రియో పరమో హరి — 2. క్షత్రి
వైశ్యో పితామహం చైవ — 3. వైశ్య
ఇంద్ర శూద్రశ్చ జాయతే॥ — 4. శూద్ర

తా॥ రుద్రుఁడు బ్రాహ్మణుఁడు, విష్ణువు క్షత్రియుఁడు, బ్రహ్మ వైశ్యుడు, ఇంద్రుడు శూద్రుఁడుగా నున్నటుల ప్రమాణ శ్లోకము గలదు.

ఇందువలన విష్ణువు క్షత్రియుఁడైనటుల వర్ణింపబడి యుండుటచే వానిశరీరము (దేహము) నుండి పుట్టినవాడు (సముద్రుడు) క్షత్రియుడనుటయే సమంజసమైన సిద్ధాంతము.

మున్నీటిపట్టియైన చంద్రుఁడు కాపు.

౧౦ అప్సు జాతః అబ్జః. జనీ ప్రాదుర్భావే॥ నీటి (మున్నీటి)యందుఁ బుట్టినవాఁడు. ౧౩ నక్షత్రాణామీశః నక్షత్రేశః॥ చుక్కలఱేఁడు (రాజు).

1 చదల2కాపు (చదలు=నక్షత్రములు, కాఁపు=బాధలు తొలఁగించిరక్షించువాఁడు)

1 (దే) 2 (వి) 1 దేశ్యము 2 విశేష్యము.

కాఁపుశబ్దము దేశీయమై సంస్కృతమునందలి రక్షకః యనుదానికి వికృతపదమైయుండుటచేతను చంద్రుఁడు వాహినీపతిపుత్రుఁడౌట (మున్నీరునకు పుత్రుఁడౌట), చేతను అందు కాపుశబ్దోత్పత్తికి మూలకారణుడై సస్యాధిపతి యౌటంబట్టి వాహినీపతివంశజులు వృత్తియందు కాపు యనునది వృత్తినామాంత్యమున ధరించుట లోకప్రసిద్ధి.

కాపుపదవిమర్శన.

సముద్రుని (మున్నీరు) పట్టి (పుత్రుడు) చంద్రుఁడు చదలకాఁపు యని వృత్తినామాంత్యమున ధరించియుండుటం

బట్టి పూర్వాచారపరంపర సస్యాధిపతివృత్తినామాంత్యమున గల కాఁపుయను రక్షకశబ్దవాచకము సస్యముల పండించు నపుడు ధరించిరనుట దృఢవిశ్వాసము.

## వా హి నీ ప తి వం శ వృ త్త ము.

వాహినీపతి (సముద్రుని) వంశమున నీదిగువ నుదహ రించిన ప్రకారము సూర్యచంద్రవంశములు రెండు.




అందు, 1 అర్క లేక అరక (అర్కుని వంశజులనియు) 2 అరకవంశజులను

రెండుశాఖలవారు లేక పితా సంతతిపుత్రులయినను వృత్తిభేదములచే అర్క,అరక వంశజు లనబడుదురు.

(1) అర్కః అర్క అదంతః పుంసి అమరః సూర్యే = సూర్యవంశజులు.

(2) అరక, దేశ్యము విశేష్యము. శబ్దరత్నాకరే. నాగలి. ఇది యేప్రథమాయుధముగ ధరించినవారు చంద్రవంశజులు(మున్నీటిపట్టియగు చంద్రునివంశజులు).

ఇట్లు రెండు తెగలుగల మీవంశజులుగలరు. అందు సముద్రునకు (మున్నీరునకు) చంద్రుడు మీ మూలపురుషుడయిన ఆదిరేడునకు బూర్వమే పుట్టినవాడౌటచే చంద్రవంశజులనియు చంద్రునకు మీకు ఆదిపురుషుడు వాహినీపతి యగుటచే వాహినీపతివంశజు లనియు సముద్రునివలన గంగయందు పుట్టుటచే గంగవంశజులనియు ప్రతీతి (ప్రసిద్ధి) గల్గియుందురు.

వత్సా! రాత్రులయందుగాని ఉదయమందుగానిపరుండునపుడు వామహస్తము (యెడమచేయి) ప్రక్కన పరుండుము. ఏలననగా మనయాహారపుతిత్తి గర్భమున కెడమచెయివైపు (ఎడమప్రక్క) నుండును. గనుక నాప్రక్కనే పరుండవలయును. ఇట్లు శయనించుటచే ఆహారము సక్రమముగా జీర్ణమై గర్భమున కేవిధమైనబాధ కలుగక ప్రాణవాయువు కుడినాసికయందు నడచుచుండును. అందువలన నాప్రాణవాయువు అభివృద్ధి యగును. కారణ మేమనగా కుడినాసిక (ముక్కు) నుండి శ్వాస 8 యెనిమిదంగుళములు మాత్రమే వెలుపల కొచ్చును (బయలుదేఱు). ఎడమనాసికయందుండి వచ్చుశ్వాస 12 పండ్రెండంగుళములు వెలుపలి కొచ్చును. న్వొక్కొకశ్వాసకు 4 నాలుగంగుళములు ప్రాణవాయువు మిగులును. ఆకారణముచే ఆయుర్వృద్ధియు జీర్ణశక్తియు గలుగును.

ప్రాణవాయువును ఎక్కువగా పీలుచుచు తక్కువగా వదలు (వీడు) చుందువేని ఆయు వభివృద్ధియగును.

నీ వేకార్యము చేయుచున్నను ఏకాలమునందైనను ప్రాణవాయువును ఆకర్షించుచు దానిని హృదయకమలము నందు ధారణచేయుచు సదా అంతర్ముఖవిచారము గలిగి బహిర్వ్యాపారములఁ జేయుచుండుము. అని బోధించి తపోబల ముచే ఆదిశేషుని రావించి రాజా! ఈ ఆగమశేషున కఖిల విద్యలు వచ్చునట్లు జేసితిని. నీతపోమహిమచే కలిగినఫలమిది. సర్వవిషయము లీతనికరతలములు. గావున ఈతని యాజ్ఞాను వర్తులై మీ రుందు రేని సకల శుభములఁ బడయుదు రనిన యాదిశేషు మునీంద్రున కభిముఖుడై నిటలఘటితాంజలి ఘటితుండై నిలుండిన వాడు శిరసాష్టాంగనమస్కరించి తమ ఆజ్ఞప్రకార మటులే ప్రవర్తించెదనని పలుకుచు ఆగమశేషు సహితుడై స్వగ్రామమున కొచ్చుచుండ మార్గమధ్యమున,

## శి శి ర వ స ం త ఋ తు వు లు.

గావున పగటివేల్పు(సూర్యుఁడు)పచ్చని గుఱ్ఱములుగల తేరునెక్కి ఎఱ్ఱనిదేహముగలవాఁడై ఆకసమునకు రత్నమువలె అగపడుచు త్రిమూర్తులకు స్థానమై నమస్కారములకు ప్రియుఁడై సహస్రకిరణములచే ప్రకాశించుచు దిగువ నడచు చున్న శేషులకు తోడుబాటసారియై వాహినీపతివంశజులు

దిగువ సర్వలోకబాంధవుడై జగత్ చక్షువనబడు సూర్య నారాయణుం డెగువ నడచుచుండిరి.

అయ్యది శిశిరఋతువంత్యము. వసంతఋతు ప్రారంభము. గావున తేజోమండలమునుండి దినకరు డుదయమున తన కిరణము లను కరములచేఁ జోరుడుంబోలె "పట్టుపుట్టంబులు గట్టిన గోపికాస్త్రీల చేలంబు లపహరించి నగ్న దేవతలుగా జేసి పూర్వజ్ఞానస్మరణాచరణులై దేహాభిమాన మొదలునటుల జేసిన దేవకీనందనుని చందంబున" దినకరు డాపర్వతపజ్క్తుల యందు ధూమాకారముగ వ్యాపించి మాయయను అవిద్య వలె కాన్పించుచున్న మంచును హరించి పూర్వరూపంబులు దేట తెల్లముగా గోచరమై బాటసారులకు 1 గిరి 2 గిరి స్తలుల 1 గుట్ట 2 నేలమార్గము సులభముగా అగపడునట్లు జేయు చుండెను.

మఱియు,

కొండలయందలి జీవరాసు లెల్ల నవమాసపూరిత గర్భాంతరజీవులు భూపతనమై పూర్వస్మరణచే కావు కావు మని ప్రార్థనాలాపములు చేయునటుల కొండలగర్భము లను గుహలనుండి వెడలి (తమ్మిదొర) సూర్య దర్శనముచే సంతుష్ట హృదయములుగలవియై తమతమపలుకులచేత తమవంటి జీవులఁ బిలుచుచు తమతమయాహారమునకై తమకముగా (త్వరపడు) పరుగెత్తుచు బోవుచుండ.

గాధేయుఁడు నేర్పిన గాండీవ (విలు)విద్యయందలి హరి గతి వ్యాఘ్రగతి జంబుగతి మొదలగు గతుల మర్మంబు లుపమానయుక్తముగా జనకునకు జూపుచు ఇరువురును నడచు చుండిరి·

వసంతప్రభువగు మన్మధుఁడు రాచిలుక నెక్కి వచ్చు చున్నాఁడని కోవెలలపలుకులచే చాటఁబడుచుండెను. మఱియు కొమ్మ లెట్టని చివురు జొంపములచే గన్నుల పండువ జేయుచు పెక్కుసిరులంబొందు వారివలె 1 చిగురు 2 ఆకు 3 తీగె 4 మొగ్గ 5 పువ్వు 6 పిందె 7 కాయ 8 పండు యను అష్టైశ్వర్యములుకలిగి కనులపండుగు జేయుచుండెను·

మఱియొకప్రక్క మహీరుహంబులు అష్టదరిద్రులవలె 1 చిగురు 2 ఆకు 3 తీగె 4 మొగ్గ 5 పువ్వు 6 పిందె 7 కాయ 8 పండు నేమియును లేక అష్టదరిద్రతచే దరిద్రుఁడు లజ్జలేని వాఁడై యుండునటుల కారాకులురాలి దిగంబరులవలె కనుపడు చుండెను. మఱికొంతదూరముననే వృక్షరాజములు జలార్గళ మహిమచే సంపూర్ణపుష్పఫలములచే విరాజిల్లుచు ఇది యాకు నిది మాఁకు ఇది కొమ్మ ఇది రెమ్మయని తెలియకుండ నిండిన కొమ్మలయందుండి వచ్చుచున్న గంధము (సువాసన) యాఘ్రా ణించిన యవ్వనమత్తులు మన్మధబాణహతులై మతిదప్పి కొంతతడవైనపిమ్మట యాకొమ్మలను కొమ్మలుగ కనుఁగొని

నటుల యనేక పుష్పజాలంబుల సుగంధంబు లైక్యమై (ఏకీభావమై) ఆనందము కలిగించిన యా పుష్పజాతు లెన్నియై యుండవచ్చునను సంశయము సమీపవాసులై వేలువేలు పుష్పము లొక్కచోటనుండి పరిమళించుటచేత గుర్తింప శక్యముగాని (సాధ్యము కాని) పరిమళానందము కలిగెనని గ్రహించిరి. "ఇటులే ఐక్యభావముచే ప్రవర్తించు నారి సంఘ సంపత్తియైనను సంసారసుఖమైనను దెలియగెలువ నసాధ్యంబై యుండు."

ఆకాశమార్గమునుండి నొకధ్వని వినఁబడియె. నపుడాశ్చర్యమగ్నులై ఇదేమినాదమని సంశయించునంతలో నభోమార్గమున సోమసూర్యులవలె ప్రకాశించుచున్న రెండు విగ్రహములుగల విమానమునుఁ గనిరి. ఆ విరాజమానంబయిన నవ్విమానరాజంబు జలయంత్రముఁబోలె ప్రవేశంబునకుగమకించుచు విష్ణుచక్రంబువలె వలయాకారముగ తిరుగుచు యొక్కపరిరథంబు విధంబున మందగతిఁజనుచు మఱియొకసారి సర్పాకారజ్యోతి వలెఁ బోవుచు నొక్కతేప బొంగరంబురంగున బిరబిరఁ దిరుగుచు నొక్కమాఱు గాలిపటంబునీటున నసియాడుచు నొక్కయెడఁ జుక్కతెగిపడ్డవిధంబునడిగ్గుచు నొక్కచోటఁ బుట్టచెండువలె నుప్పరంబునకుబోవుచు నొక్కవంక లంగరు విడచిన ఓడచొప్పునఁ గదలక నిల్చుచు నొకపరి బైరిడేగ

యొయ్యారంబున నడ్డువడువులం జూపుచుఁబోవు యావిమాన మెవరిదై యుండవచ్చునని ఆలోచించి కాలకంఠకుండగు నీల కంఠునిదిగా కొన్ని చిహ్నములచే గుజ్జవేల్పుతండ్రియని గుఱు తెఱింగి శిరస్సాష్టాంగనమస్కృతు లొనర్చి నడచుచుండ,

నొకవైపు నెట్టగాఁబూచినవై నిప్పుదగిలి మాడుచు న్నటువలె నున్న మోదుగుచెట్లు తమపువ్వులచే పూలమాలి కలు వేసికొనియున్నట్లున్నవి. ఏకొమ్మకైనను పసిడిఛాయయే అందమని బోధించుచుండున ట్లగపడుచుండెను. మఱియు ఏ ఫలవృక్షములఁ జూచినను ఫలపత్రముల బరువుచే నిగర్వ మును సూచించు నమ్రములై (వంగినవై) "అష్టైశ్వర్య ములు గలిగినను మానవుండణకువ నమ్రత కలిగి యుండ వలయునను హితోపదేశము జేయుచుండెను."

తేనెటీగలు పన్నిన మధువు(తేనె)తెట్ట అపరిమితవృక్ష ములకు వ్రేలాడగలిగియున్నవి. కోయిలలు మార్గాయాన పరులశ్రమను తమ వాగ్మాధుర్యకూజితములచేఁ దీర్చుచుండె. వానిసమక్షముననే తమపింఛములను విప్పి నెమలులు నృత్య మునుజేయుచు "నొకడు సర్వజనానందకరమగుగౌరవకార్యము చేయునపుడు రెండవవాఁడు సోమరిగా నుండక మానసోల్లాస కరమగు సహాయ మవశ్యముగా జేయుచుండవలయునని సూచించు కోవెలలకు ప్రతికూయుచుండెను.

వృక్షముల దిగువఁబడియున్న కారాకుల శబ్దము సహః కర్ణము (చెవి)నఁ బడకుండ కుంజరములు (ఏనుఁగలు)నలుదిశల "కులపాలిక (తల్లిదండ్రు)లచే నిచ్చి పెండ్లి చేయఁబడిన స్త్రీ)లు సహః సంసారారణ్యమున గతపడి (గడచిన) దుఃఖ విషయము లనుకారాకులు వ్యాకులితమను చప్పుడు జేయకుండ 'ఈమూలం లేని శరీరం ఏమి లేదు' యనుద్వాదశాక్షరిని జపించుచు శాంతగమనురాలై గజగామినియను కీర్తి పొందవలయునని సూచించుచు నడుచుచుండెను.

జితేంద్రియులగు నాఇరువురు పలువిధములైయున పెక్కు వృక్షముల వింతవింతలగు పూగుత్తులు దళుకొత్తుచున్నవి జూచుచు గజంబుల ఘీంకారములను ఇతరమృగముల కూఁత (చప్పుడు) లను వినుచు నాయుత్తమారణ్యమును సుఖముగా నడచుచుండిరి.

ఆదిరేడునుగురించి పురజను లాలోచించుట.

బంధుమిత్రులారా! మన యాదిరేడయిన పెద్దరేడు చుట్టపక్కముల వదలి చెట్టుచేమయనక రాయిఅప్పయనక పులిబుట్రియనక ఈడై నజోడులేక పండుపబ్బములనక చెట్ల గుట్టల సందులలో బోవునపుడు బంటు సహా వెంటలేక నొంట రిగ వెళ్లెనే! యనికొందఱు చింతలువంతలం బొందుచుండిరి.

మఱికొంద ఱాగాప్రమమునకు వెలుపల విధివిరామము లేక ప్రతినిత్యము దిక్కుల నిరీక్షించుచుండిరి. వెండియు కొంద అరణ్యమార్గగమనులై పోవుచు నాకులసందునుండి తొంగి చూచుచు తమకెదుట తొంగిచూచునట్లుండు గురువిందగుత్తుల యందము డెందమున కానందము గల్గింప జూచుచు బూచిన తంగెడుల కనుగొనుచు గంటకములకుఁ గఱకురాలకుం దొలం గుచుఁ జల్లని వేపచెట్లనీడల నిలచి నిట్టూర్పుల విడచుచు ఱివ్వున బరుగెత్తు లేళ్ల గమిం గాంచి నిలుచుచు బుట్టున పొదల నుండి పాఱు కపింజలము (కౌఁజు) ల ఇటునటు జూచుచు పొదలనుండి పారిపోవుచున్న పులులకు బెదరుచు ఇతరమృగ ముల కేకల కడలుచు దిక్కు లరయుచు బయ లాలకించుచుఁ దడబడు అడుగులతోడ నడచుచు దుస్సహ క్షుత్పిపాసాతప ముల మూలంబున దేహములు శోషించి దుఃఖభారంబులు మనంబున కత్యంతబాధితంబులుగ దోఁచి దీనజనావనపరా యణుండగు నారాయణునిపైని భక్తియే తమకుఁ దోడునీడఁగా నెంచి ఈశ్వరప్రేరితంబున మనంబునందు గల్గిన ధైర్యమే చేయూతగా గొని నడచుచుండిరి.

సూర్యరశ్మి సహా గనుపడని వృక్షలతాదుల మధ్య నుండి పోవుచుండునపుడు "అంధకారమగ్నమైన సంసారారణ్య మున జ్ఞానజ్యోతియను చక్షువు లేక గాఢాంధకారాంతర్గతులై

-చిక్కినవారుగురుకటాక్షవీక్షణములనెడికిరణముల ప్రకాశముచే తన్నుదా తెలిసికొనునిర్భయునివలె" నీలమేఘములుదట్టముగా క్రమ్మియున్న యాకసమున తళుక్కుమనిమెఱుపుమెఱసినపు డాకాంతార మతిమనోహరవిరాజమానమై తద్ప్రకాశ మా లతపత్రాలయములనుండి వెడలిన వీరి హృదయము లత్యంత వికాసములొంది మొగంబులు దీప్తిమంతంబులగునట్లుగావించె.

మఱికొంతదూరముననే "జలదర్పణమున ప్రతిబింబితం బగు చంద్రబింబము సంపూర్ణముగ గనుపడక చలనరూప ముగ దోచునట్లు" వృక్షలతాదులు గాలిచే కదలుచు పత్ర ములమధ్యనుండి సూర్యునికాంతి చలన రూపకముగా గోచ రింపఁబడుటచే మిక్కిలి ప్రోత్సాహము గలవారై నడుచు చుండిరి.

మందమారుతము వృక్షపర్ణంబులమధ్యంబున కుజ్జని నిద్రబుచ్చుటకై పాటబాడుచు జోకొట్టుచున్నటుల వీచు చుండె.

"సంగీతానందపరులు గీతాలాపము వీను లార విని తలయూచుచు రహస్యముగ ఒడలెల్లఅభినయించుచు పరవశతం జెంది సమాప్తమయినవెంటనే సభికులు జూడ నిశ్చే ష్టితు లౌనటుల" లతపత్రములు కదలుచు గదలకుండెను. ఆమహారణ్యమున నడచుచు కళదప్పిన ముఖంబులు బెళుకు

వాసిన కన్నులతో తీవ్రింబగు నూపిరి విడుచుచు మూర్ఛిలు చుండిరి.

నిర్మానుష్యంబగు నాయరణ్యంబున నతిహీనంబగు నొకకంఠధ్వని వినబడియె.

వెంటనే వదనంబు వ్యాకులపాటుదోప శల్యచర్మశేషం బగు శరీరంబుగలిగిన గడువృద్ధుఁడొకఁడు గానంబడియె.

నిండువృద్ధుండగు ముదుసలిం జూచి 'అయ్యా! తా మొచ్చుచుండిన మార్గమున ఎవరినైన జూచితిరా?' యన కన్నులుమూసికొని మూల్గుచున్న యా ముదుసలి తడబడు మాటలలో, 'నాయనా! ఇచటికి నేబదిసావరములదూరమున నొక కాలువ పాఱుచున్నది. అది యొకరాతిసందునుండి త్రికాలములు ప్రవహించునట. యాస్థలంబును పక్షులకలకలధ్వనుల మూలమున సులభముగ దెలిసికొనవచ్చును. మఱియు,నచట సంపెంగలసొంపు కంటి కింపుగా నుండి, సుగంధపరిమళముచే నలుదిక్కుల నల్లుకొని శోభిల్లుచున్నవి. తత్ప్రదేశంబున నిండు జవ్వనము గండుమీరి బిందుచందంబున ప్రకాశమానుఁడైన నొక యవ్వనుని మఱియు తపోనిష్ఠద్రుష్టిగలిగి రాజర్షి యనఁ దగునట్టియు మధ్యవయస్సుగల్గి మహోన్నతమైన శరీరచ్ఛాయ గల్గి బలిష్ఠుఁడై యభీష్టముగలవానివలె దోచు సహిష్ణునిసహా కన్నులకు విందుజేయఁగంటిని. మీరాపవిత్రాత్ముల నచ్చట కనుగొనగల'రనిన యావృద్ధునకు నమస్కరించిపోవుచు,

నొకనిని మఱియొకఁడు? మిత్రమా! లెక్కింపనలవిగాక యూహకు మించియుండు అఖిలలోకములనెల్ల నహర్నిశము తమతమ త్రోవలు తప్పకుండ ద్రిప్పుచు పద్మమహాపద్మముల కొలఁదిగల పిపీలికాది సమస్థజంతుసంతానము మొదలుకొని కిన్నరకింపురుష సురనరాదులనుసహా కాపాడుచుండు కరుణా నిలయుఁడైన సర్వజ్ఞుఁడు మనకు మాత్రమే మార్గ మగు పఱుచలేడా ?

ఇట్లొకరికొకరు ధైర్యవచనముల పలుకుచు నడుచు చుండ కొంతదూరముననే చెట్లమధ్యనుండి తెల్లతెల్లన నల్లని మేఘములవెనుకదోచు నక్షత్రేశునిపగిది దృష్టిని నాకర్షించు చుండిన మనోహర తేజవిగ్రహము లావనబృందమునఁ గనిరి. అచటికి జేరుచుండుకొలఁది దృగ్గోచరము లగుచుండె. యవి వనదేవతావిగ్రహములని సవినయులై సాష్టాంగపడి నమ స్కృతులు గావించిరి. అపుడు భావింపఁబడిన విగ్రహములు మరల నమస్కరించుటయు తాము తలయూచగా ప్రతితల యూచుటయుఁగని నిజవిగ్రహములగుటఁ దెలిసికొని ఆపన్నాల రక్షకుఁడు ప్రత్యక్షమైన యపు డానిరీక్షకు డుపేక్ష సేయక యపేక్షను దెలుప నువ్విళ్ళూరునట్లు ధూళిదూసరి దేహం బులు ఒడదాకినవదనంబులు బెళుకుతగ్గిననయనంబులు పరాగ ముచేఁ గప్పబడిన కేశములును గలిగి తమ దుస్థితిని దెలుప నిట్టూర్పులు విడుచుచు వారిని సమీపించిరి.

## వింధ్యపర్వత వర్ణనము.

పర్వతములలో మహోన్నతమై నిరంతరము సాధు సత్పురుషులకు నెలవై ఆర్యావర్తమున కుత్తరదిగ్భాగమున తూర్పునుండి పడమరవరకు వ్యాపించినదై భగవన్నిర్మితమైన ప్రపంచమను రాజ్యమునకు ప్రాకారపురాతిగోడచందంబున దుర్భేద్యమై పర్వతరాజమనుకీర్తిగాంచి వైశాల్యమందేమి, గాంభీర్యమందేమి? నొక్కమా రానగమును గన్నవారి మనో చక్రము శైలచక్రమున నొకప్రక్కంగల కిన్నర విద్యాధరులు కలసిమెలసి మెరలేనిమమతల విహారంబు నల్పుచుండుటయు రెండవప్రక్క తపోనిష్ఠులైన వశిష్ఠుడు మొదలగువారి యజ్ఞ యాగాది ధూమోపరాగముచే నిండియుండుటయు మూడవ ప్రక్క జగత్పావనములగు నదులు ప్రవహించుటయు నాల్గవప్రక్క దుర్గమారణ్యములుగల్గి యందు వజ్రవైడూర్య నీలగోమేధిక పుష్పరాగాది రత్నములును సువర్ణరజిత తామ్రాదిలోహములును నుత్తమాది దివ్యౌషధులును నిండి ప్రకాశించుచు గనులపండువు నేయుచు పరమేశ్వరునియనంత మహిమ బ్రకటించుచుండుటఁజూచి త్రిప్పుకొన శక్తిజాలక వేలకొలదివత్సరము లానగంబున తప మాచరించుచు ముని బృందములు స్థిరనివాసులై యున్నవారు. దీనికి దక్షిణముగానే వీరు జేరినభూమి.

మిత్రమా! ఇచ్చట విచ్చలవిడిగా బూచిన గోరంట
చెట్ల కొమ్మలు గాఢముగా నల్లుకొని చల్లనిగాడ్పుల కిరవై
నల్లంబులు రంజిల్లజేయుచున్నవి. కన్నులారఁ జూచితివా?
ఇది యిటులుండనిమ్ము. రెండవప్రక్కఁగంటివా మధురరస
భరితంబులగు ఫలంబులచే నిండినచెట్లను యాచెట్లకొమ్మల
మధ్యన పరిపక్వ ఫలంబులను తమచుంచువులతో తుంచుచు
బక్షించుచున్న యాశుకరాజంబుల చక్కగా జూడుము. వాటి
కంఠములు కలకంఠియొక్క కంఠమునంగల నీలమణుల కంఠా
భరణమునకంటె యందమై గన్నుల కానందము గలుగజేయు
చున్నవి.

మిత్రమా! ఇదియేమివింత? మనకింతలో వింతయగు
సంతస మెచ్చటినుండిగలిగె? సంతోషమునకు కారణము సత్పు
రుషుల సందర్శనమే మూలాధారము.

అదుగో అచట గూర్చొనియున్నవారిలో నవయవ్వనుఁ
డగు యాతని ముఖపద్మమున షోడశకళాపరిపూర్ణమగు సోమ
బింబమా? లేక ముఖారవిందమందలి యందమా? అతని
శరీరచ్ఛాయజూడ పసిడికళలు పలుదిక్కుల వ్యాపించుచున్నవి.
ఆ ముఖబింబమున చిఱునగవో లేక నిండువెన్నెలయో
నిశ్చయముగ నెఱుంగ నలవిగాక నిప్పటికిని హృదయమందిర
మునగలిగిన సందేహతరంగములు శాంతిస్థానమునజేరకున్నవి.

నింతవర కెందరినో సుందరులఁ జూచితినిగాని, చంద్రమౌళి యొక్క జటాజూటమునఁగల చందురునిబోలుస్మిముఖారవిందము గలవాని నే నెందునుం గనుంగొనియెఱుంగను. యాతని దయా రసవీక్షణంబులచే మనస్తాపసంతప్తులమైన మన దేహములకు శైత్యోపచారము జేయంబూనుకొనినట్లు గానంబడియె. అను నంతలో కుసుమములసుగంధమిశ్రితమందమారుతము మేనసోకి నంతమాత్రముననే హాయి యనుపించులాగున ఆగమరేడు యొక్కదృష్టి వీరిపై సోకినంతమాత్రముననే అదుగో మమ్మే వీక్షించుచున్నారని ఆనందపరవశులైరి.

తక్షణమే ఆరేడులు వీరికెదురుగావచ్చిరి. వీరు సాష్టాంగ నమస్కారములుగావించి 'ప్రసవసమయశ్రమల బడుచు నిక ముందు సంసారమే కూడదని సమయవైరాగ్యమునఁబూని దుఃఖించుచున్న పణఁతి ముద్దుకుమారునిగన్న తక్షణమే మితి మీరిన ప్రసవసమయశ్రమ మతిలేక మహాసంతోషమున మద్ భర్తారున కీవిషయ మెపుడు దెల్పుదను యిష్టముండియు, అమితానందముచే నందనుని జూచుచు ముద్దిడుకొనుచు మురసి మరచినటుల' తమరాకయు మార్గమధ్యమందలి బాధయు దెలుపజాలకుండిరి.

అపు డాపురుషసింహులగు ఆదిరేడాగమరేడుభయులు వీరిని తమమృదుమధుర వచనామృతములచే సంతోషహృద

యాంతరంగు లౌనటుల హెచ్చరించి శుభ్రములై చూచుట కందమగు నునుపుగలరాతి వేదికలపై గూర్చుండ నియోగించి అతివిశాలమగు నాకులచే దొల్లలనుగుట్టి అపరిమితముగ కూర్చి యున్న తేనెదెట్టుల తేనెను గొనితెచ్చి యందు నిండునిండుగా బోసి పలువిధములయిన ఫలంబులు పర్ణములయందు డనిడి వారు గుడుచుచుండ ఆదిరేడు మనగ్రామమునఁగల ఆబాలా దులు క్షేమముగయున్నారా? అని విచారించెను.

స్వామీ! తమయనుగ్రహమువలన తమపై చింతదప్ప రెండవవింత నేమియులేక తమయాజ్ఞానువర్తనులమై నియమిత శాసనానుకూలాచరణులమై యున్న మాకు మఱియొక కష్టమే లేదనుట స్పష్టమని నమ్ముఁడు. తాము ప్రస్తుతము మన గ్రామమునకు దయజేయుటయే పరమానందకర మనుచుండిరి. మార్గాయాసపరుల కమిత శ్రమ నివ్వకూడ దనుచు కనుగనియుండిరి.

## సూర్యాస్తమయ వర్ణన.

జగద్బాంధవుఁడైన జమునయ్య సర్వజీవకర్మలకు సాక్షిభూతుఁడై బ్రహ్మాండగోళముచుట్టు ప్రయాణీకునివలె ప్రదక్షిణ గావించి తుదకలసి అస్తాద్రిని సమీపించుచుండె. అట్టితరి చిత్రవిచిత్రములై వర్ణనాతీతములగు వింత లామేఘమండలమున గోచరించుచుండె. కాలక్రమమున అక్కడక్కడ

చుక్కలేర్పడి యేభావముచే జూచువారి కారూపములుగ దోచుచుక్కలగోళములు కనుపడుచుండెను. అట్టితరి నల్గురును యొకగొప్పవృక్షముక్రింద మెత్తనియాకులచే శయనవసతు లేర్పఱచుకొని శయనించిరి. అందు గ్రామమునుండి వచ్చిన నిరువురకును నిదురరాక నిక్కి నిక్కి జూచుచు నొకని మఱియొక డిటు లనియె.

చెలికాడా! ఇంతలో నిద్రపట్టినదా? ఇటు వినుము. సమీపమునకురమ్ము. మనాదిరేడుతో కూడయున్న జితేంద్రియుని చక్కగా జూచితివా? యతనికంఠ మన్ననో శంఖమును తిరస్కరించుచున్నది. ముంగురులుజూడ ఇంద్రనీలచ్ఛాయగల్గి ఫాలభాగమున ప్రకాశమానముతో త్రాచులమేత పీచునకు తాండవ మాడుచున్నది. నుదు రర్ధచంద్రునిచందమున నున్నయది. కనుబొమలన్ననో కోదండములవలె నమ్రములై గనులపండువు చేయుచున్నవి. నయనము లన్ననో మీనంబులవలె మిలమిల లాడుచున్నవి. జూపు పంచశరుని సాయకమువలె సుందరమై హృదయమందిరమునఁ గుచ్చుకొని తత్తరపడజేయుచున్నది. నాశికమా సంపెంగకుసుమమువలె నందముగుల్కుచున్నది. అధరమో మధురరసభరితమై అందమగుదొండపండువలె గలిగి డెందమున కానందము గల్గించుచున్నది. కర్ణములన్ననో శ్రీకారములై కనుబడుచున్నవి.

చెక్కిళ్లు చక్కని యద్దపుచెక్కలవలె చక్కగా నిగనిగలాడు చున్నవి. పలుకులా యవి చకోరముల గులుకులా కర్ణానందము కలుగజేయుచున్నవి. దంతములన్నో యవి దాడిమ బీజములవరుసల నిరసించుచున్నవి. భుజములన్నో గజహస్తము లనవొచ్చును. మేనిచాయజూడ మానిపసుపుచందమున కాంతి గుల్కుచున్నది. చిఱునగవన్నో చంద్రకాంతమణులయందలి కాంతిచందమున వింతగా దోచుచున్నది. నా ప్రాణాలయము పట్టజాలని సంతోషముచే నిండి అఖండమండలాధిపతికి సహా లభింపని అపరిమితానందము గల్గుచున్నది. యని కొంత కాలహరణము గావించి శయనించిరి.

## సూర్యోదయవర్ణన.

అతిదీర్ఘంబగు చీఁకటిపై దినకరుఁడు తన తేజస్సనెడు కిరణసాయకము లాకసమునుండి అరణ్యంబున ప్రయోగింపగ 'గురూపదేశమను సూర్యునికాంతిచే తిమిరము తెలివిలేమి (అజ్ఞానము) తొలఁగి తెలివి (దేహాత్మాదిభేదజ్ఞానము) గాంచు అజ్ఞుని (మూర్ఖుని) చందమున'

చోరులు తమ్ము బట్టుకొనవచ్చిన వారిం దూరమునుండి గాంచి తిన్నన (మెల్లన) పల్లపుభూములయందు దిగిబాఱిపోవునటువలె రానురాను తిమిర (చీఁకటి)మెల్ల గుట్టలయందలి మఱుఁగుప్రదేశములలోఁ బడి పాఱిపోవుచుండెను.

తక్షణమే నాయరణ్యప్రదేశమెల్ల నిజరూపమును జెందెను. అంతఁ దూర్పుదిక్కునుండి పద్మరాగమే యనునట్టు లాదిత్యునిబింబ మవలోకనమయ్యె. తళతళమను దాడిమీ కుసుమమంజరీఛాయ గల్గి శోభిల్లుసౌగంధికముచందమున డెందమానందము జెంద మఱియొక పార్శ్వమున సలలిత మత్త కోకిలలోచనద్యుతి నలరారు కురువిందమువలె అరవిందప్రియు డగుపడుచుండ మారుత మత్యంతమందగమనముచే నవవిక సిత కుసుమజాల సుగంధభార మెల్లెడల వ్యాపింపజేయుచు జల్లగా వీచుచుండె.

భయంబులేక నయంబున నడువుడనుచు ఎలుగెత్తి పిలచెడినో యనునట్లు మృగాదిసాధుజంతుజాలంబుల గేకలు కర్ణానందము గలిగించుచుండె. దుఃఖానంతరము సుఖము తప్పక గల్గునను నీతిని బోధించునటుల నిసిసమయము పోయి నిర్భయమైన సూర్యోదయ సమయ మవలోకన మయ్యె. మరియు

నానావిధధాతువులచేతను నవరత్నములచేతను శిఖర ములచేతను ఇంపుగొలుపు సొంపైన క్రీడాచలములను గనుచు నడచుచుండిరి.

మహారుషిచే నివ్వఁబడిన విలుబాణములు మొదలగు వాటిలో ఇంద్రాయుధమునకు సాటియైన చంద్రాయుధము

నూఱుఫలములయెత్తు గలిగి పిఱుదులపై బంగారువన్నెచే తలతలలాడుచు వ్రేలాడబడియుండ బాహుబలసంపన్నులను సహా బీడింపశక్తిగల మేటివిల్లులు హస్తములయందు వన్నె గులుకుచుండె.

ఉభయులు పొదరిండ్లనుండి బోవుచుండునపుడు శరము లమ్ములపొదినుండి ధగధగమని సూర్యకిరణములవలె తుల కింపుచు సర్పంబులుగల భోగవతీపురమువలె అమ్ములపొది నెంతయు రాణించుచుండె. బంగఱుగొలుసులుగల మేటికత్తులును ఉభయులబాహుసందులయందు నీటు గుల్కుచుండె. బంగారు బొట్లుగల దాలువాలులు ధరించి నల్లెత్రాటిదెబ్బ తగులకుండు టకై బంగారుచే రంగారుచున్న ఉడుపత్తోలుకవచములు చేతఁగట్టుకొని ఎట్టిశూరులైనను తమ వీరరూపములఁ జూచి నంతమాత్రముననే భయకంపితులై పలాయనులౌనట్లాయుధా లంకారులై నడచుచుండిరి. వెంబడే గోవృషభ మహిషీమహిష ములు వొచ్చుచుండెను.

ఇటు లనేకదినంబులు గడుపుచు మహారణ్యములందు నీలమేఘములమధ్య చంద్రసూర్యులు పరివేశించునటువలెఁ బరివేశించుచు యనంతర మామేఘమండలమునుండి వెలువడి ప్రసరించులాగున అరణ్యమధ్యగల పొదరిండ్లనుండి వెళ్లుచు బయలాలకించుచు పవిత్రాత్ము లాచండికాపురసమీపవాసు

లైరి. నాటిరేయి రేడు లచటనే నివసించి నిద్దురనుండి ప్రొద్దు నసే లేచి ప్రాతఃకాల కర్మాద్యనుష్టానాదివిధుల నిర్వర్తించు కొని ప్రయాణులై గ్రామమున కేగుచుండిరి.

అన్వేషులు (వెదకబోయినవారు) యిద్దరును ముందుగా పోయి చండికాపురంబునగల ముఖ్యజనుల కీవృత్తాంతమెల్ల దెలుప పురజను లెల్లరులు అమితానందపరులై అంబువుపట్టికి యతనిపట్టికిని కల్యాణకరములయిన ఫలపుష్పగంధాక్షతలు మొదలయినవి గొనిపోయి కన్నులారం గాంచి కరుణారసభరి తుల పూజించి యాపూజనీయుల కిరుపార్శ్వముల కన్నియలు హస్తములయందు మంగళహారతులు వెలుంగ బంటులు వెంట నుండి ప్రశంసించుచుండ నింటికి జేరిరి.

మఱునాఁ డుదయముననే ఆదిరేడాగమరేడొక స్వజన సభ గావించి మహాశయులారా! బంధుమిత్రములారా! కాలగతిచే ప్రజలు క్షుత్పిపాసలశ్రమకోపజాలక ఇడుమలఁ బడుచున్నవారు. గంగాదిజీవనదులన్నియో కడుదూరములై యుండుటచే సమీపమున అంబువు (జలము) లభించుట కత్య వసరమైయున్నది.

---

# రెండవ ప్రకరణము

## వాపీకూపతటాకనిర్మాణము.

ప్రస్తుతము మన కనుకూలమగు వాపీ (నడబావి) కూపము (నుయ్యి) తటాకము(చెఱువు) లను నిర్మింపవలయును. మన బంధువర్గములోనుండి నొక్కొక్కరు నొక్కొక కార్యమును నిర్వహింపజేయు నిర్ణేతలై (నిర్ణయముచేయువారై) యుండ ఆమోదించగలరనిన ఆముష్యాయణులు (ప్రసిద్ధకులుఁడైన తండ్రివలనఁ బుట్టినవారు) ఆదిరేడుపుత్రులు వల్లెయని వాగ్దానములు జేసిరి.

ఆదినుండి సహా నేకార్యము చేయదలఁచినను యాకార్యాభిమానులెల్లరులు యొకసభ యొనర్చి ఏకభావముగ కార్యక్రమములు నిర్ణయించువారు. కావున ఆగమరేడాదిరేడొనర్చిన సభకు సంఘసభ్యులెల్ల సవినయులై తమయాజ్ఞానుకూలురమై ఏతద్ కార్యనిర్వాహకులమై నెరవేర్పగలమని వాగ్దానము లొసఁగిరి. అందున కారేడు సంతోషచిత్తుఁడై మద్ప్రియనందనులారా! ఆగమరేడేర్పఱచు పద్ధతుల ప్రకారము కార్యములు గావింప జలంబులు రావింపవలయుననియె.

(1) జలార్గళ శాస్త్రప్రకారము మున్నీరు (మురి సీరు) సులభముగా మిక్కిలిసమీపమున లభించు స్థలమును (భూమిని పరీక్షించి జూపువృత్తిగలవారు మున్నీరుకాపులని

యొకవృత్తినామమును కలిగినవారైరి) వ్యవసాయమునకై ప్రథమమున జలమే అత్యవసరమై యట్టిజలము భూమియందలి జలనాడులయందుండ నెఱిఁగి జలార్గళ శాస్త్రప్రకారము స్వవంశజులగు కాపువీరుల కెల్లరులకు జలవసతుల నేర్పరుప జేయుటయందు మున్నీరుకాపులు ప్రథములు. వీరు జలముండు ప్రదేశమును జూపి తత్కార్యము జరిపించుచు (నడిపించుచు) నిర్వహింపజేసినవారు.

Skill నేర్పు కౌశలత నిపుణత ప్రవీణత చాతుర్యము.

In Controlling అధికారత్వముచేయుట.

Storing క్రొత్తవింతైన అద్భుతమైనమార్గమును గని పెట్టి జలవాహినులంగూర్చు.

1 Water 2 For 3 Agriculture 4 Purposes, 1నీరు 2 కొరకు 3 వ్యవసాయము 4 కార్యము. వ్యవసాయమునకై (మున్=నీరు), మున్నీరు జలనాడులయందుండ నెఱింగి ఆశ్చర్య పడునట్లుజూపిన ప్రవీణతగలఅధికారులు అధ్యక్షులు జలముండు స్థలమును జూపి ప్రజలరక్షించుటచే (కాపురక్షణమురక్షించుట) యనియు మున్=మున్ను మును మొదలు నీర్=నీరు జలముండు స్థలముచూపి రక్షించుటచే మున్నీరుకాపుయను వృత్తి నామమేర్పడి పురజనులెల్ల మున్నీరుకాపులనియే పిలుచు (ఆహ్వానించు)చుండిరి.

(2) గుద్దలి (గడ్డపార లేక ఖనిత్రము)ని కొని నే జూపిన స్థలమున ఖనిత్రి (పార)యను పారచే ఖనకునితో (ఉప్పర

వానిచే) త్రవ్వింపవలయునని నియమింపఁబడి తద్ కార్యనిర్వా హకులై యున్న వారిని గునుపకాపులనియు పిలుచుచుండిరి. వీరినే ప్రస్తుతము గుడాటికాపు లనియెదరు.

(3) ఇట్లు త్రవ్విన మట్టిని గోనెసంచు(అడ్డముగానడుమఁ గుట్టుపోసిన జనుపనారపట్టసంచి)లయందు నింపి పైకి తెచ్చి వేయింప నియమితులైనవారిని గోనెకాపులనియు

(4) బావికి పైన మోట (కపిలె అనగా ఎడ్లుగట్టితోలి నీరెత్తెడి యంత్రవిశేషము)ను నిర్మింపజేయుటకై నియమింప బడినవారిని మోట (కపిలె) పాటుపడు (శ్రమపడు) వారిపై నియమితులైనవారిని మోటపాటికాఁపు లనియు పిలుచుచుం డిరి. ప్రస్తుతము మోటాటికాపు లనియెదరు. మరియు కామా టము (మోటపని) కాపు లనియు సహా వైకృతవిశేష్యముచే పర్యాయనామ మయ్యె.

(5) గ్రామమునకు వెలుపలగల తాటి ఈఁత చెట్ల నుండి కమ్మలను గోయించి వాటిచే బావులసమీపమున పాక (దూలములుంచక కట్టినయిల్లు) లను వేయించి తదుపరి యా చెట్లకమ్మలను నిర్హేతుకముగ గోయకుండ కాపాడుటకై నియమింపఁబడినవారిని కమ్మకాపులనియు

(6) ఆబావుల సమీపమున ఉదయము మొదలు సాయంసమయమువఱకు కృషివిషయ పరిశ్రమ చేయుచు సాయంకాలము సతీయుక్తులై ఉద్యానవనముల కరుదెంచుచు

క్రీడించు (ఆట్లాడు)చు (విహరించుచుండుటకై) (వేడుకగాఁ దిరుగుటకై) గొప్పవృక్షములు గలుగుటయేగాక జాజి విరజాజి మల్లె మొల్ల సూర్యకాంతము (పొద్దుతిరుగుడు) వకుళ (పొగడ) వాడగన్నెరు మఱియు అరుణోదయరాగము అప రంజి పద్మరాగము పుష్పారుణపుంజము ప్రభాతాకాశము పీతాంబరము భూచక్రము రజితగోళము రాజవస్యము రాక ప్రియము హిమవంతము హిమకుమారము శశికాంతము శరద్లలిత సంధ్యారాగము సుధాంశము సూర్యప్రభ సుధా ధవళము నీలాభ్రము నక్షత్రరాశి వికచకము చంద్రపరాగము చంద్రసుందరము కరకధవళము కాంచనద్యుతి మౌక్తికము మొదలగు చేమంతులవింతలు జూచుచు యాపుష్పములకడ నెగురు చిత్రవిచిత్రవర్ణముల ఱెక్కలు గల సీతాకోకచిలుకల సౌందర్యములం జూపుచుండ ఇట్టిచిత్రములైన రంగులుగల వలువ కావలయునని కాంత కాంతున కభిప్రాయము దెల్పు చుండ వల్లెయని పతి పత్నికిఁ దెల్పుచుండ లతలు తరువును జుట్టు కొని ప్రేమబంధ మిట్లుండవలయునని సూచించుచు లలితాంగికి హితోపదేశ మొనర్చుచుండునట్టి వింతలుగలవనమధ్యమున చిత్రవిచిత్రములగు లతపత్రములతో నిర్మించిన పచ్చని మందిరములు వాటి ద్వారములయందు తోరణములవలె వ్రేలాడులతాకుసుమశోభితజాలంబులును గల్గిన అనేక వనరా జంబులు నిర్మింపజేసి వాటిపై శ్రద్ధబూని కార్యక్రమపద్ధతులఁ నెల్ల నిర్వహింప నియమితులైనవారిని తోటకాపులని బిలుచు చుండిరి.

(7) ఆతోట(ఉద్యానము)లయందుగల మామిడి,తియ్యమామిడి, జంబూ, నేరేడు, నిమ్మ, దానిమ్మ, కొబ్బరి, ఖర్జూర, వెలఁగ, ఆమలక, ఉసిరిక, అరఁటి మొదలగుచెట్ల (వృక్షములను గాపాడువారిపై నియమితులైనవారిని చెట్లకాఁపులనియు, వీరినే ప్రస్తుతము చిట్టెపుకాపులని తెలియనివారు పిలిచెదరు.

(8) ప్రత్తిచేలను వేయించి తూలము (దూది) చెడకుండ ప్రత్తికాయ ఫలించునంతవరకు యాచేలను కాపాడువారిపై నియమింపఁబడినవారిని ప్రత్తికాపులనియు,

(9) పైరుపంటలు జాగ్రతగాకాచు(బాధలుతొలఁగించి రక్షించు)కొనుచు వాటియందుగల లోపాలోపములను పరిశీలన మొనర్ప నియమితులైనవారిని పంటకాపులనియు,

(10) ప్రథమమున మధ్య దూలములేని పాకలను నిర్మింపజేసి నిర్మితులపై లోపాలోపములను పరిశీలించుటకై నియమింపఁబడినవారిని పాక = దూలములుంచక కట్టినయిల్లు నాడు = నాటి కాఁపులు = రక్షకులు పాకనాటికాపులనియు,

(11) యనంతరము వీరు నివసించిన దేశమునకు పాకనాడనియు వీరీప్రదేశమునుండి యన్యభాగములకుఁ బోయినపుడు పాకనాడుకాపులమని చెప్పుకొనుచుండుదురు. ఇతర కులములవారిటులే పాకనాడుబ్రాహ్మణులమనియు పాకనాడువైశ్యులమనియు పాకనాడుశూద్రులమనియు చెప్పుకొనుచుండుట ప్రతీతి (ప్రసిద్ధి) గలదు. దేశభేదమునుబట్టి దేశనామము,కులభేదమునుబట్టి కులనామము, దేశకులనామయుక్త

ముగ వలసపోవువారు దెల్పుచుండుట ప్రసిద్ధి. ఐనను, దేశనామమాత్రమున నే కులనామ మంతరింపదు. కులనామ మాత్రమున నే అనాదివృత్తినామమంతరింపక ఆదివృత్తినామ మవశ్యమై యుండుట అఖిలజనప్రతీతి గలదు.

పాకనాటి లేక పాకనాడుకాపు లను నామమందుగల వృత్తినామము కాపున కే వృత్తినామమై అన్యకులజులకు దేశనామమయ్యె. ఇటులే దేశనామమాత్రముచే పాకనాడు వారనుమాత్రమున నే పాకనాటికాఁపులు గాజాలరు. దేశనామ ముతోఁ కూడ కులవృత్తినామములుండి వృత్తినామమొక వృత్తిని దెలుపుచుండుటచే యావృత్తిగలకాపని అనుమాన రహితమౌను, కాని వృత్తినామభేదములు కలవారు దేశమే యొక వృత్తినామమనుట అసంభవము (కలుగనిది).

(12) ఏలిక (రాజు) ఏలినవాఁడు (రాజు) సమక్షమున ఖడ్గముపూని కాపుదలగ నిలచినవారిపై నాయకులైనవారిని ఏలిన లేక ఏలికకాపులనియు వీరినే దేశ్యముయొక్క విశేష్య ముచే వెలమలనిమెదరనినను వీరు దండనాయకవృత్తియం దున్న మున్నీరుకాపులేగావున వీరు ముఁ=వేల్ కులమువారని వెలమకాపులని జెప్పుకొనిరి. వీరినే మున్ వెళ్ళానైన్మవా రని యెదరు.

ఆక్షేపము: వెలమశబ్దము వెళ్ళానైన్మశబ్దము మొదలగు వానినుండి పుట్టును. నీరుగట్టెడువారు మున్నగువారలను బోధించును.

# మూడవ ప్రకరణము



## మున్ = వెళ్ళాళ్మైన్ శబ్దార్థము.

సమాధానము: వెలమశబ్దము వెళ్లాన్మైశబ్దమునుండి పుట్టినది. దీనిపదపదార్థము తర్స్టన్ - సీ - ఐ - ఇ - గారు, కాస్ట్ - అండ్ - ట్రైబ్స్. అను కులముల చరిత్రియందు

మున్ = వెల్లం Mun Vellan మున్ = నీరు మున్నీరు అనమాయి Anmai జలార్గళశాస్త్రప్రకారము జలముండు స్థలమును పరీక్షించి వాపీకూపతటాకంబుల నిర్మింపఁజేయుట అనగా Management తద్కార్యములను జరిపించువారనియు జలవసతుల గావింపజేయుటలో వీరు ప్రధములని వ్రాసి యున్నవాఁడు.

వెలమ (వెళ్ళాన్మై) శబ్దము వర్మశబ్దభవమని చెన్న పురి రాజకీయ కళాశాలయందు సంస్కృతోపన్యాసకులుగా నుండి కీర్తిశేషులైన యం. శేషగిరిశాస్త్రిలవారు శబ్దశాస్త్ర మను తమగ్రంథమందు వ్రాసియున్నారు. దక్షిణ హిందూ

స్థానములో క్షత్రియులు వర్మశబ్దము నామములతుదను బెట్టు కొన్నవారు నున్నారు.

(వృణోతిశరీరంవర్మ వృఞ్ వరణే శరీరమును కప్పునది అనగా శరీరమును గాపాడు కవచమును ధరించినక్షత్రియుడని అర్థము. గురుబాలప్రబోధిక ద్వితీయకాండే క్షత్రియవర్గే అశ్వారోహాదినామాని.)

దీనిపై విచారింపవలసియున్నది. వెలమ (మర్రి వెళ్లానెర్మ) శబ్దమెన్నింటివలన మారినను మున్నీరుకాపులను నామమునకు సమానార్థమైన పర్యాయపదమై వర్మశబ్దమైమర్రి వెళ్లానెర్మశబ్దభవమగునది స్వాభిమతార్థబోధకమగుటను ఆక్షేపకు డంగీకరించినయట్లేకదా ?

చరిత్రసందర్భోచితమగు నర్థమే గ్రహింపఁబడుచుండును. కాని యప్రకృతానుచితార్థము గ్రహింపఁబడదు.

విష్ణుసహస్రనామములలోని శ్రీదః అనుదానికి శ్రీని భంగపఱచువాఁడనియు ప్రియకృత్ అనుదానికి ప్రీతిని భంగపఱచువాడనియు నర్థముచేయుట హరిశబ్ద మనేకార్థక మని హరింవన్దే అనుచోట కప్పను కోతిని గ్రహించిన ట్లనుచితంబగునుకదా ? అట్లు వెలమ (మర్రి వెళ్లానెర్మ) మున్నీరు

కాపుశబ్ద మనేకార్థమని నీరుగట్టువారను నర్థముఁ దీసికొనుట యనుచితంబగుననుట తెల్లము. లేనియర్థము ప్రసంగింపఁజూత మన్న బొసంగదు. మున్నూరు వెల్మా మైశబ్దమునకు అనగా మున్నీరు కాపుశబ్దమున కపార్థము కల్పించి నీమున్నీరుకాపుకులము నందు గళంకమారోపించుటకు వలనులేదు.

మున్నీరుకాపు యనుశబ్దమునకు కారణోత్పత్తి దెలుపుచుండ నిష్కారణాధారములతో ఆక్షేపణచేయుట పరహృదయానందసంధాయకులగు సజ్జనులపని గాదు.

## పద్మనాయకశబ్దార్థము.

మున్నీరు (మున్నూరు వెల్మా న్మె) కాపుల (వెలమకాపుల)కు పద్మనాయకులని యొకనామాంతరము కలదు. ఈ నామమును గురించి శ్రీనాథమహాకవి కృత భీమఖండమున

"వ. అప్పుణ్యావంశంబునఁ గంసాసుర విధ్వంసి చరణ పల్లవంబు దనకుఁ బుట్టినిల్లుగావున" అని వ్రాయబడినది.

తాత్పర్యము—విష్ణుమూర్తియొక్క చరణకమలమునఁ బుట్టినవారనియు, పావనవంశజులనియు, అప్పుణ్యావంశజులనియు వ్రాయుచు శ్రీనాథకవి పంటవారి యాస్థానపండితుడగుటచేఁ వారికి విరోధులగు పద్మనాయకులవిషయమై వ్రాయు సందర్భమున, పద్మ మనగా పాదమనియు తద్పాదసంభవులైన

వారుగావున పద్మనాయకులనియు, సచ్ఛూద్రులనియు వ్రాసియుండిన శూద్రశబ్దప్రయోగమును జూడగా, ఆస్థాన పండితుఁడై తద్ ఆస్థానమునకు విరోధులయిన పద్మనాయకులను వర్ణించుటలో లోపము (మఱుఁగుపాటు) నుంచక పోయెనేని జీవాధారము నిరాధారమై పోవునను భయము, రెండవపక్షమున అనగా పద్మనాయకులను క్రిందుపఱచెనేని, వారి ధైర్యశౌర్యపరాక్రమాదిగుణగణనలను అనలము (అగ్ని) నకు సహించుట కష్టముగావున ఉభయపక్షానుకూలముగ మీరు పుణ్యవంశజులని, పద్మనాయకులను, పాదసంభవులు శూద్రులేగా? యని తన యాస్థానాధిపతులకు సంతోషము కలుగ వర్ణించినాడని స్ఫుటమగుచున్నది.

శ్రీనాథుఁడు పంటవారి యాస్థానముననుండిన కవిరాజు. వారి వీరివలె ద్రవ్యైకాభిలాషియై యసత్యవాదికాక సత్యమునే పురస్కరించి వర్ణించువాఁడు. కావుననే పద్మనాయకులు, కమ్మ మొదలగు నితరశాఖలవారికన్న నుత్కృష్టులని తనచే రచింపఁబడిన భీమఖండమున వర్ణించి యున్నవాఁడు.

శాస్త్రరహస్యవేత్తయై జగత్ప్రసిద్ధిగన్న శ్రీనాథ మహాకవి, పద్మనాయక యను పదప్రయోగమున కర్థమేయభిప్రాయముతో చేసెనో యది, "నేనాడో మరణించి మట్టిలోఁగలసి పోయినవారిని లేవనెత్తి యశుత దృష్టపూర్వము

లగు శౌర్యధైర్యాది లోకోత్తర గుణరత్నములతో తమ పక్షమువారిని నలంకరించుటయు, వారికి వ్యతిరిక్తులగువారిని వినని కనని దూషణములచే ధిక్కారము (తిరస్కారము) గావించునట్టివారికి తెలియుట కష్టసాధ్యము.

"భీష్మునకుఁ బాండవులం దంతయనురాగముండినను, యుద్ధమారంభించినపిదప గర్భశత్రువులతో బోరునట్లే యుద్ధముచేయుచుండెను. పాండవపక్షులగు శతానీకాదులను దునుమాడుచుండెను. దుర్యోధనుని జయమే గోరి రణమొన రించుచుండెను. కురుక్షేత్రమున ధర్మజుడు పాదచారియై భీష్మునియొద్దకేగి నమస్కరించెను. ధర్మజుని నాశీర్వదించి, పాండవపక్షమునఁ బోరుటకాక, యేదేని వరము వేడుకొను మనియె.

దానుండగ పాండవులకు భయపడవలసిన పని లేదని దుర్యోధనునకు ధైర్యముచెప్పెను. పాండవులు ఆత్మప్రియు లైనను, ధర్మముదప్పక అనగా దుర్యోధనుని యుప్పు తిను చుండుటచే, కౌరవుల పక్షముననే యుద్ధమొనరించుచుం డెను" గావున

, సర్వధర్మలఁదెలిసిన శ్రీనాథుడు పంటవారియాస్థానము నాశ్రయించి యుంటఁజేసి వారికి విరోధులగు పద్మనాయకులు (కంసాసురవిధ్వంసిచరణపల్లవంబు దమకు బుట్టినిల్లుగావున)

విష్ణుచరణ(పాద)సంభవులని రహస్యపదములంబెట్టి వర్ణించి నట్టుల విదితమగుచున్నది.

పద్మ,నాయక- (పద్మనాయక) యని విగ్రహము.

పద్మ, వెలమ- (పద్మవెలమ) యని విగ్రహము.

విష్ణుః ఉ॥ పు॥ విశ్వం వేష్టి. వ్యాప్నోతీతి విష్ణుః। విశ్వ మును వ్యాపించియుండువాఁడు.

నారా ఆపః అయనం స్థానః యస్య సః॥ నారమనగా జలము, అది స్థానముగాఁ గలవాఁడు. గావున సముద్రమునకు విష్ణుపదం అను నొక పేరు కలదు. నానార్థరత్నమాలా॥ క్లీబే॥ సముద్రే॥ సముద్రమునకు నామము. మరియు

విష్ణుపది॥ ఇకారాంత స్త్రీయాం॥ అమరః॥ గంగాయాం గంగానదియనియు,

విష్ణుపదం॥ నానార్థరత్నమాలా॥ క్లీబే॥ సముద్రే - సంద్రము సముద్రము.

పాద మనగా చరణము.

చరణం॥ పాదే= పాదము॥ కులే=కులము.

తాత్పర్యము: విష్ణుపది=గంగకు, విష్ణుపదం=సముద్రుని వలన బుట్టిన, పాదము = కులము అని శ్రీనాథుని రహస్యార్థము.

నాయకః॥ అదంత స్త్రీషు॥ అమరః॥ స్వామిని॥ శ్లోకం॥ యశః ప్రితాపసుభగో ధర్మకామార్థతత్పరః, ధురంధరో గుణాఢ్యశ్చ నాయకః పరికీర్తితః॥ తా॥ అనఁగా నీ శ్లోకమునఁ జెప్పినగుణములుగలవాఁడు. (సంస్కృతశబ్దార్థకల్ప తరుః కకారాంతః) (272 పుట)

తా॥ యశః=కీర్తిగలవాఁడు ప్రితాప=కోశబలముగల వాఁడు. కోశబలమనగా? అన్నమయ కోశమగు శరీరబలము గలవాఁడు, మరియు "క త్తిరొయొఱయందు, వైరుల సంహారింపఁ దగిన ఖడ్గముగలవాఁడనియు" ధర్మ=న్యాయధురంధరుఁడు కామ సద్విషయములయందు సదా కోరికగలవాఁడు. అర్థ: వంశపరంపరగా లక్ష్మీప్రిసన్నుడై యున్నవాడు. ధురంధరో= రాజ్యభారమునెల్ల వహించి బలమున మించినవాఁడే సేనా నాయకుడు, అని యర్థము.

ఆది వెలమ-ప్రిథమే=మొదలు నీటికొరకై జలముందు స్థలము పరీక్షించినవారు మున్నీరుకాపులనిన, మఱి వెల్లాన్మె వారనిన, దండనాయకులనిన, ఆదివెలమలనిన, పద్మనాయకు లనిన, వాహినీపతులనిన, పద్మవెలమలనిన, మున్నీరుకాపు నామమునకు బర్యాయపదసముదాయకులైన నొకేవంశజు లనుటను దెల్పుచున్నవి.

## పద్మనాయకులు సూర్యవంశజులు.

మున్నూరుకాఁపులు (పద్మనాయకులు) పద్మ- సం- తామర- నాయకుఁడు స- అధిపతి (పద్మబాంధవుండగు సూర్యుఁడు) సముద్రునికి 1 బ్రహ్మ 2 మరీచి 3 కశ్యపుఁడు 4 సూర్యుఁడు చతుర్థుఁడుగావున తద్వంశజులు చతుర్థవంశజులని వ్యవహరింపఁబడుచుండునట్టి మున్నూరు కాఁపు (పద్మనాయక) కులముయొక్క యుదంత మెఱుంగకయే బుక్కటి పురాణము లాధారముగా కొని చరిత్రములను వ్రాయఁబూనిన బెక్కుదోషములుండకమానవు. గ్రంథనిదర్శనములుండగా నయ్యవి విశ్వసింపక "బుక్కటి పురాణ గాథలతోఁ బెనఁగులాడుట యెల్ల నఱచేతిలోని వెన్నముద్దను విడిచి మోచేయి నాకుటవంటిది కాదా?"

పల్నాటివీరచరితమునఁ గార్తవీర్యార్జునునిసంతతివాఁడయి క్షత్రియుండయిన యనుగురాజు తనమంత్రియైన మున్నూరు కాపై (వెలమయై) న రేచర్ల దొడ్డనాయకుని కుమారునిఁ బెద్దనను దత్తపుత్రునిగా స్వీకరించెనని నుడువంబడినది. ఇందువలనమున్ వెల్లాన్మె(మున్నూరు)వారు క్షత్రియసంబంధసముచిత ప్రాశస్త్యముగలవారై యుండిరని యెట్టివారికిని దోఁపకపోదు. అని జటప్రోలుసంస్థానమువిద్వాంసులగు వెల్లాల సదాశివశాస్త్రిగారిచే ఆంధ్రచరిత్రవిమర్శము క్రీ. శ 1913 ముద్రితము 168 పుటయందు వ్రాయఁబడినది.

## పూర్వము ఉత్తమజాతులవారికే దండనాయకత్వ మిచ్చుచుండిరి.

ఇదిగాక సోమదేవరాజీయములోఁ బ్రతాపరుద్రుఁడు సభాసదులం గూర్చి పలికినట్లుగా నీ క్రిందివాక్యములు వ్రాయ బడినవి. "ఆరాజు హర్షించి మనంబున విచారించి యిట్లనియె. గణపతిమహారాజు నానావర్ణంబులవారికి నాయకత్వమిచ్చుటఁ జేసి బహునాయకంబై యున్నయది. బహునాయకంబు ననాయకంబు నొక్కసరియే. కావున నాయకత్వంబున కుత్తమవంశజాతులే కాని ఇతరజాతులవా రర్హులుగారు. మఱియు నొక్కమాటఁ జెప్పెద. మానధనులును నీతివివేకసంపన్నులును గాంభీర్య సముద్రులును మంత్రవివేక దక్షులును స్వామిహితానుచరులును నైన పద్మనాయకులు నాయకత్వంబునకుఁ దగుదురని సభాసదులతోఁ బల్కిన వారు రాజువివేకంబునకు హర్షించి (సంతోషించి)" అని.

ఇందు "నానావర్ణంబులవారికినాయకత్వమిచ్చుటంజేసి" అనుటవలన గణపతిమహారాజు మాత్రము నానావర్ణముల వారికి నాయకత్వమిచ్చెనని దెలియుచున్నది. "ఉత్తమవంశజాతులేకాని యితరజాతులవా రర్హులుకారు" అనుటవలన పద్మనాయకులు (మున్నూరుదండనాయకులు) ఉత్తమవంశజులనియు నేర్పడుచున్నది. ప్రతాపరుద్రు డప్పటి మున్నూరుదండ

నాయకుల (పద్మనాయకుల) యుదంతము (వృత్తాంతము)ను జక్కఁగఁ దెలిసియుండికదా పద్మనాయకుల కులప్రాశస్త్య మును గనిపెట్టి పలికినరాజువివేకమునకు సంతోషించియుం దురు. ఇప్పటివారికన్న వారికీవిషయము చక్కఁగదెలిసియుండు ననుటకు సందేహముండదు కదా?

మున్నీరుదండనాయకు (ముర్కవెల్లానెమ్మవారు లేక వెలమ లేక పద్మనాయకు)లు దండనాయకులైనను పరశురాముని వలన భయమొంది స్వకర్మపరిభ్రష్టులై యప్పటి సందర్భ మును బట్టి యొకటి, పద్మపతివలన బరాభూతులైన కారణ మునుబట్టి మరియొకటి. ఇట్లు రెండు సందర్భములంబట్టి (ముర్క వెల్లానెమ్మ)మున్నీరుకాఁపు (పద్మనాయకు)లమని త్రేతాయుగ మున అనగా పరశురాముని దండయాత్రయందు తమవృత్తి నామము మాత్రమే జెప్పికొనిరి. అటుపిమ్మట మహాపద్మపతి దండయాత్రయందు ముర్కవెల్లానెమ్మ (మున్నీరు)వారు పద్మ నాయక కులమువారని వ్యవహరింపఁబడుచుండిరనియు.

ఇట్లు వ్యవహరింపఁబడుచు వచ్చినవారు సూర్యచంద్ర వంశజులగు క్షత్రియులని యెట్టివారికిని బోధపడకపోదు. అట్లుండినవా రెవరో వారు సూర్యచంద్రవంశపురాజులైనం దున వారే యీ పద్మనాయకులని చెప్పినపుడు వీరిజాతికేమి యపకర్ష రాఁగలదు? క్షత్రియత్వరూపవస్తుస్థితికి భంగము లేదుకదా?

శూద్రులలో నుత్తములుగా గణింపబడుచున్న కమ్మ కాపు మొదలగు తెగలవారలలో నగ్రగణ్యులుగ పద్మనాయక వెలమలను జెప్పినందున వారలయం దేద్దియో విశేష ముండునని బోధపడకపోదు కదా? యనియు అయ్యది తక్కిన శాఖలవారికన్న నత్యుత్తమత్వమే కాదగియున్నదని బ్రం. శ్రీ. వెల్లాల సదాశివశాస్త్రిగారు తమ ఆంధ్రచరిత్రవిమర్శనము 188 పుటయందు వ్రాసియున్నవారు. మరియు,

ఇంగ్లీషుచరిత్రకారులయందు కీర్తిగాంచిన (తర్ స్టన్ Mr. Thurston, C. I. E.) మరియు ఘనత కీర్తిగాంచిన స్టార్ట్ (Mr. H. A. Stwart) గారును తాము రచించిన కులముల చరిత్రయందు (Castes and Tribes by Mr. Thurston, C. I. E) మున్ వెల్లాన్మెవారులేక వెలమవారు (మున్నీరుకాపు) అను కులమువారు.

Many Thousands of years ago when the inhabitents of the world were rude and ignorant of agriculture these people showed them how to till the soil.(Page) (361)

తాత్పర్యము॥ అనేక వేలసంవత్సరములకు ముందు ప్రపంచమందలి ప్రజలు వ్యవసాయ విషయమైన జ్ఞానములేక మోటువారుగ నున్నపుడు మున్ వెల్లాన్మె (మున్నీరు) కాపులు భూమిదున్నుట మొదలగు వ్యవసాయ సంబంధమైన విషయ

ములను బోధించి నెట్లు కృషిచేయవలయునని జూపినవారు యని వ్రాసియున్నారు.

శ్రీయుతులగు థర్‍స్టర్‍గారు తనకులముల చరిత్ర 340 పుటయందు

వీరు బ్రాహ్మణుల తరువాత క్షత్రియజాతివారు.

Next to the Brahmans' equal to the Rajpoots.

తాత్పర్యము॥ ఈమున్నీరుకాపు (వెలమ)లు ప్రసిద్ధికెక్కిన వర్ణమువారు. వీరు హిందువులలో బ్రాహ్మణులతరువాత గొప్పజాతివారనియు రాజపుత్రులతో సమానులనియు మఱియు దమయుత్కర్షము (శ్రైష్ఠము) మిక్కిలి మానప్రధానములైన మర్యాదలచే గాపాడుకొనుచుందురనియు Arum ఆరమ్ దొరగారు వ్రాసియున్నారు. బొబ్బిలి సంస్థానాధిపతుల చారిత్రము క్రీ. శ. 1902, పుట 5 చూడనగు.

Caste and Tribes by Mr. Thurston. C. I. E. Page 367. In Kamba Ramayana written (1000) thousand and odd years ago, it is said that the Priest Vasishta handed the crown to a Vellanmy (munnir kapu) who placed it upon Great Rama's head.

తాత్పర్యము:— త్రేతాయుగమున శ్రీరామచంద్ర పరబ్రహ్మమూర్తి పట్టాభిషేకసమయమున చక్రవర్తికికిరీటము

పెట్ట మున్నీరుకాపు(మర్క వెల్లాన్మె) వారలే నర్హులుయనివశిష్ఠు నితో తీర్పుజెంది స్వామివారికి పెట్టిరనియు నీవిషయము కంబ రామాయణమునగలదనియు చరిత్రపరిశోధకాగ్రేసరుఁడగు థర్స్టన్ సి. ఐ. ఇ. గారు వ్రాసియున్నారు.

ఆదిరేడుకిరీటము విశ్వకర్మచే క్రిందపడ వేయబడినపుడు క్రిందపడిన కిరీటము తిరుగపెట్టమని, దీక్షచేయుటయు మీావం శజులచేతనే ప్రతిరారాజు కిరీటమును ధరింపవలయునని దేవ తలచే నియమింపబడియుండినకారణముచే వశిష్ఠుడు కిరీటము పెట్ట వీరే నర్హులనుటయు వీరు పెట్టుటయు సభయందుగలవశిష్ట విశ్వామిత్ర భరద్వాజాది మహారుషులు మరియు (1) అంగ 2 వంగ 3 కళింగ 4 కర్ణాటక 5 కేరళ 6 కామరూప 7 గౌడ 8 వనవాస 9 కుంతల 10 కొంకణ 11 మగధ 12 సురాష్ట్ర 13 మాళవ 14 లాట 15 భోట 16 వరాట 17 శబర 18 కుకుర 19 కురువు 20 అవంతి 21 పాండ్య 22 మద్ర 23 సిమ్మళ 24 ఘూర్జర 25 పారశీక 26 మిథిల 27 పాంచాల 28 శూరసేన 29 గాంధార 30 బాహ్లిక 31 హైహాయ 32 తౌళవ 33 సాల్వ 34 పుండ్రక 35 ప్రాగ్జోతిష 36 మత్స్య 37 చేది 38 బర్బర 39 నేపాళ 40 గౌళ 41 కాశ్మీర 42 కన్యాకుబ్జ 43 విదర్భ 44 ఖురసాణ 45 మహారాష్ట్ర 46 కేకయ 47 ఆహిచ్ఛత్ర 48 త్రిలింగ 49 ప్రయాగ 50 కరహాటక 51 కాంభోజ

52 భోజ 53 చోళ 54 హూణ 55 కాశి మొదలగు నానాదే శాధీశులును, అనగా నాయా దేశములఁబాలించుచుండిన నాటి రాజులును హర్షించియుండి (సంతోషించియుండి) రని మెట్టి వారికిని దోఁపకపోదు. ఈవంశజులు తాము కిరీటమును నాడు ధరింపకున్నను, రాారాజులకు కిరీటమీానంశజులు పెట్టుట కర్తా లను విషయము వశిష్ఠవిశ్వామిత్రాదిమహర్షులకు చక్కఁగ దెలసియుండుననుటకు సందేహ ముండదు.

భూతభవిష్యత్కాల విషయములఁ దివ్యదృష్టిచేఁ తెలసి కొనిన వసిష్ఠుని వాక్యమువిశ్వసింపఁబడుట కేమి సంశయము?

వసిష్ఠుని పుత్రుఁడు శక్తియనువాడు. ఈ శక్తిపుత్రుఁడే పరాశరులు. వీరికి మత్స్యగంధియందు పుట్టినవారు వ్యాసులు వేదభేద మొనరించి వేదవ్యాసు లనఁబరగె. వీరిశిష్యుఁడు వైశంపాయనుఁడు జనమేజయమహారాజునకు భారతకథాసార మెల్ల వినిపించెను.

పూర్వయుగములయందు యుగయుగాంతములయందలి విషయములను అసమానమగు తమతపోదృష్టిచే దెలిసికొని తద్ప్రకారముగ కార్యక్రమములు రాజులతో నడపించు చుండుట జగత్ప్రసిద్ధిగావున అందు వసిష్ఠుఁడు 18 పురాణముల వ్రాసిన వ్యాసునకు వృద్ధపితామహుఁడ (ముత్తాత) గుటచే యతనివాక్యమెల్లరులు విశ్వసింపదగినదని నిశ్చయ

ముగా జెప్పనొప్పును. అటులకాదేని లోకముననున్న పురాణము లన్నియు యత్కించిద్విరోధమును బురస్కరించుకొని యప్రామాణికములు గావలసివచ్చును.

వీరు (మున్నూరు వెల్మ)మున్నీరుకాపువారనియు మరియు విశ్వామిత్ర మహాఋషిచే నేర్పినదండనాయకవిద్యయందు దక్షుండ పాండిత్యము గలవారగుటచే దండనాయకులనియు పిలువబడిరి. అందు దండ లోపించి నాయకయనుపదము మాత్రము శేషించెను. వీరి పూర్వచరిత్రమును తెలియక వెలుగోటివారి వంశచరిత్ర క్రీ శ 1910 ముద్రితమైనదానియందు 39 పుటలో కాకతిగణపతిదేవుఁడు మేటియైన చెవిరెడ్డికిః బిల్లలమర్రి బేతాళనాయకుడని బిరుదునామమొసంగినందునఁ దదాదిగాఁ గులమువారందరు నాయకులని వ్యవహరింపఁబడు చుండిన నుండవచ్చునని యున్నది.

ఇదేచరిత్రము (వెలుగోటివారి వంశచరిత్రము) 26 పుటలోన "బేతాళనాయకుడు రేచర్లవంశజులకు మూలపురుషుడుగా నుండినట్లు వెలమ (మున్నీరు) కులమువారి కందఱకు బ్రసిద్ధమమున పద్మనాయకుండనునతఁడు మూలపురుషుడై మహాప్రసిద్ధుడుగా నుండి తన్నామమునఁ గులమువారందఱు పద్మనాయకకులమువారని వ్యవహరింపఁ బడుచున్నారని చెప్పినం జెప్పవచ్చును." అని యుండుటచే పద్మనాయకులు గంగతోఁబుట్టువులుగారని స్థిరపడినది.

ఇదే చరిత్రము వెలుఁగోటివారి వంశచరిత్రమున 25వ పుట ఉపోద్ఘాతమున వీరిజాతివిషయమున పద్మనాయకుఁడనగాఁ పద్మబాంధవుడగు సూర్యుడు, ఆకులమువా రనఁగా సూర్య వంశమువారని యభిప్రాయము అనియు,

బొబ్బిలివారి రావువంశీయ చరిత్రము 49 పుటయందు మహానందియను రాజునకు వివాహితశూద్రస్త్రీయందు మహా పద్మపతియనువాడు పుట్టి సూర్యచంద్రవంశజులగు రాజులను దనకు వందనాదు లాచరింపుఁడని నిర్బంధించి వశపడనివారిని కారాగృహంబున నుంచగ పెద్దకాలం బందునుండనోపక అభివాద నాదుల నాచరింప నంగీకరించి వెళ్లిరనియు యచ్చటచ్చట రాజ్య ముల నాక్రమించుకొనిరనియు,ఇట్లుకాగా వారు పద్మపతివలన బహుకాలము జాత్యుచితసంస్కారశూన్యులై యొక్క తెగ వారుగా నేర్పడి శూద్రప్రాయులై యున్నందున నేకులము వారనియుఁ జెప్పుటకు వీలులేక పద్మనాయకకులమువారని వ్యవహరింపఁబడుచు వచ్చిరి. అనఁగా బద్మపతి యనువాఁడు నాయకుఁడుఁగాగలకులమువారని అభిప్రాయపడి వ్రాసి యున్నారు.

పద్మనాయకులపూర్వచరిత్ర మెరుంగని కారణమున, పండితు లూహించిన నానామార్గములు ఉపేక్ష(అశ్రద్ధ)చేఁ గలిగిన దోషములు దక్క వేఱొండుగాఁ గన్పట్టవు.

యజుర్వేదమున కుపవేదమయిన ధనుర్వేదమునకు కర్తయగు విశ్వామిత్రుడు యందుగల గజదండ సమదండ కుక్కుటపుదండ మొదలగు పదిరెండుదండములయం దఖండ పాండిత్య మీా సంఘనాయకుండగు ఆగమరేడునకు నేర్పియుం డుటచే ఆదిరేడుపుత్రుడైన ఆగమరేడువంశీయులు దండ నాయకులై తత్కార్యనిర్వాహకులౌటచే దండనాయకులని కీర్తిగాంచిరి. వీరు కృతయుగాంతమునుండి గలరు.

వాసవి అక్షయనామ సం॥ పుష్యమాసము తేది 1 జన వరి 1927, 11వ సంచిక 25 వ పుటయందు శ్రీయుత తుంపూడి భగవంతం గుప్తగారు

‘ఒక్కొకకులమున ఒక్కగుణము ప్రధానముగ నుండెను. కృతయుగమున దండనాయకులు తపోబలసంపన్నులుగను, జనులు పశుప్రాయులుగను ఉండిరి. ధర్మము నాలుగుపాదముల మీాదను నడచుచుండెను.

ప్రజలు పూర్తిగ దండనాయకుల ఆజ్ఞానువర్తులై యుం డిరి. జనులు తిరుగబడినప్పుడు వారిని స్వాధీనపరచుకొనుటకు దండనతప్ప మరియొక ఉపాయము లేదు.’ అని వ్రాసియున్న వారు. గావున

ఎఱ్ఱక్కసానమ్మగారు స్థాపించిన శిలాశాసనము

పిల్లలమఱ్ఱిగ్రామముపశ్చిమభాగమున దేవస్థానముదగ్గర నున్న శాసనములో (క్రీ - శ - 1208)

నామెపితృవంశమును వర్ణించునపుడు "భీమాహ్వయో నాయక ఊర్జితౌజాః ఎఱ్ఱమనాయకోభూత్ కామరేనాయక ఇత్యుదారకీర్తిః" అని రేచర్ల బేతిరెడ్డిభార్య ఎఱ్ఱకసానమ్మ స్థాపించిన శాసనమున గలదు.

కస్తూరిరంగకవికృతసాంబనిఘంటువు మానవవర్గు

సీ॥ ....................సాహిణి సాని రా

తనఁగ నశ్వారోహకునకుఁదనరె॥

టీక:—సాహిణి, సాని, రాతు- 3 ఈ మూడు నామములు అశ్వారోహకునికి అశ్వారోహకురాలికిని జెల్లును.

ఎఱ్ఱకసానమ్మ (స ఆని అమ్మ)

1. స = కలిగినవాని.

2. ఆని=దార్ఢ్యము ఁటవు దృఢము శక్తి ధైర్యము.

3. అమ్మ=తల్లి అనగా సాహసికునితల్లియని యర్థము.

మఱియు సాహిణి యనునది సానియొక్క ప్రకృతి యైనందున సానియనుపదము సాహిణియొక్క వికృతిపదమై యున్న కారణముచే సాని అమ్మ= సానమ్మ అనగా సాహసికునితల్లియని అర్థము.

మఱియు యుద్ధమునం దశ్వారోహకురాలై బాహు బలంబుచే శత్రువులఁ దునుమాడుశక్తిగలదై యున్న కారణముచే సాహిణిశబ్దవికృతియైన సానిపద ముపయోగించు సందర్భమున అమ్మయను స్త్రీవాచకమును సూచించుటచే యుద్ధవీరునితల్లి యుద్ధవీరురాలనుట సమంజసముగా దోచుచున్నది.

బేతిరెడ్డిసోదరుఁడగు నామిరెడ్డియొక్క క్రీ. శ. 1195 వ సంవత్సరమునాటి శాసనములో

లీలామాత్రదుమితధుతసమానీతనానానరేంద్రే
యః ప్రఖ్యాతః పృథుభుజబలో రుద్రదేవస్య సైన్యే.

రుద్రభూపతి (ప్రతాపరుద్రుని) (ప్రతాపవీరరుద్ర దేవుని) యొక్క సైన్యమందు భుజబలసుప్రసిద్ధుఁడై యుండెననియు నారుద్రదేవునియనుగ్రహమున సంపదనొందియుండెననియు నాసార్వభౌముఁడు (ప్రతాపరుద్రుఁడు) భూమండలము నేలుచుండ తాను శివలింగత్రయమును బ్రతిష్ఠించి "లింగాని త్రీణి సోయం త్రిపురవిజయిన సంప్రతిష్ఠాప్య వృత్తీః" తత్పూజనమునకై యనేకవృత్తు లొసంగెననియుఁ గలదు.

- బేతిరెడ్డి యామనగంటిరాజ్యమేలుచు 'సకలగుణాలంకార ఆమనగంటిపురవరేశ్వర వీరలక్ష్మినిజేశ్వర దోర్బలభీమ రణరంగరామ వితరణకర్ణ శౌర్యసంపన్న పతిహితాంజనేయ శౌచగాంగేయ సత్యరత్నాకర దుష్టజనభీకర మనుమకులా

దిత్య సుభటసంస్తుత్య' అను బిరుదములను వహించి కాకతిరాయ సేనానాయకులలో మిన్నయై యున్నవాఁడనియు,

బేతిరెడ్డి లోకోత్తర శౌర్య ధైర్య సాహసములతో బేతాళుని నెదిరించుటయు బేతాళుడాగాజుయొక్క శౌర్యాదులకు మెచ్చి కొన్నివరము లొసంగుటయు నావృత్తాంత మప్పు డోరుగల్లురాజ్యధురంధరుడగు గణపతిచక్రవర్తి చారులవలన విని యీ రెడ్డిని రావించి మిగుల గౌరవించుటయు,

## పిల్లలమఱ్ఱిగ్రామము.

నైజామురాజ్యమునకుఁ జేరియున్న నల్లగొండరాజ్యములోని యామనగల్లురాజధానిలోను ఆమనగంటి కుత్తర భాగమున రెండుక్రోశములదూరములోనున్న పిల్లలమఱ్ఱి రాజధానిలోను వసించి యాదేశము నేలినవాఁడు బేతిరెడ్డి యనియు, నిది ప్రస్తుతము నల్లగొండజిల్లా సూర్యాపేట తాలూకయందు జేరినదైయున్నది. సూర్యాపేటకు పశ్చిమమున మూడుమైళ్ళదూరమున గలదు. శిల్పకళానైపుణ్యము వెదజల్లు దేవాలయము లీగ్రామమున యుండుటచే నాంధ్రుఁడగువాడీపవిత్రభూమిని దర్శించి తీరవలయును. గ్రామమునకు వెలుపల సోమేశ్వరస్వామియాలయము గలదు. ఆలయము లోన నునుపుగల రాతిపై చెక్కిన చెక్కడములు మిగుల

యాకర్షణీయములుగా నుండుటయేగాక మనపూర్వులవిజ్ఞాన వికాసమున కాశ్చర్యము గొలుపును. ఈ గుడిముందుభాగమున నొక శాసనము స్తంభముపై నలువైపుల జెక్కఁబడియున్నది. ఈ శాసనమును గురించి 'సుజాత' మాసపత్రిక యందు ప్రకటించియున్నారు.

ఈ శాసనము శాలివాహనశక 1130 విభవ సం॥ జ్యేష్ఠ శు॥ 3 సోమవారంనాఁడు శ్రీ రేచెర్ల పిల్లలమఱ్ఱి బేతిరెడ్డి భార్య ఎఱ్ఱకసానమ్మగారు శ్రీ ఎఱకేశ్వరదేవరను ప్రతిష్ట జేసినటులయు బేతిరెడ్డి ఆమనగల్లుదుర్గమున కధీశుడై మొదటిప్రతాపరుద్రునియొక్క సైన్యమందు సుప్రసిద్ధుఁడై రుద్రునియందు భక్తియుక్తుడై వెలసియుండెననియు, ఈతని కనేక బిరుదులు గలవని పై శాసనమువలన తెలియుచున్నదని శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయరజితోత్సవపత్రిక అనుబంధము క్రీ. శ. 1928 సం॥ 53 పుటయందు గలదు.

ఈ బేతాళనాయకునికి చెవ్విరెడ్డియను నామాంతరము గలదు. ఈవలఁ గనిపెట్టఁబడిన శిలాశాసనములలోని శ్లోకంబులవలన బేతాళనాయకునికన్నఁ బూర్వులు గొందఱు రాజులుండిరనియు వారిలో భీమరాజు సుప్రసిద్ధుండై యుండెననియు దర్వాతఁ గొన్నితరములకు నావంశమున ముంజరా జుదయించెననియు ఆయనకు కాటమరాజు, ఆయనకు కామరాజు, ఆరాజున కీబేతాళనాయకు డుదయించెననియు,

రేచర్ల నామిరెడ్డిగారు స్థాపించిన శిలాశాసనము.

నైజాంరాజ్యములోని నల్లగొండజిల్లా సూర్యాపేట తాలూకా పిల్లలమఱ్ఱిగ్రామమధ్యమున దేవాలయములో నున్నది.

స్వస్తి సమస్తగుణసంపన్నుండగు శ్రీమతు రేచర్ల నామిరెడ్డి శకవర్షములు 1117 వ రాక్షససంవత్సర వైశాఖ శుక్ల త్రయోదశి నాదిత్యవారమునాఁడు వేయించిన శాసనమున 4 వ శ్లోకము.

శ్లో॥ సింహావ్యాఘ్రాయితభటమనోగంధవాహాయితాశ్వ
క్ష్మాభృన్మేఘాయితగజగణోజ్జృంభితే భీమధామ్ని
లీలామాత్రద్రుతధుతసమానీతనానానరేంద్రే
యః ప్రఖ్యాతః పృథుభుజబలో రుద్రదేవస్య సైన్యే.

ఈ భీమరాజు ప్రతాపరుద్రుని సేనానాయకులలో సుప్రసిద్ధుండై యుండెననియు పై శాసనము క్రీ-శ - 1195 వదై ప్రథమప్రతాపరుద్రదేవునిరాజ్యకాలమై యున్నదని దెలియుచున్నది.

"బేతాళనాయకుని కాలమున నీవంశస్థులకు విశేషధన ప్రాప్తియగుటయుఁ గులమువారందఱకు నీతని మూలముగ స్థిరవృత్తి స్వాస్థ్యములు లభించుటయు మొదలగు విశేషకార్య

ములు జరుగుటచే యాతని మూలపురుషుడుగా వ్రాయుటకుఁ గారణమై యున్న"దనియు,

ఆరాజు వీరికిమాత్రమేగాక రేచర్లగోత్రమువారందరకును అనఁగా, పిఠాపురము బొబ్బిలి జటప్రోలు మొదలగు ముప్పదియారు తెగలవారికి మూలపురుషుడు. ఈవిషయము వారి వారి సంస్థానచరిత్రములలో వ్రాయఁబడి యున్నదని బ్ర. శ్రీ. వెల్లాల సదాశివశాస్త్రిగారు వెలుగోటివారి వంశ చరిత్రయందు వ్రాసియున్నారు.

ఈవంశమునందలి ఆదిపురుషుడు రేచర్ల యను గ్రామములో వసించియున్న కతంబున వీరికి రేచర్లగోత్రజులను గోత్రనామ మేర్పడెననియు, వీరిగోత్రము గ్రామనామ మగుటచే వెలమనాయకుల కనేక గ్రామనామ గోత్రములే గలవనియెదరు.

| | నామము | రాజధాని | కాలము |
|---|---|---|---|
| 1 | బేతాళనాయకుడు | పిల్లలమఱ్ఱిరాజధాని | క్రీ.శ. 1116 లో |
| 2 | దామానాయకుడు | యామనగల్లు ,, | ,, 1199 మొ. 1257 వ |
| 3 | వెన్నమనాయకుడు | ,, ,, | ,, 1258 మొ. 1295 వ. |

4 బ్రహ్మనాయకుడు మాచర్ల యను గ్రామమును పాలించి పల్నాటి యుద్ధమున జయముగాంచినవాడు.

3 వ వెన్నమనాయకుని గనిష్ఠసోదరు డగు సబ్బినాయకునికి నల్లదాచానాయకుడు అని యొక పుత్రుఁడు. ఆయనకు,

4 - 5 మాధవనాయకుడు, దామానాయకుడు. ఇటుపై వీరిశాఖావృత్తాంతము తెలియదు.

3 వెన్నమనాయకునికి దాచానాయకుడు లేక యెఱ్ఱి దాచానాయకుడు రుద్రునిచే బంపబడి కంచిదుర్గద్వారమును భేదించినందున "కంచికవాటచూరకాడ" అని బిరుదమును పొందిన సేనానాయకుఁడు.

5 సింగమనాయకుడు శత్రుసైన్యనాయకులను సంహరించి "మచ్చనాయకగండ" "సామంతరాగోల" "కొదమ నాయకతలగుండుగండ"యను బిరుదములు బ్రతాపరుద్రుని వలన బొందెను. ఈ సింగమనాయకుడు క్రీ. శ. 1295 మొదలు 1323 వఱకుఁగల ద్వితీయప్రతాపరుద్రుని రాజ్యకాలమునవే రాచకొండ, దేవరకొండలలో నుండినవాఁడు. వీనికి నాగానాయకుడు దన్నాలకోటయొద్ద ననవేమారెడ్డితో కఠారియుద్ధముచేసి జయించినందున గఠారినాయకుఁడని బిరుదమును వహించెను. ఇటుపై నీశాఖవృత్తాంతము తెలియదని వ్రాసియున్నారు. నైజామునగరమునకు నాశాఖవారికుటుంబమువారు జేరి కఠారివారమని దెల్పుచు పచ్చభావియను వీధిలో నివసించి ధర్మకంకణ నిష్టాగరిష్ఠుఁడగు మహారాజ చందులాల్‌గారియొద్ద ధనాగారాధిపతిపదవిపై యుండిరి. వీరికి పగటిదివ్వటీలు యుండి నడుమున పూర్వబిరుదుప్రకారము కఠారి గల్గియుండెడిది. మరియు ఐదవతరము,

6 సింగమనాయకునికి అనపోతానాయకుఁడు మాదానాయకుఁడు అని యిద్దరు పుత్రులు. వీరు యనేకరణరంగముల యందు ఘోరయుద్ధమొనర్చి క్రీ-శ-1361 జయము గైకొనిరి.

అనంతరము మాదానాయకుడు దేవరకొండరాజధానిని ననపోతానాయకుడు వంశపరంపరాగతమైన రాచకొండరాజధానిని నేలుచుండిరి. ఇది నల్లగొండమండలములోఁ బ్రస్తుత నారాయణపురసంస్థానమునకుఁ బశ్చిమభాగమున 6 మైళ్ళదూరమున నున్నది. మాదానాయకుని పుత్రుఁడు,

7 పెదవేదగిరినాయకుఁడు ఏకశిలానగర సమీపమున బెక్కండ్ర వీరుల రణమున బరిమార్చి "ఏకశిలానగరసమీప శాత్రవారణ్యదహనదావానల" 'వేములకొండ రణరంగస్థల వైరిరాజజీమూతపవన" అనెడు బిరుదునామములను బొందెను.

8 ఈ వేదగిరినాయకునికి రామచంద్ర నాయకుఁడు, కుమార మాదానాయకుడను నిరువురు పుత్రులు. అందు రామచంద్రనాయకుఁడు కన్నడసరదార్లను రణరంగమున జయించి కీర్తిగాంచెను. కుమార మాదానాయకుఁడు దేవరకొండపైకి యుద్ధమున కొచ్చిన మెఱకృష్ణరాయని జయించి "హొన్నెగట్టు, కుదిరెగట్టు, మండలేశ్వరగండ" యను బిరుదములు బొందెను.

9 ఈ కుమార మాదానాయకునికి 3 పుత్రులు. అందుఁ బెద్దవాఁడు సూరానాయకుఁడు. నితఁ డనేక యుద్ధములందు జయశాలియై యుండెను. లింగమనాయకుడను 3 వ వాడు "ఏకధాటీసమర్థుఁడు" "కోటలగొంగ" "మూరురాయర గండ" యను బిరుదములు బొందెను. మరియు శ్రీనాథుఁడు మొదలగువారలను జంపి జయముగాంచి "బల్లరగండ, విషమ ధాటీసమర్థ, చతురుపాయదక్ష, రిపుప్రళయాంతకోపేంద్ర, అష్టదిగాత్రియ, మనోభయంకర, అవఘళరాయమానమర్థన, మేదినీరాయదుష్టగజాంకుశ" ఇత్యాది బిరుదములు వహించెను.

10 వ తరము పర్వతనాయకుడు.

11 వ తరము కుమారలింగమనాయకుడు.

ఇటుపై వీరి శాఖవృత్తాంతము తెలియదు.

6- 7 వ తరము అనపోతానాయకునికి పెదసింగమ నాయకుఁడు ధర్మానాయకుఁడును ఇద్దఱు పుత్రులు. వీరిలో జ్యేష్ఠుండు సింగభూపతి అనేక గ్రంధముల రచించినట్లు తెలియు చున్నది. అందు సింగభూపాలీయమను నలంకారశాస్త్రము అత్యుత్తమప్రబంధము.

8 సర్వజ్ఞసింగభూపతికి అనపోతానాయకుఁడు మొదలు 6 గురు పుత్రులు. అనపోతానాయకునికి యన్నమనాయకు డను నొక నామాంతరము గలదు. ఇతడు 'పట్టుతలాటాంక, రాయవేశ్యాభుజంగ' అని బిరుదులు బొందినాడు.

9 అనపోతానాయకుఁడు కొండవీటిసీమప్రభువులైన సంపెట సోమరాజు నలతిమ్మరాజులను జయించి పానుగల్లు మొదలైన తాలూకాల నాక్రమించెను. రాజమహేంద్రవరము రెడ్లను జయించి బోయధొరలను గొట్టి బోయరాజ్యమును గట్టుకొనెను.

ఈ పోతనాయకుఁడు విష్ణుభక్తుఁడై రామానుజీయమతము నవలంబించియుండెను. వీరు మెతుకుసీమ నేలినయట్లు తెలియవచ్చుచున్నది.

10 సర్వజ్ఞసింగమనాయకుఁడు అనపోతానాయకుని పుత్రుఁడు. కావ్యనాటకాలంకారశాస్త్రాదులందు మిగుల బ్రవీణతగలిగి యాంధ్రపండితమండలికిఁ బట్టుకొమ్మయైయుండెను. ప్రసిద్ధికెక్కిన శ్రీనాథుఁడు సహా సింగభూపతిసమ్ముఖమ్మునఁ దనకేమిపరాభవము గలుగునో యని చింతించి,

ఇట్లు

సీ॥ దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాల
వాక్కుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకు
పగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టుకంచుఢక్క

చంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుదు

గీ॥ నెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగన్న భూపాలు ధీవిశాలు
నిండుఁగొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురంబ శారదాంబ॥

వాగ్దేవిని ప్రార్థించెననియు, వీరు 15 వ క్రీ. శ. న నున్నటుల స్పష్టపడుచున్నది. 6 వ తరము అనపోతానాయకుని రెండవకుమారుడు ధర్మానాయకుఁడు. ఈయనకు శింగభూపాలీయమున శివభూపతి యని యొక నామాంతరము గలదు.

8 వ తరము ధర్మానాయకునిపుత్రుడు తిమ్మానాయకుఁడు. చంద్రవంశపురాజులను బాండ్యదేశపురాజులను గొందఅను జయించి ఘూర్జరదేశపురాజుల బెక్కండ్రను బరిమార్చెను. ఈ తి మ్మా నా య కు ని కి ధర్మానాయకుఁడు చిట్టిదాచానాయకుఁడు యిద్దరుపుత్రులు.

9 వ తరము, వీరిలో ధర్మానాయకుని సంతతివారు పిఠాపురమువారును రావువారైరి. ఈ ధర్మానాయకుఁడు ప్రస్తుతము నైజాంరాజ్యములోఁ జేరిన నల్లగొండమండలము నేలుచుండెను. ఆ నల్లగొండ జిల్లాముఖ్యస్థలము. ఆనల్ల

గొండయను పర్వతముపై గొప్పకోట కట్టించినాఁడు. రెండు కొండలకు మధ్య గ్రామము నిర్మింపఁబడియున్నది. దక్షిణభాగమునగల కొండను కాపురాలగుట్టయని పిలిచెదరు. కాకతీయ రాజ్యము మహోన్నతదశయందున్నపుడు ఆరాజులపక్షమున నియమింపఁబడిన సేనానాయకులు (సర్దారులు) నల్లగొండకు రెండుమైళ్ళసమీపమున పానుగంటిని నిర్మించిరి. హిందూ రాజులకాలమున దీనిని నీలగిరియని పిలచుచుండిరి. అల్లాయుద్దీన్ బహమన్‌షా దీనిని జయించి తనస్వాధీనము చేసికొనినతరువాత దీనికి నల్లగొండ యనుపేరిడె నని యందురు. కానియిటీవల నల్లగొండయనుటకు కారణము నలునిచేనిర్మింపబడిన దుర్గముండుటవలననే యని కొంద రభిప్రాయపడుచున్నారు.

పానుగల్లును బాలవద్దిరాజు పాలించుచుండెను. ఇతడు చాళుక్యరాజులలోనివాఁడని తెలియుచున్నది. ఈ పానుగల్లు ఆకాలమున పన్నెండామడపట్నమనియు

బాలనాగమ్మ రాచవారియింటియాడుబడుచు. ఈమెను బాలవద్దిరాజు పెండ్లాడెను. ఈయమ ఆపత్కాలములయందు బలుమారు ఓరుగంటిశంభుని ప్రార్థించుచుండుటచే బాలనాగమ్మ ఓరుగంటివారి యాడుబడుచేమో యనియు హనుమకొండలోని బాలసముద్ర,మీయమపేరుతో గట్టబడినదేమో యని తోఁచుచున్నది.

బాలవద్దిరాజు డిల్లీకి పోయినపుడు బాలింతయగు బాల నాగమ్మను మోసకాఁడగు నొక పకీరు మాయోపాయము లచేఁ గామవశమునఁ గొనిపోయెను. ఆపతివ్రతాశిరోమణి వానిబారినుండి తప్పించుకొని నల్లగొండపట్టణములోఁగట్టెలు విక్రయించుకొనుచు బ్రతుకుచుండెను. బాలనాగమ్మబంటు తలారిరాముఁడు. వీఁడు విశ్వాసపాత్రుడు గాన మిక్కిలి సాయ పడెననియు

బాలవద్దిరాజు డిల్లీనుండి వచ్చి భార్యాబిడ్డలను దిరుగఁ గలసికొని పకీరును శిక్షించి సుఖంబుగనుండె. ఈ కథాంశము ఓరుగల్లుముట్టడికి (క్రీ. శ. 1328) ఈవలిది యని చరిత్ర పరిశోధకులచే నిర్ణయింపఁబడినది.

10 వ తరము ధర్మానాయకునితమ్ముడైన చిట్టిదాచా నాయకుని పుత్రుఁడు అనపోతానాయకుడు. ఈనరేంద్రునకు

11 వ తరము పెదమాదానాయకుడు చిన్నమాదానా యకుడు అను యిద్దరు పుత్రులు.

12 వ తరము చినమాదానాయకునికి ఎఱ్ఱసూరానాయ కుడు నల్లసూరానాయకుడను ఇద్దరు పుత్రులు. వీరిలో నల్ల సూరానాయకునిసంతతివారు మైలవరమువారును సూరా నేనివారైరి.

10

13వ తరము ఎఱ్ఱసూరానాయకునికి మాదానాయకుఁడు యాచమనాయకుడను నిరువురుపుత్రులు. అందు మాదానాయకునిసంతతివారు ప్రోలూరువారైరి. వీరు సురభివారికి మూలపురుషులు.

14వ తరము యాచమనాయకునికుమారుడు చినసింగమనాయకుఁడు (సింగభూపతి). నితనిపుత్రుఁడు

15వ తరమువాడు నిర్వాణరాయప్ప నాయకుఁడు (పెద్దరాయఁడు).

వీరు దేవరకొండనుండి వచ్చి వెలుగోడు నాక్రమించి గొప్పకోట గట్టించిరి. ఈవిషయము కొంతవఱకు కర్నూలు మ్యాన్యూలులో 14వ అధ్యాయమున 104వ పుటలో "16వ శతాబ్దమధ్యమున గోలకొండనుండి యొకజమీందారు వచ్చి వెలుగోటిలో నొకబలిష్ఠమైనకోట గట్టెను" ఇతడు రాయలవారి సేనాగ్రియాయియై రణమున జయముగాంచి ప్రధాన బిరుదమగు శ్వేతచ్ఛత్రము (వెండిగొడుగు) నాకోటపై బట్టించుకొనెను. మఱియు వెలుగోడురాయవిభుఁడు అనుబిరుదమ్మును సహా రాయలవారిచే జెంది జయలబ్ధమగు తద్రాజ్యము నేలుచుండునటుల రాయలవారే యానతిచ్చిరి. ఈవెలుగోడనునది ప్రస్తుతము కర్నూలుజిల్లా నందికొట్టుకూరు తాలూకాలోఁ జేరి కర్నూలునకుఁ దూర్పున 40 మైళ్ళదూరమునను

నంద్యాల కుత్తరదిశను 15 మైళ్లదూరమునను శ్రీశైలమునకు దక్షిణమున 40 మైళ్లదూరమున నున్నది.

వీరు వెలుగోటిని సంపాదించినపిమ్మట అందు యుద్ధాదులు ప్రసక్తించునపు డవరోధవధూబృందంబు వసింప నర్హాంబులగు ననేకసౌధరత్నంబులు సురక్షితంబులగు కోశాగారాయుధాగారాద్యనేక రాజభవనంబులును నిర్మించి తద్రాజ్యము నిష్కంటకముగఁ బాలించుచు నాటినుండి రేచర్లవారనుటకు బదులు వెలుగోటివారని పిలువబడుచున్నారు.

16 వ తరము నిర్వాణరాయప్పనాయకునికి కుమారతిమ్మానాయకుడు సింగమనాయకుడనునిరువురిలో సింగమనాయకునికి రంగప్పనాయకుడు వీరికి అబ్బానాయకుడు వీరికి గోపాలనాయకుఁడు నితనికి ఓబానాయకుఁడు.

అటుపై తదీయశాఖవృత్తాంతము తెలియలేదు.

17. కుమారతిమ్మానాయకునికి పెదకొండప్పనాయకుడు, వీరికి

18 వ తరము తిరుపతినాయకుడు. ఈయన కృష్ణదేవరాయలవారి ప్రభుత్వకాలములో వెలుగోటిదేశము నేలుచుండినవాఁడు. వీరితమ్ముఁడు గనితిమ్మానాయకుఁడు నంద్యాలతాలూకాలోని గనిరాజధానిని పాలించుచుండెఁ. ఈగనితిమ్మానాయకునికి రెండవకుమారుఁడు

19 నాయనప్పనాయకుఁడు. వీరికినరసింగప్పనాయకుడు,

20 గురువప్పనాయకుడు.

ఇందుపై వీరిశాఖవృత్తాంతము తెలియదు.

నరిసింగప్పనాయకునిసోదరుడగు చెన్నప్పనాయకునికి 6 గురు పుత్రిలు. వీరిశాఖవృత్తాంతము తెలియదు.

18 వ తరము ఎఱ్ఱతిమ్మానాయకునికుమారుడు తిమ్మానాయకుడు. ఇతనికి 3గురు పుత్రిలు. ఇందుపై వీరిశాఖవృత్తాంతము తెలియదు.

17 వ తరము పినకొండప్పనాయకునికి ముగ్గురు భార్యలు. అందు పెద్దభార్య (తిమ్మాంబ) యందు 4 గురు పుత్రిలు. రెండవభార్యయగు అక్కమ్మయందు ముగ్గురు పుత్రిలు. మూడవభార్యయగు సింగమ్మయందు ముగ్గురు పుత్రిలు.

పై తిమ్మాంబపెద్దకుమారుడైన 18 వ తరము కుమారతిమ్మానాయకునికి నలుగురుపుత్రిలు. వీరిలో జ్యేష్ఠుఁడైన 19 వ తరము తిరుపతినాయకునికి 4 గురు పుత్రిలు. ఇందుపై వీరి శాఖవృత్తాంతము తెలియదు.

17 వ తరము పెదకొండప్పనాయకునికి 3 గురు పుత్రిలు. గండికోట మొదలగు దుర్గముల నాక్రమించుకొని యున్నవారిని జయించి రాయలవారియొద్ద గొప్ప మన్ననబడసిరి.

19-20 వ తరము చన్నప్పనాయకునికి యిద్దరు కుమారులు. ఇందుపై వీరిశాఖవృత్తాంతము తెలియదు. తిమ్మాంబ చతుర్థపుత్రుడగు 18-వ-త. రాయప్పనాయకునికి 19-వ-త. వెంకటాద్రినాయకుఁడు. నితడు కలిమిలియను గ్రామమును మిక్కిలి వృద్ధిచేసి తన నామముతో వెంకటగిరియని నామధేయముంచెను.

ఈ వెంకటాద్రినాయకునికి,

20 వ తరమువాఁడు రాయప్పనాయకుఁడు. వీరికిరంగప్పనాయకుడు (21) కుమారరంగప్పనాయకుడు ఇద్దరుపుత్రులు.

21 వీరిలో రంగప్పనాయకునికి,

22 వ తరము సింగమనాయకుఁడు. నితనికి తృతీయకుమారుఁడు,

23 వ తరము వెంకటాద్రినాయకుఁడు. వీరికి ప్రథమపుత్రుఁడు,

24 వ తరము సింగప్పనాయకుఁడు. యిటుపై వీరిశాఖవృత్తాంతము తెలియదు.

17 వ తరము పినకొండప్పనాయకుని 3వ భార్యయగు సింగమ్మకు 3రు పుత్రులు. వీరిలో రెండవవాడైన,

18 చినతిమ్మానాయకునికి 4గురు పుత్రులు. అందుఁ బెద్దవాడైన చెన్నప్పనాయకునికి

19 మాలెకొండప్పనాయకుఁడు. వీరిపుత్రుఁడు,

20 కుమార చన్నప్పనాయకుఁడు వీరి శాఖవృత్తాంతము తెలియదు.

17 వ తరము పినకొండప్పనాయకుని 2 వ భార్యయగు అక్కమ్మకు యాచమనాయకుఁడు రెండవపుత్రుఁడు. వీరికి,

19 వ తరము కస్తూరి రంగప్పనాయకుఁడు ఆకువీటి తిమ్మానాయకుఁడను ఇరువురు పుత్రులు. వీరు ఘోరయుద్ధ మొనర్చిరనియు అది క్రీ. శ. 1579 ప్రమాది సం॥ ఆశ్వయుజ శు ౮ ఆదిత్యవారమునాఁడు ముగిసినదనియు ఈ యుద్ధము కొండవీటిసీమ మొదలగు ప్రదేశములయందు జరిగియుండెననియు అందు జయము గాంచి కీర్తియందు మించిరని తెలియుచున్నది.

20-వ తరముకస్తూరిరంగప్పనాయకునికి 3రుకుమారులు. అందు రెండవకుమారుఁడు పెదయాచమనాయకుఁడులేక (యాచశూరుఁడు) వీరవెంకటపతిరాయలచేత నీయఁబడిన పెరిమిడి సీమను పాలించుచు మధురాంతకములో యుండెను. యాచశూరుడు క్రీ - శ - 1602 క్రూరమైనయుద్ధముచేసి యుత్తర మల్లూరుకోటను జయించి "రామరాజరాజ్యస్థాపనాచార్య" అను బిరుదముఁ బొందెను.

21. యాచశూరునకు 8 గురు కుమారులు. అందు జ్యేష్ఠుండగు కుమారరంగప్పనాయకుడు చెంచు మాధవయ్య, కృష్ణయ్య, మధుర వీరప్ప అనువారలతో యుద్ధముచేసి జయ మొందెను.

ఆఱవకుమారుఁడైన కుమార యాచమనాయకుఁడు చామలియను గ్రామమునొద్ద మైసూరురాజుగారి సేనలతో యుద్ధముచేసి సంహరించి అబ్దుల్ పాదుషాహగారివలన ఛత్రి చామరములు గజములు బిరుదైనకలికితురాయి శ్రేష్ఠమైన ఖడ్గము మొదలగు నుత్తమబహుమానములను బొందెను.

22 యాచమనాయకునికి బంగారు యాచమనాయకు డను నొక పుత్రుఁడు. ఇతఁడు ఉత్తరమల్లూరులో ప్రభుత్వము చేయుచుండి యాదేశములో జేరిన చెంజిపరగణా తిరువణ్ణా మలెతాలూకాలోనున్న మహాదేవమంగళమను గ్రామమును దమపురోహితులకు నగ్రహారముగా నిచ్చినారు.

23 బంగారు యాచమనాయకునికి యిద్దరుపుత్రులు. అందు జ్యేష్ఠుడగు సర్వజ్ఞకుమారయాచమనాయకుఁడు క్రీ-శ 1695లో వెంకటగిరి ప్రవేశించి పట్టాభిషిక్తుఁడై ప్రభు త్వముఁ జేయుచుండెను.

24 వ త. సర్వజ్ఞకుమారయాచమనాయకునికి యిద్దరు పుత్రులు. అందు జ్యేష్ఠుఁడగు బంగారు యాచమనాయకుఁడు,

తనతండ్రియవసానకాలమువరకును ననుభవములో నుండిన కొచ్చెర్లకోట, దర్శి, పొదిలె, పెళ్ళూరు, సర్వాపల్లి, వెంకటగిరి, కోటపోలూరు, నగుటూరు, నెల్లూరు మొదలైన తాలూకాల నేలుచుండిరి.

25 వ త. బంగారు యాచమనాయకునికి కుమార యాచమనాయకుఁడు. వీరు క్రీ. శ. 1699లో పట్టాభిషిక్తులైరి.

26 వ త. కుమారయాచమనాయకునికి బంగారు యాచమనాయకుఁడను యొక పుత్రుఁడు.

27 వ త. బంగారు యాచమనాయకునికి కుమారయాచమనాయకుఁడు.

28 వ తరము: ఇరువదియేడవతరము కుమారయాచమ నాయకుని జ్యేష్ఠపుత్రుఁడగు శ్రీశ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రి బహద్దర్ కె. సి. ఐ. ఇ. వారు తమతండ్రిగా రుండగనే వారిచేత క్రీ. శ. 1876 అక్టోబరు నెలలో సింహాసనారూఢులుగా జేయఁబడియుండిరిగాన౯ దదాదిగా నిష్కంటకముగా రాజ్యపరిపాలనము చేయుచున్నవారు ఈ రాజచంద్రునకుఁ జ్యేష్ఠభార్యయందు

29 శ్రీగోవిందకృష్ణయాచేంద్రులవారు. వీరికిముగ్గురు పుత్రులు.

1. పై 28 వ తరము కుమారయాచమనాయకునకు జ్యేష్ఠపుత్రుడు శ్రీ శ్రీ రాజగోపాల కృష్ణయాచేంద్ర బహద్దరు - కె - సి - ఐ - ఇ - గారు. వీరు తమ స్వంతరాజ్య పరిపాలకులై యున్నవారు.

రెండవకుమారుడు రామకృష్ణయాచేంద్రులుగారు. వీరు పిఠాపురసంస్థానమునకు దత్తుపోయియున్నారు.

మూడవ కుమారుడు రంగమన్నారు కృష్ణయాచేంద్రులుగారు. వీరు బొబ్బిలిసంస్థానమునకు దత్తుపోయి యున్నారు.

నాల్గవ కుమారుడు నవనీత కృష్ణయాచేంద్రులుగారు వీరు జటప్రోలుసంస్థానమునకు దత్తుపోయి యున్నారు.

ఐదవకుమారుడు ముద్దుకృష్ణయాచేంద్రులుగారు.

ఆరవకుమారుడు వెంకటకృష్ణయాచేంద్రులుగారు.

ఏడవకుమారుడు వేణుగోపాలయాచేంద్రులుగారు.

ఆంధ్రదేశమున యున్న మున్నీరుకాపు(మున్ వెళ్లాన్మె) లేక వెలమవారలేకుటుంబమునకు జెందినవారో క్షత్రియులగు వీరు నెటనెట సంబంధము జేసికొనిరో వీరలు క్షత్రియులనుటకు నేమేని యాధారములు గలవా? ఈమున్నీరుకాపులు (ముణ వెళ్లాళ మై)వ్యవసాయకులలో మొదటివారను విషయప్రి

సంగము మొదటనే వ్రాసియున్నాను. ఇపుడు దక్షిణోత్తరములు నివాసము జేసికొని పరిపాలించిన దేశభాగమును గురించియు యా దేశమున కేనామ మెటుల గల్గినదియు వ్రాయుట ముఖ్యమని దగిన యాధారములతో దిగువ నుదహరించెద.

చరిత్రపరిశోధకాగ్రేసరులగు పండితులచే ('శారద' రుధిరోద్గారి సం॥ ఫాల్గుణము, మార్చి 1924 1 వ సంపుటము 1 సంఖ్య 1 వ పుటనుండి వ్రాయఁబడిన వ్యాసమందలి సారాంశము.)

మున్నీరు (చాళుక్యులు, వెలమ) కాపులనుటకు ప్రమాణము.

అఱవమునందు ‹దివాకరమ్' అను పేరుగల కోశము (శబ్దార్థనిఘంటువు) గలదు. ఇది 640 శతాబ్దప్రాంతపుది, ఇది యింతకంటెను ప్రాచీనమని చెప్పువారును కలరు. ఇందుచళుక్య వెందర్ మర్ఱ వెళ్ కుల అరసర్ అనుపదములు పర్యాయ పదములుగ నీయఁబడినవి. "చళుక్యరాజులు మర్ఱ వేళ్ కుల నృపతులు" అని యీపదముల కర్థము. అనగా చాళుక్యరాజులు మర్ఱ వెళ్ కులము (మున్నీరుకాపు) వారే ననుట స్పష్టము. మర్ఱ వెళ్ కులము వారిని వెళాళ్ అందురు. వీరు తెలుగులోని మున్నీరుకాపులు, వెలమవారు, కన్నడములో వక్కళగర్, సముద్రికుల మొదలయిన జాతులు మర్ఱ వెళ్ - లేక వెళ్ళాళ్ళు, మున్నీరుకాపుజాతులనియే చెప్పవలెను.

వీరందరు మొదట నొక్కజాతివారే కాని, దేశభేద ములబట్టి పేళ్లు మారుట సంభవించినది. దీనినిబట్టి(చాళుక్యులు) మున్నీరువారు మొదట దాక్షిణాత్యకాపుజాతివారనియు, రాజ్యము వచ్చినపిమ్మట క్షత్రియనామము జెందిరనియు స్పష్టమగుచున్నదనిరి. "థర్‌స్టన్ - సి - ఐ - ఇ - గారు, The Vellanmy (Munneer kapu) can not be of the Sudra or Service class) తా॥వీరు శూద్రులుగారు లేక పరి చారకుల తరగతి వారును కారు. Vellala caste Proper were Kshatriyas) తా॥ మున్నీరు కాపులు క్రమమైన క్షత్రియులుగా నున్నవారు.

కోయంబత్తూరుమ్యాన్యుయల్లో The Vellalas (మున్నీరు కాపులు) are summed up as truly the Back bone of the District తాత్పర్యము. కోయంబత్తూరుజిల్లాకు, వెన్నె ముకవంటివారని.

శేలంమ్యాన్యుయల్లో The Vellala's goad is the ruler's scepter తాత్పర్యము. మున్నీరుదండనాయకుని చేతగల దండము (రాజాధికారము) రాజుగారి ఆజ్ఞదండము అని యున్నది. ఒక్కచాళుక్యులేగాక దక్షిణమందు ప్రఖ్యాతి చెందిన కదంబ, గాంగులు, రాష్ట్రకూట, హోయిసళ, చోళ, పాండ్య, చేరాదులందరు మొదట వ్యవసాయము

చేయు తెగలుగానుండిరి. తరువాత వారిలోనుండి పరాక్రమ
శాలులు యుద్ధరంగవీరులు పుట్టి రాజులై తాము క్షత్రియుల
మని చెప్పుకొనసాగిరనియు వీరు సూర్యునినుండి చంద్రుని
నుండి పుట్టిరని వ్రాసిరనియు క్షాత్రతేజమువలన క్షత్రియ
త్వము సంపాదించినవారని చెప్పినయెడల నెవ్వరును కాదని
చెప్పుటకు వీలులేదను చిలుకూరి వీరభద్రరావు బి. ఎ. గారి
అభిప్రాయ మిటులున్నను

ఏకాధ్వరముగ ఆఱువందలసంవత్సరముల వఱకును
తెనుగుదేశమునుకర్ణాటదేశాదులను పెక్కువందలసంవత్సరముల
వరకును ఏలిన సంమ్రాట్టు (తన యాజ్ఞ చే రాజులను శిక్షించి
రాజసూయయాగమును చేసిన మండలేశ్వరుడు) శ్రీహర్షుని
పారదోలిన చాళుక్యులు క్షత్రియులుకాని యెడల మఱి యెవరు
క్షత్రియులు ?

మున్నీరుకాపు (చాళుక్యులు, వెలమ) జాతుల
వారనియును వెలమక్షత్రియులనియు జెప్పుటచేత నేను వక్కా-
ణించిన జాతిపరిణామ (మారురూపు) సిద్ధాంతము నంగీకరించి
రని చెప్పకతప్పదు. అని బ్ర. శ్రీ చిలుకూరి వీరభద్రరావు
గారి అభిప్రాయము.

పాండ్యరాజ్యమును స్థాపించిన మొదటి పాండ్యుడు
మున్నీరుకాపు (మఱవెళ్లాళైన్). వెలమతెగకు (వ్యవసాయ

కుల తెగకు) జేరిన సాహసకుఁడు పాండ్యుడనువాఁడు దక్షిణ మునదాను నివాసము జేసికొని, పరిపాలించిన దేశభాగమునకు పాండ్య దేశమని పేరువచ్చినట్లుగా విల్సనుగారువ్రాసియున్నారు.

Royal Asiatic Journal vol. 3, P 201 and in the Madras Journal vol. 13, P. 177. Wilson's Mackenzie collections Introduction P.45. and Tamil Book P. 203 Neu Edition.

గౌర్నమెంటువారి ప్రాచ్యలిఖిత గ్రంథ భాండాగార మున మెకంజీసంపుటములలో 241 వ నంబరుగల పాండ్య మండలం చోళమండలం పూర్వరాజ చరిత్రి 'వెలుంగు' అను వ్రాతప్రతిలోను విల్సనుగారి మెకంజీకూర్పులలో నాలుగవ సంఖ్యగల తమిళ్ భాషాస్థానిక చరిత్రములోను టైలరుగారి జాబితాపట్టిక సంపుటము 3 లో 23, 22 సంఖ్యగలదానిలో 4 వ పుటలోను మొదటిపాండ్యునిగురించి

"అప్పడి మెవడదేశత్తిలుల్ల పాండియర్ ఆగిరవెళ్ళాళర్ ఇందరామేశరయాత్తిరైక్కు పురపట్టువందాన్."

అనగా ఉత్తరదేశములో నివసించు పాండ్యుడను మున్నీరుకాపు (మర్ వెళ్ళాళన్) జాతివాఁడు రామేశ్వర యాత్రికు బయలుదేరివచ్చెను. అని వ్రాియబడియున్నది.

మరియు 5 వ పుటయందు

"ఇప్పడియరశర్ పాండియర్ పేర్ మధుర నాయగ (నాయక) పాండియర్ అవర్ ముదల్ ఉందు పన్నిన పట్టణ త్తుక్కుతన్ పేరై తానె వెత్తుమదురాపురి యెనున్రిం మదురై నాగరెనున్రిం పేరిట్టు పిన్నుం ఆనేకపట్టణంగళెయుం ఉందుపన్ని నాన్"

అనగా ఈప్రకారముగ మధురపాండ్యుడను ఈపాండ్య రాజు తాను మొదట నిర్మించిన పట్టణమునకు మధురాపురి లేక మదురై నగరమని పేరు పెట్టి తరువాత ననేకపట్టణములను గట్టించెనని యున్నది.

6 వ పుటయందు చోళరాజ్యమును స్థాపించినవాడు దయమాన్నల్లియను మున్నీరుకాపు (మర్ వెల్లాన్నైన్మ) యని యున్నది.

ఉత్తరదేశ పాండవులతోడ దక్షిణదేశపాండ్యులకు సంబంధమును దెలుపుగాధలు పెక్కులు గలవు.

పాండ్య, కేరళ, కోల, చోళాదులు చంద్రవంశీయు డైన దుష్యంతునిసంతతివారని భారతీయులని హరివంశము మొదలగు పురాణములలో వక్కాణింపఁబడియెను. ఉత్తర దేశమునుండి విజయుడనురాజు లంకాద్వీపముపై దండయాత్ర వెడలెనను గాధలో విజయునకు పాండవులకు సంబంధము కల

దని చెప్పఁబడియెను. ఆతఁడు దక్షిణ మధురాపురము నేలిన పాండవునికూతురిని బెండ్లాడెనసియు ఆమెవలన సంతానము కలుగనందున తనతరువాత సింహళద్వీపమును బాలించుటకై తన జ్ఞాతి (దాయాదుడు) సోదరకుమారుని యుత్తరదేశము నుండి రప్పించెననియు జెప్పబడియున్నది.

పాండువంశదేవుడను నీ సోదరపుత్రుడు బుద్ధునిముని మనుమఁడగు పాండుశాక్యుని కూతురగు భద్రకాంచన యను నామెను వివాహముజేసికొనియె ననియు వక్కాణింపఁబడియెను. మఱియు బుద్ధునిగాథలలో నొక కథ గలదు.

ఏమనుష్యుడు నొక్కభార్యకంటె నెక్కువమందిని వివాహము చేసికొనుట కూడదని శాక్యవంశక్షత్రియులలో నొక ధర్మము కలదనియు అట్లయ్యును గౌతమబుద్ధునితండ్రియగు శుద్ధోదనుడనురాజు శాక్యులదేశముపై దండయాత్రలు సలుపుచు పీడించుచున్న పార్వతీయజాతులను పాండవులను జయించుటచేత నొక్కశుద్ధోదనరాజుకు మాత్రము బహుభార్యలను వివాహమాడుటకై సంఘమువారి యనుమతి యొసంగబడినదని తమ బుద్ధచరిత్రములో రాక్‌హిల్లు (Rock Hill) గారు వ్రాసియున్నారు.

పాండుజాతులవారిలో. ఉత్తరదేశమే జన్మస్థానముగా గలవారు పాండవార్జునాభిమన్యపరీక్షిన్మహారాజవంశజులనియు

దక్షిణ దేశమే జన్మస్థానముగాగలవారు మున్నీరుకాపు (మర్క వెల్లాన్మె) కులమువారు. వీరొక్కదక్షిణహిందూ దేశమునందేగాక (ద్రావిడ దేశమేగాక) ద్రావిడ దేశము మొదలు ఆంధ్ర కర్ణాట మహారాష్ట్ర ఘూర్జర దేశములందును ఉత్కల కళింగ దేశములందును దక్షిణవిదర్భము (హైదాబాడ్) నందును గానంబడుచున్నారు. (ఈ హైద్రాబాద్ భరతఖండమున వింధ్యపర్వతమునకుదక్షిణమున నుండుటచే దీనికి దక్షిణవిదర్భ మని నామమేర్పడెను.) వీరికి మాతృస్థానము గంగాతీరము నందలి కురుజాంగల దేశముగాని కోసల విదేహ దేశములుగాని యైయుండును. కాబట్టి వీరిని దాక్షిణాత్యులేయని నిర్ధారించుట సమంజసము. పిమ్మట యనేక దేశములయందు నివసించుటచే ఆయా దేశవాసులనుటయు నిశ్చయమే.

హిందూ దేశచరిత్రము (11) XI వ ప్రకరణము క్రీ॥ శ॥ ...నందు - దక్షిణము (దక్కను)యొక్క పూర్వచరిత్రము (21) పుటయందు 43 వ పూర్వపురాజ్యములు:—

దక్షిణము (దక్కను) నందు మిక్కిలి పురాతనమైనవి పాండ్య, చోళ, రాజ్యములు. పాండియన్ అనునతఁడు స్థాపించుటచే దీనికి పాండ్యరాజ్యము అని పేరువచ్చెను. ఇందు మధుర తిన్నెల్ వేలిజిల్లాలు చేరియుండును. ఈ రాజ్యమునకు ముఖ్యస్థానము మధుర. పాండ్యరాజులు ముఖ్యముగా చోళరాజులతో

యుద్ధముచేసిరి. చోళరాజ్యము పాండ్యరాజ్యముకంటె విస్తీర్ణము. ఇది ద్రవిడ దేశమంతట వ్యాపించియుండును. ఎనిమిదవ శతాబ్దమునందు త్రిలింగ దేశముయొక్క కొంతభాగమును ఈ రాజులు ఏలుచుండిరి. దీనికి ముఖ్యపట్టణము 'కంచి' యని యున్నది.

చరిత్రపరిశోధకాగ్రేసరుడగు మిస్టర్ విల్సన్ గారు పాండ్య రాజ్యమును స్థాపించిన మొదటిపాండ్యుని గురించి వ్రాయుచు మూఁవెళ్లాన్మై (మున్నీరుకాపు) తెగకు (వ్యవసాయ కుల తెగకు) జేరిన సాహసకుఁడు పాండ్యుడనువాఁడు దక్షిణ మున (దక్కను) దాను నివాసము జేసికొని పరిపాలించిన దేశ భాగమునకు పాండ్యదేశమని పేరు వచ్చినట్లుగా వ్రాసినారు.

విజ్ఞానచంద్రికా గ్రంథమాల (8) ఆంధ్రులచరిత్రము ప్రథమభాగము, పూర్వయుగము, చిలుకూరి వీరభద్రరావు గారిచే రచియింపఁబడి క్రీ. శ. 1910 ముద్రితమైన దాని పదమూడవ ప్రకరణము 258 వ పుటయందు

ఆంధ్రచాళుక్యులజన్మాదిక కథనమంతయుఁ గల్పిత గాదలలో నిమిడియున్నదనియు అయిన నవియే మనకు శరణ్య ములుగా నున్నవనియు ఈకల్పితగాథలు గ్రంథములలోనికి, శాసనములలోనికినిగూడ నెగఁబ్రాకినవియనియు బిల్హణకవివిర చితమైన విక్రమాంక దేవచరిత్రమునందు చాళుక్యులజన్మ

కథనము కొంత వివరింపఁబడినదనియు అందు బ్రహ్మదేవుఁడర్ఘ్యమిడునిమిత్తముదకమునకై పట్టియుండిన తన చులుకము (పుడిసిలి) కేసి చూచెనట. అంతటాచులుకమునుండి పుట్టినవాఁడు చాళుక్యవంశమునకు కర్తయయ్యెనట. యనియు

అదేగ్రంథమున 262 పుటయందు చాళుక్యవంశము అను శీర్షికనుగురించి జయసింహవల్లభ మహారాజు విజయాదిత్యునికుమారుఁడనియు విష్ణుభట్టసోమయాజివలనఁ బెంపఁబడి విష్ణువర్ధనుడను నామమును నహించి యుక్తవయస్సువచ్చిన తరువాత చళుక్యపర్వతమునకుఁ బోయి గౌరినిగూర్చి తపస్సు చేసివచ్చి కాంచీపురాధీశ్వరుండైన పల్లవరాజుకొమార్తెను వివాహముచేసికొని యామెవలన విజయాదిత్యుఁడను కుమారుని గాంచెననియు వీనికి రణరాగుడను బిరుదు గలదనియు వీనికి శ్రీపులకేశివల్లభమహారాజను పుత్రుడు పుట్టెననియు వానికి కీర్తివర్మ బుట్టెననియు వీనికి సంతానములేక తన సోదరుడగు మంగళేశుఁడు రాజయ్యెననియు యనంతరము శ్రీకీర్తివల్లభరాజుకుమారుడు పులకేశి రాజ్యమున కభిషిక్తుఁడయ్యెననియు వీనియనంతరం శ్రీ పృధ్వీవల్లభమహారాజు మూడురాజ్యములకు ప్రభువయ్యెననియు చాళుక్యులలో బహు సమర్థుడని వ్రాసినారు.

చాళుక్యుల జన్మకథ కల్పితగాధలలో వ్రాయఁబడి

యున్నదని తెలుపుచు నవియే మనకు శరణ్యములుగా నున్న వని వ్రాయువారు పొరపాటుచే వ్రాసిరని వారిని ఆక్షేపము చేయుట యేల? అది ఉపేక్షయనిన బాగుండునని నాయభి ప్రాయము.

బ్రి. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రచరిత్రము ప్రథమభాగము పూర్వయుగము మొదటికూర్పు. క్రీ. శ. 1910, 13-వ ప్రకరణము 258 పుటయందు ఆంధ్ర చాళుక్యులు అను శీర్షికయందు క్రీ. శ. ఏడవశతాబ్దారంభమునఁ జాళుక్యు లాంధ్రదేశముపై దండెత్తివచ్చి పల్లవరాజులను జయించి దేశమును స్వాధీనముపఱచుకొని నాఁటనుండి వేంగీదేశమును బరిపాలింపఁగడంగిరని పూర్వప్రకరణమున తెలిపియుంటిమని వ్రాసియున్నారు.

ఇదేగ్రంథమున 3-వ ప్రకరణము 32 వ పుటయందు వేఁగీదేశము (వెంగై యనగా నఱవములో పులియని యర్థము.) యనియు తొలుత నీవేఁగినాటిబ్రాహ్మణులు ద్రావిడాచారమునే కలవారై క్రమక్రమముగా నిప్పుడిప్పుడు కొంత యాంధ్రాచారము నవలంబించుచున్నారు అనియు, నీద్రావిడ బ్రాహ్మణులలో పాకనాడు, పాలకనాడు, బెడగనాడు, వాదనాడు, సిర్నాడు, ఉలచనాడు, కళింగనాడు, కాసలనాడు, తెలుగునాడు (తెలగాణ్యులు), మురికినాడు, వెలనాడు, వేంగి

నాడు, వేఁగినాడు, కమ్మనాడు, ఇంగనాడు, ఇన్నుంబర్నాడు, తిరుమునాడు, తిరువలినాడు, తిరునారాయణర్నాడు, పల్నాడు, చేగల్నాడు, పోల్నాఢు మొదలగునవి ద్రావిడ బ్రాహ్మణులలోనినాడులనియు

ఈ వేంగీదేశము ద్రావిడజాతులలో నొకరగు పల్లవులచే పరిపాలింపఁబడుచుండెననియు నటుపిమ్మటఁ బండ్రెండవశతాబ్దాంతమువఱకును బూర్వచాళుక్యులును బరిపాలనముచేసిరనియు పల్లవరాజులిప్పటి ఏలూరునకు సమీపముననుండెడి వేంగీపురము రాజధానిగాఁజేసికొని యీదేశమును బరిపాలించిరనియు ఏడవశతాబ్దిని రెండవపులకేశివల్లభుడను చాళుక్యరాజు పల్లవరాజును జయించి తనతమ్ముని (కుబ్జవిష్ణువర్ధనుని) వేంగీదేశమునకుఁ బాలకునిగా నియమించెనని 323 వ పుటయందు వ్రాసియుండుటచే చాళుక్యులు దాక్షిణాత్యులనియు దివాకరమను నిఘంటువున వ్రాయబడిన మర్క వెళ్ళాళ్ళ (మున్నీరుకాపు)లనియు ఆదివ్యవసాయకులనియే చెప్పుట సమంజసమని యొప్పుకొనక తప్పదు. మరియు,

మున్నీరుకాపులు (చాళుక్యులు) క్షత్రియులనుట కాధారములు పెక్కులు గన్పట్టుచున్నవి. మున్నీరుకాపుయను నామమునకు చళిక్యవెందర్ అనగా మర్క - వేళ్ కుల లేక మర్క - వెళ్లాళ్ళ లేక చాళుక్య లనియు మర్కవెళ్ళాళ్ళ

వెళమై-వెలమ అనియు (మూల వెల్లం=మున్నీరు, అనమాయ్ మూల నీరువిషయమైన కార్యనిర్వాహకుడైన కాపు) మొదలగు నామము లేకార్థముగల్గి వీరెల్ల నొక్కజాతివారై యుండుట నిశ్చయము. దేశభేదములబట్టి పేళ్లు మారుట సంభవించినదని స్పష్టమగుచున్నది. ఈజాతీయులే కన్నడదేశమున వక్కళిగార్‌లని పిలువబడుచున్నవారు. వీరందరు మొదట నొక్కజాతివారే. దీనినిబట్టి చాళుక్యులు మొదట దక్షిణదేశ మున్నీరు (మూల వెళ్లాన్మై) కాపుజాతివారనియు రాజ్యపరిపాలనత్వమున కనంతరము క్షత్రియత్వము జెందిరనుట స్పష్టమగుచున్నదని బ్ర. శ్రీ చిలుకూరి వీరభద్రరావు బి.ఎ.గారు తమ అభిప్రాయము నిచ్చియున్నవారు.

ఏకాధ్వరముగ (600) ఆఱువందలసంవత్సరములవఱకును తెనుఁగుదేశమును కర్ణాటదేశాదులను సహా పెక్కువందల సంవత్సరముల వరకు ఏలి సమ్రాట్టు (మండలేశ్వరుడు) శ్రీహర్షుని పారదోలిన మున్నీరుచాళుక్యులు క్షత్రియులు కానియెడల మఱి యెవరు క్షత్రియులని బ్ర- శ్రీ కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు, ఎం. ఏ. గారు తమ అమూల్యాభిప్రాయ మొసగిరి.

పై ఉభయుల అభిప్రాయమును పరిశోధింపగ మున్నీరు కాపులు(మూల వెళ్లాన్మై)వెలమవారునొక్కజాతివారై యున్నటు

లయు మున్నీరుకాపులకే చాళుక్యులను నామాంకితమై ఇందు చళుక్యవెందర్ వెళ్ కుల (మున్నీరుకుల వెలమకుల) అరసర్ అనుపదములు పర్యాయపదములై "చళుక్యరాజులు, మ్రుణ వేళ్ కుల నృపతులు" అని పైపదముల కర్థమై అతి ప్రాచీన మైన "దివాకరమ్" అను పేరుగల కోశము అరవమునగలదానిచే మున్నీరుకాపులే(మ్రుణ వెళ్లాన్మకాపులు) చాళుక్యరాజులనియు, చాళుక్యులే మున్నీరుకాపులనియు, వీరు రాజ్యములను నిర్మించి యనేకరాజులం జయించి, క్షాత్రతేజమువలన క్షత్రియ త్వము నొందిరనియు నీ కారణముచే క్షత్రియులని పిలువబడి రనుటకు పూర్వమే క్షత్రియులు

శ్రు॥రయిసుక్షత్రంస్వపత్యమాయుఃసువీర్యంనామసత్యావహన్తా.
ఋగ్వేదము - మం (1) సూత్రము (1)

సాయణాచార్యభాష్యము, అతః క్షత్ర = బల, బల = క్షత్ర, యని యుండుటచే క్షత్రియశబ్దము బలమను శబ్దము ఈ రెండు శబ్దములు సామర్థ్యమను అర్థమునందు పరస్పర మొకటి కొకటి తుల్యార్థములై పర్యాయపదములై యున్నవి.

యజుర్వేదమున కుపవేదమగు ధనుర్వేదాదికర్తయగు విశ్వామిత్రమహర్షిచే విలువిద్య మొదలు సమస్తదండ నాయకవిద్యయం దఖండపాండిత్యమును సంపాదించి కృత కృత్యులై బలసంపన్నయుతులై దండనాయకులైన మున్నీరు

కాపులు క్షత్రియులే యనుట నిజమని ఋగ్వేదసూత్రము సాయణాచార్యుల భాష్యయుక్తముగ సిద్ధాంతమైయుండ వేరే జెప్పనేల?

నిజాంరాష్ట్రంధ్రచారిత్రిక ప్రదేశముల వర్ణనము క్రీ-శ. 1928 ఆంధ్రప్రాంతము శ్రీ కోదాటి వెంకటేశ్వర రావుగారు, బి.ఏ

## హ ను మ కొం డ.

హనుమకొండ వరంగల్లుజిల్లాకు (సుబాకు) ప్రధాన స్థలము. దీనికి అనుమకొండ యనియు నుచ్చారణ గలదు. ఇది నిజాము రైలుమార్గమున కాజీపేట, వరంగల్లుస్టేషనులకు సమీపమున నున్నది.

క్రీస్తుశకారంభమునుండి ఇది ఆంధ్రుల రాజధానిగా నుండినట్లు దెలియుచున్నది. శ్రీశైలప్రాంతారణ్య ప్రదేశములనుండి యొక కిరాతశూరుడు వచ్చి, హనుమాద్రి నాక్రమించి రాజ్యముచేయసాగెను. అతనికొమారులగు అనుమడు, కొండడు, వారిపేరున 'అనుమకొండ' నిర్మితమైనది. కొండడు తనపేరిట కొండపర్తి గట్టించెనట.

మున్నీరుకాపుకుల (చాళుక్య) రాజొకడు నందగిరి (నాందేడు) లోఁ బాలించుచుండెను. అతనిమరణానంతరము అతని యిద్దఱుకొడుకులు రాజ్యమును బంచుకొని యొకఁడు

హానుమకొండ యందును, మరియొకఁడు కందారమునందును రాజ్యములనేలుచుండిరి. బల్లహుఁడుఅను కటక (కల్యాణము) పురాధీశ్వరుడు కందారురాజ్యపాలకుడైన చాళుక్య సోమదేవుని జంపినందున, గర్భిణియగు నాతనివిధవభార్య సిరియాలదేవి హానుమకొండకు బరుగెత్తి యచ్చట నొకపుత్రునిం గనియెను. అతనిపేరు 'మాధవవర్మ.'

ఒకనాడీబాలుడు (మాధవవర్మ) తనతోఁ జదువు బాలురు తానును నాటతమి బలకపుస్తకమునుఁ బద్మాక్షీదేవిచేరువపెట్టి యగ్గుడితలుపుఁ బెట్టి, విహారించుచుండ నస్తమయంబయ్యె. అంత యింటికిఁ బోయి, భోజనానంతర మారాత్రి చదువందగు పలుకయు, పుస్తకమును లేకునికి, తనతల్లి తననెక్కడ కోపించునో యని యట్టి రాత్రికాలంబు ననే పద్మాక్షీదేవిసముఖంబునకు దా నొక్కరుండు చనెను.

అచ్చట అతిభయంకరంబై భూతప్రేతపిశాచశాకినీ ఢాకినీ బేతాళ బ్రహ్మరాక్షస పరివృతమై సింహాసనంబున పద్మాక్షీదేవి కొలువయి వుండెను. కాని యవమాత్రింబైన మాధవవర్మ చలింపక, భూతగణంబులఁ జేతఁ దోఁ్రయుచు, యద్దేవిసముఖంబుననున్న పలకయు బుస్తకంబును బుచ్చుకొని నిలచియుండెను.

అంత నబ్బాలుని సాహస ధైర్యంబులకు దేవి వెర

గంది, యతని ధైర్యపరీక్షకై యతిభయంకరాకారంబు దాల్చెను. అబ్బాలుండు దానిని గాంచి ఎంతమాత్రము జలింపక, నిలచి, ముకుళితహస్తుండై బహువిధంబుల స్తుతియించుచు పాదపద్మములపైం బడి లేవకుండెను. దానింగని దేవి యత్యంతదయార్ద్రమానసయై "లెమ్ము వత్సా! నీ భక్తి ధైర్యంబులకు మెచ్చితి.నీ కిష్టంబైన వరంబు వేడు"మని పలికిన నబ్బాలుండు తన జననిచేం దండ్రిచందంబంతయు నెఱింగిన వాండై నందున, గటకవల్లభుని సాధించి తమగోధనంబులు మరల్చునట్లు వరంబు కృపసేయు మనిన, యద్దేవి, నీ వన్న యట్లు కృ ప సే యు దు న ని ఒకదివ్యఖడ్గంబును మరియొక దివ్యఖేటకంబును (డాలువాఱుడాలు) గృపజేసి ఈ ఖడ్గంబు నీచేతనున్న ని న్నెదిర్చినశత్రువు లడంగుదురు. ఈ దివ్య ఖేటకంబు (డాలు) నీచేతనున్న శస్త్రాస్త్రంబులు నిన్ను జేరవు. అని యానతిచ్చి (1000) సహస్రవత్సరంబులు ఏలోపము లేక రాజ్యంబు నీవంశజుల కుండుగాకయని వరం బిడి తనసమీపముననున్న నొక్క బిలంబును జూపి అందు బ్రవేశింపుమనియు తిరిగి నబ్బిలమార్గంబు వెడలిన చతురంగ బలంబులు నీవెంట చనుదెంచునని యానతిచ్చిన వెంటనే నబ్బాలుడు నట్టులే గావించెను. సమస్త గజతురగవీరభట బలంబులు వెంటనంటిరాగ మాధవవర్మ యిలు జేరి క్రీ. శ. 314లో శత్రువుల జయించి సింహాసన మాక్రమించెను. ఇతండే

కాకతీయ వంశములోని మొదటివాడైన (చాళుక్యమాధవ వర్మ) ట్లును, ఈ వంశము పద్మాక్షీవరప్రసాదమున(1000) సహస్రవర్షంబులు రాజ్యము చేసినట్లు చెప్పఁబడుచున్నది.

1. చాళుక్య (మున్నీరుకాపు) మాధవవర్మ శాలివాహన శకము 291 తారణనామ సంవత్సర మాఘ శు ౫ గురువారము శ్రవణానక్షత్రమున సింహాసనంబెక్కి శా-శకం 411 వరకు అనగా 120 సం॥ రాజ్యమును పరిపాలించెను.

2. పద్మసేనుఁడు శాలి-శక 411 నుంచి శాలి-శక 489 వరకు రాజ్యమును పాలించెను.

3. వెన్నమరాజు శాలి-శక 489 నుంచి శాలి-శక 572 వరకు రాజ్యమును పాలించెను.

4. పోరికి వెన్నమరాజు శాలి-శక 572 నుంచి శాలి-శక 648 వరకు రాజ్యమును పాలించెను.

5. గుండమరాజు శాలి-శక 648 నుంచి, శాలి-శక 718 వరకు రాజ్యమును పాలించెను.

6. ఎఱుకు దేవరాజు-శాలి-శక 718 నుంచి శాలి - శక 792 వరకు రాజ్యమును పాలించెను.

7. కుంతలదేవి (ఎఱుకు దేవరాజు మేనత్త) శాలి- శక 718 నుంచి 727 వరకు ఎరుక దేవరాజు బాలుండగుటంజేసి యతని మేనత్త రాజ్యము చేసెను.

8. భువనైకమల్లుఁడు శాలి-శక 792 నుంచి శాలి-శక 818 వరకు రాజ్యముచేసెను.

9. త్రిభువనైకమల్లుఁడు శాలి - శక 818 నుంచి 892 వరకు రాజ్యముచేసెను.

10. కాకతిప్రోలరాజు శాలి - శక 892 నుంచి 964 వరకు రాజ్యమును పాలించెను. ఇతడే కటకవల్లభునితో యుద్ధముచేసి వానితల దురించి వానిసుతునికి బట్టముగట్టి (30000000) మూడుకోట్ల సువర్ణనిష్కంబులు (మాడలు) బుచ్చుకొని, హనుమకొండ ప్రవేశించెను. ఈమహానీయుడే ఓరుగల్లు నిర్మించెను. ఈ ఓరుగల్లుపట్టణము శాలి - శక 909 కి సరియగు శుభకృతునామ సం॥ కార్తీక శు ౫ గురువారం రోహిణీనక్షత్రమున గట్టించెను. ఇతనియనంతరము చాళుక్యులైన నీరాజులు, కాకతీయులని పిలువఁబడి కాకతీయరాజులని ప్రసిద్ధికెక్కిరి.

11. రుద్రమహారాజు శాలి-శక 964 నుంచి శాలి-శక 1052వరకు రాజ్యమేలెను.

12. మహాదేవరాజు(రుద్రమహారాజుతమ్ముఁడు) శాలి-శక 1052 నుంచి శాలి-శక 1059 వరకు రాజ్యమేలెను.

13. గణపతిరాజు (రుద్రమహారాజుసుతుడు)శా-శ-1059 నుంచి శా-శ- 1127 వరకు రాజ్యమేలెను.

14. రుద్రమహాదేవి(గణపతిదేవునిభార్య) శా-శ-1127 నుంచి శా-శ- 1205 వరకు రాజ్యమేలెను.

గణపతిమహారాజు తనకు సంతానంబులేకునికి పద్మాక్షీ వరప్రసాదంబున నొక కన్యకారత్నంబునుం గాంచి ముమ్మమ్మ యను నామకరణము జేసెను.

అకోమలి నవయవ్వనురాలైనంజూచి చోళాఖ్యతిల కుండగు వీరయ్యదేవుండను రాజసుతునకు వివాహంబుజేసి (80000000) యెనిమిది కోట్ల సువర్ణంబులు నిక్షేపంబు (చెప్పి చూపియుంచినధనము) జేసెను. యనంతరము

శాలి-శక సం॥ 1013 ఆనందనామ సం॥ చైత్ర శు ౫ గురువారము రోహిణీనక్షత్రంబున బ్రాహ్మ్యముహూర్తంబున సూర్య అంగారక బృహస్పతు లుచ్ఛస్థానంబున శనైశ్వరుండు నిజస్థానంబున వసింప ముమ్మమ్మ దేవికి సుతుఁ డుదయించెను. వీనికి శివదేవయ్యగారు ప్రతాపవీరరుద్రదేవుండని నామకరణంబు జేసిరి.

15. ప్రతాపరుద్రదేవమహారాజు శా.శ. 1205 నుంచి శా-శ-1282 వరకు రాజ్యమును పరిపాలించెను.

కామక్షీవరప్రసాదానుకూలముగ 1000 వేయి సంవత్సరములు అనగా ప్రతాపరుద్రునిపర్యంతము రాజ్యమేలిరి.

ఇట్టి పవిత్రచరిత్రకు మూలపురుషుఁడై అంపకందారము

నందు రాజ్యము నేలుచుండిన చాళుక్య(మున్నీరుకాపు) సోమ దేవునికి సిరియాలదేవియందు పుట్టినమాధవవర్మ పద్మాక్షీ దేవివరప్రసాదంబున నేకచక్రంబుగ రాజ్యము పాలించెను. అనంతరము నితనికి(11)పదునొకండవతరమువాఁడైన కాకతి ప్రోలరాజు ఓరుగల్లును నిర్మించెను.

నాటినుండి చాళుక్యరాజులు కాకతీయులని పిలువబడిరి.

ఈ విషయము, ఏకాంబ్రనాథవిరచిత ప్రతాపరుద్ర చరిత్రము బ్ర. శ్రీ. విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రి గారిచే పరిశోధితము. (వరంగల్ శైవప్రచారిణీముద్రాలయమున ముద్రితమైనదానియందు గలదు).

శారద (రుధిరోద్గారినామ సం॥ భాద్రపదము 2 వ సంపుటము) మచిలీపట్టణము సెప్టంబర్ నెల 1923 సం॥1సంఖ్య 1పుటమొదలు 7 పుట వరకు.)

మున్నీరుకాపులు (చాళుక్యులు) దాక్షిణాత్యులేయను వ్యాసము చరిత్రపరిశోధకాగ్రేసరులగు బ్ర - శ్రీ కె - లక్ష్మణరావుగారు వ్రాసియున్నారు.

మున్నీరుకాపులు (చాళుక్యులు) ఉత్తరదేశమునుండి వచ్చినవారనియుఁ జంద్రవంశపుక్షత్రియులనియుఁ బెక్కు చరిత్రకారులు వ్రాసియున్నారు కాని మనకు తెలిసినంతవరకు

జరిత్రలందు గానంబడు మున్నీరుకాఁపు (చాళుక్య) లకును, ఉత్తరదేశమునకును ఎట్టి సంబంధమును లేదనియు, గదంబ రాష్ట్రకూటాదివంశములవలె వీరును దాక్షిణాత్యులే యనియుఁ దెలియుచున్నది.

ఇచ్చట దాక్షిణాత్యశబ్దమునకుఁ గొంచెము నిర్వచనము చెప్పవలెను. (అర్థవివరణముచేసి చెప్పుట.) మనపూర్వులచే హిందూదేశము, (హిం=హీనమును దూ=దూషించును గాన, "హిందూ" దేశములు=అనేకపట్టణములుగల గొప్ప భూభాగము) రెండు ఖండములుగా విభాగింపఁబడినది.

(1) ఒకటవది ఉత్తరహిందూదేశము.

(2) రెండవది దక్షిణహిందూదేశము.

ఈ రెంటికి సరిహద్దు వింధ్యపర్వతము (భారతవర్షముఁ నార్యావర్తమునకు దక్షిణముననున్న పర్వతము) లేక నర్మదానది. ఈపర్వతమునకుగాని, నదికిగాని దక్షిణముననున్న భూభాగమునకంతటికిని దక్షిణాపథమనియు లేక దక్షిణహిందూదేశమనియు పేళ్లు. ఇచ్చట నివసించువారు దాక్షిణాత్యులు. కాని యీ వ్యాసమునందు దాక్షిణాత్య శబ్దమును, యింత వ్యాపకార్థమందు నుపయోగింపఁదలచుకొనలేదు. ఆంధ్రదేశమును దానికిఁ జుట్టును అంటి సరిహద్దులుగ నున్న దేశములనుమాత్రము గ్రహింపదలచితిని.

ఆ దేశములలో నీశాన్యముననున్న ఓఢ్ర దేశమును గూడ గ్రహింపనక్కరలేదు. సరిహద్దుగ లేకపోయినను మళయాళ దేశమునుగూడ నిందుఁ జేర్పవచ్చును. ఇట్లు దాక్షిణాత్య పదమువలన నాంధ్ర, కర్ణాట, ద్రావిడ, మళయాళ, మహారాష్ట్ర దేశములు సూచింపఁబడును.

## నా నా దే శ మం దు గ ల చా ళు క్య లు.

మున్నీరుకాపుల (చాళుక్యుల) చరిత్ర కనుఁగొనుటకై యీ నామముగల వంశములు చరిత్రగ్రంథములలో నెన్ని కలవో మొదటఁ జూడవలెను. చరిత్రకు నందినంతవఱకు వీరివంశము లయిదు కానవచ్చుచున్నవి.

1. మొదటిది వాతాపి (బాదామి) యను పట్టణము రాజధానిగాగల వంశము. వీరు రమారమిగా క్రీ-శ-550 మొదలు 750 వఱకు (200) రెండువందలయేండ్లు రాజ్యము చేసిరి. ఈ వంశమే మిగిలినయన్నివంశములకును మూలమని చెప్పవచ్చును.

2. రెండవ వంశమువారు తూర్పు మున్నీరుకాపు (తూర్పుచాళుక్య) లను పేరుతో రాజమహేంద్రవరము రాజధానిగా 610 మొదలు 1100 వఱకు రాజ్యమేలిరి.

3. మూడవ వంశమువారు కన్నడ దేశమందలి కల్యాణ పట్టణము (దీనినే కటకమనుచుండిరి), ఈపట్టణము నైజాము

రాజ్యమునందుగుల్బర్గజిల్లాలోనున్నది. రాజధానిగా రమారమి 980 మొదలు 1200ల వరకు రాజ్యముచేసిరి. మొదటివంశము వారిని మూడవవంశమువారిని కలిపి అనగా ఈరెండువంశముల వారిలో విశేష విభేదము చేయక ఉభయులను పశ్చిమ చాళుక్యులనియు చరిత్రకారులు వ్యవహరించియున్నారు.

4. నాల్గవశాఖయు, ఐదవశాఖయు గుజరాత్ దేశము నేలిన చాళుక్యులు నాల్గవవంశమువారు 600 మొదలు 750 వఱకు నున్నతిదశలో నున్నట్టు కానవచ్చుచున్నది.

5. అయిదవ శాఖవారు, సోళంకులుఅను పేరిట "అన్హిల్ వాడ" పట్టణము రాజధానిగ 941 మొదలు 1143 వఱకు దొరతనము చేసిరి.

కొందరు చాళుక్యులు సోళంకులన్న పేరిట రాజపుత్ర స్థానమునందును, బుందేల్ ఖండమునందును చిన్నచిన్న సంస్థానములను సంపాదించుకొనిరి.

చిన్నచిన్న సంస్థానికులుగా అఱవదేశమునందున్నటుల శాసనములవలన దెలియుచున్నది.

కన్నడదేశమునందుఁగూడఁ దరువాత కాలమున నీచాళుక్యులు (మున్నీరుకాపులు) చిన్నచిన్న జమీందారులుగ నున్నట్లు కానవచ్చుచున్నది.

ఇఁక వీరందఱిఉత్పత్తినిగురించి విచారింపగా వీఱంద రును దక్షిణదేశపువారె యనియు, వీరిలోనుండి కొందరు

దక్షిణమునుండి యుత్తరమునకు బోయిరేగాని, ఉత్తరము నుండి దక్షిణమునకు రాలేదనియు వారి చరిత్రములును శాసనములును స్పష్టముగా నుద్ఘోషించుచున్నవి.

మొదటివంశమువారగు వాతాపిచాళుక్యులు కన్నడ దేశజులని వేరుగ జెప్పనక్కరలేదు. వారి రాజధాని కన్నడ దేశమం దుండుటవలనను వారిచ్చిన కొన్ని శాసనములు కన్నడమునందుండుటవలనను, మిగిలినవి సంస్కృతమునందు మాత్రముండి ఇతర భాషలలో లేకపోవుటవలనను, వారికి మహారాష్ట్ర దేశముమీద కొంత యధికారమున్నను, అచ్చట వారిచ్చిన శాసనములు మహారాష్ట్రమునందు వ్రాయక పోఁగా సంస్కృతశాసనములు గూడ వారు కన్నడాక్షరము లతో వ్రాయించుటవలనను వారి మాతృభాష కన్నడ మనుటనొప్పును. తా ముత్తరదేశమునుండి వచ్చితిమని వా రెచ్చటను తమ శాసనములందు చెప్పుకొనియుండలేదు.

ఈబాదామిచాళుక్యులు మహారాష్ట్రులని కొందఱు వ్రాసియున్నారు. మహారాష్ట్రులయినను దాక్షిణాత్యులేగాన నావాదమునకు నేమియుభంగములేదు. కాని, మహారాష్ట్రులా, కర్ణాటకులా యనినచర్చకు జవాబు(ప్రత్యుత్తరము)గా కర్ణాట కులే యని చెప్పవలసియున్నది. ఇందుకింకను ప్రమాణము కావలసినవారు రాష్ట్రకూటరాజై నదంతిదుర్గుడనువానిసమాన

గడతామ్రశాసనము జూడనగును. (Ind, Ant. Vol. XI, p.114) ఇది శా-శ. 67౫ నాటిది. ఈరాజు బాదామి వంశమును జయించినవాఁడు.

ఆ రాజుకూడ తాను జయించిన చాళుక్యులు (మున్నీరు కాపులు) కర్ణాటులని యా శాసనమునందు స్పష్టముగ జెప్పెను.

ఇట్లు శ్రీహర్షుని నర్మదానదియొద్దున నడ్డగించిన పులకేశి కర్ణాటకుడని సమకాలమువారి యభిప్రాయ మను టకు సందేహము లేదు.

ఇఁక రెండవచాళుక్య (మున్నీరుకాపు) వంశమువారైన తూర్పుచాళుక్యులు వాతాపిచాళుక్యులలో నుండియే చీలిన వారని సర్వవిదితము.

పశ్చిమచాళుక్యరాజైన రెండవపులకేశియు,

తూర్పుచాళుక్యవంశస్థాపకుఁడైన కుబ్జవిష్ణువర్ధనుఁడును అన్నదమ్ములు.

అట్లే నాల్గవవంశమని పైని చెప్పఁబడినదియు గుజ రాతుదేశమునందు రాజ్యమేలినదియు నగు చాళుక్యవంశము నకు మూలపురుషుఁడు రెండవ పులకేశికి దమ్ముఁడు.

మూడవవంశమువారైన కల్యాణిచాళుక్యులును మొ దటివంశమునుండి పుట్టినవారే. ఈ రెండువంశములకుం గల

సంబంధము ఫ్లీటుగారి గ్రంథమునందు 379 వ పుటలో నియ్యఁబడినది. ఇది కౌతేయము తామ్రశాసనమునుండి ఎత్తి వ్రాయబడినది. చూడనగును.

ఇఁక మిగిలినవారు అన్హిల్‌వాడ రాజులైన సోళంకి నృపతులు. వీరును పశ్చిమ చాళుక్య రాజవంశములోని యొక పురుషునిసంతతివారని చరిత్రకారులు జెప్పుచున్నారు. రాజపుత్రస్థానచరిత్ర వ్రాసిన కర్నల్‌టాడ్ ఇట్లు వ్రాయుచున్నాడు.

They are princes of Kalian on the Malabar Coast, which city still exhibits vestiges of ancient grandeur. It was from Kalian that a scion of the Solanki tree was taken and engrafted on the Royal stem of the chauvuras of Anheelwar Patan, Vol. I, P. 21.

"వారు కళ్యాణరాజపుత్రులు. ఈ పట్టణ మిప్పటికిని తన పూర్వవైభవమును సూచించుచు మలబారుతీరమున నున్నది. ఇచ్చటి రాజులను వృక్షమునుండి యొక కొమ్మ తెచ్చి అన్హిల్‌వాడపట్టణపు రాజవృక్షముపై నంటు నాటనైనది" అని పై దాని కర్థము.

రాజపుత్రస్థానమందలి సోలంకీలు గుజరాతుసోలంకీల నుండి యుద్భవించినవారు. ఇందులకు గొన్ని యుదాహరణ

ములు రాజపుత్రస్థానము నంటుకొని 'టానవాడా' అను సంస్థానమొకటి గలదు. ఇదియిప్పటి బొంబాయిరాష్ట్రములో జేర్పఁబడ్డనది. ఇచ్చటిరాజు సోళంకియే అన్హిల్‌వాడా సోళంకీలలోనివాఁడు.

The chief is descended from a Rajaput dynasty that ruled at Anhilwada Patan........the chief Maharana is a Hindu of the Solanki Rajput class. (Imperial Gazetteer of India.)

"ఈరాజు అన్హిల్‌వాడపట్టణమున రాజ్యముచేసినవారి వంశజుడు. ఈ మహారాణా సోలంకివంశమువాఁడు" అని దీని కర్థము.

మధ్యహిందూస్థానమునందు 'రీవా' యని యొక రాజపుత్రస్థానము కలదు. అచ్చటివారు సోళంకులలోని భగల్ లేక భాగల్ అను శాఖవారును గుజరాతునుండి వచ్చిన వారే.

The chiefs of Rewah or Baghul Rajputs descended from the Solanki clan which ruled over Guzerat from the 10th to 13th century. (Imperial Gezetteer of India)

"రీవారాజులు (భగల్ రాజపుత్రులు) గుజరాతు దేశమునందు 10 వ శతాబ్దమునుండి 13 వ శతాబ్దము వఱకు

రాజ్యముచేసిన సోళంకివంశమునుండియే వీరి యుత్పత్తి" అని యర్థము.

ఇట్లు ఉత్తరహిందూదేశమునందలి సోళంకుల పూర్వ చరిత్రము పరీక్షించినయెడల వారందరును గుజరాతునుండి వచ్చినవారని స్పష్టముగా దేలుచున్నది. గుజరాతుసోళం కులు కన్నడ చాళుక్యుల (మున్నీరుకాపుల) లోనుండి చీలిన వారని ఇదివఱకే తెలిసియున్నాము. ఈలాగున చాళుక్యు లెచట నున్నను దక్షిణమునుండి యుత్తరమునకుఁ బోయిన వారుగాఁ గానవచ్చుచున్నారే గాని యుత్తరమునుండి దక్షిణ మునకు వచ్చినవారుగా నే చరిత్రవలనను గానరారు.

ఇఁక వీరి కొన్ని శాసనములలోను గ్రంథములలోను ఈయబడిన వీరియుత్పత్తికి సంబంధించినగాథలను ఉత్తరము నుండి వచ్చినవారనిన గాథలను పరీక్షించెదము.

వాతాపిచాళుక్యులు (మున్నీరుకాపులు) తాము ఉత్తర మునుండి వచ్చితిమని ఎచ్చటను ఎన్నడును చెప్పుకొనియుండ లేదు.

ఉత్తరపుగాథ అనఁగా అయోధ్యనుండి వచ్చితిమన్న కథ మొదట (10) పదవశతాబ్దములో పూర్వచాళుక్యులలో పుట్టినది. ఈయది మొదట రాజరాజుతండ్రియయిన విమ లాదిత్యుని రణస్థిపూండిశాసనములోఁ గానవచ్చును. ఈయది

క్రీ. శ. 1011 వ సంవత్సరపునాటిది. చాళుక్యుల మొదటి శాస నము 550 ప్రాంతపుది. కావున ఈవంశము రాజ్యమునకు వచ్చినతర్వాత రమారమి 500ల యేండ్లవఱకును ఈ గాధ ఎవరునెఱుఁగరు. ఈగాధ చెప్పటలో తమ వంశము చంద్ర వంశమని చెప్పుకొనిరి. చంద్రవంశమునకును, అయోధ్యకును ఏమిసంబంధము? అయోధ్య ఎప్పుడును సూర్యవంశజుల రాజ ధాని. అచ్చట చంద్రవంశజులేలినట్లు పురాణములలో లేదు. చరిత్రములలోను గానరాదు. కావున నది యొక యసంగత మైన గాధ. అసంగతమైనను సుసంగతమైనను యితర చాళు క్యుల గాధలతోఁ గలియుటలేదు.

కల్యాణచాళుక్యులలో గొప్పరాజైన విక్రమాంక దేవునిం గుఱించి బిల్హణుఁడను కవి విక్రమాంకదేవచరిత్ర మను ఒక కావ్యమును రచించెను. అందుఁ జెప్పఁబడిన చాళు క్యోత్పత్తికథకును పై శాసనాలలో చెప్పఁబడినకథకును సంబం ధము లేదు.

రణస్థిపూండిశాసనమునందును దాని ననుసరించి వ్రాయఁబడిన నందంపూఁడిశాసనమునందును బ్రహ్మకు అత్రి అత్రికిఁ జందుఁడు పుట్టినట్లు చెప్పి అప్పటినుండి పాండవులవఱ కును, తర్వాత ఉదయనునివఱకును వంశము చెప్పఁబడినది.

ఉదయనునినుండి ఏఁబదితొంబదితరములవా రయో

ధ్యలో రాజ్యము చేసిరట. పిదప విజయాదిత్యుఁడను రాజు దక్షిణాపథమునకు వచ్చి త్రిలోచనపల్లవునిచే నిహతుఁడయ్యె నట. అతనిభార్య గర్భవతి విష్ణుభట్టసోమయాజిచేఁ గాపాడఁబడి విష్ణువర్ధనుడను కుమారునిఁ గనెను. ఆతఁడు చళుక్యపర్వతముమీఁద తపస్సుచేసి, నందాదేవివరప్రభావమువలన పల్లవునిఁ జంపి సేతునర్మదామధ్యస్థమగు సార్ధసప్తలక్షణదక్షిణాపథము నంతయు నాక్రమించెను. చళుక్యపర్వతముపై తపస్సు చేయుటవలన నాతనికి చాళుక్యుడన్న పేరు వచ్చెను. ఇది ఈశాసనమునందుగల పూర్వచరిత్రభాగమునకు సారాంశము. ఈ శాసనములు వ్రాసినవారి మతమున ఉత్తరదేశమందున్నంత వఱకు ఈ రాజవంశమునకు చాళుక్యులన్న పేరు లేదు. దక్షిణదేశమునకు వచ్చినతరువాతనే యాపేరు వచ్చెను.

ఇఁక విక్రమాంకదేవుని యాస్థానకవియైన బిల్హణుఁడేమిచెప్పునో చూతము. ఒకదినము బ్రహ్మదేవుఁడు సంధ్యావందనము చేసికొనుచుండఁగా నచ్చటికి నింద్రుఁడు వచ్చి ప్రపంచమునం దంతటను పాపము హెచ్చగుచున్నదని మనవి చేయఁగా బ్రహ్మ తన చులుకము (పుడిసిలి) వైపు చూచెను. అందుండి యొక క్షాత్రతేజముగల పురుషుఁడు పుట్టెను. వాఁడు చులుకములోనుంచి పుట్టినవాఁడు గనుక చాళుక్యుడాయెను. వాడయోధ్యలో రాజ్యమేలెను. కొంత

కాలమైనతరువాత నావంశమునందు హారీతమానవ్యులను వారు పుట్టిరి. ఇట్లు రెండుకథలకును ఏవిధమైనసంబంధము లేదు. ఈ కథప్రకారము చాళుక్యులు చంద్రవంశజులు కారు. సూర్య వంశజులునుకారు. అగ్నికులజులునుకారు. వారిమూలపురుషుడుఁ బ్రహ్మమానసపుత్త్రుఁడు. ఆయనకే చాళుక్యుడన్న పేరున్నది. కనుక యది దక్షిణమునకు వచ్చినతరువాత రాలేదు. వంశము పుట్టినతోడనే పుట్టినది దానికి చాళుక్యపర్వతమునకును యేవిధమైన సంబంధము లేదు. రణస్థపూండిశాసనవంశము నందు మానవ్యహారీతులు లేరు. ఈ గ్రంథవంశమునందు పాండవాదులు ఉదయనాదులు కానరారు.

క్రీ. శ. 1025 వ సంవత్సరమునాటి ఇంకొక పశ్చిమ చాళుక్య శాసనమునందు బ్రహ్మకుమారుడు స్వాయంభూమనువు, వానికొడుకు మానవ్యుడు, వానికొడుకు హారీతి, వానికొడుకు పంచశిఖహారీతి, వానికొడుకు చళుక్యుఁడు, వాని సంతతివారే చాళుక్యులని యున్నది. ఇట్లు చాళుక్యవంశోత్పత్తిని గురించియు, చాళుక్యశబ్దార్థమునుగురించియు శాసనములును గ్రంథములును పరస్పరవిరుద్ధమైనగాథలు వ్రాయుట చూడగా వీరు క్రొత్తగా రాజ్యమునకువచ్చిన దాక్షిణాత్యులనియు అంతకు పూర్వచరిత్రము వీరికేదియు లేదనియు క్షత్రియులమని చెప్పు కొనవలెనన్న కోర్కెమాత్రము వారికి గలదనియు వారి యొద్దనున్న పండితుల యిష్టప్రకారము చళుక్యశబ్దమునకు

వ్యుత్పత్తియు, దానికి దగినట్లు గథలును కల్పింపబడెననియు స్పష్టమగుచున్నది.

దక్షిణములోని చాళుక్యులగాథ లిట్లుండగా నుత్తరము నందలి చాళుక్యులనఁగా సోళంకులు తాము అగ్నికులక్షత్రియులమని చెప్పుకొనసాగిరి.

పవార్ (ప్రమార) పరిహారి (ప్రతిహార) చౌహాణ్ (చాహుమాన), సోలంకి (చౌళుక్య)- ఈనాల్గు (4) క్షత్రియ జాతులును అగ్నికులక్షత్రియజాతులని రాజపుత్రస్థానమం దనియెదరు.

ఆబూపర్వతముమీఁద వశిష్ఠుఁడు అగ్నికుండము స్థాపించి రాక్షసవినాశనమునకై తగిన పురుషుల నీయుమని శివుని గోరగా పైన పేర్కొనబడిన నలుగురుపురుషుల నిచ్చె నట. వారిలో చులుకమునందుండి పుట్టినవాఁడు చాళుక్యుఁ డయ్యెను.

పై గాథ లన్నియుఁ జూడ వీరు మొదట క్షత్రియులు కారనియు, ప్రభుత్వము పెరిగినకాలఁదిని ఎవ్వరికి దోచిన గాథలను వారు కల్పించుకొని క్షత్రియులమని చెప్పుకొన దొడఁగిరనియు తేలుచున్నదనిరి.

ఇఁక వీరి "మానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశిక వరప్రసాదలబ్ధ రాజ్యాణాం" అను బిరుదములవలన

నైనను వీరి పూర్వోత్తరమేదియైన కనుగొనిమెదమన్న నా బిరుదము లన్నియును వీరు వీరికంటె బూర్వము రాజ్యము చేసిన కదంబులయొద్దనుండి తీసికొనినవిగాని క్రొత్తవి కావు. కదంబులను కొట్టి రాజ్యము తీసికొనినట్లే వారిబిరుదములను కూడ వీరు లాగుకొనిరి. కావున నంతకుపూర్వము చాళుక్య తెగకు బ్రముఖతగాని రాజ్యముగాని బిరుదముగాని ఉండె ననుటకు నాధారములు లేవనిరి.

## సల్కి చాళుక్యశబ్దవిచారము.

చాళుక్యులుత్తరదేశమువారు కారనుటకు వారిపేరొక సూచకమై యున్నది. వారిమూలనామము దేశ్యమైన సలుక్కి లేక సల్కి అనునది. వీరికి రాజ్యమువచ్చి తాము క్షత్రియులమని చెప్పుకొనఁదలఁచి నప్పుడు వీరు దానికి సంస్కృతీకరణము గావించి చలుక్య, చాలుక్య, చౌలుక్యరూపములఁ గల్పించిరి. ఇట్లు దేశ్యశబ్దములను సంస్కరించి వానికి సంస్కృతదుస్తులను కట్టుట యప్పటినుండి ఇప్పటికాలమువఱకును జరుగుచునే యున్నది. బందరును బృందావనపురము జేసిరి. సులతానును సురత్రాణుని గావించిరి. ముసియనువఱు క్రీ. శ. 1908 లో హైదరాబాదుపట్టణమును ముంచివేసెను. అప్పుడా నదియొకరు మహాత్యముహెచ్చి అది ముచికుందానది అయ్యెను. దానికి భాగవతము నందలి ముచికుందునితో బంధుత్వము కలిపిరి.

కావున నిట్టి సంస్కృతీకరణములు మనకు నూతనములు కావు. ఇఁక సలుక్కి-చాళుక్యశబ్దచరిత్రములను కొంత విచారింతము.

ఈదిగువ నీయబడినపట్టికలో శాసనాధారములను బట్టి చలుక్కి, సల్కి రూపముల పురాతనత్వము తెలియగలదు.

మున్నీరు(చాలుక్య) కాపువంశజుల శాసనాధారములు.

| | కాలము | రూపము | ప్రమాణము. |
|---|---|---|---|
| 1. | 709 | చలికి | కొక్కిలిమహారాజుతామ్రశాసనము |
| 2. | 739 | చలుక్కి | గుజరాతులోని చలుక్యరాజైన అవని జనాశ్రయుని శాసనము |
| 3. | 850 | సలుక్కి | గుణగవిజయాదిత్యుని గుంటూరుశాసనము |
| 4. | 850 | సలుకె | గుణగవిజయాదిత్యుని సాతులూరుశాసనము |
| 5. | 892 | సల్కి | ప్రథమచాలుక్యభీముని అత్తిలిశాసనము |
| 6. | 900 | చళ్కి | విక్రమ చోళమహారాజునాటి శాసనము |
| 7. | డిటో | సళ్కి | డిటో |
| 8. | 930 | సళ్కి | యుద్ధమల్లుని శాసనము |
| 9. | 11 శతా. | శలుక్కి | విష్ణువర్ధనమహారాజుశాసనము |
| 10. | 13 శతా. | చలుక్కి | నారాయణమనుమసిద్ధిశాసనము |

ఇది చల్కి, చలుక్కి అనినరూపములతోనైన నుండ వచ్చును. ఏకకాలమందు చల్కి, సల్కి రూపములుండుటయు నసంభవముకాదు. చకారము సకారముగా మారుటయు సకారము చకారముగ మారుటయు సన్నిభాషలలోనుగల మార్పే. ఇందు వింత ఏమియు లేదు. అందరు ఉత్పత్తిశాస్త్రజ్ఞులును

ఒప్పినవిషయమే. దీనికి ప్రమాణము లక్కరలేదు. కాని ఇందునుగురించి ఏమియు నెరుఁగనివారు ప్రమాణముల నపేక్షింతురు. కావున వారికినై కొన్నియుదాహరణముల నిచ్చెద.

తెలుఁగులో రెండురూపములుగల శబ్దములను గొన్నింటిని నుదహరించెద.

చాగు, సాగు; సను, చను; చలుపు, సలుపు; చావు, సావు; సంపెఁగ, సున్నము, సవరము, చారు, సావడి.

ఇట్లు చలుక్కి, సలుక్కి, చల్కి రూపములును, వాని మారుఉచ్చారణ లనఁదగు సలుక్కి, సలుకి, సల్కి రూపములు మిక్కిలి పురాతనకాలమునుండి అనఁగా చాలుక్యుల మొదటివంశమునాటినుండియు, 14-15-వ శతాబ్దములవరకుఁ గానవచ్చుచున్నవి. ఇంతియకాదు, అన్ని దేశములలోను గానవచ్చుచున్నవి.

చాళుక్య లెచ్చటికిఁబోయినను అది యచ్చట గానవచ్చును. అఱవదేశమున, కన్నడదేశమున, తెలుగుదేశమున మరియు గుజరాతుదేశమున ఈరూపములు కానవచ్చుచున్నవి.

ఇది వింతకదా! ఇది మూలరూపము కానియెడల చాళుక్య (చళిక్య)లవెంట సర్వత్ర ప్రసంగించుట యెట్లు సంభవించును? "చలుక్కి"లోని "చ" అనునది "స"గ మారుటయు పదమధ్యాక్షరములోని ఉకారము లోపించుటయు

"క్కి" లోని రెండు కకారములలో నొక్కటి లోపించు టయు,—అనుమార్పులు పెద్దవికావు, వింతలును కావు, సర్వ సాధారణమైనవి. కావున,

చలుక్కి - సలుకి - సల్కి శబ్దములలో నేది యైనను మొదటినుండి వచ్చుచున్న దనుట సిద్ధము. పై జాతివారు చకారమును క్రిందిజాతివారు సకారమును ఉచ్చరించుట సహజమే.

ఇటు "సల్కి" శబ్దము మొదటినుండియు అసాధారణ మైన యేమార్పు లేక యుండెనని తెలిసికొని, ఇఁక సంస్కృత మనుకొనబడు "చాలుక్య" శబ్దచరిత్రము జూతము.

## 'చాళుక్య' శబ్దచరిత్రము.

చరిత్రకారులు సాధారణముగా నన్నివంశముల చాళుక్యులను 'చాళుక్యులు' అను దీర్ఘచకారపూర్వకముగా వ్రాయుచుండుటవలన నీశబ్ద మీరూపముతోడనే మొదటి నుండియు నుండెనని కొందఱు భ్రమపడవచ్చును. కాని యది తప్పు. ఈశబ్దము సంస్కృతమువలె గానబడవలెనని యెన్నియో సంస్కారములను గనినది.

ఇయ్యది మూలరూపము కాదనియు సంస్కృతీకరణ రూపమనియు జెప్పుటకు నింతకంటె వేఱు ప్రమాణ మక్కర లేదు. ఇఁక నీసంస్కరణములను కాలానుక్రమముగ విచారింతము.

1. చల్కౄ (క్రీ-శ. 5వ శతాబ్దము). ఇయ్యది మొదటి

సంస్కృతీకరణరూపము. ఇది 'చల్కి' యను దేశ్యపదము నకు సంస్కృతకృత్రిమరూప మనుట స్పష్టము. ఇదియుగాక, మధ్యాక్షరములోని ఉకారము లోపించిన రూపముగూడ మొదటినుండియు యుండెనని దీనివలన మన మూహింప వచ్చును. "చల్కేరపత్య" మనియో, "చల్కస్యపత్య" మనియోయర్థము చేసికొని యణ్ ప్రత్యయము పెట్టగా నీరూపము సిద్ధించినదని తలంచిరి. "యాజ్ఞవల్క్య"ది శబ్దము వలె నిదికూడ సంస్కృతశబ్ద మయ్యెనని సంతసించిరి.

Badami cave Inscription Ind, ant Vol. 1 page 363

2. చలిక్య (ఆఱవశతాబ్దముచివర, ఏడవశతాబ్దము ప్రారంభమున నీరూపము బాగుగలేదని తలంచి మంగళేశుని కాలమున, "చలిక్య" రూపమును గడించిరి.

Ind Ant, Vol. XIX Page 16

3. 'చలుక్య' అన్నియెడలను 'ల' కార 'ళ' కారము లను భేదములేక వాడిరి. గనుక 'ళ' కారరూపముల దేవ తేన చెప్పనక్కరలేదు. అది అంతటకు ఉన్నవనియే తెలియుచున్నది.

7వ శతాబ్దములో అదియు బాగుగ లేదని చివరకు రెండవపులకేశికాలమున "చలుక్యరూపము" సిద్ధమాయెను. ఇటుతరువాత నీరూపమే వాతాపిచాలుక్యుల యన్ని శాసన ములలోను గానవచ్చును.

చకారమునకు దీర్ఘముగల చాలుక్యరూపము వారి ఏశాసనమందును గానరాదు. ఇంతియకాదు. తూర్పుచాళుక్య

శాసనములు పరీక్షించినను (9-వ శతాబ్దమువఱకును వారి యన్ని శాసనములలోను "చళుక్య" రూపమె గానవచ్చును.) "చాళుక్య" యను దీర్ఘరూపము మొట్టమొదట కలివిష్ణువర్ధనుని (843-844) అహాదనగరశాసనమునందు గానవచ్చును. ఇయ్యది పూర్వపశ్చిమచాళుక్యుల పెక్కుశాసనములను ప్రకటించిన డాక్టరు ఫ్లీటుగారి మతము.

ఫ్లీటుగారు వ్రాసిన తరువాత ప్రకటింపఁబడిన పూర్వపశ్చిమ చాళుక్యులశాసనములను నేను శ్రద్ధతో పరీక్షించితి. ౯వ శతాబ్దమునకు పూర్వపువానిలో "చాళుక్య" యను దీర్ఘరూప మెచ్చటను గానరాదు.

4. చాళుక్య (9వ శతాబ్దము) ఈ రూపమును కల్యాణపురవంశమువారును 9 వ శ తా బ్ద ము తరువాత బూర్వచాళుక్యులును యథేచ్ఛముగ వాడిరి. "చలుక్య" యనునది సరియయిన సంస్కృతీకరణము కాదనియు యాజ్ఞవల్క్యశబ్దమునందలి మొదటి యికారమునకు వృద్ధివచ్చినట్లు చాళుక్యపదములోని మొదటి చకారమునకు వృద్ధి రావలయుననియుఁ దలచి సంస్కృతీకరణమునందు ఈ శబ్దమును ఇంకొక మెట్టెక్కించి యప్పటి పండితులు చాళుక్యరూపమును సాధించిరి. తరువాతి వారీరూపమునే ఎక్కువగా వాడినను పూర్వపు 'చలుక్య' రూపముగూడ నచ్చటచ్చట తలచూపుచునే యుండెను.

5. "చౌలుక్య" ఈ శబ్దసంస్కార మింతటితో నాగినది కాదు. సంస్కృతమున 'చల్క, చల్కి' శబ్దములు లేవు. లేని

శబ్దములనుండి "చలుక్య"గాని, "చాలుక్య"గాని పుట్టుట యెట్లు? అనితలంచి పశ్చిమచాళుక్యులపండితులును, గుజరాతు చాళుక్యులపండితులును, "చులుకము"నుండి పుట్టెనన్న గాథ యొకదానిని గల్పించిరి. వారికి చాళుక్యరూపము సాధువుగఁ గన్పింపలేదు. చులుకమందలి మొదటి ఉకారమునకు వృద్ధి వచ్చినయెడల "చౌ"కావలయునేగాని "చా" ఎట్లగు? కావున దిద్దుదిద్దుమని "చ"కు ఔత్వమిచ్చి చాలుక్యులను "చౌలుక్యులు" గావించిరి.

5వ వంశమువారగు గుజరాతులో సోళంకీలు ఈ రూపమునే విశేషముగ వాడిరి. ఇట్టిశబ్దము చల్క్య, చలిక్య, చలుక్య, చాళుక్య, చౌలుక్య యను అవతారముల నెత్తుచు, పూర్తిగ సంస్కృత వేషమును ధరించితినని తలంచెను. ఈ మార్పులవలననే యియ్యది మూలరూపము కాదనియు, దేశ్యశబ్దమునకు నలంకారములుపెట్టి ప్రాయశ్చిత్తము లొసంగి సిద్ధముచేయఁబడిన కృత్రిమసంస్కృతికరూపమనియు స్పష్టముగా దేలుచున్నది.

దేశశబ్దములకు, తద్భవ శబ్దములకు భిన్నకాలములందును, భిన్న దేశములందును భిన్నరూపములుండుట కలదు. కాని సంస్కృతశబ్దముయొక్క రూపము లిట్లు మారుట యెచటనైనను కలదా?

ఆమారుటలోను ఒకశబ్దమునకంటె మఱియొకశబ్దము కఠినమైనదిగా మారుట గొప్పవింత. కావున "చల్కి" శబ్దము

దేశ్యము; "చాళుక్య" శబ్దము పండితనిర్మితము అనుటకు సందేహము లేదు.

చాళుక్యులగురించి క్షత్రియులని వ్రాయఁబడియున్నను పండితులకు వారి క్షత్రియత్వమును గుఱించి సంశయముండి నట్లు తోఁచుచున్నది.

బిల్హణుఁడు విక్రమాంక దేవచరిత్రమునందు ఈవంశా భివృద్ధిని గుఱించి వ్రాయుచు ఇట్లనుచున్నాఁడు :—

"క్రమేణ తస్మాదుదియాయ వంశః
శౌరేః పదాద్గాంగ ఇవ ప్రవాహః" (1-57)

తా॥ విష్ణుపాదమునందు బుట్టిన గంగాప్రవాహము వలె అతనివలన నావంశము క్రమముగా వృద్ధిచెందెనని కవి చెప్పుచున్నాఁడు. పైకిచూడ గంగతో పోల్చుట పవిత్రతను సూచించును.

## ఇంకొక ప్రబల ప్రమాణము.

బ్ర॥ శ్రీ॥ కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, ఎం. ఏ. గారు వ్రాసియున్నారు. అఱవమునందు "దివాకరమ్" అను పేరుగల కోశము గలదు. ఇది 9,10 వ శతాబ్దప్రాంతముది. ఇది యింతకంటెను ప్రాచీనమని చెప్పువారును కలరు. ఇందు "చళిక్య వెందర్" "మున్ వెళ్ కుల అరసర్" (మున్నీరు కాఁపు) అను పదములు పర్యాయపదములుగ నీయబడినవి. "చళిక్యరాజులు" "మున్ వేళ్ కులనృపతులు" అనియీ పదముల

కర్థము. అనగా ఆకాలమున చాళుక్యులు వేళ్ కులమువా రన్ననమ్మికక యుండెననుట స్పష్టము. వేళ్ కులమువారిని ఇప్పుడు "వెల్లాల్ లేక మర్ వెళ్లాళమై (మున్నీరుకాపు)" లందురు. వీరుత్తమశూద్రులు, తెలుగులోనిమున్నీరుకాపులు. మరియువెలమవారు కన్నడములోని వక్కలగర్ మొదలయిన జాతులు మర్ వెళ్ జాతులనియే చెప్పవలెను. వీరందరును మొదట నొక్కజాతివారే కాని దేశభేదములబట్టి పేళ్లు మారుట సంభవించినది.

మరియు "దివాకరమ్" అను కోశమున నే కవిసార్వభౌముడగు కనకసభాయి 1800 సంవత్సరములకు ముందే (అనగా తాను నిఘంటు రచించుటకుముందు యని యర్థము) ప్రపంచములో ద్రవిడదేశమున సేద్యముచేయు వారగు ఈ మున్నీరుకాపువారు గొప్ప గౌరవనీయులు, శ్రీమంతులు, భూపతులు, సర్వజనులలో శ్రేష్ఠులని వ్రాసియున్నాడు. వీరికి వెల్లాలార్ (నిండియుండిన నీటికి ప్రభువులు) యను నొక పేరు కలదు. కరలార్ (మేఘాధిపతులు) యను మరియొక పేరు కలదు. ఈ జాతివారికి మున్ను నీటివిషయమైన వివరణము శాస్త్రోక్తముగ తెలిసియుండుటచే (మర్ - నీరు) మున్నీరుప్రభువులనియు, మర్ వెల్లం-మున్నీరు - అనమాయ్- కార్యనిర్వాహకుడు - (కాపు) మున్నీరుకాపు వీరిని వెళ్లాన్మై వారని అఱవమున యందురు. వీరినే "మున్ వెళ్ కుల అరసర్" చళిక్యవెందర్ అనగా మున్నీరుప్రభువులు (మర్ వెళ్ కులనృప

తులు) చాళుక్యరాజులని ఈ పదముల కర్థము అఱవమందలి "దివాకరమ్" అను పేరుగల కోశమున గలదు.

పై కోశమునందలి పర్యాయపదములనుగురించి బ్రి. శ్రీ. కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు, ఎం. ఏ గారును, Mr. E. Thurston C. I. E. గారును వ్రాయుచు అందుగల పదములకు సహా అర్థమును వ్రాసియుండుటచే కృతజ్ఞతావందనము లాచరించుచున్నాఁడను.

దీనినిబట్టి చాళుక్యులు మొదట దాక్షిణాత్య ఉత్తమ శూద్రజాతి (మున్నీరుకాపు) వారనియు, రాజ్యము వచ్చినతరువాత క్రమముగ క్షత్రియత్వము జెందిరనియు స్పష్టమగుచున్నదనిరి. ఏకాధ్వరముగ పెక్కువందలసంవత్సరములవఱకు తెనుఁగు దేశమును, కర్ణాట దేశాదులను, దక్షిణదేశమునందలి పాండ్య దేశమును ఏలి సమ్రాట్ శ్రీహర్షుని పారదోలిన చాళుక్యులు (మున్నీరుకాపులు) క్షత్రియులు కానియెడల మఱియెవరు క్షత్రియులు? అని వెంబడే తమ అభిప్రాయము పంతులవారే నొసగిరి.

## నైజాం రాజ్యమందలి గంగాపురము.

గంగాపురము బహుచారిత్రికప్రాముఖ్యత వహించిన యొక స్థలము. ఇది ప్రస్తుతము జెడిచెర్ల గుల్లపల్లి యను రెండు రైలుస్టేషనులకు సమీపమున నాల్గు (4) మైళ్ళదూరమున నున్నది. ప్రతివత్సరమును వేలజనము నాకర్షించు జాతర

గలదై యుండియు నభివృద్ధియం దెంతయో వెనుకబడి యున్నది.

గంగాపురము బహుపురాతన కాలమునుండి ప్రశస్తి ననుభవించినదని తెలుపుటకు స్థానికులు "మయూరపురీ, 'మత్స్యపురీ' 'దురితకోలాహలం' "కలియుగే గంగాపురీ" యను వాక్యముల నుడువుచుందురు. దీని నాధారముగా జేసికొని కొంద ఱీపట్టణమే కృతయుగమున మాయాపురి యనియు త్రేతాయుగమున మత్స్యపురియనియు ద్వాపరమున దురిత కోలాహలమనియు బ్రసిద్ధినొందెననియు, మఱియు కలియుగ మున గంగాపురినట్టుల ప్రసిద్ధిగాంచెనని యందురు.

కొన్ని శాసనములలిపిని బట్టి గంగాపురము (1500) పదునైదువందలయేండ్లనుండి ప్రాముఖ్యత నొందియుండెనని చెప్పవచ్చును.

గంగాపురము దత్పరిసరమునగల శాసనములలో బౌద్ధ స్థూపంబునసమీపమున నున్నవి గాక పెక్కులు వేయినుండి పదునొకండువందల (1000-1100) యేండ్ల క్రిందటివి. అవి క్రీ. శ. 800 లేక 900 మధ్య విజృంభించిన పశ్చిమచాళుక్య రాజుల సంబంధమయినవి.

ఇచ్చటి శాసనములలో దరుచుగ జగదేకమల్లచాళుక్య త్రిభువనమల్లచాళుక్యధరాధిపు లనేకుల బిరుదావళులతో గలవు. జగదేకమల్లచాళుక్యుడు (1100) పదునొకండవ శతా బ్దమున పశ్చిమచాళుక్యరాజధానియగు కోడూరు (కోడూరు

మహాబూబునగరము స్టేషన్) పురంబున రాజ్యమేలెనని తెలియుచున్నది. త్రిభువనమల్లదేవుడు యతనితరువాత బ్రసిద్ధుడయిన చాళుక్య రాట్పుంగవుడు. ఇతఁడు 12 వ శతాబ్దమునాటివాఁడు.

శాసనములన్నియు వీరును వీరి వంశీయులు నొనరించిన దానములసంబంధమయినవి. ఈ శాసనములందు గాకతీయరుద్రదేవునిచే నిహతుడైన తైలపదేవుని ప్రశంసయు కలదు.

శాసనములఁ బట్టి ఈ చాళుక్యరాజన్యుల చారిత్రిక విశేషాంశము లెరుంగుట కవకాశము గలుగకపోయిన చాళుక్యుల కాలమునందు గంగాపుర మెక్కుడు ప్రతిభగన్నదని మాత్రమూహింపవచ్చును. వీరిచే నిర్మింపఁబడిన యొక కేశవాలయము గ్రామమునకు పశ్చిమభాగమున గలదు. ఈ దేవాలయమును బట్టియే గంగాపురమునకు గేశవాపురమని యొక నామాంతరము గలదనెదరు

గంగాపురము చాళుక్యుల కాలములో బంచక్రోశాయతమయిన పట్టణమని యందురు ఈయూరిబొడ్రాయి సిరసవాడలో గలదనియు ఈ గంగాపురము నంటికొనియే మీనాంబరియను యేటొకటి పాఱుచుండును. దీనిప్రభావ మధికమనియందురు.

ఈ ఏటిపొడుగున శైవమతప్రియులగు చాళుక్యులు కోటి (10000000) లింగముల స్థాపించిరనియు కోటిలింగాలయని యీ యేటిదిగువభాగమున కందురు. ప్రవాహగర్భ

మున త్రవ్వినను లింగములు, సోమసూత్రములు, నందులు బయ ల్వెడలుననియు తెలియుచున్నది. కావున చాళుక్య (మున్నీరు కాపు)లు నైజామురాజధానియందొక శాఖవారు మాత్రము అచ్చటచ్చట రాజ్యము నేలినవారని దోపక బోదు. తత్కారణ ముచే యీ రాజకుటుంబములవారు ప్రచ్ఛన్న నామరూపము లతో ఈ రాజధానియందుండి ('చళిక్యవెందర్ ముర్ వేళ్ కుల అరసర్') చాళుక్యరాజులు పూర్వము 'ముర్'నీరు కులము వారు గావున తమ రాజ్యములు బోయినను తమ పూర్వనామమును వదలక 'మున్నీరుకాపు'వారమని దెలుపుచున్నారు. (గోల కొండ విభవసం॥ సంచిక క్రీ. శ. 1928)

'ఆంధ్రపత్రిక సాధారణనామసం॥ 90 వ పుట'

## జగన్నాథాలయము.

స్థలపురాణములో జగన్నాథస్వామి 318 సం॥లో వెలసి నటులు చెప్పబడినది. కాని రక్తబాహుని క్రూరత్వము వలన జనులు దమయిండ్లను వదలిపోయిరి. విగ్రహము చిలుకసముద్రములో దాచబడినది. నూటయేబదియేండ్లకుం బిమ్మట నొక హిందూపాలకుడు పరరాజులం బాఱదోలి విగ్రహ మునుం బ్రతిష్ఠించెను. గర్భాలయములో నాకారహీనములైన శ్రీకృష్ణ సుభద్రా బలదేవుల విగ్రహములు గలవు. విగ్రహా కారమును, వర్ణభేదభావమును నిచ్చోట బౌద్ధధర్మ వ్యాపక మును సూచించుచున్నవి. కొన్ని గ్రంథములందు జగన్నాథ స్వామి బౌద్ధావతారముగ వర్ణింపబడెను. పురాణములు,

దేవాలయము అనంగభీమునిచే గట్టింపఁబడినటులు వ్రాసి నను గంగవంశజుఁడైనచోడునిచే బండ్రెండవ శతాబ్దము నందుఁ గట్టింపఁబడినదనుటకు మంచి నిదర్శనములు గలవు. (చాళుక్యులకు చోడులతో సంబంధమైనపిమ్మట చోడులనిసహా పిలువబడుచుండిరి.) ప్రస్తుతము ఖురడారాజాగారు దానికి ధర్మ కర్తలు, అర్చకులు పండాలనబడుదురు.

దేశదేశములందును వీరిదూతలు గలరు. వారు యాత్రికులనుఁ దోడ్కొనివచ్చి వారినుండి విశేషధనమును స్వీకరించుచున్నారు

ఈపట్టణములో 50,000జనులు గలరు. జనులు ఓఢ్రులు. మాటలాడునది ఓఢ్రభాష.

## గుజరాత్.

దీనికి సౌరాష్ట్రమని పేరు. ఇచ్చట బ్రాహ్మణముల కాలములోనే యార్యులు వచ్చి నివసించిరి. క్రీ.పూ.4 వ-3 వ శతాబ్దంబులలో, జంద్రగుప్తాశోకరాజు లీరాజ్యమును బరి పాలించిరి. తరువాత నీరాజ్యము కనిష్కునిక్రిందికిఁ బోయె. కనిష్కుని యనంతరమున నచ్చటి షాహరాజులు స్వతంత్రు లైరి. షాహరాజుల యనంతరము వల్లభివంశజులు రాజు లైరి. భటార్కుఁడను వీరి మూలపురుషుఁడు క్రీ. శ. 460 లో రాజయ్యెను. ఈవంశజులు క్రీ. శ. 780 వఱకు రాజ్యము చేసిరి. అప్పుడే హుయెన్ స్యాంగు అనువాఁడు

సౌరాష్ట్రముఁ జూచె. అప్పుడు వల్లభపురమున సముద్రవర్తకంబుకతన లక్ష్మి తాండవ మాడుచుండెను. క్రీ.శ 780 వ సంవత్సరప్రాంతమున చాళుక్యవంశజులయిన రాజపుత్రులు దక్షిణమునుండి వచ్చి వల్లభివంశమును నాశ మొందించిరి. వీరు "అన్హిల్ వాడాపట్టణ" అనుపట్టణమును రాజధాని చేసికొనిరి. ఇంకొక రాజపుత్ర వంశజులు వచ్చి క్రీ.శ. 980 లో నీచాళుక్యులఁ దొలఁగించిరి. ఈవంశపురాజే మహమ్మదుగజినీ వచ్చినపుడు రాజ్యము చేయుచుండెను. అని బ్ర.శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, ఎం. ఏ. గారు రచించిన హిందూదేశ కథాసంగ్రహము ప్రథమభాగము క్రీ.శ. 1909, పుట 192 యందు గలదు.

'భారతి (సచిత్రమానసపత్రిక) క్రీ.శ. 1935 శ్రీయువ సం. చైత్రము 589వ పుట'

## సర్వలోకాశ్రయుడు.

అఖిలాంధ్రదేశమును పాలించిన చళిక్యనృపాలురలో గుణగవిజయాదిత్యుడు అందరికంటె కడుప్రసిద్ధుడు. అతని కాలమున చాళుక్యవంశమునకు కులవైరులగు రాష్ట్రకూటులు పెక్కుమారు లోడింపఁబడి భంగపాటు నొందిరి. ఐనను, రాష్ట్రకూటులకు చాళుక్యులతో సంబంధ బాంధవ్యము లుండెను. కృష్ణరాజు విజయాదిత్యునికి మేనమఱఁది. విజయాదిత్యునితల్లి శీలమహాదేవి కృష్ణరాజునకు మేనత్త.

చాళుక్యభీముడు రాజ్యాభిషిక్తుండు కాకుండ దాయాదులును, వైరిరాజులును విపర్యయము గలిగింపఁదొడగి పూర్ణముగ విఫలమనోరథులైరి.

పిమ్మట వారు నల్దెసలనుండివచ్చి, యాంధ్రదేశముపై బడి, చాళుక్య (చళిక్య) భీముని పదచ్యుతుని జేయదలపడిరి. అపుడు శత్రురాజులబలములనెల్ల ఖండించి, దాయాదకుల ద్రోహుల నందఱిని దేశమునుండి పాఱద్రోలి శత్రునిర్మూలనము గావించి రాజచాళుక్యభీముడు 'సర్వలోకాశ్రియ శ్రీ విష్ణువర్ధనమహారాజాధిరాజు' అను అభిషిక్తనామముతో క్రీ.శ. 892 వ సంవత్సరము మొదలు క్రీ.శ. 922 వఱకు అనగా (30) ముప్పదియేండ్లు అరిరాజభయంకరుడై, నిజ ప్రజానురంజకముగ, సుస్థిరైశ్వర్యముతో నీయావదాంధ్ర భూమిని సంరక్షించెను. ఇతఁడు చక్రవర్తిపదవితో భూచక్రము నేలినవాడు.

'సర్వలోకాశ్రయుండ పరచక్రభీమ పరగండరాక్షసుండ విక్రమధనంజయ వనితాభిరామ దుష్టకాలానలుండ భువనైకదీప ఆంధ్రక్ష్మాపాల రాజమకరధ్వజుండ అరి రాజభీషణుండ త్యాగమహార్ణవుండ విష్ణువర్ధనమహారాజాధి రాజ రాజపరమేశ్వర' అను బిరుదులుగలవాడు.

బంగారుజల పోతబోసిన వెండిబెత్తముల కటిస్థానమున నానఁకొనునట్లు బట్టుకొను కటికవారు సారెసారెకు బరాబరులు సేయుచుండ, కొందరు వేత్రహస్తులు నిరుకెలం

కుల నడచుచు సందడి దూరమై చనునట్లు హెచ్చరించుచుండ, బంగారుగుబ్బతో భాసిల్లుచున్నట్టియు చుట్టును ముత్యాల సరులు వ్రేలాడుచున్నదియు నగు. తెల్లపట్టుగొడుగును ఇల ఫేలికపై పట్టుకొని భటుడు వెనుక నడచుచుండ పృథ్వీశ్వరు నకు ముందు కులక్రమాగతములైన సామ్రాజ్యచిహ్నము లను బట్టుకొని భటులు భయభక్తులతో నడచుచుండ సర్వలోకాశ్రియుడు అంతఃపురమునుండి కొలువుకూటమున కొచ్చువాడు.

"విష్ణువర్ధనమహారాజాధిరాజ సర్వలోకాశ్రియుండ చళిక్యభీమభూపాల ద్రోహార్జునాపరనామధేయ దక్షవాటికా భీమనాయకవరకటాక్షలబ్ధసుస్థిరైశ్వర్య విభవామరేంద్ర సమరైకవీర అసహాయవిక్రముండ గొందళ సాహసుండ విక్రాంతచక్రాయుధ శశికులపూర్ణిమాచంద్ర" యని గద్య పఠించుచుండ గద్దియపై కూర్చుండువాడు.

'క్రీ - శ - 1935 యువనామసంవత్సర ఆంధ్రపత్రిక సంచిక 179 వ పుట, (మారేమండ రామారావుగారు.)

## ఆలంపురము.

ఆలంపురము ప్రకృత నైజాము రాజ్యములోని రాయచూరుమండలమున తుంగభద్రానదియొడ్డున కర్నూలు కెదురుగానున్నది. ఆలంపురము తాలూకా కిది కేంద్రస్థానము. ఇచటి కుత్తరమున 8 మైళ్లదూరమున కూడలిసంగమ మను కృష్ణాతుంగభద్రానదీసంగమస్థాన మున్నది. సుప్రసిద్ధ

శైవాచార్యుడగు మల్లికార్జునపండితారాధ్యు డీస్థలముననే శివైక్యమునందెను. శైవులకు ముఖ్యయాత్రాస్థలమగు నీ గ్రామమునం దమూల్యమగు చారిత్రికసామగ్రి గలదు.

ఇచ్చట నేలపై నొక రాయి యున్నది. దానిపై నిర్వురు వీరులు కత్తిని డాలును ధరించి పోరాడుచున్నట్లు చెక్కఁబడియున్నది. డాలులపైనను, రాతియంచులమీదను కొన్ని యక్షరము లున్నవి. కాని బాగుగా నరిగిపోవుటచే నవి స్పష్టముగా తెలియుటలేదు.

## శాసనములు.

వాస్తునిర్మాణకౌశలమునకును, శిల్పవైచిత్ర్యమునకునే గాక నీ యలంపురదేవాలయములు చరిత్రమునకుగూడ మిక్కిలి ముఖ్యములు. వీనియందనేక రాజవంశములకు జెందిన ముప్పదియారుశాసనములు గలవు. ఇంకను కొన్ని భూమిలోను, గోడలలోను బిగింపఁబడినట్లు తెలియుచున్నది. మఱియు తుంగభద్రలో నిర్మింపఁబడిన గోడలో సుమారు పదియడుగుల యెత్తున మూడురాళ్లపై నొక ప్రాచీనకన్నడ శాసన మున్నది. ఎండవానలకు గురియై దీనిలోనియక్షరములు కొన్ని యరగిపోయినవి. ఇది బాదామిచాళుక్యుల శాసనము. సవిమర్శముగ బరిశీలించినచో నింక నెన్నియో శాసనము లీస్థలమున దొరకగలవు.

'ఆంధ్రపత్రిక 23 వ సంవత్సరాదిసంచిక ఆంగీరస సం॥ క్రీ - 1932-33, 257 వ పుట.

## ఆర్యపురము (Aihole) చాళుక్యుల పురాతన నగరము.

(శ్రీమార్ - కొ. నరసింహాచారిగారు.)

చాళుక్యులు సుమారు క్రీ. శ. 5 వ శతాబ్దము మొదలు 12 వ - శతాబ్దమువఱకును కడు ప్రబలులై యుండిరి. వారు ప్రథమమున అయోధ్యనుండి దక్షిణమునకు వచ్చియుందురని చరిత్రకారుల అభిప్రాయము. చాళుక్యులు (మర్క్ వెళ్ కులమువారు - మున్నూరుకులమువారు) దక్షిణము నుండి వచ్చినపుడు ప్రథమమున ఆర్యపురమును జేరియుండి, తర్వాత ఒకటవపులకేశికాలమున వాతాపి (Badami) నగరమును రాజధానిగ జేసికొనిరి. చాళుక్యరాజ్యము ప్రస్తుతము బొంబాయిరాజధానియందు దక్షిణభాగమును, మైసూరున ఉత్తర భాగమును, ఈ రెండుభాగముల నంటియుండు చెన్న రాజ్య నిజామురాజ్య (హైదారాబాద్) భాగములును అయి యుండెను.

ఆర్యపురమునందలి దేవాలయములను, తొలుదొలుత ఒకటవ పులకేశియో లేక ఆతనితనయుఁడు ఒకటవకీర్తివర్మయో కట్టియుండవచ్చును. ఇచ్చట ఒకటవపులకేశి "సత్యాశ్రియ శ్రీ పులకేశివల్లభమహారాజ" అను బిరుదుతో అశ్వమేధయాగమును చేసియుండెనని ప్రతీతి. ఒకటవ కీర్తివర్మ కుమారుడు రెండవ పులకేశి చాళుక్యరాజులలో ప్రసిద్ధిజెందినవాఁడు. ఇతనికాలమున విదేశసాంగత్యముకూడ నేర్పడియుండెను. రెండవపులకేశియు పారసీకదేశాధిపతియగు రెండవ

ఖుస్రూను పరస్పరము రాయబారము జరిపినట్లు అజంతాగుహాలయములందుగల చిత్రములు నిదర్శనములు. రెండవపులకేశి కాలమున ఆర్యపురమునందలి 'మేగూతి' దేవాలయమునందు నెలకొల్పఁబడిన శిలాశాసనముగూడ కలదు. ఇతనికాలముననే చాళుక్యవంశము భిన్నమై ఒకభాగము గోదావరీ కృష్ణానదుల ముఖదేశమును జేరి తూర్పుచాళుక్యు లనబరగిరి.

## ఆ ర్య పు ర ము (Aihole).

ఆర్యపురము ఇప్పటి బీజపూరుజిల్లాలో బాదామి తాలూకాయందలి బాదామిరైలుస్టేషనునకు ఈశాన్యమున సుమారు 15 మైళ్ళదూరమున నున్నది. పశ్చిమచాళుక్య రాజ్యమున బాదామి (Vatapi) ఆర్యపురము (Aihole) పట్టడకల్ అను మూఁడు నగరములు మిక్కిలి ప్రసిద్ధములై యుండిన వనుటకు ప్రస్తుతముగల నిదర్శనములు వానియందుగల అసంఖ్యాకములగు పురాతనదేవాలయములే. ఇందు ఆర్యపురము ప్రస్తుతము సుమారొక ఫర్లాంగుమాత్రము నిడివిగలిగి పెద్ద ఆవరణకుడ్యమును గలిగియున్నది.

పశ్చిమచాళుక్యులు వైష్ణవులైనందున ఆర్యపురములోని ఆలయములన్నియు విష్ణ్వాలయములయి యుండినవి. కాలక్రమమున వానిలో అనేకములు లింగాయతులస్వాధీనమై వాటియందు లింగములు స్థాపింపఁబడి శివాలయములుగను, దుర్గాలయములుగను మార్పఁబడినవి.

ఆలయములలో మేగిలాతిఆలయమందలి శిఖరము శిథిల

మైనది. దీనియందు రెండవపులకేశికాలమునకు జేరిన శక వర్షము 55 నకు సరియగు క్రీ. శ. 634 సంవత్సరమునాటి శాసనమొకటి కలదు.

ఇవికాక ఆర్యపురమున నింక ననేక దేవాలయములు, వాటి ప్రతిష్ఠాతల కీర్తిని ఆచంద్రార్కము చాటగలవి కలవు. ఇట్టి పూర్వప్రసిద్ధదేవాలయములను, నగరములను గుఱించి తెలిసికొనుట మున్నీరుకాపులకు సంతోషదాయకము.

ప్రస్తుతము లాడ్ ఖాన్ దేవాలయమను పేర పిలువబడు నొకఆలయము గలదు. దీని కీ పేరు ఇందు వసించుచుండిన యొక మహమ్మదీయునివలన గలిగినది.

ఇదేరీతిని తక్కిన దేవాలయములకు ఇప్పటికాలమున గలిగిన పేరులు తొలుతటివి కాక మధ్యమధ్య కారణాంతరములవలన గలిగినవై యున్నవి. ఈ ఆలయము క్రీ. శ. 450 ప్రాంతముల గట్టబడియుండవలెనని తోచుచున్నది.

## సముద్రుడే శంతన చక్రవర్తి.

పూర్వభవమున సముద్రుడు (మున్నీరు)గా నుండిన మహాభిషుడు (మహాభీజుడు) బ్రహ్మచే మర్త్యలోకమున బుట్టునట్లును నీవు రాజువైనను గంగయే నీకు భార్యయగు ననియు నీకు సంతానము కలిగినపిదప శాపవిమోచనమగునని నియమింపఁబడి యుండుటచే పుణ్యచరితుఁడగు ప్రతీపుఁడను వానికి బుత్రుడుగ బుట్టినవాడే శంతనుడు (సముద్రుఁడు.)

శంతనుఁ డొకనాడు మృగంబుల వేటాడనేగి యచ్చట గంగాతీరమున సంచరించుచుండగ గంగ స్త్రీరూపమున గోచరించెను. ఆమెరూపమును జూచి శంతనుఁడు కామశరీర పీడితుడయ్యెను. ఆకారణముచే దానియెడ బద్ధానురాగుండై వివాహమాడి దానియందు నొక తనయుం గాంచె. ఆతడాయునతియొద్ద నాబిడ్డను విడిచి తాను నగరమునకు వెళ్లెను. అతనిసుతుండు విపినంబున ఋషులవలన సకలవేదంబులను సర్వశాస్త్రములను అస్త్రవిద్యలను ఆత్మవిజ్ఞానమును నేర్చి అన్నివిద్యలయందు మేటియయ్యె. శంతనుడు గ్రీష్మఋతువునరణ్యంబునకు రాగా నాగంగ స్త్రీరూపంబున నాతనికి నగపడి కొడుకు నతనికి నప్పగించెను. శంతనుడు తన ముద్దుకుమారుని వెంటనిడుకొని కరిపురికి వచ్చి సకలమంత్రిపుంగవుల ముందట నాభీష్మునికి యావరాజ్య పట్టాభిషేకంబు నేసి కొడుకువలన సకలవినోదంబులఁ బొందె.

పరశురాముడు, గాంగేయు (భీష్ముని) పాలికి నేగి, యంబను వరియింపుమని చెప్ప నాతఁడు బ్రహ్మచర్యవ్రతంబును పూనినందున నాకాంతను జేపట్టనని మోమోటమేమియు లేక మందలించెను. పరశురాముం డంత గినిసి, తనతోఁ గయ్యము నేయ నాశాంతనవుని జీరెను. భీష్ముఁడు బాపనితోఁ గలహము సేయగోరక విధిలేక వానితోఁ బోరి జయమందె. అంబ ప్రతిహతమనోరథయై మిక్కిలి శ్రమపడి శిఖండియయ్యె.

భారతయుద్ధమున శిఖండి పాండవులకు సహాయము చేసెను.

భీష్ముడు (గాంగేయుడు) షండులు, స్త్రీలు మొదలగు వారితోఁ బోరనని వ్రతము బూనియుండెను. కావుననే వీని వెనుకనే యర్జునుడుండి భీష్మునిపై బాణములు వేయుచుండెను. శిఖండిని జూచుటతోడనే గాంగేయుడు (భీష్ముఁడు) అస్త్ర సన్యాసము చేసెను. కావున పాండవులకు జయము గలిగెను. భీష్మునకు గాంగేయుడనునామము గల్గుటకు కారణము గంగ తల్లియగుటచే గంగపుత్రుడు గాంగేయుడని పిలువబడియె.

పూర్వము తల్లులపేళ్లనే చెప్పుకొనుచుండిరి.

పూర్వము వంశము చెప్పుకొనునపు డిప్పటివలెఁ గేవలము తండ్రితాతలపేళ్ళే చెప్పక తల్లులపేళ్ళును ఋషులునహా చెప్పుకొనుచుండిరి. బృహదారణ్యకోపనిషత్తులో 65 గురు ఋషులు తమగురుపరంపర మాతృపూర్వకముగాఁ జెప్పిరి. పైతృకనామములవలెనే మాతృకనామములుకూడ ధరించుచుం డిరి. భార్గవీపుత్రుఁడు భార్గవేయుఁడు, కద్రుస్త్రీపుత్రుఁడు కాద్రవేయుఁడు, మమతాపుత్రుడు మామతేయుఁడు, ఇతరా స్త్రీ పుత్రుఁడు ఐతరేయుఁడు. ఐతరేయుఁడే మైతరేయబ్రాహ్మణ కర్త. గావున భీష్ముడు గాంగేయుడని తన నామము దెలియ జేయుచుండెను.

గంగాసూనుడగు భీష్ముఁడు దన ప్రాణ మున్నంతవఱకు నన్యులకై కష్టపడినవాఁడు. అతఁడు పుట్టినది మొదలు చావు

వఱకు బ్రహ్మచారియై పరదారలఁ జూడక ఇంద్రియములకు వశ్యుడుగాక తండ్రియాజ్ఞను శిరసావహించి తనబాట యొరులకు మేలుబంతిగఁ జేసెను. అతనికి దెలియనిశాస్త్రము లేదు. యుద్ధమున నాతని శౌర్యధైర్యములు భూలోకంబునఁ బ్రసిద్ధులగు శూరులం దెవ్వరియందును లేవు. శ్రీకృష్ణునిభక్తులలో నాతఁడొకఁడు భారతములో భీష్ముడు శ్రీకృష్ణుని స్తుతించు వాక్యావళికి భీష్మస్తవరాజమని పేరు. ప్రతిహిందూమతస్థుడును దాని బారాయణము సేయును. భీష్ముఁ డొరులమనస్సు నొప్పింపనెఱుగడు. భూలోకమున నాతనికిసము లాతనిపూర్వమునగాని అతనికాలమునఁగాని అతనివెనుకఁగాని లేరుగదా! భీష్మునంతటివాఁ డికమీఁద హిందూదేశమునఁ బుట్టుట శశవిషాణము (కుందేలుకొమ్ము) వంటి దేసుమీ! యని శ్రీమాన్ యస్. వి. రంగాచార్యులుగారు వ్రాసియున్నవారు.

హిందూదేశ కథాసంగ్రహము ప్రథమభాగము హిందూ మహాయుగము క్రీ. శ. 1909 ముద్రితము, బ్ర-శ్రీ- కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, ఎం. ఏ. గారిచే 206 వపుట మొదలు.

## ఓరుగంటి గణపతిరాజులు గంగవంశజులు.

తూర్పు చళుక్యరాజులతరువాత నాంధ్రదేశమును బరిపాలించి మిక్కిలి ఘనతజెందినరాజు లీగణపతివంశజులు. వీరికి కాకతీయవంశజులనియు మాఱుపేరు గలదు. వీరికి రాజధాని ఓరుగల్లు (ఒరంగల్). ప్రస్తుతమిది నైజాము రాజ్యములో

వరంగల్ అనుపేరట వ్యవహరింపఁ బడుచున్నది. ఈ యోరు గంటివద్దనే అనుముకొండయను గ్రామముకలదు. మొదట గాకతీయరాజు లచ్చటనే రాజ్యము చేయుచుండిరి. ఈకాకతీయరాజులు గంగవంశపువారని కొందఱు వ్రాసియున్నారు. ఈ రాజులు మొదట చిన్నసంస్థానాధిపతులుగా నున్నను, (12 వ 13 వ) శతాబ్దములలో వీరు బలవంతులై తెనుఁగు దేశమంతయు నాక్రమించుకొనిరి. అందువలననే 'తెలంగాణ' అనఁగా ఓరుగంటిరాజ్యమని హిందూదేశమంతటను వాడుక యయ్యెను.

ఈ వంశమువారి మూలపురుషుఁడు సోమదేవరాజు కుమారుడగు మాధవవర్మయని చెప్పెదరు అని వ్రాసియున్న వారు.

## చాళుక్యులతో చోడుల సంబంధ బాంధవ్యము.

ఆంధ్రుల చరిత్రము, ప్రథమభాగము, పూర్వయుగము, బ్ర. శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారిచే రచియింపఁ బడినది. క్రీ. శ 1910 మొదటికూర్పు (293 మొదలు 300 పుటలయందు.)

విమలాదిత్యుఁడు (చాళుక్యరాజు) రాజేంద్రచోడునిచేఁ జెఱఁగొని పోఁబడి తంజాపురియందుండిన కాలమున రాజరాజచోడునికూతురును, రాజేంద్రచోడుని చెల్లెలు నగు కూుండమాంబాదేవిని వివాహమాడెను.

ఆచాళుక్యవిమలాదిత్యునికి కూండమాంబా దేవి యందు జనించిన జ్యేష్ఠపుత్రుఁడే రాజరాజవిష్ణువర్ధనుఁడు. ఇతఁడు రాజరాజచోడుని మనుమఁడగుటంజేసి వీనిని చోడులు రాజరాజని పిలుచుచుండిరి.

చాళుక్యులు వీనిని విష్ణువర్ధను డనుచుండిరి. రాజరాజను పేరువహించిన వేంగిరాజులలో నితఁడు మొదటివాఁడును విష్ణువర్ధన్నామమును వహించినవారిలో నితఁడు తొమ్మిదవవాఁడునై యుండెను. వీనికి విజయాదిత్యుడను తమ్ముఁడు గూడ గలడు.

ఇతఁడు సింహాసన మెక్కినకాలము.

వసంతతిలక॥ యో రక్షితుం వసుమతీమ్ శకవత్సరేషు
వేదాంబురాశినిధివర్తిషు సింహగేర్కే
కృష్ణద్వితీయదివసోత్తరభాద్రికాయాం
వారే గురోర్వణిజలగ్నవరేభిషిక్తః

శాలివాహనశకము 944 వ సంవత్సరము, శ్రావణబహుళ ద్వితీయ గురువారమునా డుత్తరాభాద్ర నక్షత్రమున అనగా ఈ లెక్కవేసి చూడగా క్రీ. శ. 1022 వ సంవత్సరము జూలై నెల (19) పందొమ్మిదవ తేదితో సరియగుచున్నది.

శ్లో॥ తస్మాచ్చాళుక్యచూడామణిరథవిమలాదిత్యదేవాన్మహీశాచ్చోడక్ష్మాపాలలక్ష్మ్యా ఇవరచితతపఃకూండమాయాశ్చ దేవ్యా జాత శ్రీ రాజరాజో రజనికరకులశ్రీమదంభోధిరాజో రాజ్యాద్రాజన్య సేవ్యామభృతభుజబలాద్రాజ్యలక్ష్మీంపృథివ్యామ్.

అని రాజరాజనరేంద్రుని కోరుమల్లి శాసనమున గూడ స్పష్టముగా చాళుక్యులకును చోడులకును సంబంధ బాంధవ్యమునుగురించి జెప్పఁబడినది.

ఈ రాజరాజనరేంద్రుఁడు సింహాసనమెక్కిన తరువాత, యుక్తవయస్సు వచ్చినకోడనే మేనమామయు, చోడ చక్రవర్తియునగు గంగయికొండరాజేంద్రచోడుని కూతురగు అమ్మంగదేవిని వివాహమాడెను. ఈ వివాహము సింహాసనమెక్కిన తరువాతనె జరిగినదనుట మాత్రము వాస్తవమనుటకు సందియములేదు.

రాజనరేంద్రుని పరిపాలనకాల మీయాంధ్రదేశమునకు మిక్కిలి మంచికాలమని చెప్పుటకు సంశయింపఁబనిలేదు. ఇంతకు పూర్వ మనేకపర్యాయములు రాజోపద్రవములచేఁ బీడింపఁబడుచుండిన యీ యాంధ్రదేశ మీపరగండభైరవుండగు రాజరాజనరేంద్రునికాలములో స్వస్థతను గాంచి దివ్యసుఖములను గాంచెను.

## రాజనరేంద్రుని బిరుదనామములు.

'సత్యాశ్రయకులశేఖరుఁడు, సర్వలోకాశ్రయుఁడు, రాజకంఠీరవుఁడు, త్రిభువనాంకుశుడు, సమస్త భువనాశ్రయుఁడు, బిరుదాంక భీముఁడు, రాజమహేంద్రుడు, రాజమార్తాండుడు, పరగండభైరవుడు, రాజపరమేశ్వరుఁడు' మొదలగు బిరుదునామము లెన్నో వహించి రాజరాజనరేంద్రుఁడు

సుప్రఖ్యాతిఁగాంచినవాఁడని నన్నయభట్టనేక బిరుదనామము-లతోనభివర్ణించుటయేగాక

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలిశౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడురాజమహేంద్రుఁడున్నతిన్.

"భారతము, ఆదిపర్వము."

వ సం త తి ల క ము.

'వీరావతార సుకవిస్తుత నిత్యధర్మప్రారంభ శిష్ట పరిపాలనశక్త రాజా నారాయణాఖ్య కరుణారసపూర్ణ వీర శ్రీరమ్య రాజకులశేఖర విష్ణుమూర్తీ.'

అని రాజనరేంద్రుని "నారాయణాఖ్యుఁడనియు, విష్ణుమూర్తి"యనియుఁ బొగడి యున్నాఁడు.

విన్నకోట పెద్దన్న యను కవి తన "కావ్యాలంకార చూడామణి"లో తన కృతికర్తయగు విశ్వేశ్వర మహారాజును వర్ణించునపుడు

'సీ॥ శ్రీకంఠచూడాగ్రశృంగారకరణ మే
రాజున కన్వయారంభగురుఁడు
చాళుక్యవంశభూషణము శ్రీవిష్ణువ
ర్ధనుఁ డేమహీశుతాతలకుఁ దాత
భృతకుమారారామభీముండు చాళుక్య
భీముఁ డే నృపకులాబ్ధికి విధుండు

రాజమహేంద్రవరస్థాత రాజన
రేంద్రుఁ డెక్కువ తాత యేవిభునకు

గీ॥ నంధ్రదళదానవోపేంద్రుఁ డగును వేంద్రి
ధరణివల్లభుఁ డేరాజు తండ్రితాత
ఘనుఁ డు పేంద్రాఖ్యుఁ డెవ్వనికన్నతండ్రి
యతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబసుతుఁడు.'

ఆనుపద్యములో రాజనరేంద్రుని రాజమహేంద్రవర స్థాతయని యొక మహద్విషయముగఁ జెప్పినదానిని బట్టి చూడ, రాజనరేంద్రునకును రాజమహేంద్రపురవరమున కును విశేష సంబంధము గలదనియును, రాజమహేంద్రి పురమునందుండి రాజ్యపరిపాలనముచేసిన మొదటి "చళుక్య ప్రభువు రాజనరేంద్రుఁడే" యని సూచించుచున్నట్టు గన్పట్ట గలదు. "చళుక్యవెందర్ మున్ వేళ్ కుల అరసర్ చళుక్య రాజులు మున్ వేళ్ కులనృపతులు" మున్నీరు రాజులు అని యీ పదముల కర్థము. వీరు దాక్షిణాత్యకాపువారనియు రాజ్యములు వచ్చిన తరువాత క్రమముగ క్షత్రియత్వము నెందిరనియు స్పష్టమగుచున్నదని పండితులఅభిప్రాయము.

ఒక్క చాళుక్యులనుగుఱించియే యననేల? దక్షిణము నందు బ్రఖ్యాతిచెందిన కదంబ, రాష్ట్రకూట, హొయసళ, చోళ, పాండ్య, చేరాదులందఱును మొదట వ్యవసాయము చేయు తెగలుగానుండిరి. తరువాత వారిలోనుండి పరాక్రమ శాలులు పుట్టి రాజులై ప్రబలినతరువాత తాము క్షత్రియుల

మని చెప్పుకొనసాగిరి. అనగా మొదట సచ్ఛూద్రులుగా నుండి క్షాత్రతేజమువలన క్షత్రియత్వమునొందిరి. ఇట్టిక్షాత్ర తేజమువలన క్షత్రియత్వము సంపాదించినవారని చెప్పిన యెడల నెవ్వరును కాదని చెప్పుటకు వీలులేదు. (చి. వీ. భ. రావుగారు) ఏకాధ్వరముగ 600 సంవత్సరములవరకు దెనుగు దేశమును కర్నాట దేశాదులను పెక్కువందల సంవత్సరముల వఱకును ఏలి సమ్రాట్ శ్రీహర్షుని పారదోలిన చాళుక్యులు క్షత్రియులు కారనినయెడల మఱియెవరు క్షత్రియులు? అని బ్ర. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు, యమ్. ఏ. గారు తమ అభిప్రాయ మిచ్చిరి.

మున్నీరుకాపులు (చాళుక్యులు) పుట్టుకతోడనే క్షత్రియులై ధనుర్విద్యాదిగురువగువిశ్వామిత్రమహాఋషిచే విలువిద్య మొదలగునవి నేర్చి కృతయుగాంత్యముననే దండనాయకులై వాహినీపతులై (సేనాధిపతులై) యున్నవారని అనేక గ్రంథము లాధారములను సూచించుచున్నవని చెప్పునది వినుటకంటె సంపూర్ణగ్రంథావలోకన మొనర్చువారల కనుమాన రహితమే ననుట నిక్కము.

## ధనుర్వేదము.

ధనుశ్శబ్దము వింటికి రూఢమైనను ముక్తము, అముక్తము, ముక్తాముక్తము, యంత్రముక్తము అను చతుర్విధ ప్రహారణముల వర్తించుచు ధనుర్వేదము శత్రుదండ రూపమగు సమస్త ప్రయోగసామగ్రితత్వమును బ్రతిపాదించును.

అది యిరువదివేల శ్లోకములతో గూడియున్నది. ఇట్టి ధను ర్విద్యయం దఖండపాండిత్యము కలిగి దండనాయకు లనియు వాహినీపతులనియు కీర్తిగాంచిరి.

ఒక్కొకకులమునందు ఒకగుణము ప్రధానముగ నుండెను.

కృతయుగమున దండనాయకులు తపోబలసంపన్నులు గను జనులు పశుప్రాయులుగను ఉండిరి.

.ధర్మము నాలుగుపాదములమీదను నడచుచుండెను. ప్రజలు పూర్తిగ దండనాయకుల ఆజ్ఞానువర్తులై యుండిరి. జనులు తిరుగబడినప్పుడు వారిని స్వాధీనపరచుకొనుటకు దండన తప్ప మరియొకఉపాయము లేదు. అని వాసవి అక్షయ సం॥ పుష్యమాస జనవరి క్రీ. శ. 1927 సం॥రం 25 వ పుటయందు శ్రీయుత తుంపూడి వేం. భగవన్తముగుప్త బి. ఏ. బి. ఎల్. గారు సహా వ్రాసియున్నారు.

ఆంధ్రదేశకథాసంగ్రహము 13వ వ ప్రకరణము 292 పుట చిలుకూరి వీరభద్రరావుగారిచే రచితము:—చోడచక్ర వర్తియగు రాజరాజరాజకేసరివర్మకూతురును, రాజేంద్ర చోడుని గారాబుచెల్లెలునగు కూండమాంబాదేవి విమలా దిత్యునకు వివాహము చేయఁబడియుండెను.

విమలాదిత్యునకు (శ్రీవిజయాదిత్యయను నామము గలదు) కూండమాంబాదేవియందు జనించిన జ్యేష్ఠపుత్రుఁడే మన యీ శ్రీవిష్ణువర్ధనుఁడు. వీనిని చోడులు రాజరాజని పిలుచుచుండిరి. చాళుక్యులు వీనిని విష్ణువర్ధనుఁ డనుచుండిరి.

రాజనరేంద్రునితమ్ముఁడైన శ్రీవిజయాదిత్యుని
కుమారుఁడయిన విష్ణువర్ధనుని అహాదనకర తామ్రశాసనము.

మూలము, మొదటి రేకు రెండవపక్క.

1 స్వస్తి శ్రీమతాం సకలభువనసంస్తూయమానమానవ్యసగోత్రాణాం హారీ
2 తపుత్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణపరిపాలి
3 తానాం స్వామిమహాసేనపాదానుధ్యాతానాం భగవన్నారాయణ
4 ప్రసాదసమాసాదిత వరవరాహలాఞ్ఛనానాం క్షణక్షణవశీకృ
5 తారాతిమణ్డలానాం అశ్వమేధావభృథస్నానపవిత్రీకృతవపుషాం

రెండవ రేకు మొదటిపక్క.

6 చాళుక్యానాం కులమలంకరిష్ణో స్స్వాసిధారాప్రభావావర్జితాశేషమహీ
మణ్డల
7 స్య శ్రీవిష్ణువర్ధనమహారాజస్య భ్రూభంగమాత్రవిధూత సమస్తారాతి
మణ్డలస్య
8 కారిణః అనేకతులాధృతి శాతసమ్భవిశాణనవదాతశరీరస్య శ్రీ
9 విజయాదిత్యమహారాజస్య ప్రియతనయః చక్రవర్తిలక్షణోపేతః చక్ర
10 ధర ఇవ లక్ష్మీవల్లభః భాస్వానివ నిత్యోపజాయమానోదయః చన్ద్రఇవ

ఆంధ్రవాఙ్మయాభ్యుదయమునకై యాయుష్యము ధార వోసి కీర్తిశేషులయిన కె. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. గారు నేటికి పదమూఁడు వత్సరములకు మునుపు ఈ యహాదనకర తామ్రశాసనమును గూర్చి మిక్కిలి కృపిసల్ప సీమనుండి పై శాసనముల ప్రతిబింబములు మరల దెప్పించి చూచి ప్లీటు దొరగారు, ఇండియన్ ఆంటిక్వెరీ 13 వ వాల్యూములో ప్రక టించిన ప్రతిబింబములకును, వీనికిని భేదము లేదని తెలిపిరి.

ఈ శాసనము సమగ్రముగా 'ద్రవిడ సంస్కృతశాసనము' అను గ్రంథమున బర్గెస్ దొరగారుగూడ ప్రకటించి యున్నారు.

ఈ శాసనము సంస్కృతభాష ద్రవిడలిపియందు రాగి రేకులపై వ్రాయఁబడియున్నది.

## భారతరచనకాలము.

నన్నయభట్టంతటి విద్వత్కవిరాజసింహునిచే
"శ్రీమదాంధ్రమహాభారతము, ఆదిపర్వమున"
"క. విమలాదిత్యతనూజుఁడు
విమలవిచారుఁడు గుమారవిద్యాధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిహితశ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్."

చ. "ఘనదురితానుబంధకలికాలజదోషతుషారసంహతిన్
దనయుదయప్రభావమున దవ్వుగఁ జోపి జగజ్జనానురం
జనముగ రాజ్యసంతతవసంతనితాంతవిభూతి నెంతయుం
దనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మదయార్ద్రనిబద్ధబుద్ధియై."

అని సన్నుతులుగాంచి "రాజమహేంద్ర కవీంద్ర సమాజసురత్నరాజ" యని సంబోధింపఁ బడినవాఁడును సకల భువనలక్ష్మి విలాస నివాసంబయిన రమ్యహర్మ్యతలంబున మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహా ప్రధానానంత సామంత పరివృతుండై యపారశబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులును భారతరామాయణాద్యనేక

రచనావిశారదులయిన మహాకవులును వివిధతర్కవిగాహిత సమస్తశాస్త్ర సాగరగరీయః ప్రతిభులయిన తార్కికులును నాదిగాఁగల్గు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ నిరంతరము విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుండయి యిష్టకథావినోదంబులఁ బ్రొద్దువుచ్చుచుండిన "చళిక్య" రాజు "(మున్నీరుకుల రాజు) నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్య విభవుండును నిజభుజ విక్రమవిజితారాతిరాజనివహుండును, నఖిలజగజ్జేగీయమాన నానాగుణరత్న రత్నాకరుండునునై పరగుచున్న రాజరాజ నరేంద్రుఁడు "చళిక్య" (మున్నీరు)కుల రాజచంద్రుండని "ముర్ వేళ్ కులనృపతి" అనియే స్పష్టమగుచున్నది.

ఈతఁడు తెలుఁగుబాసకు మహోపకారమొనర్చి యాచంద్రార్కము నాంధ్రదేశమునఁ బ్రతిదినము తన్ను ఆంధ్రులు తలఁచుకొనునట్లు చేసిన మహానుభావుఁడు. ఈతని ప్రేరణవలననే నన్నయభట్టు తెలుఁగున భారతము వ్రాయ నారంభించెను. నన్నయభట్టు తెలుఁగుబాసలోఁ గావ్యము చెప్పిన యాదికవి. ఆదిమకృతిపతియునగు నన్నయభట్టు రాజరాజనరేంద్రులు మనభాషకు జనకులని చెప్పవలసి యున్నది.

నన్నయభట్టుగాక ఈరాజునాస్థానంబున నారాయణ భట్టు, పావులూరి మల్లన యను నిద్దరాంధ్రకవులున్నట్లు గాన వచ్చెడిని. నారాయణభట్టు భారతముఁ దెనిఁగించుటలో నన్న యభట్టునకు సహాయుఁడుగా నుండెను. పావులూరు మల్లన యను నాతఁడు రాజరాజనరేంద్రునివలన నగ్రహారము వడసి

"పావులూరి గణితము" అను గ్రంథము రచించెను. ఇటులీ చాళుక్యరాజ చంద్రుఁడు, ఆంధ్రభాషా వధూటిని నెంతయుఁ బ్రేమతోఁబెంచి పెద్దదానిని జేసెను.

చాళుక్యులే యాంధ్రమును అభివృద్ధిగావించిరి.

యువనామసం॥ ఆంధ్రపత్రికసంచిక క్రీ. శ. 1935 సం॥ (కుందూరి ఈశ్వరదత్తు) సత్యాశ్రయచాళుక్యరాజుల ప్రశంస.

క. మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమున
జనసత్యాశ్రయునిదొట్టి చాళుక్యనృపుల్.

మఱియు సత్యాశ్రయాది చాళుక్యనృపుల కాలములో సంస్కృతముతోఁబాటు దేశభాషలకుఁగూడ గౌరవము హెచ్చినది.

చాళుక్యరాజ్యముతోడ నాంధ్రభాషయు దినదినప్రవర్ధమానమై రాజరాజుకాలమునాఁటి కున్నతస్థితికి వచ్చినది. (యుద్ధమల్లుని బెజవాడ శాసనము, పుట 25).

శ్రీ రామయ్యపంతులుగారి యభిప్రాయానుసారముగఁ చాళుక్యరాజుల కాలములోనే దేశికవిత యావిర్భవించెనని స్పష్టముగదా.

ఇక శ్రీ లక్ష్మణరావుగారి యభిప్రాయమును గమనింపుడు:—

"This inscription is very importent: to the students of Telugu literature as it furnishes a positive evidence of the existence of Telugu Poetry in the middle of the 9th century A. D. The oldest Telugu work now extant is the Maha Bharata of Nannayya Bhattu, the Poet Laureate in the covert of the Eastern Chalukya Rajarajah (A. D. 1022-1063) of Rajahmundry. It was therefore belived by many Telugu scholars, that the beginning of the Telugu Poetry could not go to a period earlier than the eleventh century of the Christian era. But the Bezwada Pillar inscription of Ubbha Malla took it a century back, the present inscription takes it a century still"

Epigraphia India Vol. XIX, Page 273.

ప్రథమమున కర్ణాటభాష పశ్చిమచాళుక్యుల యాదరణచేఁ బెంపొందెను. కర్ణాటదేశమును పశ్చిమచాళుక్యులు పరిపాలనమొనర్చి కన్నడభాషను వర్ధిల్లఁజేసిరి. నన్నయభట్టునకు పూర్వము వేంగీవాసులైన పంపకవియు నాగవర్మయు గర్ణాటక దేశమునకుఁ బోయి యచ్చటనే మహాభారతాది కావ్యములు రచించిరి. వారు వేంగీవాసులైనట్లు వారే చెప్పుకొనిరి.

కృష్ణాజిల్లా స్థానికచరిత్ర (క-తం-పుట 23)

కడప, నెల్లూరు, గోదావరి, జిల్లాలలోను నుండబడే బ్రాహ్మణకరణములు తమిళసంతతి యనియు చోళచాళుక్యరాజులతో క్రీ. శ. 1112 వ సంవత్సరములో వచ్చినటువంటివారి సంతతియనియు డాక్టరు బర్నల్ దొరవారు జెప్పియున్నారు.

ఇమ్మహారాజు తన మేనమామ యగు రాజేంద్రచోళునికూఁతురయిన యమ్మంగదేవిని వివాహమాడి శాలివాహనశక-944 వ సంవత్సరమందు భాద్రపద బహుళ ద్వితీయ గురువారము ఉత్తరాభాద్ర నక్షత్రమున (ననఁగా క్రీ.శ 1022 వ సంవత్సరము ఆగష్టునెల 16 వ తేదిని) పట్టాభిషిక్తుఁడై క్రీ.శ 106౨వఱకు ననఁగా నలువదియొక్క సంవత్సరములు రాజ్యపరిపాలనము చేసెను. ఇతనితమ్ముఁడు విజయాదిత్యుఁడు, కుమారుడు కులోత్తుంగ చోళదేవుఁడు (రాజేంద్రచోళదేవుడు).

కులోత్తుంగచోళదేవుఁడు : ఇతఁడు రాజనరేంద్రుని ప్రథమపుత్రుఁడు. ఇతఁడే రాజేంద్రచోళుడు. ఇతని మొదటి పేరిదియే యయినను ఇతఁడు వేఁగిదేశరాజ్య భారమును వహించిన మొదటిసంవత్సరములోనే చోళదేశముపై దండెత్తి దానిని జయించి స్వాధీనపఱుచుకొన్న తరువాత కులోత్తుంగ చోళదేవుఁడనఁబడుచు వచ్చెను. ఇతనికి "రాజనారాయణుఁ" డను బిరుదుండెను. ఇతనిని "కరికాలచోళుఁ"డనియుఁ బిలుచుచు వచ్చిరి.

మూఁడుతరములనుండి చోళరాజుల కూఁతులను వివాహమాడుచు వచ్చుటచేతఁ దమతల్లులనుబట్టియు భార్యలను బట్టియు చాళుక్యుల కంతకంతకు వేఁగిదేశమునకంటె చోళదేశముమీఁద నభిమాన మెక్కువగుచు వచ్చెను.

విమలాదిత్యుడు రాజరాజుకూఁతురైన కూండమాంబా

దేవిని వివాహమాడి తనకుమారునకు రాజరాజని పేరు బెట్టెను.

రాజరాజు తన మేనమామయైన రాజేంద్రచోళుని కూఁతురైన అమ్మంగదేవిని పెండ్లియాడి తన పుత్రునకు రాజేంద్రచోళుడనియే నామకరణముచేసెను.

తరువాత రాజేంద్రచోళుడు చోళరాజుకూఁతురైన మధురాంతకదేవిని పరిణియముచేసికొని చోళదేశముమీఁదనే యధికారముగలవాఁడై తానా దేశమున జయించినతోడనే తన రాజధానిని చోళదేశమునకు మార్చుకొని వేఁగిదేశమును పాలించుటకై పాలకుల నియమించి రాజ్యాధికారము వారికి విడిచిపెట్టెను.

కులోత్తుంగ చోళదేవుడు తన పినతండ్రియైన విజయాదిత్యుని వేఁగిదేశముపై నియమింపగా పదునేనుసంవత్సరములు రాజ్యపాలనముచేసి వార్ధకదశలో క్రీ. శ. 1077 వ సం. నందు చోళదేశమునకుఁ బోయి చేరెను. అటుతరువాత

క్రీ. శ. 1077 సంవత్సరములోనే వేఁగిదేశపాలనము నిమిత్తము తన రెండవకొడుకైన రాజరాజును బంప నతడక్కడ నుండనొల్లక మరుసటిసంవత్సరములోనే తల్లిదండ్రుల యొద్దకు లేచిరాఁగా క్రీ. శ. 1078 వ సంవత్సరమునందు శ్రావణ మాసములో దన మూడవకొడుకైన వీరచోళదేవుని వేఁగిదేశ పాలకునిగా బంపెను. ఈ వీరచోళదేవుడు 'తొమ్మిదవ విష్ణువర్ధనుఁడు' అనుబిరుదుతో క్రీ.శ. 1100 సంవత్సరమువఱకు వేఁగి

దేశాధిపుడుగానుండెను. కులోత్తుంగ చోళదేవునికి విక్రమ చోళుడు, రాజరాజు, వీరచోళదేవుడు మొదలుగాగల కొడుకులును రాజసుందరియను కూతురును గలిగిరి.

ఈ రాజసుందరి కళింగరాజైన రాజరాజునకు భార్య యయ్యెను.

కులోత్తుంగ చోళదేవుఁడు క్రీ. శ. 1063 మొదలు 1112 వరకు నలువదితొమ్మిదిసంవత్సరములు రాజ్యపాలనము చేసెను.

"విక్రమచోళుఁడు - ఇతఁడు కులోత్తుంగ చోళుఁడన బడెడు రాజేంద్రచోళుని జ్యేష్ఠకుమారుఁడు. ఇతఁడు కొంత కాలము వేఁగిదేశమును పాలించి తండ్రియొక్క మరణానంతర మున వేఁగిదేశమును విడిచి చోళరాజ్యమును వహించుటకుఁ బోయెనని యొకశాసనమున వ్రాయఁబడియున్నది. ఇతఁడు క్రీ. శ. 1112 మొదలు 1127 వఱకు బదునేను సంవత్సర ములు రాజ్యముచేసెను.

"కులోత్తుంగ చోళదేవుడు" ఈ రెండవకులోత్తుంగుడు విక్రమ చోళునికొడుకు. ఇతఁడు క్రీ.శ. 1127 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు చోళరాజ్యము క్రీ.శ. 1158 వ సంవత్సరమువఱకు పాలించెను. ఇతని కొడుకు రాజేంద్ర చోళుడు క్రీ.శ. 1200 వఱకును, రాజేంద్రచోళుని కొడుకగు రాజరాజ చోళుడు క్రీ.శ. 1232 వఱకును చోళరాజ్యమును పాలించినట్లు కనఁబడుచున్నది.

ఈ రెండవ కులోత్తుంగ చోళదేవుని కాలములోనే వేగిదేశ మితరచాళుక్యుల యధీనమయినట్లు స్పష్టముగా గనఁబడుచున్నది. క్రీ.శ. 1202 వ సంవత్సరమునందు మల్ల విష్ణువర్ధనుఁడు వేఁగిదేశప్రభువుగా నుండినట్లొక శాసనమునం దున్నది. ఆశాసనమునందే యాతని తండ్రి విజయాదిత్యుడు చిరకాలము వేఁగిదేశము పాలించినట్లును జెప్పఁబడియున్నది. దీనిబట్టి చూడఁగా రెండవకులోత్తుంగ చోళదేవుని కాలము లోనే విజయాదిత్యుఁడు పైనివివరింపఁబడిన పదునేడవ తూర్పు చాళుక్యరాజగు బేటవిజయాదిత్యుని కాలవతరమువాఁడు. బేట విజయాదిత్యుని కొడుకు సత్యాశ్రియుఁడు; సత్యాశ్రియుని కొడుకు విజయాదిత్యుఁడు; విజయాదిత్యునికొడుకు విష్ణువర్ధ నుఁడు; విష్ణువర్ధనునికొడుకు మల్లప దేవుఁడు; మల్లపదేవునికొడుకు వేఁగిదేశప్రభువైనవిజయాదిత్యుఁడు. క్రీ.శ. 1278 వ సంవ త్సరమునందుకృష్ణాగోదావరీమధ్యమందున్న వేఁగిదేశమంతయు గణపతిరాజులయధీనమైనది. కులోత్తుంగ చోళదేవుని కాలము నుండియుఁజాళుక్యరాజు లందఱును తాము వేఁగిదేశమునువిడిచి చోళులను బిరుదావళులను వహించి తాము చోళులుగానే పరి గణింపఁబడుచు వచ్చుటచేత వారినిగుఱించి యిందు వివరించుట యనావశ్యకము. చాళుక్యులు చంద్రవంశపు రాజులు. చోళులు సూర్యవంశపు రాజులు. (హిం. దే.క.సం-20- ఆంధ్రకవులచరి త్రము; ప్రథమభాగము) (హిందూదేశకథాసంగ్రహము నందును జూడనగును.)

రామాయణకాలమున మున్నీరురాజ పాండ్యరాజ్యము.

శ్రీమద్వాల్మీకిరామాయణమున కిష్కింధా కాండ మునందు,

"తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ,
చోళాన్ పాండ్యాన్ స కేరళాన్"

అని పాండ్యదేశము నుదహరించియుండుటచే మున్నీరు పాండురాజు త్రేతాయుగమందలి పాండువు గాని ద్వాపర యుగమునందలి పంచపాండవులలోని పాండురాజు కాడు.

కావున కంబకవి మున్నీరుకులమువారు శ్రీరామునకు కిరీటము పెట్టిరని వ్రాసియున్నాడు. శ్రీరాముడు త్రేతాయుగమువాడయినందున మున్నీరుకుల పాండ్యు డేలిన భూభాగమునకే పాండ్యదేశమని నాటి వాల్మీకియే తనరామాయణమున వ్రాసియుండ ఇతర ప్రమాణము లనవసరమనుట కేమి సంశయము?

చళిక్య (పాండు) వంశజులు ఎనిమిదవ శతాబ్దమునందు ఆంధ్రదేశముయొక్క కొంతభాగమును ఏలుచుండిరి. దీనికి ముఖ్యపట్టణము ఓరుగల్లు (వరంగల్). చళిక్యులు దక్షిణము నుండి యాంధ్రదేశముపై దండెత్తివచ్చి జయించినపుడు వారితోవచ్చినరాజబంధువులును తద్బంధువర్గములోనుండియే నియమింపఁబడిన సేనానాయకులును కొలనుపాకయందు వసించుచుండిరి.

## కొలనుపాక.

కొలనుపాక కుల్ ఫాక్ కొలిపాక సరోవరకుటీరము సోమశేఖరపురము కుదుటపురి బింబావతిపురి మొదలగు పేర్లతో వ్యవహరింపఁబడుచు నొకరాజధానిగా నుండెననియు దానిక్రింద 7000 గ్రామములుండెననియు తెలియవచ్చుచున్నది. చాళుక్య (చళిక్య) చక్రివర్తుల సామంతరాజులు, సేనానాయకు (సర్దారు)లు కొలనుపాకను ముఖ్యపట్టణముగాఁ జేసికొని అసామాన్యధాటిచే నేలుచుండిరనియు

### శెట్టి మహానాటి తెలగా దండనాయక నామార్థము.

వీరు కృతయుగముననె దండనాయకులై, మహత్తు (దొరతనము) కలిగియున్నవారవుటచే "మహాః మహత్ మహాః మహతీ ఇతి త్రిషు ఆయామ విస్తారాదిభిరధికే॥ గొప్పది" మహత్తు సం. వి. త్. న. దొరతనము యని అర్థము.

సూ. 55 కర్మధారయ బహువ్రీహులయందుఁ దొలిపదమైనపుడును, జాతీయశబ్దము పరమైనపుడును మహచ్ఛబ్దము 'మహా' యగు.

మహత్ = మహిమగలయుగము (కృతయుగము)న.

1 (శెట్టి) శ్రేష్ఠి సం. వి. న్. పుం. కులశ్రేష్ఠుఁడైనవాఁడు

2 మహత్తు = దొరతనము దండనాయకులై కృతయుగమునం దున్నవారు. (చూ. 63 వ పుట).

3 నాటి = ఆనాటి.

4 తెలంగ – తెన్ అనగా దక్షిణము తెనుగుదేశము.

5 తెల్లంగ – తెల్ల + అంగ యని విగ్రహము.

తెల తెల్లయొక్క రూపాంతరము తెల్లని రూపముగల పాండువంశజులని. ఈతెల బహువచనాంతముచే తెలగ అని యయ్యె.

అంగ = కాలుచాచి పెట్టినయడుగు, అనగా దక్షిణ దేశమునుండిచట పాండువంశజు లడుగుబెట్టిన భూభాగము (దేశము). మఱియు తెల్లనివానివంశజులు తెలగానాయకులని యొక అర్థము.

అనగా శెట్టి మహానాటి తెలగా, యను మూడుపదముల కర్థము. మఱియు

దండ = దండాధికారము (దండధారి).

నాయకుఁడు సం. వి. అ. పుం. అధిపతి.

అనగా శెట్టి మహానాటి తెలగా దండనాయకులు అను నాలుగుపదముల కర్థము.

"కుల శ్రేష్ఠుడై కృతయుగముననే దొరతనము గలిగిన నాటి తెల్లనిరాజు అడుగుబెట్టిన (జయించిన) భూభాగమునకు అధిపతులని యర్థము.

వాహినీపతిః॥ వాహిన్యాః పతిః వాహినీపతిః॥ వాహినీ పతిః యనగా నదులకు భర్త (సముద్రుడు మున్నీరు) వాహినీ పతిః యనగావాహినీయను దండున (సేన) కు పతి (సేనాపతి)

దండనాయకుడు. దండనాయకులు నివసించువీధి దండయను పదము లోపించి నాయకవాడయని పిలువబడెను. నాయకవాడ యందలి నాయకులు చేవ్రాలు చేయునపుడు "వేముల అంతన్న నాయకవాడ శ్రీ దక్షిణకాశీ కొలనుపాకయని క్రీ. శ. 16 వ శతాబ్దములో వ్రాయుచుండెడివారు గావున క్రీ. శ. పదియారవశతాబ్దమున వ్రాసియిచ్చిన దాన శాసనములో పై విధమున చేవ్రాలులు గలవు.

వాహినీపతివంశజులు దండనాయక వృత్తులయందుండునంత వఱకు వాహినీపతిశబ్దము సముద్రినకు సేనాపతి (దండనాయకుని)కిని సమానార్థ మొసఁగుటచే మున్నీరు కాపులు దండనాయకులనియే పిలువఁబడిరి. దండనాయక వృత్తులు బోయినపిమ్మట తూర్పుదేశమున గలవారు ముర్ వెళ్లానైమ్రయను ద్రవిడపదవికృతియైన 'వెలమ' పదమే నుపయోగించుచున్నారు.

దక్షిణ విదర్భయను హైదర్ఆబాదునందు "మున్ వెళ్లానైమ్ర"యను ద్రవిడపదమునకు సమానార్థ మొసగు "మున్నీరుకాపు" నామమే ఉపయోగించుచున్నవారు.

ఒకభాషాపదము మఱియొక భాషలో మారుట.

"ఒక భాష నుండి మఱియొక భాషలోనికి ప్రవేశించినపదములు కొన్ని యాకాలమున వానికి గలిగిన వ్యవహార ప్రాచుర్యమునుబట్టి యంతకుఁ బూర్వ మాభాషలో సమానార్థకములై వ్యవహరింపఁబడుచుండ యా భాషకు

సహజములు గూడనైన పదములను వాడుకలోనుండి తొలఁగిపుచ్చుటయు సంభవించుచుండును."

నీలశబ్దభవంబులగు 'నల్ల' 'నల్లని' శబ్దంబులు వాడుకలోనికి వచ్చినతర్వాత 'కప్పు' శబ్దమంతరించినది. 'పాందాను' వచ్చిలడపమును పోఁగొట్టినది. ఇటువలెనే యొకభాషనుండి మఱియొక భాషలోనికి ప్రవేశించిన పదము అనగా ద్రవిడపదమునకు సహజమై సమానార్థకమునై వ్యవహరింపఁబడుచున్న 'మున్నీరుకాపు' పదము వాడుక (అభ్యాసము) లోనికి వచ్చిన పిమ్మట ఇంతకుపూర్వ మీ 'మున్నీరుకాపు' పదమునకు సమానార్థకమై వ్యవహరింపఁబడుచుండిన (ముఁ వెల్లానైన్మ) పదము వాడుకలోనుండి తొలఁగిపుచ్చుటయు సంభవించెను.

ఇట్లు సంభవించునని ద్రావిడభాషాపదచరితమును వ్రాసిన యు. సుబ్బారాయభట్టు, ఎం. ఏ., ఎల్. టి. గారు, కె. రామకృష్ణయ్య, ఎం. ఏ. గారును ఒప్పుదల సిద్ధాంతము (శా. 2. 4 సం. 2 సం. పు.) చేసియున్నవారు.

పూర్వము వీరు ద్రావిడదేశజులైనచో ద్రావిడ భాషనేల మఱచితిరను ప్రశ్న బయలుదేరును. సమాధానము: ఎందరో ద్రావిడు లాంధ్రదేశంబున నివసించుచు నాంధ్రంబున గొప్ప పండితులై ద్రావిడము మాటలాడుటకుఁగూడ మఱచినను పేరునకు దాము ద్రావిడులమనియే జెప్పుకొనుచున్నారు. అని విద్వాన్ పి. సూరిశాస్త్రి, బి. ఎ. గారు వ్రాసిన గ్రామ్యాగ్రామ్య వివాదవీఠిక క్రి.శ. 1912, 71-72వ పుటలయందు సిద్ధాంతము చేసియున్నవారు.

పశ్చిమ హిందుస్థానమందు రాట్టులు నివసించు దేశమునకు రాట్టవాడి యనియు ఈరాట్టవాడి లేక రాథోడ్‌సీమనుండి యాంధ్రదేశమున కేతెంచి నివసించిరనియు దేశ పరిత్యాగముతోకూడ భాషాపరిత్యాగముచేసి ఆంధ్రులలో గలసి ఆంధ్రభాష మాతృభాషగా గైకొన్న వారని రె.కు.ని. చంద్రిక 56వ పుట యందు శ్రీమాన్ శేషాద్రిరమణకవులు వ్రాసియున్నారు.

## ఉత్తర దేశ చాళుక్యులు రాష్ట్రకూటులమని దెల్పుట.

## అనవేముని ఉప్పుగల్లుశాసనము.

శ్లో॥ కావేర్యాం త్రిపురాంతకే జయపురే కాశీపురే గోకులే
పంచారామపురీషు పట్టనపురే మార్కండశంభో పురే
గంగాసాగరసంగమేషు నిరతం శ్రీకొండవీటీపురే
చాళుక్యామ్నయుతాన్నదాననిరతః శ్రీవేమభూపప్రభుం.

పై శాసనమువలన రాష్ట్రకూటులలోని వేమభూపాలుడు చాళుక్యాన్వయుడని వ్రాసియుండుటచే నుత్తరదేశచాళుక్యులు రాష్ట్రకూటులమనిసహా దెల్పినట్టుల తెలియుచున్నది.

## సోమసూర్యవంశజులు - వారిగోత్రములు.

కొరుకొండదుర్గము నేలిన రేచర్ల కాచిరెడ్డి పుత్రుడును నుభయభాషాకోవిదుడు నగు రామిరెడ్డి భారతమును ద్విపదకావ్యముగ రచించుచు నందు దాను సూర్యవంశమునఁ బుట్టినట్లు వ్రాసియున్నాడు.

రేచర్లగోత్రుండ రెడ్డికులుండ, గాచిరెడ్డికవీంద్రగర్భజాతుండ
భానువంశజులందుఁ బ్రఖ్యాతిగన్న రసికవందితుఁడను రాజవంశజుఁడ.

అని యుండుటచే నీ వంశజులు సూర్యచంద్రజులుగా వ్రాసికొనుటకు కారణము రెండువంశజులకు కర్తయైన మూల పురుషుడు వాహినీపతి యైనందున మున్ వేళ్ కులమువారు నుభయవంశములకు జెందినవారుగా (శాసనములయందునొకరు చంద్రవంశ్యులుగా మఱియొకరు సూర్యవంశ్యులుగా) వ్రాసికొనిరి.

సూర్యవంశజులని వ్రాసికొనినవారు కాశ్యపగోత్రులనియు చంద్రవంశజులని వ్రాసికొనినవారలలో గన్నభూపాలుడు ధనంజయగోత్రుడనియు ఈ గోత్రప్రవరఖండములో విశ్వామిత్రగణంబున గలదు. గోత్రకర్తలు విశ్వామిత్రి మధుచ్ఛందో ధనంజయులు గావున ధాన్యవాటీపురాధీశ్వరుడగు గన్నభూపాలుడు తన కులమునకు ధనుర్విద్యాదిగురువౌటచే విశ్వామిత్ర గోత్రజుడ ననియే దెల్పియుండును.

ధనంజయునకు జనార్దన యనియు హారీతకు శ్రీవత్స యనియు నామాంతరము లున్నవని గొందఱి యభిప్రాయములు గలవు.

మున్నీరుకాపుకుల చాళుక్యులు అశ్వమేధయాగములను చేసిరి.

## పాలమూరు తామ్రశాసనము.

క్రతుసహస్రయాజి హిరణ్యగర్భ ప్రసూతః ఏకాదశాశ్వమేధావభృతస్నానవిగత జగదేవస్క్రః సర్వభూతపరిర

క్షణాచుంచుః విద్వద్ద్విజగురు వృద్ధత తపస్విజనాశ్రయో మహా రాజః మాధవవర్మా. అపిచ

"స్వస్తిశ్రీమతాం........వరవరాహ లాంఛనేక్షణ క్షణవశీకృతారాతిమండలానామశ్వమేధావభృతస్నాన పవిత్రీకృతవపుషాం చాళుక్యానాం కులమలంకరిష్ణో."

ఇ లి పే టి శా స న ము .

గుంటూరుజిల్లా బాపట్లతాలూకాలో జేరిన శిరిపూడి తామ్రశాసనమునందు సత్యాశ్రయవల్లభేంద్రుడు (మున్నీరు కాపుకుల చాళుక్యుడు) అశ్వమేధ యాగము లొనరించినటుల వేలశాసనములు గల వందొకటిమాత్రము దిగువ నుదహరింప బడుచున్నది.

"స్వస్తిశ్రీమతాం......... అశ్వమేధావభృతస్నాన పవిత్రీకృత వపుషాం చాళుక్యానాం కులమలంకరిష్ణు సత్యాశ్రియవల్లభేంద్రతద్భ్రాతా కుబ్జవిష్ణువర్ధనః తత్పుత్రో జయ సింహః॥"

మున్నీరుకాపు (వెలమ) వారి నాగులపాడు (నల్లగొండ జిల్లా) శాసనము శా. శ. 1404 తెలుగునందుగలదు. గోల కొండరాజ్యమున మున్నీరుకాపువారివద్ద రాజప్రతినిధిగా నుండి సూర్యాపేటతాలూకాలోని భాగములను రామరాజు మేడరాజు పాలించినటుల దత్రత్యులు చెప్పుచున్నారు. (తె-శ) ఆంధ్రపత్రిక సాధారణనామసం॥ 81 పుట.

## తెల్లఁగదేశనామము.

'త్రిలింగము' నుండి 'తెలుఁగు' పుట్టెనా? లేక తెలుఁగు నుండి త్రిలింగము పుట్టెనా? (బ్ర. శ్రీ కే. వి. లక్ష్మణరావు ఎం.ఏ. గారిచే వ్రాయబడినది.

ఇదివఱకు సాధారణముగా గ్రంథకారు లందఱును త్రిలింగశబ్దమునుండి తెలుఁగుశబ్దము పుట్టినదని వ్రాయుచున్నారు. శ్రీశైలము, కాళేశ్వరము, ద్రాక్షారామము అనుస్థలములందుఁగల మూఁడులింగములకు నడుమ 'తెలుగు' దేశ మున్నందున దానికి 'త్రిలింగ' తెలుఁగుగా మాఱెనట. తెలుగే తెనుఁగయ్యెనఁట. 'తెలుగు' గ్రంథకాఱులందరిట్లు ఒక్కపాఠమునే పాడుచున్నారు. కాని దీని సత్యాసత్యములు చక్కఁగ బరిశీలించినవారు కారు.

'త్రిలింగ' యనుపదము మొదట లేదనియుఁ తెలుఁగను పదమే మొదటినుండియు వాడుకలోనుండెననియు, ఇటీవలి సంస్కృతపండితులు 'తెలుఁగు' అను ఆంధ్రపదమునకు సమానోచ్చారణ గల సంస్కృతపదముగా నుండవలయునని 'త్రిలింగ, పదమును నూతనముగా నిర్మించిరని నాయభిప్రాయము.

'త్రిలింగ' శబ్దము పదునొకండవ శతాబ్దమునందు అనగా నన్నయ భట్టు కాలమున వాడుకలో లేదు. ఇందుకు 'తెలుఁగు' మహాభారతమే సాక్షి. అందు 'ఆంధ్ర' 'తెలుగు తెనుఁగు వేఁగినాడు' అను పదములే యుపయోగింపఁ

బడినవికాని, 'త్రిలింగ'పదము భాషయను నర్థంబునందు గాని దేశమను నర్థంబునందుగాని వాడబడి యుండలేదు. తిక్కన కాలమునందును ఈపదము వాడుకలోనున్నట్టు కానఁబడదు. తిక్కనగాని అతని సమకాలికులగు కేతనాదులుగాని 'త్రిలింగ' శబ్దమును ఉపయోగించి యుండలేదు. కావున ఆకాలమందీశబ్దము పుట్టలేదని యూహింపవలసియున్నది. అట్లయిన ఈ శబ్దమెవ్వరిచే మొదట నిర్మింపఁబడెనో మనము కనుగొనవలసి యున్నది.

కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థానపండితుఁడగు విద్యానాథమహాకవియొక్క బుద్ధివైభవమే ఈనూతన శబ్ద నిర్మాణమునకు హేతువని నాయొక్క తాత్పర్యము. ప్రతాపరుద్రుడు పదునాల్గవశతాబ్దారంభమున నుండెను. కావున విద్యానాథకవి కాలముకూడ నదియే. ఆకాలమునందు 'త్రిలింగ' శబ్దమును నిర్మించుటకును దానికి నొకవ్యుత్పత్తి కల్పించుటకును ఒక కారణము గలదు.

ఓరుగల్లు రాజధానిగాగల కాకతీయరాజుల రాజ్య విస్తారమును ఈ మూడులింగములును కొంతవఱకు దెలుపుచుండెను. అనగా ఈ రాజ్యపు సీమయొక్క మూడువైపుల నీమూడులింగము లుండెనని చెప్పవచ్చును. కావుననే విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమునందు ప్రతాపరుద్రమహారాజు నుద్దేశించి ఈప్రకారము చెప్పియున్నాడు.

నాటకప్రకరణము చతుర్థాంకమున—

స్వామింస్త్రిలింగదేశ పరమేశ్వర

శ్లో॥ యైర్దేశస్త్రిభిరేష యాతి మహతీం
ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతిరాజకీర్తివిభవైః
కైలాసశైలాః కృతాః
తే దేవాః ప్రసరత్ప్రసాదమధురాః
శ్రీశైలకాళేశ్వర
ద్రాక్షారామనివాసినః ప్రతిదినం
త్వచ్ఛ్రేయసే జాగ్రతు. ౮౮

అర్థము - స్వామీ! త్రిలింగపరమేశ్వరా! ఎవరిచే ఈ దేశమునకు 'త్రిలింగ మను పేరు వడసి మిక్కిలి ఖ్యాతిని చెందెనో, కాకతీయరాజుల కీర్తివైభవముచే ఎవ్వరి (తెల్లని) కైలాసశైలములు చేయఁబడెనో, వ్యాపించిన యనుగ్రహముచే కమనీయులగు శ్రీశైల ద్రాక్షారామ కాళేశ్వర నివాసులైన యా దేవతలు నీశ్రేయస్సువిషయమై ఎల్లప్పుడును జాగరూకులై యుండుదురు గాత.

పైని ఉదాహరింపఁబడిన ప్రతాపరుద్రీయశ్లోకము వలన 'త్రిలింగ' సంబంధములైన మూడులింగములును కాకతీయరాజ్యమునకు సంబంధించినవని స్పష్టముగ తెలియవచ్చుచున్నది.

ఈ మూడులింగములమధ్యనున్న దేశము మిక్కిలి చిన్నదిమై యందు కాకతీయరాజుల రాజధానియైన ఓరుగల్లు కాని ప్రస్తుతము నైజామురాజ్యమునందున్న 'తెనుగు'

దేశము అంతయుగాని అనగా 'తెనుగు' దేశములో రమా రమి సగము దేశము త్రిలింగములోనికి రాకపోవుటయే కాక యీ కాలమందు ఇంగ్లీషువారిస్వాధీనమునందున్న తెలుగు జిల్లాలలో కృష్ణాజిల్లాయొక్క పశ్చిమమార్గముకూడ నందుండ నేరదు. కావున కాళహస్తిహద్దుగా గల దేశము విద్యానాథునిచే వర్ణింపఁబడిన త్రిలింగ మెప్పటికినిఁ గానేరదని 'తెలుఁగు' దేశపుఁబటము చూచినవారందఱికిని స్పష్టమగును.

'త్రిలింగ'మందుండి తెలుగు పుట్టినమాటయే వాస్తవమైనయెడల ఒకానొక కాలమందు ఈదేశమునకు త్రిలింగ మను వాడుక పేరు ఉండియుండవలెను. భాషకు త్రిలింగి యను నామముండవలయును. మహారాష్ట్రదేశపు భాష మహారాష్ట్రి, మగధదేశపుభాష మాగధి. ఇట్లే త్రిలింగిభాష యెచ్చటనైనఁ జెప్పఁబడి యున్నదా? కొన్ని పురాణములు పురాతనములని తెలిసినను వానిలో నూతనముగా ప్రక్షిప్త శ్లోకము లనేకములు కలుపఁబడినందునను 'త్రిలింగ' సంబంధమైనచర్చ పురాణములఁబట్టి నిశ్చయించుటకు వీలులేదు. తదితరగ్రంథములంబట్టి నిశ్చయింపవలయును.

మూడులింగములుగల స్థలమును మూడుకోణములుగా భావించి యొక కల్పితత్రిభుజము నిర్మించుకొని చూచిన యెడల దీనికి పశ్చిమమున నైజాముచాజ్యములోని కొంత 'తెనుగు' దేశమును, ఈశాన్యమున గోదావరి జిల్లాలోని సగముభాగము, విశాఖపట్టణముజిల్లాయును, గంజాములోని కొంతభాగమును, ఆగ్నేయమున గుంటూరుజిల్లాలోని చాల

భాగమును, నెల్లూరు, ఉత్తర ఆర్కాడు, కడప, కర్నూలు, అనంతపురము, బళ్లారిజిల్లాలును ఈ మూడులింగములకు వెలుపలనుండును. అనగా నివన్నియు త్రిలింగములోనివి కావు. శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వరములకు వెలుపల నింత తెలుగు దేశముండగా ఈ మూడులింగములనుబట్టి ఈ దేశమునకు త్రిలింగదేశము వచ్చెననియు నందుండి 'తెలుఁగు' పుట్టెననియు జెప్పుట ఎట్లు పొసగును?

కావున పైని చూపఁబడిన కారణములచే మన దేశమునకు మొదటినుంచి 'తెలుగు' దేశమనియే నామముకలదనియు 'త్రిలింగ' మను నామ మెన్నడును లేదనియు సంస్కృత పండితులు తెలుఁగను పదమునకే (ఎట్లు ఓరుగల్లుయను పదమును సంస్కృతమున ఏకశిలానగరము గావించిరో అటులే) తమ పాండిత్య ప్రకర్షణార్థమై 'త్రిలింగ' మను సాంస్కృతికరూపము నొసంగిరనియు, ఆపదము శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వరములలోని లింగములవలన కలిగెనని యొక కాల్పనిక వ్యుత్పత్తిని మొదట కల్పించినవాడు విద్యానాథుడనియు, అట్లతడు కల్పించుటకు ఓరుగల్లురాజ్యములో మూడుదిక్కుల మూడు లింగము లుండుటయే కారణమనియు నాయొక్క యభిప్రాయము. పండితులు దీనినిఁ జక్కగ పరిశోధింతురుగాక.

నన్నయభట్టుతిక్కనసోమయాజులచే రచియింపఁబడిన గ్రంథములలోగాని పదునాల్గవశతాబ్దమునకుఁ బూర్వము రచింపఁబడిన మఱియేగ్రంథమునందుగాని త్రిలింగశబ్దప్రయోగమును ఎవరైన చూపినయెడల నేను నాఅభిప్రాయములను

మార్చుకొనుటకు సిద్ధముగనున్నాను. ప్రక్షిప్త భూయిష్టము లైన పురాణముల నుదహరించిన లాభములేదని నేనిదివఱకే వ్రాసియున్నాను. సత్యాభిమానమే వలయునుగాని పక్షాభిమానము వలదుగదా.

"సరసాస్తిలవద్గావస్సంతి యత్ర సహస్రశః, స దేశ స్తిలగుర్నామ తతోఽసౌ యజ్ఞియః స్మృతః" దీనికర్థము: తిలలచందంబున రసవంతంబులై గోవులు వేనవేలుగా నేదేశంబునఁ జెన్నారునో యాదేశము "తిలగు" దేశమని చెప్పఁబడును. కావున నీ దేశము యజ్ఞార్హమైనదిగా నెన్నఁబడు చున్నది.

"తిలగు" శబ్దమే "తెలుగు" అని మార్పుచెందినదిగా నొకరు వ్రాయుచున్నారు.

చాళుక్యు (చళిక్యు)లు ఆంధ్రదేశముపై దండెత్తివచ్చి జయించినప్పుడు వారితో వచ్చిన సేనలు సేనానాయకులు నివసించుచుండిన తరువాత వీరు నివసించిన భూభాగమునకు మున్నీరుకాపుకులంబున ప్రసిద్ధపురుషుడు పాండురాజగుటచే నా పాండు రాజు తెల్లనిశరీరచ్ఛాయ గలవాడయినందున నతడు జయించిన ఆంధ్రదేశమునకు తెల్లనివానిదేశమనియు, తెల్లయొక్క రూపాంతరము తెల. ఈ తెల బహువచనాంతముచే తెలగ తెలుగుయయ్యె. అనగా తెల్లనివానిదేశము తెలగ దేశము తెలుగుదేశము యని దేశనామము స్థిరపడెను.

అనంతరము పండితులు, బందరును బృందావనపురము, ఓరుగల్లును ఏకశిలానగరము లేక ఒంటిమిట్ట జేసినటుల త్రి కళింగమనుటకు 'క' లోపించి, త్రిళింగము లేక త్రిలింగమై యుండవచ్చునని 'త్రిలింగ' శబ్దమును నిర్మించి దానికి నొక వ్యుత్పత్తిని కల్పించిరి.

తెలుఁగు అను పదమునకు సమానోచ్చారణగల సంస్కృతపదముగా నుండవలయునని త్రిలింగపదమును నూతనముగా నిర్మించిరని నాయభిప్రాయము. బెజవాడకు విజయవాడయనియు కమ్మంమెట్టుకు స్తంభపురమనియు ప్రౌఢనామములు నూతనముగా కల్పింపఁబడుట మన మెఱింగిన విషయమే. అట్టిదే ఈత్రిలింగశబ్దమునుండి పుట్టినదను తెలుగుశబ్దము.

మన దేశమునకు 'తెలుగు' 'తెనుగు' దేశమనియే మొదటినుంచి అనగా పాండువు నీ దేశము నేలిన నాటినుండియే కలదనుట సమంజసము.

తెలుగు (దెలుగు) శబ్దము "త్రిలింగ" శబ్దభవమా యనుదానిని విమర్శింపఁగా శక్తిసంగమతంత్రము రచింపఁబడిన కాలమున "దైలంగ" శబ్దవ్యవహారము సుప్రసిద్ధముగా నుండెనుగాని "త్రిలింగ" మట్టు లుండెననుకొన జాలము. కాఁబట్టి "తైల్లంగ" శబ్దవ్యవహార మతిప్రాచీనమని తలంపవలసి యుండును.

"త్రిలింగ" శబ్దము సమస్తపదము, "తెలుఁగు" శబ్దము వ్యస్తపదము. "త్రి" యనుదానికి "తె" యనునదియు "లింగ" శబ్దమునకు 'లుంగు' శబ్దమును తద్భవరూపములనుట సమంజస

ముగాఁ గనబడదు. మఱియును "లింగ" శబ్దములోని సిద్ధపూ ర్ణానుస్వాగము తద్భవమగు "లుంగు" శబ్దమున సంక్రమించి యర్ధానుస్వారముగా మాఱుటవలన "లుఁగు" శబ్దము సిద్ధించె ననుట హాస్యాస్పదము. కావున "త్రిలింగ" శబ్దభవము "తెలుఁ" గని యంగీకరింప ననువుపడదు.

'ఆంధ్రపత్రిక సాధారణనామ సం॥ 5లేవ పుట'

## ఆంధ్ర దేశము.

ఈ శబ్దమునకు వ్యుత్పత్తు లన్యంబులు కలవని యొక విద్వాంసునివలన నే నెఱింగితి. వాని నిట దెలిపెద.

"అనంతం ధారయత్యేష దేశః శైలాకృతిం తతః
అనంతధ్రిస ఏవాంధ్రః పరోక్షేణేంద్రవత్ స్మృతః"

దీనికర్థము:—శైలరూపంబుననుండు ననంతుని నీదేశము ధరించియున్నకతంబున దీని కనంతధ్రిదేశమను పేరు గలిగె. అదియే ఆంధ్రమని చెప్పంబడు.

ఇంద్రునికి దొలుత "నిదంద్రు"డని పేరొదవె. దేవతలు పరోక్షప్రియులుగావున "నింద్రు"డని యతనిం బేర్కొనిరి. అట్టులే "అనంతధ్రి" శబ్దమునకు "ఆంధ్రము" అను పేరు గలిగె. దీనికి శ్రుతి.—

"స ఏతమేవ పురుషం బ్రహ్మ తతమమపశ్యదిదమదర్శమితి తస్మాదిదన్ద్రోనామేదంద్రోహవై నామతమిదంద్రంసంతమింద్ర మిత్యాచక్షతే పరోక్షేణ, పరోక్షప్రియా ఇవ హి దేవాః"

అని ఐతరేయోపనిషత్తు ప్రథమాధ్యాయము తృతీయ ఖండముచివర నున్నది.

## చతుర్థ పద విమర్శనము.

మున్నీ గు కాపు జాతీయులు సోమసూర్యవంశజులుగ కొన్ని శాసనములయందును, మఱి కొన్ని శాసనములయందు చతుర్థవంశజులుగా పేర్కొనబడిరి. ఇందలి చతుర్థ శబ్దము శూద్రజాతిపదము కాదనుటకు వ్యుత్పత్తులు సాధించి యున్నా రనియు, వీటిలో కాశ్యపగోత్రజులే నాయకు (దండనాయకు) లుగాగల తెగ చతుర్థు లన్నదే సమంజసంబుగా నున్నదనియు

ఇందు రెడ్లను చెప్పు చతుర్థపదము శూద్రపదము కాదని స్పష్టపడుననియు కాకతీయులు చతుర్థులని కొన్ని శాసనములు, చంద్రసూర్యకులజులని కొన్ని శాసనములు గల వనియు

ఉత్తరహిందూస్థానమునుండి ఆంధ్రదేశమునకుఁ బల్లవ, చోళ, చాళుక్య, రాష్ట్రకూటులు వచ్చిరనియు, నిందు నాల్గవ తెగవా రనుటకు బదులు చతుర్థ జాతివారనియు, కొందఱు జైన, బౌద్ధ, శైవ, వైష్ణవ మతములలో నాల్గవ మతమువా రగుటచే చతుర్థజాతివా రనియు, చతుర్థులకు, శూద్రులకు, చాలా భేదముకలదనియు, రెడ్డికుల నిర్ణయ చంద్రికను వ్రాసిన శ్రీమాన్ శేషాద్రి రమణకవులు శతావధానులుగార్లును శ్రీమాన్ పెద్దమందడి వెంకటకృష్ణకవి గారును తమతమ యభిప్రాయముల నొసగియున్నారు.

పంచమహాభూతములయందు ఆకాశము, వాయువు, అగ్ని, నీరు(జలము). ఇందునాల్గవది మున్నీరు (సముద్రుడు). చంద్రుడు మున్నీటిపట్టియగుటచే చంద్రవంశజులు చతుర్థులని మూలపురుషునికులము వారమని దెల్పిరి. సముద్రునకు బ్రహ్మ మరీచి కశ్యపుడు సూర్యుడు. ఇందు చతుర్థుడు సూర్యుడు గాన సూర్యవంశజులు సహా నొక్కొకచోట తాము చతుర్థ వంశజులమనియు చెప్పియుండినటుల దెలియుచున్నది.

సదాశివరాయల కొల్లిపఱశాసనమున దేవతలు మథించిన క్షీరసముద్రము (మున్నీటి) నుండి చంద్రుడు పుట్టెననియు చంద్రునకు బుధుడు ఇట్లు పరంపర పురూరవుడు ఆయువు నహుషుడు యయాతి తుర్వసువు. ఈతుర్వసువంశమున తులువేంద్రుడైన తిమ్మభూపతికి ఈశ్వరభూపతి. ఇట్లు పరంపర నరసారాయలు వీరసింహరాయలు కృష్ణరాయలు అచ్యుతరాయలు వెంకటదేవరాయలు సదాశివరాయలు. వీరు సదాశివ మహారాయపురమని నామాంతరము గల కొల్లిపఱయను గుంటూరుజిల్లా తెనాలితాలూకాలోని గ్రామమున వేయించిన క్రీ. శ. 1543 నాటి శాసనమునందు మున్నీటిపట్టమైన చంద్రునివంశజుడనని చెప్పికొనియుండుటచే మూలపురుషుడు సముద్రుడే యనుట సమంజసము.

రాజులుగానున్నవారు సూర్యచంద్రవంశజులుగా చెప్పికొనిరనియు సామాన్యదశలోనున్నవారు మున్ నీరుకులము వారుగా చెప్పికొనిరనియు విశదమగుచున్నది. ఐనను ఉభయ వంశములవారలకు మూలపురుషుడొకడే యనక తప్పదు. ఒక

కుటుంబమునందలిమనుమలు తమతమతండ్రిపేళ్లను చెప్పికొనుట సహజము అందొకడు ఫలానివారికుమారునికి కుమారుడనని తాతనుండి మొదలుపెట్టి చెప్పిన దోష మేమియు లేదు కదా? ఈకారణముచే చాళుక్యులు రాజులైనను మున్నీరుకులము (మున్నీరుకులము) వారమని చెప్పియుండుట నిక్కమని తోచక మానదు.

వీరు వాహినీపతివిద్యయం దఖండ పాండిత్యము గల వారై యుండి వాహినీపతు లవుటచేతను ఈ పదమునకు దండ నాయకపదము పర్యాయపద మవుటచేతను తెల్లని పాండు రాజు జయించిన ఆంధ్ర దేశమందలి ప్రదేశమునకు నాయకులై తెల్లనివానినాయకులు తెలగానాయకులనియు జలార్గళశాస్త్ర ప్రకారము జలస్థలము జూపి మున్ నీరు కాపులు మున్నీరు కాపులనియు పిలువబడువారు చతుర్థ మహాతత్వమైన నీరు కులముకాపులనియు చతుర్థవంశజులమనియు చెప్పికొనుట సహజమనుటకేమియు సంశయ ముండదు.

ఋగ్వేదమున జలము(నీరు)యొక్క ఉపయోగము.

పురాణములకన్న విశ్వాసయోగ్యములును ప్రకృతివిరుద్ధములుగాని యనేకవిషయములు వేదమునందు గలవు. ఇప్పటి శ్లోకాత్మకములగు పురాణములు లేనికాలమున ఆర్యులచే పురోభివృద్ధికి విజ్ఞానమునకు మూలకారణములగు సత్యవిషయము లెన్నియో వేదభాగములందు విరచింపఁబడి యుండెను.

ఇటీవలి పురాణకారులు సత్యములగు వేదార్థములను

దెలియజాలకనో నొకరికన్న నొకరు మించిపోవలయునన్న యాతురమువలననో యార్యులజీవనము, విజ్ఞానము, పరిశ్రమ అన్నియు యనిత్యములే యని ప్రపంచమునకు బోధించునట్టి పురాణములను కల్పించిరి.

వేద భాష కఠినమైనదికాదు. కాని యాశబ్దములయొక్క యాంతరిక భావములను గ్రహించుట మాత్రము మిక్కిలి కష్టము. ఐనను భాష్యకారు లనిపించుకొనినవారు సైతము గ్రహింపజాలని క్రొత్తవిషయము లిక్కాలమునాటి విమర్శకు లకు గోచరించుచున్నవి. ఈ నవీన సిద్ధాంతములను చూచి అల్పజ్ఞానులు, అవిమర్శకులు, మూఢులు, కుక్షింభరులు నగు కొందరు పండితమ్మన్యులు నిరసించెదరు. ఏది ఎట్లున్నను వెనుకటి పురాణములు మన తాతలు చెప్పినమాటలే ఐనను కథ పుట్టిననాటినుండి నేటివరకెందరో తమయిష్టమొచ్చినటుల మార్చి వేలను నూర్లుగా నూర్లను వేలుగా శ్లోకములయందు వ్రాసిరి కృతయుగసత్యము త్రేతాయుగమున, త్రేతాయుగ మందలి సత్యము ద్వాపరమున, ద్వాపరమందలి సత్యము కలి యుగమునందు లేక నొక్కొక యుగమున నొక్కొక్కరు వ్రాసిన గాథలు నిజవిమర్శకుల కసత్యములే మెండుగా గానఁ బడుచున్నవి.

వేదమున జూడుము, ఆరంభమున అనగా ముఖ్య నీరున (జలమున) కెన్ని పేరులు గలవో మనము గమనింపవలయును. అమరాదికోశములందు నీరు (జల) నామము లెన్నియో కన బరచఁబడినవి. కాని నీరుయొక్క ఉత్పత్తివిధాన మెట్లో తెలుపు

నామమొక్కటియు లేదు. సంస్కృతనిఘంటువులయందు లేనంత మాత్రమున మున్ నీరయుత్పత్తి లేదనువారల మాటలను నమ్మక దీర్ఘదృష్టితో పరిశోధించినయడల వేదమే శంకా సమాధాన మొసఁగును

వేదమునమాత్రము జల (నీరు) నామము జన్మమని కలదు. జన్మశబ్దార్థము పుట్టుకయని యందఱెఱింగినదే. అన్ని పదార్థములజన్మముకన్న నీరుయొక్క పుట్టుకయందేదేని విశేషముండవచ్చును. లేకున్న వేదము ప్రత్యేకముగ మున్ నీరు (జలము)నకు జన్మము అని నామ మివ్వజాలదు.

ఆధునిక విజ్ఞానశాస్త్రజ్ఞులు రెండువాయువులయొక్క సంయోగమువలన జలముయొక్క జన్మోత్పత్తి యగునని తెలిపెదరు. వారియభిప్రాయమువలన జలమునకు జన్మనామము సార్థకమగుచున్నది.

'భూత భువన భవిష్యత్' ఈమూడుశబ్దములును వేదమున నీరు (జల)వాచకములు నై యున్నవి. 'భు' ధాతువు వలన ఈమూడు శబ్దములు జనించినవి. 'భు' ధాతువున కర్థము 'పుట్టుట పుట్టించుట పుట్టించగలదు' అని యెఱుంగవలయును. ఈయర్థమువలన ముఖ్యముగ నేను గనపరచునదేమనః అన్ని వస్తువులవలెనే నీరు(జలము)నకు పుట్టుక గలదనియును జలము ముందటివలెనే యిపుడును పుట్టుచున్నది, ముందు పుట్టగలదు, అనిమాత్రమే. వేదములందు "శేత" శబ్దము గూడ నీరునకే వాడుకోబడినది. సాధారణభాషయందు మాత్రము వీర్యమునకు

రేతస్సని చెప్పుదురు. ఈవిషయమున బ్రాహ్మణములందలి మిత్రావరుణులగాధ యొకటి గలదు.

మిత్రావరుణౌ త్వా వృష్ట్యావతామ్॥ వ - యజుర్వేద-2,16 శత-బ్రా-1-7-3-12. "మిత్రావరుణులు వృష్టిని గలిగించి నీటియొక్క రక్షణము చేయుదురుగాక." ఈవచనము వలన మిత్రావరుణులే జలమును కలిగించు యధికారము గలవారని స్పష్టపడినది. వీరిరువురిలో స్త్రీపురుష సంజ్ఞ లేదు. ఇద్దరును పురుషులే. వీరిరువురు కలిసియే జలమును కలిగింతురని అధర్వణ వేదమునందుగూడా కలదు.

మిత్రావరుణౌ వృష్ట్యధిపతీ తౌమావతామ్॥ అధ॥5,24,5॥

"వృష్ట్యధిపతులగు మిత్రావరుణులిద్దరు నారక్షణము చేయుదురుగాక"

దీనివలన వృష్టిని జలమును గలిగించువారు మిత్రావరుణులనియే స్పష్టపడినది. ఇక వారికథ విమర్శింతము.

దేవలోకమున ఇంద్రునిసభయందు అప్సరసలను జూచి మిత్రావరుణులు మోహము నొందిరనియు వెంటనే వారికి రేతస్ఖలనమైన దని పౌరాణికులు వ్రాసియున్నారు.

"మిత్రావరుణ యే రేతశ్చకాద"ఇదియే పురాణగాధ.

స్వర్గలోకము మహనీయులగు దేవతలకావాసమైనది. యజ్ఞయాగాది పుణ్యకర్మ లొనర్చినవారందరు యచ్చటికి వెళ్లెదరు. అట్టి పవిత్రస్థానమున కులటలగు వారాంగనలతో యావశ్యకమేమి? ఇట్టి యవివేకపు కథలు వివేకము లేని

కాముకులు వినవలసినవియే కాని విజ్ఞానవంతులు వినవలసినవి గావు.

పురాణములో నెచ్చట జూచినను ఇంద్రుడు మొదలగు దేవతలు కామాతురులై చరించుట శాపములం బడయుటయే కలదు. ఇదియే దేవత్వ ముఖ్యలక్షణమనిన ఈ కాలమున వారిని మించిన దేవత లెందరు లేరు?

మఱియొక సామాన్యవిషయమును విచారింతము. ప్రపంచమున మనమెందరినో సుందరయువతుల సందర్శించితిమి. హృదయము చలించునేమో కాని, రేతస్ఖలనము మాత్రము సంభవమా? వింటిరా? దేవతలగు మిత్రావరుణుల కిద్దరికి నొకే సారి వీర్యస్ఖలనమగుట కేవల మసంభవము.

ఒక చక్కని స్త్రీని చూచినమాత్రముననే ఇంద్రియము కాపాడుకొనజాలని యల్పమతులు దేవత లనుటకంటె మరియొకయవివేకము గలదా? ఇటువంటికథనంతయు పురాణకారులు కల్పించినదియే యని తోచుచున్నది.

రేతస్సునకు 'జల'మనియు మిత్రావరుణు లిద్దరు వాయువులనియు గల వేదమునందలి నిగూఢ భావమును మనము గ్రహించుటచే మన దేవతలు మహిమాన్వితులై విరాజిల్లెదరు. మిత్రావరుణు లను రెండువాయువుల యొక్క సంయోగమువలన నీరు (జలము) లేక రేతస్సు గలుగుచున్నది అని వేదాభిప్రాయము.

ఇకముందు యప్సరసలనుగూర్చి విచారింతము.

అప్సరః దీనియొక్క యర్థము నీటియందుం బుట్టిన

వారని కలదు. పురాణకర్తలును సంస్కృత పురాణములకు టీకవ్రాసినవారును యీ గ్రంథములను ఆంధ్రమున వ్రాసిన వారును గూఢార్థములను తెలిసికొనుటయం దుపేక్షించి అలంకారశాస్త్రప్రవీణతచే నిజార్థము అడుగంటజేసి అనిజార్థముచే తమ యిష్టమువచ్చినటుల అర్థము సమర్థించి వ్యర్థముగ కాలహరణము గావించిరని తోచుచున్నది.

అప్ = నీటియొక్క ఆశ్రయమువలన దేనియొక్క సరణ = సంచారమగునో దానియొక్క పేరు అప్సరః (అప్సు సరంతీతి అప్సరసః) కాగలదు. ఈయభిప్రాయము సుప్రసిద్ధ అమరటీకాకారులగు క్షీరస్వామిగారు గనబరచిరి.

వర్షకాలమున ఆకాశమునందు మేఘోత్పత్తి యగుటయు, తోడనే భయానకమగు మేఘగర్జనము కలుగుటయు, మెఱుపులు మెఱయుటయు, తదనంతరము వృష్టియు సంభవించును. మేఘముయొక్క ఆశ్రయమువలన విద్యుత్తులు మెఱయును. విద్యుత్తులకును, జలమునకు యీవిధమగు సంబంధము కలదు. నీటియొక్క సహాయమువల్లనే విద్యుత్తుయొక్క సంచరణముకాగలదు. దీనికే "యప్సర" యనబడును. కేవలము శుద్ధమగు యుదకము విద్యుత్సంచారమునకు యోగ్యముగాదు.

ఎప్పుడు అప్సరసల (మెఱుపుల) నాట్యమారంభమగునో వెంటనే మిత్రావరుణులను జలదేవతలకు రేతః (ఉదకము) పతనము గలుగును. యీ ఘటన వర్షకాలమున మన మెప్పుడును చూచుచున్నదే.

అప్సరసలనగ మెఱుపనియు, రేతస్సనగ ఉదకమనియు

గ్రహించితిమి. కాని యప్సరసలలో వేరు వేరు పేరులుగలవా రున్నారు. వారందరిని ఇటులే పరిచయము చేసికొనవల యును. లేనిచో పౌరాణికులు మఱియు చరిత్ర కారులును యుక్తి యనరా?

1. ఘృతాచి, ఘృత=ఉదకముయొక్క, అంచన=ప్రవా హమును కల్పించునది ఇది యొకయప్సరసపేరు. ఇది విద్యుత్తని వేరే జెప్పనక్కరలేదు.

2. ఊర్వశి (ఉరూ వశే యస్యాః) దేనియొక్క యా ధీనమునందు సమస్తము గలదో ఆవిద్యుత్తునకు ఊర్వశి యని చెప్పుదురు. ప్రతివస్తువు మెరుపున కాధీనమైయున్నది. మఱియొకయర్థము: (ఉరు బహు ఆశ్నుతే) యేది అధికముగ భక్షించునో విద్యుత్ (పిడుగు) పతనమువలన జగత్తునకెట్లు నాశ ము సంభవించునో చెప్పనక్కరలేదు.

మఱియు నూర్వశీపురూరవులను గూర్చిన కథలోని ముఖ్యభావము: "పురూరవ" అధికమైనధ్వనిగలదని యర్థము సుగమముగ మనకు దెలియుచున్నది, అనగా, మేఘగర్జ నము. ఉదకము ముఖ్యముగ ఊర్వశీశబ్దము విద్యుత్ (పిడుగు) వాచకముగను పురూరవశబ్దము మేఘగర్జనమనియు తెలియ వలయును.

పురూరవా బహుధా రోరూయతే॥ నిరుక్తం 5,4,46.

పై నిరుక్తకారుని వచనమువలన 'పురూరవ (మేఘ గర్జన)' శబ్దార్థస్వరూపము గోచరించినది. ఇక మిత్రా వరుణులను గూర్చి మన మింతవఱకు ప్రశంసించితిమి.

1. మిత్రింహువేపూతదక్షం 2. వరుణంచరిశాదసం
3. ధియం ఘృతాచీ సాధన్తాం. ఋగ్వేద 1,2,7.

ఈ మంత్రము వాయుసూక్తమున మిత్రావరుణులను గూర్చినదై యున్నది.

1. పూతదక్షం మిత్రం హువే॥ బలవంతుడగు మిత్రవాయువును నేను స్వీకారమొనర్చుచున్నాను.

2. రిశాదసంచవరుణంహువే॥ ఇతరుల స్వరూపమును మార్చు వరుణవాయువునుగూడ నేను స్వీకారమొనర్చుచున్నాను.

3. ఘృతాచీధియం నాధన్త॥ వీరిద్దరును జలమును సృష్టించు కార్యమును సాధించుచున్నారు.

వరుణశబ్ద విశేషణములగు 'రిశ ఆదస్' శబ్దార్థము యితరుల స్వరూపము నాశనము జేయునది అని కాగలదు. 'రిశు, రిషు, రుశు, రుషు' యీ ధాతువులయొక్క యర్థము ఇతరులను వికృతము చేయుట, దుఃఖపెట్టుటయై యున్నది. ఇంగ్లీషుభాషలోని "రుస్టు" శబ్దము ఈ ధాతువునుండియే కలిగినది.

ఆకాలమునందలి వరుణనామక వాయువునే ఈ కాలమున 'ఆక్సిజన్' అని వాడుకొనుచున్నారు. వరుణ (ఆక్సిజన్) వాయువువినా యేజీవము నిలువజాలదు. ఇదియే ప్రాణవాయువని చెప్పఁబడుచున్నది.

మిత్రవాయువునే యిపుడు ఇంగ్లీషుభాషలో "హైడ్రోజన్"అనియు, మిత్ర శబ్దమును 'నిమిటర్' అనియు వాడు

చున్నారు. ఈ మిత్రావరుణ వాయువులవలననే జలోత్పత్తి గూడ యగుచున్నది. ఈ విధముగ మన వేదములనుండి సత్య మగు యర్థమును గ్రహింపవలయునుగాని పుక్కిటిపురాణ ములపై యాధారపడియుండిన లాభములేదు.

అప్స్వంతరమృతమప్సు భేషజం, అపామృత ప్రశస్త్యే దేవా భవతి వాజిన॥ ఋగ్వేదము 1-23-19.

తా. నీటియం దమృతమున్నది. మఱియు ఔషధము గూడనున్నది. పై మంత్రమువలన నీరునందు మంచి శక్తి గల దని మనకు తెలియుచున్నదేకాని అనుభవము మాత్రము మనకు లేదు. ఇదివరకే 'మ్రగిఫిథ్' అనునొక పాశ్చాత్యుఁడు ఈమంత్రమువల్లనే జలమందు రోగనివారకగుణమున్నదని తెలిసికొని ప్రచారము చేసియున్నాఁడు.

అప్సుమేసోమో అబ్రవీత్, అంతర్విశ్వాని భేషజా, అగ్నించ విశ్వశంభువమ్, ఆపశ్చవిశ్వభేషజీ॥

ఋగ్వేదము 1-23-20.

సోముడనురాజు ఇట్లనుచున్నాఁడు: నీటియంతరమున సమస్తౌషధములు గలవు. ఎట్లు అగ్ని హితకారకుడై యున్నాడో అట్లే (విశ్వభేషజీః ఆపః) నీరు కూడ ఔషధరూపమైయున్నది. మగ్రిఫిథ్ దీనినిగూడా భాషాంతరీకరించుకొన్నాడు.

ఇదమాపః ప్రవహాత యత్కించ దురితమ్మయి॥

ఋగ్వేదము 1-23-22.

తా॥ నాయందు యేదేని దురితము గలిగెనేని నీరు దానిని దూరముజేయుగాక! ఈమంత్రమున శరీరమందలి సర్వ

దోషములను నీరు(జలము) నివర్తింపఁజేయునని కలదు. ఏదేని దుష్టపదార్థములవలన రోగములు కలుగునప్పుడు వానిని దూరముజేసి శరీరమును పరిశుభ్రపరచునది నీరు మున్నీరు వలననే ఆరోగ్యము లభించుచుండెననుట.

అపఇద్దా ఉభేషజీ తాపో అమీవ చాతనీః అపః సర్వస్య భేషజీ, స్తాస్తేకృణ్వంతు భేషజమ్॥ ఋగ్వేదము 10-13-7-6

నీరు నిశ్చయముగ ఔషధమే; సంపూర్ణముగ సర్వ రోగములను నశింపఁజేయగలదు. ఆనీరు నీకొరకు యౌషధ ముగ చేయఁబడినది.

ఈప్రకారముగ వేదమునందు మున్నీరుయుత్పత్తియు యానీటివైద్యవిధానమును గలదు. కావున పాఠకులీసద్విషయ మును సత్యదృష్టితో గ్రహించి పుక్కిటి పురాణముగాథల నాధారముగాగొని యుండకూడదు.

## గోత్రములు.

మున్నీరు (మున్ వేల్) కులము వారిలో మహాఘనత వహించి వందలసంవత్సరములు ఏకాధ్వరముగ రాజ్యపరిపాలన మొనర్చిన చళిక్య (చాళుక్య) రాజులు "మానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశిక వరప్రసాదలబ్ధరాజ్యాణాం" యని తమగోత్రమును బిరుదునామమును తమశాసనములయందు సహా పేర్కొనిరి.

వీరిపూర్వోత్తరమేదియైన కనుగొనిమెదమన్న యా బిరుదములన్నియును వీరు వీరికంటె బూర్వము రాజ్యముచేసిన

కదంబులయొద్దనుండి తీసికొనినవిగాని క్రొత్తవి కావనియు కదంబులను గొట్టి రాజ్యము తీసికొనినట్లె వారి బిరుదములను కూడ వీరు లాగుకొనిరనియు నంతకు పూర్వము నీతెగకు ప్రముఖతగాని రాజ్యముగాని బిరుదములుగాని ఉండెననుటకు నాధారములు లేవనియు బ్ర. శ్రీ కె. వి. లక్ష్మణరావుగారు వ్రాసియున్నారు.

ఈచాళుక్యులు తాము మానవ్యగోత్రులమనియును హారీతిపుత్రులమనియును జెప్పికొనిరి. వీరిలోనుండి మఱియొక శాఖగాఁ జీలి యాంధ్రదేశమును బాలించిన పూర్వచాళుక్యులును గూడ తాము హారీతిపుత్రులమనియు మానవ్యగోత్రుల మనియు జెప్పుకొనిరనియు చాళుక్యులశాసనములలోని గాధలలో హారీతిపుత్రు లను పేరెట్లు వచ్చినదియుఁ దెలుపఁబడియుండలేదనియు విక్రమాంక దేవచరిత్రమునఁ జాళుక్యవంశమున హారీతుఁడు మానవ్యుడు ననువీరులు జనించి ప్రసిద్ధులయిరని యుండుటయు

చాళుక్యు లుత్తరముననున్న కాలమునగూడ హారీతపుత్రు లను పేరు గలిగియున్నట్లుగ విజయవర్మయొక్క ఖైరా శాసనము చాటుచున్నదనియు మఱియు అలహాబాదు ప్రాంతముననున్న రీవాలోని యొక శాసనము మహీపాలుని నామమో లేక మఱియొక విడిమనుజుని పేరో తెలియదుగాని హారీతిపుత్రశౌనకుఁడని యొక నామమును పేర్కొనుచున్నదనియు ఈ శాసనము క్రీస్తునకు పూర్వము రెండవ శతాబ్దములోనిదిగ నొకరు చెప్పియున్నారుగాని డాక్టర్ బర్గెస్సుగా

రంత పూర్వపు శాసనము గాదని యభిప్రాయపడినా రనియు బ్రి. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు తమ ఆంధ్రుల చరిత్రము ప్రథమభాగము పూర్వయుగము క్రీ. శ. 1910 ముద్రితమైన దానియందు 260 వ పుట మొదలు వ్రాసియున్నారు.

"వసిష్ఠకౌండిన్యధనంజయానాం గోత్రోద్భవాః కాశ్యపగోత్రజాతాః
శూద్రా ఇవాత్యంతగృహీతవేషాః భూపా భవిష్యంతికలాయుగేహి"

వసిష్ఠ కౌండిన్య ధనంజయ కాశ్యప గోత్రులగు రాచవారు కలిలో శూద్రప్రాయులగుదురని వ్రాసియున్న పై శ్లోకముచే కలియుగమందలి క్షత్రియులు శూద్రులుగా భావింపఁబడుచుండు రని తెలియుచున్నది. ఇట్టిస్థితిలో గోత్రములను మాత్రము దెలుపుటకేమియాటంకము గలదో తెలియదు. క్షత్రియనామముతోకూడ తమగోత్రప్రవరనామములనుసహా వదలి తిరిగి రాజ్యలాభానంతరము తద్‌రాజ్యపాలకుల బిరుదములే ధరించుచుండుటచే, కదంబులనుండి రాజ్యమును వారిబిరుదములుకూడ లాగికొనిరని పండితులు వ్రాసియున్నారు.

## గోత్రశబ్దార్థము.

గోత్రమనగా మూలపురుషుఁడని ఒక యర్థము. విశ్వామిత్రగోత్రమనఁగా విశ్వామిత్రమహర్షి కూటస్థుడుగా గలవారు అని బహువ్రీహిసమాసముచేత నేర్పడిన యర్థమని యొకరు.

తండ్రియు కుమారుడు ఇరువురు గోత్రప్రవర్తకు లెట్ల

గుదురనగా తండ్రినుండి చీలిన మఱొకసంతతివారలకు తండ్రియే గోత్రప్రవర్తకుడు, పుత్రునిసంతతినుండి చీలినగోత్రమునకు పుత్రుఁడు గోత్రప్రవర్తకుడు, తాతనుండి చీలినవంశమునకు తాతయే గోత్రప్రవర్తకుఁడు కానచ్చుననియు వీరిలో పుత్రపరంపరయనియు శిష్యపరంపరయనియు రెండువిధములు. వీని ననుసరించి ప్రవరలున్నూ రెండువిధములుగా నున్నవి.

ఋషిలక్షణము.

ఋషులనగా శాస్త్రీయసంస్కారసమన్వితులై శమదమాద్యాత్మగుణవిభూషితులయి విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమ అత్రి వశిష్ఠ కశ్యప అగస్త్య భృగు అంగిరసుల యొక్క సంతతియందు జన్మించి జగత్ప్రసిద్ధినందినవారలు. ఇట్టివాడే శాస్త్రమున ఋషి యని గ్రహింపఁబడును.

ఒక్కగోత్రమున అనేక ప్రవరలున్నూ ఒక్క ప్రవరకు అనేకగోత్రములున్నూ కలిగియుండుననువిషయమును మనము తెలిసికొనవలయును. ప్రవరయందు గలవారలు ఋషులుతప్ప దేవతలుగాని మనుష్యులుగాని యుండరు.

ఆపస్తంబసూత్రప్రవరాధ్యాయమున ధనంజయ వంశీకులకు ముగ్గురు ఋషులు గల ప్రవరము 'వైశ్వామిత్ర మాధుచ్ఛందస ధానంజయ' అని హోత (ఋగ్వేదము తెలిసినవాడు) చెప్పవలయును. 'ధనంజయవత్ మధుచ్ఛందోవత్ విశ్వామిత్రవత్' అధ్వర్యుడు (యజుర్వేద తంత్రము నడపువాఁడు) చెప్పవలయును అని యున్నది.

చంద్రవంశజులైన మున్నీరుకాపుకుల చాళుక్యులు 'మానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశికవరప్రసాదలబ్ధ రాజ్యాణాం' అని బిరుదములు చెప్పికొనియున్నారు.

(మానవ యశః) మానవ్యశః= మానవులలో కీర్తిగల (గోత్రిణాం) మూలపురుషుడైన హారిత హారీతి యనువాని (పుత్రాణాం) పుత్రుడసియు, (కౌశిక) లేక (కౌశికః) విశ్వామిత్రునియొక్క(వరప్రసాదలబ్ధరాజ్యాణాం) వరముచే రాజ్యము లభించెననియు అనగా ఆదిరేడువంశజులు విశ్వామిత్రుని యొక్క అనుగ్రహమున దండనాయకవిద్యయందఖండపాండిత్య మును బడసి తద్ప్రభావముచే (పరాక్రమముచే) రాజ్యములు సంపాదించిరని యర్థముగల పైశాసనమును వ్రాయించి రనుట సమంజసముగా నుండును.

ఇంక (మానవ్యశః) యను పదమున (మానవ్యస) అని యున్నది. కొల్లిపలశాసనమున సకార శకారములకు గల వ్యత్యాసము'శ'లోనికుడివైపుననుండు నిలువుగీటునకు మధ్యగా ఎడమవైపునకు చిన్న యడ్డుగీటు నిచ్చిన నది 'స' యగు చున్నది. అది లేనిది 'శ' యనబడుచున్నది. పూర్వము చాళు క్యుల లిపిలో నిట్టి స్వల్పభేదము లుండుటచే 'శ' 'స' గా వ్రాయఁబడినదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు భారతి క్రీ.శ.1926 3వ సంపుటము 7వ సంఖ్య 76వ పుటయందు వ్రాసి యున్నారు. ఇటువంటి వర్ణభేదములచే అర్థభేదము కలుగు చుండును.

ఋగ్వేదమున మేఘమునకు గోత్రమను పేరు గలదు. గాః త్రాయతీతి గోత్ర, అనగా గోవులను రక్షించునవి మేఘములవుటయు ఆ మేఘములకు వరుణు డధిపతియౌటయే గాక నీటిఱేడౌటచే వరుణకులమువారనియు వీరినే ముదాలియార్ యని యందురని థర్‌స్టన్‌దొరగారు వ్రాసియున్నారు. వరుణుడు సముద్రాధిపతి యైనందున వరుణకులగోత్రమువారని సహా మున్నీరుకాపులు చెప్పెదరు.

చాళుక్యరాజవంశజులైన ఓరుగంటి ప్రతాపరుద్రాది రాజులు వరుణకులమువారమనిసహా వ్రాసికొనిరని మెక్ లేను మాన్యూయల్ (Varunakula - Meaning caste)లో గలదు. మరియు వీరికి ద్రవిడమున వెల్లాలార్ యను నొకపేరు గలదు (అనగా నిండియుండిననీటిప్రభువులు). కరలార్ యను నొక పేరు గలదు (అనగా మేఘాధిపతులు). ఈవిషయము థర్‌స్టన్ గారే వ్రాసియున్నారు.

ఋగ్వేదమందు 6వ మండలము 3వ గీతములయందు వర్షమునిమిత్తమై ప్రార్థింపఁబడిన మంత్రములు వశిష్ఠమహా ఋషిచే ఉపదేశింపబడియుండుటచే గురుభావమున వశిష్ఠ గోత్రజులనియు సహా దెల్పెదరు.

మున్నీటిపట్టియైన శ్రీలక్ష్మీదేవి స్వయంవరసమయమున తనకు దగియున్న దేవదేవుండగు నారాయణుని నవలోకించి యానందబాష్పములిడువగా నబ్బాష్పమువలన పసుపుచెట్టు పుట్టెను. నేటికిని వివాహములయందు కంకణము గట్టెదరు. దీనిచూర్ణమే కల్యాణమునకు మూలకారణము. దీనిలో

శ్రీవర్ణ, ఆదిత్యవర్ణ, అగ్నివర్ణ, అరుణవర్ణ, పద్మవర్ణ అను ఐదువర్ణములు గలవు. ఈ పసుపు మున్నీటిపుత్రికయగు లక్ష్మీ దేవిసంతోషసమయోత్పన్న మవుటచే మున్నీరుకాపులు పసుపులగోత్రమును సహా వ్యవహరింతురు. విష్ణువు నాటినుండి శ్రీహరి యని పిలువఁబడుటచే శ్రీహరిగోత్రమనియు కృషికి మూలము భూమియై యాభూమి కధిపతులై యుండినకారణముచే కాశ్యపి (భూమి) గోత్రమనియు కాశ్యపగోత్రమనియు ధనుర్విద్యాదిగురువు విశ్వామిత్రుఁడవుటచే విశ్వామిత్రగోత్రమనియు ఇటు లొక్కొకకారణమునుబట్టి నొక్కొకగోత్రమును దెల్పుచుందురు.

## మున్నీరుకాపులలో వివాహములు ద్రావిడ సాంప్రదాయముగ జరుగుచున్నవి.

ఏదేశమందుగాని వివిధజాతులు చేరినప్పుడు వారు పరస్పరకలయికలేక యుండుట తటస్థించదు. హిందూదేశమందు అట్లు తటస్థించినదని నమ్ముటకు సాధ్యముకాదు. గాని ఒక తండ్రికే అదితియందు పుట్టినవారు ఆర్యులనియు దితియందు బుట్టినవారు ద్రావిడులనియు రెండుశాఖలుగ నేర్పడిరి.

ప్రస్తుతపు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రకులము లన్నియు ఆర్యద్రావిడజాతుల సమ్మేళనమువలననే యేర్పడినవి. కొన్నికులములలో ఆర్యసమ్మేళన మెక్కువగను మఱి కొన్నిటిలో ద్రావిడసమ్మేళన మెక్కువగను ఉండవచ్చును. బ్రాహ్మణులకు అరుంధతి మత్స్యగంధి మొదలగు ద్రావిడ

సమ్మేళనము పురాణప్రసిద్ధము. వైశ్యులకు నిట్లె ద్రావిడసమ్మే ళనము కలిగియుండవలెను.

బ్రాహ్మణులందుకంటె వైశ్యులందు ద్రావిడులకల యిక నెక్కువయని నమ్మవచ్చునని శ్రీయుత తుంఫ్రాడి భగ వంతం గుప్తగారు వ్రాసియున్నారు.

హిందువులలోని ద్రావిడులు ద్రవిడాచారములు కలిగి యుండుట సహజము. పురాణోక్తముగాఁచేయబడు వివాహము లందలి కర్మ యంతయు ద్రావిడసాంప్రదాయమే. మేనరికము ప్రోలుస్తంభములు అరివేణికుండలు మొదలగునవి ద్రావిడ ములు. ఆర్యులయజ్ఞములవలెనే ద్రావిడులలో బలులు ఉండెను. వివాహములలో జేయు "నాగబలి" ఒకవిధమైనబలి. అటులనే పోచమ్మ నాగులపూజ కూడ ద్రావిడ సాంప్రదాయము. ద్రావిడులైన మున్నీరుకాపులు ద్రావిడాచారముకలవారై యున్నవారు. వీరి కాచార్యులు ద్రావిడులు, పౌరోహితులు ద్రావిడులు. వీ రాంధ్రదేశముననున్నను పెరుమాళ్ ఆండాళ్ కోవెల కల్యాణం తిరువారాధన తదియారాధన కరిఆమదు పన్నార్యరం మంచితీర్థం తళియ ప్రసాదం టెంకాయ ఆదా యము అమ్మాయి పుళిగోర దధ్యోదనం శొండెలు ఆచా ర్యాదులకు దాసోహం అనియు ఇట్టి ద్రవిడపదము లనేక ములు నేటికి వీరిలో వాడుకయందు గలవు.

ద్రవిడదేశమందలి పొయిగై యాళ్వారు (సరోయోగి) పూదత్తాళ్వారు(భూతయోగి) పేయాళ్వారు (మహాయోగి) తిరు ముజిసయాళ్వారు (భక్తిసారులు) పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు)

ఆండాళ్ (గోదా దేవి) కులశేఖరాళ్వారు తిరుప్పాణియాళ్వారు (యోగివాహుడు) తొండరడిప్పొడియాళ్వారు (విప్రనారాయణుడు) తిరుమంగై యాళ్వారు (పరకాలుడు) నమ్మాళ్వారు (శఠకోపులు) మధురకవియాళ్వారు మొదలగు 12 గురిని నెక్కువ భక్తితో పూజించెదరు. వీరు ద్రవిడదేశమున పుట్టినవారగుటచే వీరియందు అసమానమగు ప్రేమసహా యుంచుదురు.

## పూర్వకాలపు స్త్రీపురుషుల విద్య.

ఇప్పటికాలపుస్త్రీపురుషులు నవనాగరికులును కుశాగ్రబుద్ధులును బుద్ధిబలసంపన్నులును సదాచారతత్పరులును ఐనను పూర్వులలోనిస్త్రీలకుసహా సంస్కృతభాషయందు చక్కని పాండిత్య ముండినట్లు దోచుచున్నది.

బృహదారణ్యకపంచమాధ్యాయషష్ఠాష్టమ బ్రాహ్మణములందు వాచక్నునిదుహిత (కూతురు) యగు గార్గి యను బ్రాహ్మణస్త్రీ జనకునిసభలో విద్వాంసులగు బ్రాహ్మణులుండగ 'మీలో మిక్కిలిబుద్ధిమంతుడగువా డీధనమును గైకొనవలె' నని ప్రశ్నింపగ యాజ్ఞవల్క్యుడుమాత్రము లేచి దాసిం గైకొనియె. ఆయాజ్ఞవల్క్యునే ఈయమ 'సర్వజగత్తు దేనియందు ఓతప్రోతముగ నున్న'దని ప్రశ్నించి వేదాంత విషయమున తర్కించి యాతనివలన ప్రత్యుత్తరమందినాతని వరించెను.

ఋగ్వేదమున చతుర్థాష్టకప్రథమాధ్యాయమందున 'సమిద్ధో అగ్నిరితి' యను షడృక్కులుగలసూక్తమును అత్రి

మహాముని పుత్రికయగు విశ్వావర యను స్త్రీ తనతపోబలముచే గనిపెట్టి దానికి ఋషిక యయ్యెను. ఈమె మంత్ర దృష్టియేగాక యజ్ఞకర్త్రియుగూడా నైయుండెను.

ఇడాదేవియను ఆమె ఋగ్వేదమునందలి ప్రథమాష్టకములో ద్వితీయాధ్యాయమందలి ముప్పదినాల్గవ వర్గాదిని 'త్వామగ్నే ప్రథమ' యను కొన్ని ఋక్కులకు ఋషిక యగుటయేగాక వేదకాలమందలి నహుషరాజునకు ధర్మోపదేశికురాలుగ ధర్మముల నెరిగించుటకు అప్పటిఆర్యులచే నియమింపఁబడియుండెను.

వాగ్దేవియను నామె ఋగ్వేదముయొక్క 10 వ మండలములో 17 వ సూక్తమును రచించెను. ఈయమ తత్వకోవిదయగు వనితాశ్రేష్ఠ.

అంభృణఋషిపుత్రి ఈమెచే రచియింపఁబడిన ఈసూక్తమునందు తనయాత్మస్వరూపవర్ణనము చేసి జీవబ్రహ్మవర్ణనమును సిద్ధాంతీకరించెను.

విశ్వలాదేవియును అపలాదేవియును శ్రద్ధాదేవియును ఋగ్వేదమందలి ప్రథమాష్టకములోని 13 వ ఋక్కునకును ఋగ్వేదమునందలి 8 వ మండలములోని 80 వ సూక్తమునకును ఋగ్వేదమునందలి 10 వ మండలములోని 151 వ సూక్తమునకును ఇట్లు ముగ్గురు మూడుసూక్తములకు మంత్రద్రష్టలైరి.

ఇట్టిప్రమాణములచేత నాకాలపుస్త్రీలు వైదికవిద్యయందును పాండిత్యమవలంబించుకొనినట్టు గోచరించుచున్నది.

మేన వైతరుణీ యను నీయిద్దరుస్త్రీలు బ్రహ్మవాదినులై యుండిరని విష్ణుపురాణమున గలదు.

మన ప్రాచీనసోదరీమణులు విద్యనభ్యసించి జ్ఞానాతిశయమునకు ధ్వజములుగానున్న వారని గుర్తెరుగతగియున్నది.

ఇక పురుషులన్నచో తమయాత్మనుగూడ వెలికిదీసి లోకాంతరములకు నడిపించెడిశక్తి యుంచుచుండిరి. గనుకనే నారదుడు లోకపాలులసభల నన్నిటిని వర్ణించుచుండెను.

పాండుమహారాజు స్వర్గస్థుండై ధర్మరాజునకు పంపించినవృత్తాంతమును నారదుడు తెలియజేసెను.

లోమశమహాముని అర్జునుడు మొదలగువారు దేవలోకమునకు బోయినట్లుకూడ భారతమున గలదు.

శంకరాచార్యులవారు తమశరీరమునుండి ఆత్మను లింగశరీరముతోగూడ యోగశక్తిచేత పైకిదీసి మరియొక్క శరీరమున బ్రవేశపెట్టినట్లు మాధవాచార్యవిరచితశంకరవిజయమున 9 వ సర్గమున కలదు.

కొందఱు ఋషులు భూలోకమున ఆకాశమార్గమున తిరుగుచుండిరి. దీనినే ఖేచరగమనమని యందురు. వారికి చారణులని పేరు. ఈవిషయము రామాయణము సుందరకాండము 55 వ సర్గమున స్పష్టముగ కలదు.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తనయాగసంరక్షణమునకు తీసికొనివెడలునప్పుడు వారలకు మార్గాయాసమును ఆకలి దప్పికయును లేకుండుటకు 'బల, అతిబల' యను రెండు

విద్యల నుపదేశించెనని రామాయణము బాలకాండము 22వ సర్గమున కలదు.

పూర్వులు మృతసంజీవినియను విద్యను ఎఱిగినట్లును కచునికి నేర్పినట్టులయు ఆకచుడు తనయాచార్యుడైన శుక్రుని శుక్రుడు కచుని బ్రతికించినటుల భారతమున కలదు.

పూర్వులు కానరానివానింగూడ తెలుసుకొనునట్టి దివ్య దృష్టి యను విద్యను తెలిసికొనియుండిరి. కావున శకుంతలను దుష్యంతుడు పరిగ్రహించిన యంశమును కణ్వమహాముని తనయాశ్రమమునకు జేరగానె దివ్యదృష్టిచేత కనుగొనెను.

'అశ్వహృదయము అక్షహృదయ' మను రెండు విద్యలు గలవు. అం దక్షహృదయ మనునది తాడిచెట్టును జూచి నొక్కొకకొమ్మకు ఆకులు పువ్వులు కాయలు మొద లగునవి ఎన్నెసి కలవో కనుగొనుట. ఈవిద్య నలమహారాజునకు ఋతుపర్ణు డుపదేశించెను. ఈవిద్య ధర్మరాజునకు బృహదశ్వు డుపదేశించినట్లు గూడ భారతమున గలదు.

అశ్వహృదయ మనగా అశ్వము(గుఱ్ఱము)యొక్క ఉద్దేశ్యమును కనిపెట్టుటయు దానికి తన హృదయమును తెలి యజేసి తనయిష్టప్రకారము దానిని నడిపించుటయు. ఈవిద్య నలమహారా జెఱిగియుండెను.

అర్జునుడు బిడుగును తనచేత దొన్నెలో నిమిడ్చెనని మహాభారతమున గలదు.

---

## అనుబంధము.

# నాలుగవప్రకరణము

## మున్నీరుకాపులు, విమర్శనము.

ప్రాచీనవస్తు పరిశోధనావిషయమున విశేషాదరము చూపఁబడుచున్నయీకాలమున మనము నిత్యవ్యవహారమునఁ బ్రయోగించుచున్న పదముల పూర్వచరితమును దెలిసికొనుటకుఁ గుతూహల మెల్లవారికిని మెండుగ నుండకమానదు.

భాషాపదములు మనకుఁ జిన్ననాటనే యలవడినవై సంతతవ్యవహారమున మనచే నతిసులభముగ నుపయోగపఱచుకొనఁబడుచుండుటచే వానితోఁ గలిగిన యతిపరిచయమువలన వానిపుట్టుకను పూర్వోత్తరచరితమునుగూర్చి విచారించుటకు మనకనాదరముగాని నిజముగ వీనిపూర్వచరితమును బరిశీలించినట్లయినఁ జిత్రవిచిత్రాంశము లనేకములు బయలుదేరుచునె యుండును. వేయేల! యీలోకమున వ్యవహరింపఁబడుచుండెడి యనేకములగుభాషల చరితమును గూర్చియేగాక యిందు జిరకాలమునుండియు వసియించుచుండెడి మానవజాతియొక్క జీవితచరితమును నాగరకతనుగూర్చియుఁ దెలిసికొనుటకీపదములే ముఖ్యాధారము లగుచున్నవి.

మన పూర్వులచరిత్రము వారిభాష వారివిజ్ఞానము మొదలగునవి వాఙ్మయరూపమున నున్న వారి గ్రంథములయం

దును శాసనాదులయందును సుప్రసిద్ధమై కనబడుచుండ గేవల పదములయందు గన్పడెడి పూర్వచరితమన నెట్టిది యను ప్రశ్న వెంటనే బయలుదేరవచ్చును. కాని కొంచెము పరిశీలించినచోఁ బదములవలన మనకు దెలియ వచ్చెడి విషయములు గ్రంథసంచయమువలన మనము గ్రహింపఁ గలిగిన విషయములకంటె ప్రాచీనములు నుత్కృష్టంబులునై యుండుట తెలిసికొనగలము.

భాషాపదములనగా మనపూర్వులు సంపాదించి మనకై దాచిపెట్టి కాలక్రమమున మనకొసంగిన విజ్ఞాననిక్షేపములని చెప్పవలసియున్నది. అతివిశాలంబగు నీ భూభాగమున నాది నుండియు వసియించియుండిన మానవకుటుంబమున కీకాలమున వారసులమగు మనకు పరంపరాగతముగ వారివలన వచ్చు చున్న యమూల్యమగు సొత్తులలో నీపదజాలమే ప్రధాన మైనది. తక్కినవన్నియు గాలగతిని మాఱినవి. పదజాలము కూడ ననేకవిధములగు మార్పులకు లోనై యున్నను ఆధునిక (ఇప్పటి) ద్రావిడాంధ్రాది శబ్దశాస్త్రజ్ఞు లాయాపదములకుగల సంబంధములను వానిపూర్వభాషాచరితమును గనిపెట్టి వాని మూలమున భాషాకుటుంబములను వాని విశేషలక్షణములను నిర్ధారణచేయగలుగుచున్నారు. ఇట్టి కుటుంబములలో ద్రావిడ భాషాకుటుంబ మొకటియై యున్నది.

ప్రాచీనమైన ద్రావిడభాష యను తల్లికి కన్నడభాష తెలుగుబాస లను నిరువురుపుత్రులు బుట్టిరి. గావున తమిళము కన్నడము తెలుగు (ఆంధ్రము) మొదలగు భాషలలోని

కొన్ని పదములకు గల పరస్పరసంబంధము వాని పూర్వచరితము స్వరూపపరిణామము మొదలగువానిగూర్చి యించుక మనము పరిశీలింతముగాక. కొన్ని పదముల పూర్వచరితమును బరిశీలించుటవలన మనకుఁ దెలియవచ్చెడి విశేషాంశములమాట యటుండ కేవల మాయాపదముల యర్థస్వరూపము పరిణామ పరిశీలనమే మన కొకవిధమగు పూర్వపరిచయానందము గలిగింపక మానదు.

పొన్ను:—ఈపద మిప్పుడు ఆంధ్రమున నంతగా వాడుకలో లేకపోయినను ద్రావిడభాషలో నతిప్రాచీనంబగు కాలముననే పొడసూపి వ్యవహారములోనికి వచ్చినదై యందు గొన్నినూతనపదముల సృష్టికిఁ గారణం బగుటయేకాక యీ భాష మాట్లాడిన జనసంఘముయొక్క ప్రాచీన నాగరకతా విశేషమునుగూడ సూచించునదై యున్నది. "పొన్ను"అనగా రోకలిచివర నమర్పఁబడు నినుపకడియ మని సులభముగా నందఱకుఁ దెలిసినదే. దీనికి బంగారము అను నర్థముగూడ నాంధ్రమున వాడుకలో లేకపోలేదు. కాని నిత్య వ్యవహారములో నున్నదని చెప్పుటకుమాత్ర మవకాశము లేదు.

'బంగారము' అను తద్భవపదము వాడుకలోనికి వచ్చిన పిదప నీదేశీయపదము నిత్యవ్యవహారమునుండి జారిపోయెను. ఇట్టులే

"మున్ వెళ్ళానై మ్" యను ద్రావిడపదము మున్నీరు కాపు యను తద్భవపదమునై వాడుకలోనికి వచ్చినపిదప

ద్రవిడనామము నిత్యవ్యవహారమునుండి జారిపోయె ననుట నిశ్చయము.

ఒక్కొక కాలమునఁ గొన్ని కారణములచే భిన్నములగు భాషలకు గలుగుచుండెడి (యన్యోన్యసంబంధము) కలయికచే ప్రవేశించిన పదములు యొకభాషనుండి మఱియొక భాష లోనికి కొన్ని యాకాలమున వానికి గలిగిన వ్యవహారప్రాచుర్యమునుబట్టి యంతకుబూర్వపుభాషలో సమానార్థకములై వ్యవహరింపఁబడుచు యాభాషకు సహజములుగూడ నైన పదములను వాడుకలోనుండి త్రోసిపుచ్చుటయు సంభవించుచుండును. ఇందుకు నిదర్శనముగా 'విందు' శబ్ద మొకటి చూడుడు. 'మాయింటి వింద వైతివి (మనుచరిత్ర)' "భూసురేశ్వర ప్రీతిం బొందితి నిను గని తగి మెదు వింద వయితి నాకు" (భారత-శాం). కాని యిటీవలికాలమున తత్సమంబగు 'నతిథి' పదము వ్యవహారములోనికి వచ్చి దీనిని త్రోసిపుచ్చినది. ఇట్లే ప్రదక్షిణముచేయు అనునది 'వలగొను' అను దేశ్య పదమును త్రోసిపుచ్చినది. నీలశబ్దభవంబులగు 'నల్ల, నల్లని' శబ్దంబులు వాడుకలోనికి వచ్చినతర్వాత 'కప్పు' శబ్ద మంతరించినది. 'పాందాను' వచ్చి అడపమును పోఁగొట్టినది. 'తయారు సప్లయి రోడ్డు' మొదలగునన్యభాషాపదముల కిపుడు గలిగిన విశేషమగు వాడుకనుబట్టి వీనికి సరియైన దేశీయ పదము లేమి యని కొంచెము తడవుకొనవలసినస్థితి వచ్చుచున్నది.

'ఫొన్' అనునది ప్రాచీనద్రావిడభాషనుండియే పుట్టి కన్నడాంధ్రభాషలలోనికి వచ్చిన దనియే జెప్పవలయును.

ఇట్లొకపదము మాతృభాషనుండి సోదరభాషలలో సంక్రమించుటే కాక యాపదమే యాయాసోదరభాషలలో కలిగిన వికారములచే మాఱురూపములఁ జెంది యాక్రొత్త రూపముతో నొకభాషనుండి మఱియొకభాషలో బ్రవేశిం చుటకూడ సంభవించుచుండును.

మున్ వెళ్లానై్మ యని పిలువబడు ద్రావిడపదమునకు సమానార్థకమునైన మున్నీరుకాపుపదము వ్యవహరింపఁబడు చుండుటచే పూర్వద్రావిడనామము వాడుకలోనుండి తొలగి పుచ్చుటయు సంభవించెను

అనంతరము 'మున్నీరు' పూర్వాంధ్రాక్షరములలోని 'నీ'కారము ప్రస్తుతాంధ్రాక్షరములలోని 'నూ'కారమును బోలియుండుటచే యనంతరము వారు 'నీ'కారమును 'నూ' కారముగా పొరపాటుచే చదివిరని తెలియుచున్నది.

దేశకాలస్థితిగతులనుబట్టి ప్రత్యేక మనేకవిధములగు మార్పులకు లోనగుచున్న సగోత్రులగు నొకసోదరసమితియం దాకుటుంబమునకు మూలపురుషులగువారి స్వాభావికగుణ ములు కొన్ని గానవచ్చుచుండుట యస్వాభావికము కాదు గదా! అట్లే ప్రాచీనద్రావిడభాషయందుగల కొన్నిపదములు గన్పడుచున్నను ఆంధ్రవైయాకరణులు దానినిజస్వరూపమును గుర్తింపలేకపోవుచున్నారు.

శోధించిన కొలది నూతనాంశములు తేలి పూర్వ చరిత్రము తలక్రిందు లగుచుండును. నేడు ఎరువుతోలదగిన పాటిదిబ్బ రేపు చరిత్రరంగస్థల మను నాధారములు బయలు పడవచ్చును. నిన్నటివఱకు గణపతిదేవునిభార్య యనుకొన్న రుద్రమదేవి కుమార్తె యనుటకు ప్రబలప్రమాణములు చిక్కుచున్నవి. ఆంధ్రదేశవాసు లనుకొన్న రెడ్డివారు రాష్ట్ర కూటవంశస్థులని ఉత్తరహిందూస్థానవాసు లనుటకు బ్రమాణ ములు శోధింపఁబడుచున్నవి.

నన్నయకు బూర్వపుగవిత దొఱకుచున్నది. ఓంటి మిట్టవా డనుకొన్న పోతరాజు ఓరుగంటివా డైనాడు. గోదా వరిమండలములోని బిక్కనవోలువా డనుకొన్న మల్లారెడ్డి హైదరాబాద్ చెంతగల బిక్కనవోలివాసు డైనాడు. చరిత్ర చతురాననుల చరిత్రములు దారుమారగుచుండ మాననీయు డగు మాతండ్రికిఁ బుట్టి మాతండ్రితాతలనుండి జెప్పికొను చున్న కులనామమును నే జెప్పికొనుటయే ధర్మమని పూర్వ చరిత్రోపేక్షకు డైనమాత్రమున లేక తండ్రి జెప్పికొనిన దానికే నొకగాథ కల్పించి వ్రాయించిన చరిత్ర యను కారు మేఘములు విమర్శనావాతము వీచినయనంతర మెంతకాలము నిలువగలవు?

పూర్వచరిత్రమును దెలిసికొనవలయునన్న ప్రథమ మున పూర్వుల పూర్వకాలపుభాష యేది యుండెననియు

తదనంతర మాభాష మననుండి తొలఁగి ప్రస్తుతభాష ఏల పరిగ్రహించితిమనియు మనకులనామ మాపూర్వభాషయం దెటుల యుండెననియు ప్రస్తుతభాషకు పూర్వభాషకు సమానార్థక మొసగుచున్నదా? లేదా? యను సంశయనివారణమే కులనామముయొక్క సిద్ధాంతము.

చరిత్రపరిశోధనచే నెన్నియో కుల పురాది నామములు నిజస్వరూపము మారినటుల దెలియుచున్నవి. ఇందులో పూర్వనామముల పరిశోధింప తదీయనామములచే వేయించిన శాసనాదులచే పూర్వులచారిత్రికవిషయములలో వివిధములు వెలువడుచున్నవి.

వనపర్తిసంస్థానమందలి 'వడ్డమా' నను గ్రామము పూర్వము 'వర్తమానపురము.' 1 'కల్యాణకటకము' రుద్రదేవుని శాసనములో 'క ట క' మనియే వ్యవహరింపఁబడినది. 2 'మట్టిచెఱ్ఱ్వాల' యని డాక్టర్ ఫ్లీటుగారు చదివినది 'మద్దిచెఱువుల' ఐనది. 3 త్రిభువనేశ్రీమల్లదేవ యని చదివిన చారిత్రికారులు 'త్రిభువనశ్రీమల్లదేవ' యని దిద్దుకొనిరి. 4 'ప్రాతీచ్యా' యను పదము 'ప్రతీచ్య' యని దిద్దుచున్నారు. 5 'మంథెన' యను గ్రామము శాసనములలో 'మంత్రకూట' మని తేలినది. 6 'ధాన్యకటకము' నేడు 'ధరణికోట' యని తెలియుచున్నది. 7 'తురగం' అను శాసనపదము 'తురంగ' మని నేడు దిద్దబడినది. 8 తాత్రపై వ్రాసిన 'విరియాల' మిరి

యూల యుండవలయు ననిరి. 9 కాకతిరుద్రదేవునికిఁ బ్రతాప రుద్రుఁడన్న పేరు చరిత్రకారు లెట్లుపయోగించుచు వచ్చిరో కాని, యితని నాపేరుతో బిలుచు నొకశాసనమైన లేదనిరి. 10 "త్రికళింగము" జనసామాన్యముచే నుచ్చరింపఁబడుచు కొంతకాలము జరుగునప్పటికి 'క' లోపించి 'త్రిళింగ' త్రిలింగ (పదమే) వ్యవహరింపఁబడెను గాని తెలు గింతకు పూర్వమె కలదనిరి.

'పేరు' బెబ్బులి బొబ్బిలి యని నొక భాషనుండి మఱియొక భాషలోనికి మాఱెను.

'శాతవాహనుడే' 'శాలివాహనుడు' 'చిలప్పాదిగార' మను తమిళ్కావ్యమున 'శాతకర్ణి'యని యున్నదనిరి. 'ర, ఱ' ల యొక్క భేద మెఱుఁగక వ్రాతలలో నుపయోగించిన విపరీతార్థము నిచ్చును యని పండితులు పదసంస్కారములఁ గావించుచున్నవారు.

# పూర్వాంధ్రాక్షరములు.

## అచ్చులు

అ ఆ ఇ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః ఁ ం

[illegible]

## హల్లులు

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న

[illegible]

ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ఱ ళ

[illegible]

## గుణింతము

క కా కి కీ కు కూ కృ కౄ కౢ కౣ కె కే కై కొ కో కౌ కం కః

[illegible]

ఈ ప్రకారము వర్ణముల యాకారముగల పూర్వ ప్రస్తుత పతకమునందలి గుడి ఉపదీర్ఘము, ప్రస్తుతము మనము వ్రాయు కొమ్ముదీర్ఘమువలె యున్నది. పరిశోధింప లేనివారు ఇంతవరకు 'నూ్న' యనుకొనిరి.

పరిశోధకులు పూర్వలిపులను గనిపెట్టి 'నీ్న' యని తెలిసి కొనిరి.

ఇటు లనేకుల నామములు పురనామములు శాసనములయందుగల అక్షరములయొక్క నిజస్వరూపము నెఱుంగక అనేక సంవత్సరములక్రింద వ్రాసిన చరిత్రకారుల చరిత్రలునూ్న తలక్రిందులైనవి; నేటికి యవుచునే యున్నవి.

———

# ఐదవ ప్రకరణము



## బ్రాహ్మణులు

చతుర్దశ విద్యలలో 4 వేదములు 6 వేదాంగములు 1 న్యాయము 1 మీమాంసము 1 స్మృతి. పురాణము లను వాటిలో

ఋగ్వేదము 21 భేదములు, యజుర్వేదము 11 భేదములు, సామవేదము 1000 భేదములు, అధర్వణ వేదము 9 భేదములు, మఱియు ఉపవేదములయిన నాల్గింటియందు

1. వ్యాధినిదానము వ్యాధిచిహ్న మంత్రౌషధములు గల ఆయుర్వేదమును.

2. దక్షిణ ఆజ్య చరు పిపాస హోరాదుల సంపాదింప ధర్మాదిచతుర్వర్గ ధనముల సాధనములుగల అర్థవేదమును.

3. శతృజయార్థము మంత్రాస్త్రప్రయోగాదులు కల్పించునట్టి ధనుర్వేదమును.

4. స రి గ మ ప ద ని స యను సప్తస్వర గీతప్రబంధములం దెలుపుగాంధర్వ వేదమును.

5. వేదాంగము లయిన మంత్రములకు త్రిష్టుపు మొదలగు అక్షరముల గణింప దగినదైన ఛందస్సును.

6. అశ్వలాయనీయ బోధాయనీయ ఆపస్తంబీయాది సూత్రరూపముచే యజ్ఞాది ప్రయోగములు దెలుపునది యగు కల్పమును.

7. వైదికశబ్దమును సమర్థించునదియగువ్యాకరణమును.

8. ఉదాత్తానుదాత్త స్వరితములచే వేదాధ్యయనము తెలుపు శిక్షయును.

9. లగ్న తిథి వార నక్షత్ర గణకూట యోగ కరణాదుల దెలుపు జ్యోతిషమును.

10. వైదిక శబ్దనిర్వచనము నియమింపు నిరుక్తియును.

11. ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయ అభావములగు న్యాయమును.

12. పూర్వమీమాంస ఉత్తరమీమాంస మనుమీమాంసములును.

13. మనుస్మృతి, అత్రిస్మృతి, హారిస్మృతి, విష్ణుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, ఉశనస్మృతి, అంగీరసస్మృతి, యమస్మృతి, ఆపస్తంబస్మృతి, సంవర్తస్మృతి, కాత్యాయనస్మృతి, బృహస్పతిస్మృతి, పరాశరస్మృతి, వ్యాసస్మృతి, శంఖలిఖితస్మృతి, గౌతమస్మృతి, శతాతపస్మృతి, వశిష్ఠస్మృతి, ఇట్లు 19 స్మృతులును.

14. 1 బ్రహ్మదేవుఁడు మరీచికి బోధించిన 10,000 శ్లోకములుగల బ్రహ్మపురాణమును.

15. 2 బ్రహ్మదేవునిచేఁ జెప్పబడిన 55,000 శ్లోకములుగల పద్మపురాణమును.

16. 3 పరాశరునిచే రచియింపఁబడిన 8,000శ్లోకములుగల విష్ణుపురాణమును.

17. 4 వాయుదేవునిచే రచియింపఁబడిన 24,000 శ్లోకములుగల వాయుపురాణమను నామాంతరముగల శివపురాణమును.

18. 5 నారదునిచే రచింపబడిన 25,000 శ్లోకములుగల నారదీయపురాణమును.

19. 6 మార్కండేయునిచేఁ రచియింపఁబడిన 32, 000 శ్లోకములుగల మార్కండేయపురాణమును.

20. 7 శుకుఁడు పరీక్షిన్మహారాజున కుపదేశించిన 18,000 శ్లోకములుగల భాగవతపురాణమును.

21. 8 శతానీకుడు సుమంతునకు బోధించిన 1,3000 శ్లోకములుగల భవిష్యోత్తరపురాణమును.

22. 9 భృగువుచే యాగాదివిధులు చెప్పబడిన 8,000 శ్లోకములుగల ఆగ్నేయపురాణమును.

23. 10 వశిష్ఠుఁడు అంబరీషున కుపదేశించిన 12,000 శ్లోకములుగల బ్రహ్మవైవర్తపురాణమును.

24. 11 నందికేశ్వరుఁడు రచియించిన 11,000 శ్లోకములుగల లింగపురాణమును.

25. 12 వరాహమూర్తి భూదేవి కుపదేశించిన 24,000 శ్లోకములుగల వరాహపురాణమును.

26. 13 స్కందు డను కుమారస్వామిచే రచియింపబడిన 1,00,000 శ్లోకములుగల స్కాందపురాణమును.

27. 14 బ్రహ్మదేవునిచే రచియింపఁబడిన4,000 శ్లోకములుగల వామనపురాణమును.

28. 15 మత్స్యమూర్తియగు విష్ణువు మనువున కుపదేశించిన 14,000 శ్లోకములుగల మత్స్య పురాణమును.

29. 16 విష్ణుమూర్తి కూర్మరూపమున రచియించిన 6,000 శ్లోకములుగల కూర్మపురాణమును,

30. 17 విష్ణుమూర్తి గరుత్మంతుల కుపదేశించిన 16,000 శ్లోకములుగల గరుడపురాణమును.

31. 18 బ్రహ్మదేవునిచే రచియింపబడిన 12,200 శ్లోకములుగల బ్రహ్మాండపురాణమునను పదునెమిదిపురాణములును.

32. 1 సనత్కుమార 2 నారసింహ 3 నంది 4 శివధర్మ 5 దుర్వాస 6 నారదీయ 7 కపిల 8 మను 9 ఉశన 10 బ్రహ్మాండ 11 వారుణ 12 కాళీ 13 వాసిష్ఠ 14 లైంగ్య 15 సాంబ 16 సౌర 17 పరాశర 18 మరీచి మొదలయిన పదునెనిమిది ఉపపురాణములును.

33. 1 రుద్రోపనిషత్ 2 బృహదారణ్యోపనిషత్ 3 శ్వేతాశ్వతరోపనిషత్ 4 కైవల్యోపనిషత్ 5 కాలాగ్నోపనిషత్ 6 కఠవల్లియోపనిషత్ 7 తైత్తరీయోపనిషత్ 8 ఛాందోగ్యోపనిషత్ 9 కాత్యాయనోపనిషత్ 10 బ్రహ్మోపనిషత్ 11 నారాయణోపనిషత్ 12 హంసోపనిషత్ 13 పరమహంసోపనిషత్ 14 భాస్కరోపనిషత్ 15 బ్రహ్మబిందోపనిషత్ 16 కౌశితకోపనిషత్ 17 మాండూక్యోపనిషత్ 18 ముద్గలోపనిషత్ 19 అరుణోపనిషత్ 20 అమృతబిందోపనిషత్ 21 చర్మోపనిషత్ 22 పంచ బ్రహ్మోపనిషత్ 23 జాబాలోపనిషత్ 24 వాజసనేయోపనిషత్ 25 బోధా

యనీయోపనిషత్ 26 ముండకోపనిషత్ 27 అశ్వలాయనీ యోపనిషత్ 28 మైత్రాయణీయోపనిషత్ 29 సాంఖ్యాయనీయోపనిషత్ 30 బాదరాయణియోపనిషత్ 31 శౌనకీయోపనిషత్ 32 శిఃసంకల్పోపనిషత్ 33 ఈశావాశ్యోపనిషత్ 34 తేజోబిందోపనిషత్. ఈ ముప్పదినాల్గు వేద శిఖలును, ఉపనిషత్తులును.

34. 1 చార్వాక 2 బౌద్ధ 3 కాళయారుళ 4 శాక్తేయ 5 లౌకిక 6 వైదిక 7 ఆధ్యాత్మిక 8 సాంఖ్య 9 పాతంజల 10 అతిమార్గిక 11 మాంత్రిక 12 ఆదిభౌతికములను పండ్రెండు శాస్త్రములును.

35. భారత రామాయణములను రెండు ఇతిహాసములును.

మొదలగునవి పఠించి సభ్యుల హృదయకమలములు వికసింపఁజేయుచు రాజాధిరాజులచే బహుమతులం బడయుచుండెడి సదాచారపవిత్రకు లయిన బ్రాహ్మణోత్తములు.

అందు కొందఱు కవిత్వంబును గోకర్ణకంబును దేశ భాషావిజ్ఞానంబును లిపిలేఖనంబును సాముద్రికంబును ధాతు గంధ రస వాదంబులును ఇంద్రజాల మహేంద్రజాలమర్మంబులును అగ్నిస్తంబ జలస్తంబ వాయుస్తంబ వాకట్టు మొనకట్టు వశ్యాకర్షణ మోహన విద్వేషణోచ్చాటన సంహారంబుల నెఱింగి పక్షిగతి భేదంబులు యోగవాదంబులును వచనసిద్ధులును మణిమంత్రతంత్రక్రియలు మొదలయినవెల్ల నేర్చి ఫల

భరితమైన వృక్షరాజములవలె నిగర్వులై సత్యవాక్యధురంధ రులై శాంతచిత్తముగలవారై యున్నవారు.

శైవ వైష్ణవ గాణాపత్య శాక్తేయ జైన బౌద్ధ మతాచార్యులునహా వీరిలో గలరు. ఇందు స్మార్తులయినవారు వేదాధ్యయనపరాయణులై మిగత మూడుతరగతుల జాతి వారల వృత్తుల నెంతమాత్ర మవలంబింపక సద్విద్యల నభ్యసించి సదాచారపరులై వైదికవృత్తిలో జిక్కినయంతటితో మిక్కిలి సంతుష్టులై పరమేశ్వరధ్యానానందభరిత హృదయులై యుండువారు.

వీరిలో ఋగ్వేదశుక్లశాఖ, కృష్ణయజుర్వేద తైత్తిరీయ శాఖ వారు గలరు. ఇందు 1 భృగు 2 అంగీరస 3 కస్యప 4 అత్రి 5 వశిష్ట 6 అగస్త్య 7 విశ్వామిత్ర గోత్రముల వారును కలరు.

18 జామదగ్నిగోత్రములు, 6 వైధవ్యగోత్రములు, 4 వాయసగోత్రములు, 2 గ్రిచమధగోత్రములు, కణ్వాముని గోత్రములు, 3 మందగాలయగోత్రములు, 5 విరూపగోత్రములు, 13 విష్ణువర్ధనగోత్రములు, 2 వారాధీశ్వగోత్రములు 7 గౌతమగోత్రములు, 17 భారద్వాజగోత్రములు, 3 కపిల గోత్రములు, 10 హరితగోత్రములు, 9 అత్రిగోత్రములు, 38 విశ్వామిత్రగోత్రములు, 11 వశిష్ఠగోత్రములు, 10 కశ్యప గోత్రములు, 2 అగస్త్యగోత్రములు, ఇట్లు మొత్తం 162 గోత్రములవారీ బ్రాహ్మణులని దెలిపెదరు.

---

# ఆదివ ప్రకరణము

## విశ్వబ్రాహ్మణులు.

శ్లో॥ న భూమిా న జలం చైవ న తేజో నచ వాయవః
న చం బ్రహ్మ నచం విష్ణుం నచంనక్షత్రితారకాః।
సర్వశూన్య నిరాలంబో స్వయంభూ విశ్వకర్మణః॥

భూమి పర్వతములు తేజస్సు వాయువు ఆకాశము బ్రహ్మ విష్ణువు నక్షత్రములు మొదలయినవి లేనపుడు సర్వ శూన్యమై నిరాలంబమై పట్టు నాస్పదములేని వేళయందు విశ్వకర్మ స్వయంభూరూపమై జనియించెను. వారిచే ప్రథమ మున భూమికిమధ్య కైలాసమనెడి పర్వతము నిర్మింపఁబడెను. అందే నివసించి యుండువాఁడు వేయిశిరస్సులుకలిగి యథోక్త మైనటువంటివాడే పరశివుడు. వినోదానంద స్వతంత్రుఁడై విహరిస్తూ వుండేవాడై సచ్చిదానందుడైన పరశివుడే విశ్వ కర్మ. ఇతనిశిఖయందు ఈశ్వరుడు నొసట మహేంద్రుఁడు బాహువునందు విష్ణువు ఊరువు (తొడ) యందు బ్రహ్మ పాదమందు ఇంద్రుడు మనస్సునందు చంద్రుడు ప్రాణము నందు వాయువు కంటియందు సూర్యుడు నాభియం దాకాశము కంఠమునందు సమస్తదేవతలు కర్ణము (చెవు) లయందు దిక్కులు ముప్పదిమూడుకోట్లరోమములయందు ముప్పది మూడుకోట్ల దేవతలు పాదములయందు భూమియును పుట్టెను.

పంచముఖములు కలిగినటువంటి పరాత్పరునకు సద్యోజాతముఖమున మనుబ్రహ్మయను సానగఋషియు వామదేవ ముఖమున మయబ్రహ్మయను సనాతనఋషియు అఘోర మున త్వష్టబ్రహ్మయను అభువనఋషియు తత్పురుషముఖ మున శిల్పిబ్రహ్మయను ప్రత్నసఋషియు ఈశానముఖ మున విశ్వజ్ఞబ్రహ్మయను సుపర్ణఋషియును బుట్టిరి. గావున "పంచబ్రహ్మాత్మకం రుద్రం పంచరూపంచ మాహేశ్వరం" పంచ బ్రహ్మరూపమే ఈశ్వరు డనబడును.

పంచవక్త్రము (ముఖము)లవల్ల జనియించిన ప్రజా పతులే సృష్ట్యాదియందలి బ్రహ్మర్షులు. ఈశ్వరు డీ విషయ మును పార్వతితోఁ చెప్పినటుల, యజుర్వేదము 4-వ ఖాండము 3-వ ప్రశ్న 3-వ అధ్యాయమున కలదు.

1. మనువనే బ్రహ్మకే మహాదేవుండని శివుడని నా మాంతరములు గలవు.

2 మయుఁడనే బ్రహ్మకే విష్ణువనియు వెన్నుడనియు నామాంతరములు గలవు.

3. త్వష్టఅనే బ్రహ్మకే బ్రహ్మయనియు తాత యనియు నామాంతరములు గలవు.

4. శిల్పియను బ్రహ్మకే ఇంద్రుడనియు మహేంద్రు డనియు నామాంతరములు గలవు.

5. విశ్వజ్ఞుండను బ్రహ్మకే ఆదిత్యుండనియు సూర్యుం డనియు నామాంతరములు గలవు.

1. మనుబ్రహ్మణే ఉమామహేశ్వరాభ్యాన్నమః

2. మయబ్రహ్మణే లక్ష్మీనారాయణాభ్యాం నమః.
3. త్వష్టబ్రహ్మణే వాణీహిరణ్యగర్భాభ్యాం నమః.
4. శిల్పిబ్రహ్మణే శచీపురందరాభ్యాం నమః.
5. విశ్వజ్ఞబ్రహ్మణే సవితాభాస్కరాభ్యాం నమః.
యజుర్వేదమందు గలదు.

సూర్య విశ్వజ్ఞునకు "ప్రజదువులపెట్టియ" అను నొక నామాంతరముగలదు.

అనగా వేదముల కునికిపట్టని యర్థము.

ఆదియందు సమస్థదేవతలకై ఈశ్వరునివలన రాబడిన తెలివియను ఉపదేశమే వేద మనఁబడును. "వేదయతీతి వేదః" సమస్తమును తెలియజేయునదియని అర్థము. పరమేశ్వరునివలన వినబడుటవలన వినినదగుటచే "శ్రూయత ఇతి శ్రుతిః" శ్రుతి యనఁబడెను. ఇది విశ్వజ్ఞుండను సూర్యాచార్యునివలన సమస్త దేవదానవ మర్త్యుల కెల్లరకు గురు పరంపరగా ఉపదేశింపఁబడియె.

నీవేద మనంతునిచే ఆదిత్యు (విశ్వజ్ఞు)న కుపదేశింపఁ బడుటయు తదనంతర మంతట వ్యాపించుటచే సమస్త దేవ ముని మనుష్య గణములచే నేటికిని నమస్కరింపఁబడుచున్న వాడు. నీ కారణముచే "మొక్కులదేవర" యను నొక నామాంతరముసహా కలదు.

1. త్వష్టబ్రహ్మ ఉత్పత్తికి కర్త యాయెను గాన బ్రహ్మయను నామాంతరము కలిగెను.

2. మయబ్రహ్మ రక్షించుటకు కర్తయగుటచే విష్ణు వను నామాంతరము కలిగెను.

3. మనుబ్రహ్మ సంహారమునకు కర్తయగుచే మహా దేవుండని నామాంతరము కలిగెను.

4. జగంబున వారివారి పుణ్యములకు తగిన స్వర్గలోక సుఖము లొసగ కర్తమై తన వజ్రాయుధముచే కొండలరెక్కలను ఖండించి సమస్తశిలలకు కర్తయాటచే శిల్పబ్రహ్మ దేవేంద్రుడను నామాంతరము కలవాడయ్యె.

5. విశ్వజ్ఞబ్రహ్మ పంచవేదములకుకర్తమై తనమూల మున సమస్త దేవదానవ మానవాదులకెల్ల ఉపదేశింపఁబడుటచే ఆదిత్యుడు సూర్యాచార్యుడని పిలువబడియె.

1. స్ఫటికవర్ణుడయిన మనువను మహాదేవుడు వెండికొండ నివాసముగా గలిగి వెండిజంధ్యమును ధరించి ఋగ్వేదమును పఠించి తపోబలసంపన్నుడై యుండును.

2. నీలవర్ణుడయినమయుడను విష్ణువు వైకుంఠము నివాసముగా గలిగి పద్మములతో గూడిన లక్ష్మీయుక్తపద్మములనే జంధ్యముగా ధరించి యజుర్వేదమును పఠించును.

3. తామ్రవర్ణుడయిన త్వష్టవను బ్రహ్మ బ్రహ్మలోక నివాసియై తామ్రనిర్మితయజ్ఞోపవీతమును ధరించి సామవేదమును పఠించును.

4. ధూమ్రవర్ణుడయిన శిల్పియను ఇంద్రుడు అథర్వణ వేదమును పఠించి తెల్లని నూలిజంధ్యమును ధరించి స్వర్గలోక నివాసియై యుండును.

5. హేమవర్ణుడయిన విశ్వజ్ఞుడను సూర్యుడు ప్రణవ వేదమును పఠించి బంగారు జంధ్యమును ధరించి ఋగ్ యజుర్ సామఅధర్వణ మనెడు నాల్గువేదములు ప్రపంచమున కెల్ల నుపదేశించి నొక్క ప్రణవ వేదము మాత్రము పరమాత్మని యం దైక్యమౌనట్టి మహనీయులకు మాత్రమే లభించునట్టి మార్గ మేర్పఱచియుండుటచే నది దివ్యదృష్టిగల మహనీయు లకు మాత్రమే గోచరమై యుండును.

సృష్టిప్రారంభమున ఇనుము ప్రయోజనమునకు మనువు మ్రాకుల ప్రయోజనమునకు మయుడు తామ్రప్రయోజన మునకు త్వష్టవు శిలాప్రయోజనమునకు శిల్పియు సువర్ణ ప్రయోజనమునకు విశ్వజ్ఞుడును.

సూర్యుని (విశ్వజ్ఞుని) (వివస్వంతుని) కుమారుడు వైవ స్వతుఁడు. ఇతనితల్లి మయవిశ్వకర్మకూతురైన సంజ్ఞ. ఇతనికి శ్రాద్ధదేవుఁడను నొక నామాంతరము గలదు. వైవస్వతుఁడు సప్తమమను వయ్యె. "వైవస్వతమన్వంతరే అష్టావింశన్మహా యుగే" యని సంధ్యావందన ప్రథమసంకల్పమున ప్రార్థిం చువానియొక్క ప్రస్తుతకాలమానమును దెల్పుదు రామనువు విశ్వబ్రాహ్మణవంశజుడు.

ఇటుల పంచకర్మలకు పంచబ్రహ్మలు కర్తలైరి వీరైదు గురికి సానగ సనాతన అభువసన ప్రత్నస సుపర్ణసు లనెడి ఐదు ఉపనామములు కలవు.

"పంచబ్రహ్మలే పంచముఖములుగా గల పంచా ననుడు." మనువంశపువారు ముక్కోణగుండమున మయుని

సంతతివారు నాల్గుమూలలగుండమున త్వష్టు తరమువారు వర్తులాకార హోమగుండమున శిల్పిసంతతివారు ఐదు మూలల హోమగుండమున విశ్వజ్ఞునిపుత్రులు ఎనిమిదిమూలల హోమగుండమున వేదప్రమాణ ప్రకారము యజ్ఞములు చేయుచు యనంతరము యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లయిన అష్టాంగయోగాభ్యాసులై అత్యంత మృదుత్వమైన చిత్తము గలవారై మతిమంతులచే అతివినయముగ గొనియాడబడుచుండిరి.

విశ్వజ్ఞుడగున సూర్యునకు మానసపుత్రుడు కశ్యపప్రజాపతి పుట్టెను.

ఈకశ్యపప్రజాపతి పుత్రార్థియై కళమను మద్యమును పానముచేసెను. దాని త్రాగినందున దక్షు డతని శపించెను. ఇతనిని శపించుటచే మనువు(ఈశ్వరు)నకు కోపమొచ్చి దక్షుని తనపుత్రికలను కశ్యపున కిమ్మని నియోగించెను. గావున దక్షపుత్రికలయిన బృహతీ మొదలగు ద్వాదశ (12) కన్యలను వివాహమాడినయనంతరము

బృహతీదేవియందు ఏబదియారుకోట్ల రక్షసులును అదితియందు ముప్పదిమూడుకోట్ల దేవతలును దితియందు చంద్రుడు నక్షత్రములును కద్రువయందు శేషుడు మొదలగు నవకులంబులనాగులును వినతయందు మెరుపులు మేఘములు గరుత్మంతుడు అనూరుడు (అనూరుడనగా ఊరువులు లేనివాడని యర్థము.)

కద్రువయండములనుండి శిశువులు పుట్టుచుండుటజూచి వినత తనయండము నపక్వదశలో పగులగొట్టెను. గావున సంపూర్ణావయవములలో ఊరువు లేర్పడకముందే పుట్టినకారణముచే అనూరుడను నామ మేర్పడెను. ఇతడే సూర్యునకు రథసారథి. ఇతనికి శ్యేనియను భార్యయందు సంపాతిజటాయువులను నిరువురు పుత్రులు బుట్టిరి. సీతాపహరణసమయమున రావణునితో యుద్ధమ్ము చేసి రామునిచే వైకుంఠపుర మందబోయిన జటాయువు అనూరునికుమారుడు. ప్రభా దేవియందు దివ్యాభరణములకు కారణంబైన నవరత్నములును ముదినీయందు అష్టదిగ్గజములు మొదలయిన చతుష్పాద జంతువులును స్వారేష్టయందు అష్టలోహములు పాషాణాదులు చింతామణులు మొదలయినవియును కాళదండయందు సప్తరుషులు అనాదిమునులు మొదలయిన ఋషిగణములును మైగదండివలన మేఘములు దేవేంద్రునిచైత్రరథము ఉద్యానవనములును ధాతుప్రభాయందు జలములో చరించెడి కూర్మములు మొదలయిన సప్తజలజంతువులును సుమావతీయందు కల్పవృక్షములు కామధేనువులును వీరిలో జ్యేష్ఠభార్యయైన పార్వతియందు పర్వతములును పుట్టెను.

శ్లో. ఏతేషామేవ పత్నిశ్చాప్రసూన మలయోద్భవం
 క్షుద్రాదిక్రిమికీటాని సకలే ప్రాణిసంకులైః.

సమస్త జీవకోటులును కశ్యపప్రజాపతిచే నుత్పన్నమయ్యె. జీవకోటులెల్ల విశ్వబ్రాహ్మణుండగు సూర్యుని మానసపుత్రుడయిన కశ్యపప్రజాపతిచే కలిగిన కారణముచే విశ్వమందలి

జీవులకెల్ల మూలపురుషు డవుటచే విశ్వబ్రహ్మ యనియు కశ్యపప్రజాపతి కొక నామాంతర మేర్పడెను. "కశ్యపోవై విశ్వకర్మ" యుజుర్వేదము. విశ్వమునెల్ల ప్రకాశింపఁజేయుచుఁ సమస్తకర్మలకు సాక్షిభూతుఁడైన సూర్యుఁడు కశ్యపప్రజాపతికి తండ్రి యగుటచే బ్రహ్మకర్మయును వేదాధ్యయనమును అనాదినుం డెటిగిన సూర్యుడగు విశ్వజ్ఞుని వంశజులమైన మాకు స్వభావజనిత మనియెదరు.

1. మనుబ్రహ్మవంశజులకు ఋగ్శాఖ సానగఋషిగోత్రము మనుసూత్రము సద్యోజాతప్రవర. వీరు ప్రపంచమున సమస్త మానవుల జీవాధారసస్యముల పండింప సాధనోపకరణము లయిన కఱ్ఱులు మొదలగునవి చేసి కమ్మరవారని వ్యవహార నామమును పొందిరి. లోహపుపనిముట్లు జేయుటచే లోహ కారకులనియు అయస్కారులనియు ప్రతినామములు గలిగెను.

2. మయబ్రహ్మవంశజులకు యజుశ్శాఖ సనాతనఋషి గోత్రము ఆపస్తంబసూత్రము వామదేవప్రవర. వీరు సమస్త మానవుల జీవనార్థమై సస్యముల పండింప భూశుద్ధి కత్యవ సరమగు నాగేలు (హలము)ను నిర్మాణముచేసిరి. వడ్లు పండింప నాగలిచేసి వడ్లవారనియు చిత్రవిచిత్రములయిన విగ్ర హములఁ జెక్కి గృహాలంకార మొనర్చుటచే మొదటివారికంటె ప్రసిద్ధమైన పని చేయుచు వారికంటె వీరు గొప్పవారని కర్తి గాంచిరి. ఆకారణముచే బడయనగా మిక్కిలి గొప్ప పెద్ద యను నర్థము గావున 'బడయలు' యని వీరికి ప్రతినామము కలిగెను.

3. త్వష్టబ్రహ్మవంశజులకు అభువనసగోత్రము ద్రాహ్యాయనసూత్రము సామవేదము అఘోరప్రవర. వీరు సమస్త దేవ మానవులకు తామ్రము వెండి మొదలయిన పంచలోహ మిశ్రితమైనకంచుచే పానీయాదిపాత్రలు మొదలయినవి సిద్ధము చేయువారు. అందు వెండి బంగారు లోహములతోనైనను లేక ఏలోహముతో చేయబడినను భోజనపాత్రకు కంచమనియర్థము. అట్టికంచములఁ జేయువారు కంచరవారనిప్రతినామమును కలిగియుండిరి. చాగు సాగు సను చను చావడి సావడి చేదు సేదు చకారము సకారముగా మారుటయు నన్ని భాషలలోను గల మార్పే గావున కంసము కంచముగా మారెను. అనంతరము కంచరవారు యనునది కంసర కంసమువారు యని మారుచు తుదకు దీర్ఘసకారముగా వ్రాయుచుండుటచే కంసాలు రను రూపమును ధరించెను. కావున కంచర (కాంస్యకారుడు) కంసర కంసల యను ప్రతినామములు కలిగెను.

4. శిల్పిబ్రహ్మవంశజులకు ప్రత్నస ఋషిగోత్రము శౌప్యాయనసూత్రము అధర్వణవేదము తత్పురుషప్రవర. వీరు సమస్తప్రాణులు జగన్మోహానాంధకారులై చెడకుండ ఈశ్వరపరతంత్ర భక్తిజ్ఞాన వైరాగ్యములు కలుగునటుల జీవదేవసంబంధమును శరీరాంతర్గత ఆత్మానాత్మ విచారమేగాక సగుణోపాసనాభ్యాసముచే అనన్యభక్తివైరాగ్యము కలుగునటుల మనోలయకారణ సుందరవిగ్రహములఁ దీర్చి తద్విగ్రహముల కలంకారముగ శిల్పచాతుర్య ప్రవీణతచే చైతన్యముగల స్వస్వరూపముల పగిది చెక్కఁబడిన విగ్రహము

 

లును యంత్రయుక్తమైన సుందరములయిన దేవమందిరముల కట్టువారు. శరీరమధ్యము (నడుము)నకుఁ గట్టు వస్త్రమునకు పేరు 'కాచ' లేక కాసె యందురు. ఇటులే "నడుమ మూల విగ్రహముండ చుట్టు రాతిని చెక్కి దేవళము నిర్మించుటచే నా దేవళమునకు కాచవలె రాతిపని చుట్టబడియుండుటచే కాచె లేక కాసె పని యనియు నడుమ దేవవిగ్రహముండ చుట్టు రాతిపనిచే కట్టబడియుండుటచే కాచె లేక కాసె పని యందురు. ఇట్టిపని చేయువారికి కాసెవారనియు కాసెబుధు లనియు ప్రతినామము కలిగెను.

5. విశ్వజ్ఞవంశజులకు సువర్ణసఋషిగోత్రము, కాత్యాయనసూత్రము, ప్రణవవేదము, ఈశానప్రవర. ఓంకారశాఖ వారై ప్రపంచమునగల మానవులకెల్లరకు పుటపాకశోభిత మైన పసిడిచే పలువిధాభరణములఁ జేసి అందు వజ్ర వైడూర్య నీల గోమేధిక పుష్యరాగము మొదలగు నవరత్నముల నిమిడ్చి సుందరములగు చందనహారాదుల నిర్మించి సౌందర్యాతిశయ ముగల సుదతు లటుండ శిల్పి నిర్మించిన మందిరమునగల శిలావిగ్రహమున కారత్నహారము వేసినంతమాత్రముననే తద్విగ్రహదర్శకు లాసుందరవిగ్రహముపై గల అమూల్యా భరణఆవరణమునఁ జిక్కుకొని నోళ్ళొకదుడ్డిచ్చి నిక్కినిక్కి జూచుచు దీర్ఘనమస్కారములఁ జేయుచు వేగమే లేచి వెనుకకు తిరిగి ప్రదక్షణము గావించి పోవుటకు కాళ్లాడక పిచ్చి మెత్తినవానివలె విగ్రహదర్శనాపేక్షకులై పోయిన పోనిండు రొక్క మెక్కడ నయిన జిక్కగలదు. కాని మనోయాకర్షణ

డయిన ఈ ముద్దుమూర్తి సర్వాభరణభూషితుడై నెచట యగుపడును ? యని ద్రవ్యమెల్ల చూపరులు వ్రియపర్చు దురు. అట్టి ఆకర్షణవజ్రహారముల నలంకరించుకొను మానవుం డఖిలలోకపూజ్యుడై యుండగలడు. అట్టి పూజ్యతాభరణ నిర్మాణులు విశ్వజ్ఞులు. వీరిని హేమకారకులనియు అగసాల వారనియు ప్రతినామములచే పిలచెదరు. మంగళసూత్రమును వెండి బంగారు యజ్ఞోపవీతములను నిర్మించి వివాహితస్త్రీలకును ఉపనయన సంస్కారాంతర విప్రులకును సాక్షిభూతులై యుండు వారు.

పై ఐదు తరగతులవారు పంచాననుండగు పరమేశ్వ రుని సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశానముల నుండి బుట్టి సానగ సనాతన అభువనస ప్రత్నస సుపర్ణస యను గోత్రనామముల ధరించి సమస్త వర్ణాశ్రమస్తులకును సకలక్రియలకును జగదాధారులై విశ్వమును నడిపించువారగు టచే విశ్వబ్రాహ్మణులని కీర్తిగాంచిరి.

పంచాననుండగు పరశివుడే మూలపురుషుడు. త్రిమూర్తు లలోని మహేశ్వరుడు కాడు, ప్రథమమున పంచముఖముల నుండి పంచమూర్తుల పుట్టించి పంచవేదముల నుపదేసించిన పరశివుడు. ఇతనికి పుట్టినవారే బ్రహ్మ విష్ణు మహేశ్వర ఇంద్ర సూర్యులు. వీరే ఆదిఋషులు. తమతమ తపోబలముచే వీరు సత్యలోక వైకుంఠలోక కైలాసలోక ఇంద్రలోక సూర్యలోక ములను సంపాదించిరి. వీరు తమ నియమితకాలము తమతమ రాజ్యముల పాలించి బ్రహ్మప్రళయమున బ్రహ్మయు విష్ణుప్రళ

యమున విష్ణువు ఇటు లెవరెవరి ప్రళయమున వారువారు పరబ్రహ్మమునం దైక్యము నొందుదురు. తదనంతర మనాది మూర్తియగుపంచాననుడే "మఱ్ఱివృక్షాకార మెల్ల మఱ్ఱిబీజమునం దణగియున్నటుల" బ్రహ్మాండ మెల్ల పరశివుడు తనయం దైక్య మొనరించుకొని యుండగలడు. గనుకనే "వటే ఫలో బ్రహ్మాండం"అని వేదశృతికలదు. ప్రళయకాలమున అణువై సృష్టికాలమున అనంతమగును. పునర్ సృష్టికాలమువఱకు సర్వాధారుఁడగు పరబ్రహ్మము నిరాధారుడై యుండును. అట్టి విరాట్పురుషునిసంతతివా రవుటచే నేటికిని ఉత్తరప్రత్యుత్తరములు వ్రాయునపుడు "శ్రీమద్విరాట్విశ్వకర్మ పంచముఖోద్భవులయిన ఫలాని మయాచారి త్వష్టాచారి విశ్వజ్ఞాచారి యని వ్రాయుదురు."

ఇందు ఆచార్య యను శబ్దమున కర్థము వేదవ్యాఖ్యానముచేయు వాడనియు ఆచార్యకము అనగా 'ఉపాధ్యాయత్వము, ఒజ్జదనమని యర్థము గావున నీవిశ్వబ్రాహ్మణులకు 'ఒజ్జ' ఓజపదము ప్రయోగానుకూలమైనది. 'ఆచార్యోవై విశ్వకర్మ' సృష్టిప్రారంభమున "మానవదశ" కొచ్చిన యనంతరము మానవులకును దేవదానవులకును వేదము నుపదేశింప వ్యాఖ్యానకర్తలైనవారవుటచే ఆచార్యు లను బిరుదునామమును పొందిరి. వీరు విశ్వమునగల ప్రాణికోటులలో శ్రేష్ఠులై దేవ దానవ మానవులకు ఈశ్వరసృష్టియం దెటుల నడువవలయునను సద్వర్తనను గనుపఱచిరి గావున వీరిమూలమున

అనగా ఆచార్యులవలన రాబడిన సద్వర్తనయను నడతయగు టచే దానికి ఆచరణయను నామ మేర్పడెను.

శ్లో॥ విశ్వకర్మకులం సర్వం సురాసురగణైస్సహా,
బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరేతి సదాశివా.

తా॥ సమస్తదేవదానవమర్త్యులును సమస్తలోకముల యందలి ఎనుబదినాలుగు లక్షలజీవకోటులును చెప్పనలవిగాని యఖండబ్రహ్మాండ గోళమునగల సమస్త సముదాయమును విశ్వబ్రాహ్మణ (విశ్వకర్మ) కులమే యగును.

వీరిని అగసాలవారని సహా పిలుచుదురు. "అగ్గము = సాలె" అగ్గము = కనబడినది కనబడునది, అగుపడునంతవరకు దృష్టిగోచరమగు విశ్వమనియు ఇట్టివిశ్వమునెల్ల సాలె - అనగా బడిగా జేసి వేదవేదార్థములను నుపదేశించుటచే అగసాలవారని కీర్తిగాంచిరి. ఆకారణముచే ఒజ్జ యనగా ఉపాధ్యాయుడని ఆచార్యనామ మేర్పడెను. ఓజ యను పదము యజుర్వేదమందు ఏడవ అట్టములో మూడవ పన్నమందు గలదు. సంధ్యయందు సహా "వోజోసి"యను శబ్దము ప్రకాశించుచున్నది. ఆకారణముచే వీరిలో వేదోపాధ్యాయులగు వారినామమున కంత్యమున ముత్తోజు, చెనోజు ఇత్యాది శబ్దము లుపయోగింపఁబడుచున్నవి. వీరి కుటుంబములయం దిట్టి నామము లనేకులకు గలవు.

ఈ పంచాచార్యులకు పంచదాయులవా రను నామాంతరములుగలవు. దాయిఅనగా దాకలి (ఇనుపముద్ద) పై పంచాచార్యులకు ప్రీతికార్యమునకు అనగా వారి వృత్తులయందు

పనిచేయునపుడు ఊతగా క్రిందనుంచెడు ఇనుపముద్ద లోనగు నది. పై పంచాచార్యులకు ఐదుదాకళ్లు ప్రధమోపకరణము లగుటచే పంచదాయులవా రని ప్రతినామ మేర్పడెను.

వీరివంశజుడే విశ్వకర్మ (దేవశిల్పి) ప్రభాసుడను వసువు కుమారుడు. ఇతనితల్లి బృహస్పతి చెలియలగు యోగసిద్ధి (ప్రభ). సూర్యభార్యయగుసంజ్ఞా విశ్వకర్మకుమారిత. (బ్ర. వై.)

విశ్వకర్మ దేవతలకుఁ గావలసినహర్మ్యములు నగర ములు రథములు ఆయుధములు మొదలగునవి చేసి యిచ్చు చుండును. ఇతనికుమారుడే నలుడు. సముద్రమునకు వారధికట్టు నపుడు నీళ్లపై రాళ్లు నిలపెను. రామునితోఁ గలసి రావణు నితోఁబోరాడెను. (బ్ర. వై.)

తనకూతురు (సంజ్ఞ) సూర్యునిభార్య. ఈయమ సూర్య తేజస్సునకు దాళలేకపోవుటచే సూర్యుని (కవచమును) సానఁ బట్టెను. ఆ రాలినవజ్రచూర్ణముతోడనే రాక్షసాదుల సంహ రించుటకై నూఱుమొనలుగల వజ్రాయుధ(సుదర్శనచక్ర)మును విష్ణుమూర్తికి చేసియిచ్చెను. నాటినుండి విష్ణువునకు చక్రపాణి యని విశేషనామము కలిగెను. (బ్ర. వై.)

కృష్ణుడు సముద్రుని ప్రార్థించి పండ్రెండు యోజన ములభూమిని గొనిన యచట మయుడు ద్వారక యను నొకనగరము నిర్మించియిచ్చెను. (ఉ. రా.)

మయుఁడు కశ్యపునకు దనువునందుఁ బుట్టిన కుమా రుడు, దానవులకు శిల్పాచార్యుఁడు. రావణునిభార్యయైన

మందోదరి ఇతని కూతురు. రావణునికిగల అద్భుతశక్తి నిత డిచ్చినదే. (ఉ.రా.)

పాండవులకు చిత్రవిచిత్రసభను నిర్మించియిచ్చెను. మఱియు భీమున కొకగదను అర్జునునకు దేవదత్తమను శంఖమును యయాతిమహారాజుమామయగు వృషపర్వున కొక సభను నిర్మించియిచ్చెను. (భారత)

సంజ్ఞాదేవి సూర్యుని తేజస్సునకు తాళలేక బడబ (అశ్వ) రూపమున ఉత్తర కురుదేశమున నుండగ సూర్యుడశ్వరూపముతో నచటి కేగెను. ఆయమ తనభర్తను గుర్తించెను. వీరిసంయోగమున అశ్వినులను కుమారులు పుట్టిరి. వీరికి నాసత్యుడు దస్రుడు అను నామములుసహా కలవు. వీరు దేవతలకు వైద్యులు. యుద్ధములో కాలు విఱిగిపోయిన ఖేలునకు నినుపకాలు పెట్టిరి. (బ్రహ్మాండ)

ఒకషండుని భార్యయగు వధ్రిమతికి హిరణ్యాహస్తుడను బుత్రుని ప్రసాదించిరి. జలమగ్నులయిన రేభుని వదనుని బ్రతికించిరి. సముద్రములో గొట్టుకొనిపోవుచున్న భుజ్యుని గాపాడిరి.

కడు వృద్ధుడైయున్న చ్యవనునికి సుకన్యయొక్క పతివ్రతాధర్మమునకు మెచ్చి అసమానమగు రూపలావణ్యములతో గూడిన యౌవన మొసగిరి. (భారత)

కశ్యపు డంతఃపురంబున కద్రువను గూడియుండు సమయమున అదితియనుభార్య సంభోగేచ్ఛకలదై వచ్చెను. అపుడాశాభంగమైన అదితికి గోప మొచ్చి మీరు నరులై పుట్టు

డని వారిని శపించెను. ఆ శాపకారణముచే దేవకీ వసుదేవులై పుట్టిరి. (బ్ర. వై.)

పూర్వము (మున్నీరు) సముద్రుని హోమధేనువులను కశ్యపుడు బుచ్చుకొనెను. వాని నిచ్చివేయుమని సముద్రు డడిగెను. కశ్యపునిభార్యలయిన సురభి నదితి ప్రేరేపణచే నీయలేదు. అపు డావాహినీపతి (సముద్రుడు) నలువతోఁ జెప్పెను. కశ్యపుడు గోవులను నపహరించెను. గావున పుడమిపై గోపవర్యుఁడై పుట్టునని నలువ శపించెను. ఆశాపకారణముచే కశ్యపుడు వసుదేవుడుగ జన్మించి గోవుల కధిపతి యయ్యె. అదితి దేవకీదేవిగ జన్మించెను. వీరికి విష్ణువు గృష్ణుఁడై శిష్టజనరక్షణార్థమై యష్టమగర్భమున జన్మించి దుష్టులగుకంస దుర్యోధనాదులు మొదలగువారి నంత మొనరింప వింతవింత లయిన లీలల గావించి తుదకు కిరీటి కసమానమైన విశ్వరూప సందర్శన మిచ్చినవాఁడు. మనుష్యదేహధారులగు కద్రువ కశ్యపు లయిన విశ్వబ్రాహ్మణవంశజులపుత్రుడనియు జగన్మిత్రుడనియు, పంచాచార్యులలో కొంద రసమానభక్తి విశ్వాసములతో రాధాకృష్ణులను యిష్టదైవములుగ భావించి పూజించెదరు. (హరి)

సూర్యునికూతురు కాళింది విష్ణుమూర్తిని పెండ్లియాడ గోరి తపముచేసెను. గావున కృష్ణావతారమున పరిణయ మయ్యె. (భాగ)

కద్రువకుమారుడు కాళియ యనువాఁడు గరుత్మంతునకు వెఱచి కాళిందిమడుగున నుండువాఁడు. ఇత డందుండు

టచే జల మంతయు విషసంకలిత మయ్యె. దాన అందలి జీవరాసులెల్లయు జచ్చి జనులకు సహా అనుపయోగమైయుండ పురజను లెల్లరు భయపడుచుండ కృష్ణుడు దానిశిరముపై నిలుచుండి తాండవమాడుచుండ శిరము వంగి శ్రమ కలుగు చుండెను. అపుడు కాళింది కృష్ణుని యనేకవిధముల ప్రార్థించి నాసహోదరుని నెటులయిన రక్షింపవలయునని విన్నవింప వానిం జంపక పాతాళమునకు బోయియుండు మని వెంటనే పంపివేసెను. (భాగ)

విష్ణు వవతరించినపుడెల్ల అదితికశ్యపులకే పుట్టుచుండును. (భాగ)

విశ్వకర్మ యజ్ఞముచేసి దక్షునకు భూమి నొసంగిన కారణమున యాభూభాగమునకు దక్షిణదేశమని నామ మేర్పడెను.

విశ్వకర్మ దక్షిణదేశము దక్షిణగ దక్షున కిచ్చినను భూదేవి దానికి సమ్మతింపక రసాతలమున కరిగెను. దక్షు డపుడు కాళీదేవిని ప్రార్థించి వేదిరూపమున రావించెను. గాన నాటినుండి యా భూభాగమునకు దక్షుని (దక్షిణ) భూమి యని పిలువఁబడెను.

ఈ విశ్వబ్రాహ్మణులు (పంచాచార్యులు) కృతయుగమున మనస్సున దలచినంతమాత్రముననే త్రేతాయుగమునఁ జూచినంతమాత్రముననే ద్వాపరమున లిఖితమాత్రముననే చేయుచుండెడివారు. కలియుగమున మాత్రము కరసాధనములచే ప్రసిద్ధదేవాలయములు గృహములు గోపురములు భువన

మోహితములయిన భూషణములు నిర్మించి సమస్తప్రాణి కోటులలో శ్రేష్ఠులై మానవుల సంతోషచిత్తులఁ జేయుచున్న వారు.

ఈ పంచాచార్యవంశజులు కృతయుగమున రజితాద్రి త్రేతాయుగమున మేరువు పైనుండి ద్వాపరము మొదలు కలియుగ ప్రారంభానంతరము కొంతకాలమువరకు స్కాంత రాతికోటయందు నివసించియుండిరి. అది ఆరికగడ్డిచేత దహింప బడినపిమ్మట

1. మను సానగ కశ్యప మాన్న విశ్వాత్మ మామను మానో భూబాల విరూపాక్ష సామంత స్వతంసన ప్రబోధక పావంజయ భామ్మది జయత కురునర వనజ భసవంత మధు చతుర్వాస్త వనజయ సత్యక వసుయజ్ఞ సూతవ వసులోచన యను 25 సానగఋషిగోత్రజులు.

2. అభువనస అభవనస భద్రాదద విశ్వరూప కాం డవ సమవస్తా యజ్ఞపాల ప్రత్యక్ష ఆదిధాతు తామ్రగర్భ లోకాశ ధాతు వైదాక్ష మేధామతి విశ్వమయ బోధా యన హరిధర్మ చతురూప చిత్రాసన జయాసన వైదన్యా ప్రభునాత్ దేవల వినయ బ్రహ్మదీక్షిత యను 25 అభు వనసఋషిగోత్రజులు.

3. ప్రత్నస శిల్పి వాస్తుపతి రుచిదత్తా సనబాస ప్రమరాహన లోకవధ శితదండ సమమర్భన వాస్తుకి ఇంద్రా సన వస్తుధర్మ వసుధర్మ వజ్రభేద విశ్వభద్ర ధ్యానభద్ర దేవ

భద్ర యజ్ఞిక వీరాసన శకపర ముముక్షు శాఖపర భుక్త్య వేదపాల సహస్రబాహు యను 25 ప్రత్నస ఋషిగోత్రజులు.

4. ఓమ్ విశ్వజ్ఞ విశ్వజ్ఞ కర్మసాక్షి స్వర్ణాసన పరిధ మణిభద్రి మునిసువ్రత ఉదర దేవపాలక సద్వర్తన ఆదిధ్యాసన దావన్య అర్పిత అర్యంధ కర్ధమ మయత్రయ తగుధర్మ సుదర్శన యాజ్ఞ సంధ్య బోధక దేవాసన ఆదిత్య వైజదన ఆపయజ్ఞ యను 25 సుపర్ణసఋషిగోత్రజులు.

5. సనాతన మయ వైధన్య విశ్వదక్ష సురక్ష మామేక్ష సనత్కుమార ధర్మిణి విధాత్య ద్విజధర్మ వర్ధకి భవబోధ సైంధవాడి అనంత విశ్వతోముఖ స్థాపక యదన్నాశ విఫల పుమాడ జన జాహ్నూ జాయద శేవత శాంతిమతి యను 25 సనాతనఋషిగోత్రజులు.

మొత్తము (125) నూటయిరువైఐదు గోత్రముల వారు స్కాంతరాతికోటదహనానంతర మనేకదేశముల కేగిరి.

శ్లో. విశ్వబ్రహ్మకులే జాత గర్భబ్రాహ్మణనిశ్చయం
శూద్రత్వం నాస్తి తద్బీజం భ్రాతృమార్గ విశ్వకర్మణః.

తా॥ విశ్వబ్రహ్మవంశజు లెల్లరు గర్భమం దుండగనే బ్రాహ్మణులు. అనగా "బీజమే" బ్రహ్మబీజమనియు ఆకారణముచే బ్రాహ్మణులయినను వారు కర్మతో బ్రాహ్మణులయిన వారు; మేము బ్రహ్మజాతియందు బుట్టి, విశ్వమునకె మూలకారణులమై విశ్వబ్రాహ్మణులమని పిలువబడువార మని యెదరు.

## విశ్వబ్రాహ్మణులతిలకధారణ.

శ్లో॥ మనూనాం త్రిపుండ్రంచ మయానాం ఊర్ధ్వపుండ్రయో
త్వష్టానాం వర్తులాకారం శిల్పిపటలమేవ చ.

త్వష్టాచారి ○గుండ్రముగ, శిల్పాచార్యులు □చౌకముగ, విశ్వజ్ఞాచార్యులు ♦నువ్వుగింజవలె, మనువాచార్యులు≡ మూడు రేఖలుగ, మయాచారి నిలువురేఖ ||| లుగ తిలకమును ధరించుదురు.

వీరు స్వాంతరాతికోటను వదలిపోయి తమయొక్క స్వస్వరూపములను మార్చుకొని ఆయా దేశాచారపద్ధతిని ప్రచ్ఛన్నవేషముల ధరించి ఎరుకగలవారు తెలిసికొనుటకు చోద్యముగాను పరాగముగప్పిన వజ్రమువలె బూడిదగప్పి అగ్నివలె ధర్మరాజాదు లజ్ఞాతవాసమయమున రూపుమారి యుండునటుల గొప్పతనమును గౌరవమును స్వభావమును మరుగుంచుకొని నానాద్వీపముల యందును నేబదియారు దేశములయందును ఆయాదేశభాషలను నేర్చి ఆయాదేశాచారములుగలవారై లోకహితకృషి చేయుచున్నవారు.

## ఉదాహరణము.

మన పురాణములలో వివస్వంతునకు మనువు పుట్టెనని యుండ ఇంగ్లీషువారి గాధలలో తుయిష్టో (త్వష్ట) కొడుకు మనస్సనువాడని యున్నది. మనుకులమువారు బర్మాదేశమున రాజ్యము నిర్మించి దానికి 'తటాన్' అనగా 'కమసాలి' అను పేరు పెట్టిరని ఫెయిరీదొరగారి బర్మాదేశచరిత్రమువలన తెలి

యుచున్నది. ఈ తట్టాన్ శబ్దము 'తట్ర' యను పేరిట తెలుఁగు లోనికి వచ్చినదని బ్ర. శ్రీ. చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసినారు. కాని ఈపదము అనగా 'తట్టాన్' యనునది ద్రవిడ పదము. తట్రయనునది దాని వికృతి యని తెలియునది. తట్టాన అనగా బంగారుపనిచేసి బ్రతికెడిజాతివారు. విశ్వ బ్రాహ్మణులలోని విశ్వజ్ఞులు. ఇటులే నానా దేశములయందు నానాభాషలచే పిలువబడు చున్న వారు.

శార. క్రీ. శ 1924. సం 2.

---

# ఏడవ ప్రకరణము

## వైశ్యులు.

విరాట్పురుషునిఊరువులనుండి జన్మించి పైడికి రేడులై "బ్రాహ్మణః ఊరోర్వభవాః ఊర్వోజాతా ఊరుజాః పర బ్రహ్మముయొక్క తొడలవలనఁబుట్టినవారు గనుక ఊరవ్యులు ఊరుజనులును. విశప్రవేశనే అంగళ్లు మొదలయినవానిని ప్రవేశించువారు విశులు. విశులే 'వైశ్యులు' అను నామముచే పిలువఁబడువారు.

ఈవంశజు లెల్లరు కాలకంఠునిభక్తులై కైలాసమును జేరి సుఖులై యుండిరి. అట్టితరి మర్త్యలోకమున గోరక్షణవ్యవహారాది పనులు నిలచిపోయెను.

ఇటుల నిలచిపోవుటచే ప్రజ లెల్లరు పరమేశ్వరుని గురించి తప మాచరించిరి. అపుడా పరాత్పరు డెల్లజనుల మొర విని కైలాసమునగల వైశ్యసంఘము నెల్ల ప్రపంచమున ప్రజానుకూల వ్యవహారములం జేయుటకై చనుండని సెలవొసంగెను. వైశ్యులెల్లరు కైలాసమును వదలి తిరిగి కర్మలోకమునకుఁ జనమని ఘనమగు భక్తివిశ్వాసములతో విన్నవించిరి. ఈ వృత్తాంతమెల్ల సర్వమయుఁడగు విష్ణువు తెలిసికొని ఈశ్వర ప్రియులయిన వైశ్యులకొఱకై తనమాయచే నొక బంగారు గోవును చేసి దానిగర్భమున యనేకలోకములను నిర్మించి అందు మీరు సుఖముగ యుండవచ్చునని వీరి కగుపఱచెను.

వీరు పరమానందముజెంది యందు ప్రవేశించిరి. తదనంతర మాగోగర్భాంతరమునఁగల లోకము లతియూష్ణము లవుటచే అందుండ వెఱచి ఈశ్వరునకు మొఱలిడుచు తా మేలోక మునకు బంపినను పోవుటకు సిద్ధముగాయున్నారము. కాని అతి యూష్ణముగల ఈగోగర్భలోకములయం దుండ నేర మని విన్నవించిరి.

సదాశివుఁడు దయామయుఁడై పవిత్రస్థానమయిన శ్రవణ (చెవి)రంధ్రమునుండి వెళ్లునటుల గావించి మర్త్య లోకమునకుఁ బంపెను. కాన నాటినుండి వీరికి "గోమతులు" యను నొక విశేషనామ మేర్పడెను. "గోమతు లనగా గోమాతయందు బుట్టి యట్టిగోవునకుగల సాత్వికస్వభావ ప్రభావము కలిగినవారని యర్థము"

కన్యకాంబికతండ్రియయిన కుసుమశెట్టి పూర్వజన్మ మున కుబేరునికొమారుడయిన నలకూబరుడు. శతజిహ్వుడను రాక్షసుఁడు ఋష్యాదులయజ్ఞములు పాడుజేయుచుండ బ్రహ్మ నలకూబరునివద్దికి వచ్చి రాక్షసునితో యుద్ధముచేసి వానిని చంపుమన అందుల కిష్టపడకుండుటచే కుబేరునికుమారుడవై ఇటుల భయపడితివి గావున మర్త్యలోకమున వైశ్యుడవై పుట్టుమనియె. ఆకారణముచే నరలోకమునఁ బుట్టి కుసుమ శ్రేష్ఠియను నామముగలవాడై కుసుమాంబియను స్త్రీని వివాహమాడెను. ఇతనినివాసము పెనుగొండ. ఇతనికి శచీ దేవియంశమున కన్యకాంబికయను కూతురు పుట్టెను. కుసుమ శెట్టి కుబేరునిపుత్రుడు గావున తన వంశజులగు వైశ్యులనెల్ల

కుబేరు లగునటుల చేసెను. నాటినుండి బేరులు కుబేరులని కీర్తిగాంచిరి.

కుసుమశ్రేష్ఠి (కన్యకాంబతండ్రి) ఇతడు తనగృహము నకు విష్ణువర్ధనుడను రాజును తీసికొనివచ్చి సత్కరించెను. అతఁడు కన్యకాంబ (శ్రేష్ఠికూతురు)ను జూచి మోహించి యామెను దన కిమ్మని కోరెను. అది తగదని చెప్పినను రాజు యుద్ధసన్నద్ధుఁడై రాక్షసవివాహమున గైకొన ప్రయత్నించు చుండునంత లో చితిపేర్చి అందుఁ దనకూతురును కుమారుని భార్యను ప్రవేశపెట్టి తానును జితినెక్కెను. వీరితో గూడయే యనేకులు గుండప్రవేశమైరి (చితిని ప్రవేశించిరి). వైశ్యులలో 714 గోత్రములవా రుండిరనియు ప్రస్తుతము 102 గోత్రముల వారే గలరనియు దెల్పెదరు.

వీరిలో అగ్నిగుండ ప్రవేశానంతరము మిగిలినవారు తమస్వస్థానములను వదలి అనేకరాజ్యములకు బోయిరి. అందు విశేషజనులు తమప్రాణములకంటె మిక్కిలి ప్రియముగ జూచుచుండెడి గోసమూహములనెల్ల వెంబడిడుకొని నానా రాజ్యములను తిరిగి క్రీ. శ. 1098 వ సంవత్సరములో పశ్చిమ దేశమునఁగల బెల్గోలములోని 'దొడ్డబెట్ట' మీద గోమతేశ్వర విగ్రహమును ప్రతిష్ఠించి వేలకొలఁదివైశ్యు లా గోమఠము నందే నివాస మేర్పఱచుకొని యుండిరి.

ఎట్లు ద్రావిడబ్రాహ్మణులలో పాకనాడునుంచి వచ్చిన వారికి పాకనాడువా రనియు కమ్మనాడువా రనియు మంథెన నుంచి వచ్చినవారికి మంథెనవా రనియు ప్రతినామములు

కలిగెనో నట్టులే వీరు గోమఠమునుండి ఇతరరాజ్యములకుఁ జేరినపుడు ఆయా రాజ్యమందలి ప్రజలు గోమఠమునుండి వచ్చిన గోమఠమువా రనియు గోమఠులనియు, గోమఠ= గవా, మఠః = గోమఠః, లేక గో ఆశ్రియ భూతిత్యర్థః మఠ= ఛాత్రాదినిలయః ఇత్యమరః 228. మఠంతి, వసంతి, గవాదయోః అత్ర గోమఠ. గోమఠ, గోమఠి, యనునది పామరోక్తులచే "కోమటు" లయ్యెను.

సాయణాచార్యభాష్య ఋగ్వేదమందు:—

"గోమతీశబ్దస్తు వికృత్యా కోమటీతి వైశ్యేషు వ్యవహ్రియతే" అని యుండుటచేత గోమతీశబ్దవికృతియే కోమటి యని ఋగ్వేదభాష్యమును వ్రాసిన సాయణాచార్యుల సిద్ధాంతప్రకారము ప్రథమనామము గోమతీ, అనంతరము కోమటి, తదనంతరము గోమఠి యను నామము లొకదాని పిమ్మట మఱియొకటి కలిగినను సాయణాచార్యుల సిద్ధాంతము పండితయుక్తిలేని సత్యసిద్ధాంతము.

గుంటూరులోని ప్రత్తిపాడను గ్రామమందలి దండేశ్వరస్వామి దేవాలయమున మూల్యగోత్రీయుఁడును పెనుగొండనివాసియునగు నారాయణశెట్టి వ్రాయించిన శాసన మొకటి గలదు. ఇది సంస్కృతాంధ్రభాషలలో వ్రాయబడినది. ఇయ్యది శా. శ. 1079 కి సరియగు క్రీ. శ. 1157.

అనంతపురములోని మడకశిరాతాలూకా హేమావతి యను ఊరియందు శా. శ. 1084 కి సరియగు క్రీ. శ. 1162 సం॥ చతుర్భాషాకోవిదులగు దేశిసెట్లచే కొన్ని పదార్థములపై

వేయబడునట్టి సుంకము (పన్ను) లను దానమిడినట్లు లిఖింపఁ బడియున్నది.

వేంగిరాజ్యమును పాలించుచున్న వెలనాటిచోడ గొంక మహారాజుయొద్ద పెనుగొండపురమున కేలికరైన సామంతుడును భాండారియునగు భండనభీమబిరుదుగల పోతిసెట్టినిన్ని ఇతనితండ్రియగు భీమసెట్టినిన్ని నలకూబరవంశీయు లనియు, భీమిసెట్టిని సకలవైశ్య శిరోవతంసునిగాను సౌజన్య ఖనిగను ఆశ్రితపద్మవాసునిగను వర్ణించియున్నారు.

ఈవైశ్యు లాకాలమున వ్యవహారాధిపతులేగాక ధైర్య శౌర్యపరాక్రమములు గలిగి సామంతరాజులుగను సేనాధిపతులుగ నున్నట్లు తెలియుచున్నది.

వైశ్యులు భరతఖండమున ఆచార వ్యవహార నామాంతరములచే నొక్కొక దేశభాషయం దొక్కొక పేర బిలువఁ బడుచు ననేక దేశములందు నివసించియున్నారు.

ఉత్తరహిందూస్థాన ప్రాంత్యములందు ఆగర్ వాలా బనియా, మహేశ్వరీబనియా లను రెండు శాఖలవారు గలరు. వీరికి పురోహితులు సారస్వతమైథిలీబ్రాహ్మణులు. బంగాళా (వంగ) దేశములో స్వర్ణబణిర్ అను వైశ్యులు గలరు. వీరికి పురోహితులు గౌడబ్రాహ్మణులు.

ఉత్కళ (ఓఢ్ర) దేశములో కళింగకోమట్లను వైశ్యులు గలరు. కర్ణాటక (కన్నడ) దేశమందు నగర్తలను వైశ్యులు గలరు. ద్రావిడదేశములో బేరిసెట్లను వైశ్యులు గలరు.

గుజరాతీ దేశములో ఉపశ్రిలా కపోలా యను రెండు తెగల వైశ్యులు గలరు. రాజపుత్రస్థానములో గోరల్ అనువైశ్యులు గలరు ఆంధ్రదేశమున కోమట్లు గవరకోమట్లు వేగికోమట్లు ఆర్యవైశ్యులు వైశ్యులు గలరు.

పద్మపురాణము ఖండము 26 లోని

శ్లో॥ విశత్యాయ పశుభ్యశ్చ కృష్యాదానరుచుశ్శుచి।
వేదాధ్యయనసంపన్నస్స వైశ్య ఇతి సంజ్ఞికః.

యను శ్లోకమువలన వైశ్యులు వేదాధ్యయన సంపన్నులై యుండిరని తెలియంగఁజెల్లును.

శ్రీనాధకవిచే ఘనముగా నెన్నఁబడ్డ నైషధమును రచించిన శ్రీహర్షుడు వైశ్యుడు. భరతశాస్త్రదులకు వ్యాఖ్యానములు వ్రాసిన మాతృగుప్తుడు వైశ్యుడు. పంచసిద్ధాంతమను క్షేత్రగణితమును రచించిన బ్రహ్మగుప్తుడు వైశ్యుడు. శ్రీహర్షుడు వైశ్య చక్రవర్తులలో నొకఁడై వెలసి యుండెను. మాతృగుప్తుడు కాశ్మీరరాజ్యమును పాలించు చుండెను. క్రీ. పూ. 320 ప్రాంతములో ఉజ్జయినిని ఏలుచుండిన పుష్యగుప్తుడు వైశ్యుడు.

క్రీ. శ. 4 వ 5 వ శతాబ్దములలో విక్రమాదిత్య బిరుదాంకితులగు చంద్రగుప్త, సముద్రగుప్త, కుమారగుప్త మొదలగు వైశ్య చక్రవర్తులు ఉత్తర హిందూస్థానమును పాలించిరి. క్రీ. శ. 5 వ శతాబ్దమున సాలంకాయనులు కాంచీ

పురమందలి వేంగిదేశమును పాలించిరి. ఈ సాలంకాయనులు తపోబల సంపన్నులై వైశ్యమునులని కీర్తిగాంచిరి.

వైవస్వతమనువుమనుమడైన నాభాగుడు అభినియను వైశ్యకన్యను వివాహమాడి వైశ్యుడైనట్లు మార్కండేయ పురాణమునగలదు. ఈనాభాగుడు సాలంకాయనులలో నొకడు. ఇక్ష్వాకువంశజుడైన శిలాదిత్యుడు (హర్షవర్ధనుడు) క్రీ. శ. 7 వ శతాబ్దమున హిందూస్థానమునెల్ల స్వాధీనపఱచుకొని రాజ్యమేలుచుండెను.

క్రీ. శ. 7 వ శతాబ్దములో హర్షవర్ధనుని దండయాత్రలలో ఆదిసూరుని నిర్బంధమువలన వైశ్యులు మగధదేశమందలి గాడ్ప్రాంత్యములనుండి వలసవచ్చి ఆంధ్రదేశమంతట వ్యాపించిరనియు అందు పెనుగొండయందున్న వారే విష్ణువర్ధనుని బారికి తాళలేక బెల్గాములో గోమతేశ్వరమును జేరి యచ్చటినుండి వెళ్లినవా రాంధ్రదేశమునకు జేరగ గోమఠమువారనియు గోమఠులనియు యనంతరము కొంతకాలమునకు 'గో' 'కో'గా మారి కోమఠులనియు స్థిరపడియె.

---

# ఎనిమిదవ ప్రకరణము

## చాత్తాద శ్రీవైష్ణవులు.

చయతని చయతి చాత్తాద చాత్తాని అనగా ధర్మాను కూలాచరణుడని యర్థము. శ్రీ రామానుజాచార్యుల కాలంబున ధర్మానుకూలాచరణులైన శ్రీవైష్ణవులలో కొందరు కర్మశ్రేష్టుల మనియు మఱికొందరు జ్ఞానశ్రేష్టుల మనియు వాదించిరి. ఉభయులును గోకర్ణక్షేత్రము మొదలు ట్రావాన్కూరునుండి ప్రవహించు తామ్రపర్ణీనదియందు ఏ చిహ్నములతో వెళ్లిన యామార్గమే శ్రేష్టమని వాది ప్రతివాదులు నియమించుకొని మునిగిరనియు అనంతర మానదిలోపలినుండి కర్మ శ్రేష్టమని వాదించిన వైష్ణవులు శిఖాయజ్ఞోపవీతసమేతముగా వెళ్లిరి. జ్ఞానమే శ్రేష్టమని వాదించిన వైష్ణవులు శిఖాయజ్ఞోపవీతరహితులై నామస్మరణజేయుచు వెళ్లిరి. నాటినుండి కర్మరహితులు చాత్తాదవైష్ణవులని పిలువబడుచున్నారనియు వీరు కర్మమార్గమును వదలి జ్ఞానమార్గావలంబకులై రనియు తెలియుచున్నది. మ రి యు పరాత్పరుండు ప్రతిమానవునకు కర్మజ్ఞానము లను రెండు మార్గములత్యావసరమని దెల్పుటకై ఉభయానుకూలముగ వాది ప్రతివాదులు స మా ను లే అ ని దెలిపినటుల గోచరమగుచున్నది. గావున వీరు జ్ఞానమార్గమునే ఆశ్రయించి శైవమున

వీరశైవజంగములవలె వీరవైష్ణవులై చాత్తాదశ్రీవైష్ణవులని పిలువబడుచున్నారనియు అందు చాత్తని యనగా అరవములో తీసికొనిపోవడమునకుగాని విడచిపెట్టడమునకుగాని యర్థము. తీసికొనిపోవడ మనగా వదలిపెట్టిన కర్మమార్గమును తిరిగి పరిగ్రహించనివారని యర్థము. విడచిపెట్టడమనగా శిఖాయజ్ఞోపవీతాదుల తామ్రపర్ణినదియందే విడచిపెట్టినవారని యర్థము. మరియు కొన్ని కర్మమార్గములనుసహా వదలినవారనియు నొకవిశేషార్థము గలదు.

వేదకర్మలను వదలినవారు దురాచారులే కదా యని కొందరి యభిప్రాయము. కాని కర్మయోగమునకంటె జ్ఞానయోగము శ్రేష్టమనియు పుణ్యాపాపముల కలిగించెడి సమస్తకర్మలను వదలి మోక్షాకరమగు భగవత్పూజతోడనే వివాహాది సకలకర్మ లొనర్చుకొనుచు వేదములను నిందింపక వీరశైవులవలె వీరవైష్ణవులై అహింసావ్రతులై జ్ఞానభక్తులను వీడక భగవంతునియందును ఆచార్యాది పరమభాగవతోత్తముల యందును దృఢభక్తిశ్రద్ధలు గల్గి ఇతరవృత్తులతో జీవింపక భగవన్నామగీతముల ప్రీతిచే బాడుచు పామరులకు భక్తిప్రబోధక మొనర్చుచు అకల్మషంబగు భిక్షావృత్తిచే జీవించుచు సంతతము భగవధ్యాన పరులై అద్వైతులగు ద్విజులలో విరక్తులుగనున్న కొందరు కుటుంబీకసన్యాసులవలెను మరియు శిఖాయజ్ఞోపవీతములను త్యజించి భాగవతసాంప్రదాయకులైన శైవులవలె వైష్ణవులలో మేమని మెదరు.

రామానుజాచార్యుల యనంతరము రామానుజ మత ప్రచారకులై ఆచార్యులచే పంచసంస్కారములు పొందిన ఉత్తమశూద్రులు శూద్రులు మొదలగువారు ఆచార్యుడు దెల్పెడి మంత్ర మంత్రార్థముల త్వరలో గ్రహింపలేనందునను గ్రహించునంతవరకాచార్యుడొకచోటనే యుండవీలుండక పంచసంస్కారులైన పైవారు విఫలులైపోకుండుటకునై ఆచార్యులచే భక్తిప్రబోధకులుగ నియమితులైనవారై సంస్కారపరులకు మంత్రమంత్రార్థముల బోధించి విజ్ఞానమును కలిగించుచు సంస్కారహీనుల సంస్కారపరు లగునటుల ప్రయత్నించుచు విశిష్టాద్వైత మతమును విస్తరింపజేయ ఆచార్య పీఠమునకు ప్రతినిధులుగను మతరక్షకులుగను నేర్పడి శిష్యసంఘములుగల గ్రామములయందు నచ్చటచ్చట నివసించిరి.

మహాస్వామియను పెరియస్వామి శ్రీ కుమార లక్ష్మణాచార్యులు తమ దిగ్విజయకాలంబున శ్రీరంగమున కూరేశ ప్రతిష్ఠ యొనరించినపుడు అచ్చటికి విచ్చేసిన అఖిలాచార్య పురుషుల సమక్షమున వీరికి మతబోధాధికారం బొసంగగ అఖిలాచార్యపురుషులసమక్షముననే గైకొనిరి. యనంతరము క్రమక్రమముగా పౌరోహిత్యముక్రిందికి మార్చుకొనిరి. పౌరోహిత్యమును చేయుచు పురుషాకారులని ప్రతినామమును బొందిరి. వీరిని మతబోధక పురుషాకారు లని ప్రజలు పిలువ ప్రారంభించిరి. వీరు ట్రావన్కూరునందలి తామ్రపర్ణీనది సమీపమునుండి వెడలి యనేక రాజ్యములకు వ్యాపించి

విశిష్టాద్వైత సిద్ధాంత మతప్రచారకులై కర్మరాహిత్యులై అహింసాపరులై అనన్యభక్తివిశ్వాసపరిపూర్ణులై యున్నవారు.

మార్కండేయ మహాఋషి. రెండవ కైలాసగిరి యనంబడు శ్రీశైలంబున యజ్ఞముచేయఁగ నాయజ్ఞగుండమునుండి ఆళ్వారు ఎంబేరుమానారు జీయ్యరు తిరువాది యను నల్వురు పుట్టి రందు ఎంబేరుమానారుయొక్క వంశజులమైన మాకు గార్గ్య కౌండిన్య ఆంగీరస కౌశిక నమ్మాళ్ వార్ కూరాత్మాళ్వార్ శేఖరాళ్వార్ తొండవపల్లియాళ్వార్ పాయాళ్వార్ గోత్రములుగల్గి పరవస్తువారు నిశ్చలపురివారు నామంవారు శ్రీపురంవారు పురమువారు వైజాపురంవారు తాలవివారు శ్రీరంగమువారు యను గృహనామములుగల్గి సమస్తశాస్త్రార్థనైపుణ్యులై మాయవాదిత్వహతపతాకములం బొంది ప్రపంచమం దనేక రాజ్యములయం దున్నవార మనియెదరు.

---

# త్రోమ్మిదవప్రకరణము

## యాదవులు.

చంద్రునకు తారయందు బుట్టినవాఁడు బుధుడు. వీనికి పురూరవుడు నితని కాయువు వీనికి నహుషుఁడు వీనికి యతి యయాతి సంయాతి యాయాతి ధృవుడు అను కుమారులు కలిగిరి. వీరిలో యయాతికి దేవయానయందు యదువు తుర్వసువు అను నిద్దఱు పుత్రులు కలిగిరి. యదువునకు క్రోష్టువు. ఇట్లొకరికొకరు శశిబింధు పృథుశ్రవుఁడు జామకుఁడు విదర్భుడు పృథుడు సాత్వుడు అంధకుడు భజమానుడు భోజుడు హృదికుడు దేవమీఢుడు (వీనికి మారిశయందు బుట్టినవాఁడు వసుదేవుడు) మొదలగువారు బుట్టిరి. వీరివంశపుకన్యయే కుంతి.

వసుదేవునకు దేవకీదేవియష్టమగర్భమున "ద్వాపరయుగముయొక్క 8,64,000 సంవత్సరములపరిమితితో 8,63,874 సంవత్సరములు 4 నెలలు 21 దినములు గడచినపిమ్మట వచ్చిన స్వభానుసంవత్సర శ్రావణబహుళ నవమీ విద్ధాష్టమినాఁడు శ్రీకృష్ణ పరమాత్మఁడు యదుక్షితీశుని వంశమున" జన్మించి నందునియింట యశోదాదేవిచే పోషింపఁబడుటచే గోపాలుడని గోకులమువారిచే పిలువఁబడియే గోపాలనము జేయుచుండెను. కంసునిభయమునకు వసుదేవుడు దేవకీదేవిప్రేరేపణచే నంద యశోదాదుల గృహంబున నెవ్వరికిఁ దెలియకుండ ప్రవేశించి యశోదాదేవిప్రక్కనగల బాలికను గొని

బాలుని యచట వదలివచ్చెను. నాటినుండి క్షత్రియవంశ సంభవుఁడైన శ్రీకృష్ణుఁడు గొల్లడై పిల్లనగ్రోవితో సమస్త జీవుల బ్రహ్మానందభరితులఁ జేసి తుదకు తననోటనే సమస్త లోకాలోకము లుండున ట్లా యశోదాదేవి కగుపరచెను. ఈ మహామహుడు తనలీలలెల్ల యశోదాదేవియింటనే జూపియుం డుటచేత యదువంశోత్తము డనుటకు బదులు గోపాలు డని పిలుచుచుండిరి. గోపాలుడనగా గొల్లనాడని యర్థము గాక (గో=పాలుడు) గో - యనగా భూమి పా లు డు యనగా పాలకుడు, భూపాలుడు అనునర్థముగల క్షత్రియనామసూచనచే పిలువఁబడియె.

కంసుడు యాదవుల కనేక యపకారము లొనర్చు చుండుటచే "రాళ్లవాన మొదలగు నుపద్రవములచే" గోకుల బృందావనము నష్టమై జూచుటకుసహా నిష్టముకానిదశయందు విశ్వకర్మచే ద్వారవతీయను పురంబును నిర్మింపజేసి శంఖనిధిని బిలిపించి ద్వారకయందుగల యాదవులెల్ల ధనవంతులుగా గావించి యుగ్రసేనుని రాజుగా నియమించి తాను స్వేచ్ఛగా యుండి భారతయుద్ధమారంభింపఁజేసి సమస్తవీరాదివీరులనెల్ల వీరస్వర్గమంపించుచు తుదకు యాదవులెల్ల గాంధారి దూర్వాస శాపకారణములచే నొకరినొకరు గొట్టుకొని గంగాతీరమున హతులై నపుడు యుద్ధవునకు సాంఖ్యయోగమును బోధించి ద్వారకకుఁ బోయి బంధుమరణానంతర మిచ టుండుట తగదని బలరామునిఁ జేర విపినమునకు బోయె.

ఈ యాదవవంశమున సాంబునిసంతతివారుమాత్రము

మిగిలినారని తెలియుచున్నది. ఆ సాంబునివంశంబున మిగిలిన వారు ద్వారకయందే నివసించుచుండుటచే క్రీ. శ. 1399 లో ద్వారకనుండి దక్షిణమున విజయకృష్ణు లను యాదవరాజ పుత్రులు మైసూరుసీమయందు 'ఒడయరు'లనుకీర్తి పొంది విజయ నగర సామ్రాజ్యముక్రింద పాలయకారులై క్రీ. శ. 1565 లో స్వతంత్రాధికారమును బూన నారంభించిరనియు

కరౌలి యను రాజధానికి పాలకులుగ నున్నవారిలో విజయపాలుడనువాడు మూలపురుషుడు. నితఁడు 'బయన'యను స్థలమందొక కోటను గట్టించెను. ఇతని జ్యేష్ఠపుత్రుడగు 'దహానపాలుఁడు' దహానఘర్ కోటను గట్టి కలౌజీ దేశాధీశు డాయెను. యనంతరము క్రీ. శ.॥ 1196 లో యాదవవంశజుడైన 'కున్వారాపాలు' డను రాజు మహమ్మదుగోరి కుతుబుద్దీనులచేత నోడింపబడి తన పరివారముతోసహా పారిపోయెను. వీరు దహానగరుకోటనుండి పోయినందున వీ రేయేరాజ్యములకుఁ చేరిరో ఆ యా రాజ్యములయందు 'దహానగర్' వార మని దెలుపుచుండిరి. అది పామరోక్తులచే 'ధర్‌ఘర్' యని స్థిరపడెను.

యాదవవంశజుడైన అర్జునపాలుడే పూర్వుల దేశము (దహానఘర్)ను తిరిగిసంపాదించుటకు కృతనిశ్చయుఁడై క్రీ. శ. 1227 లో మంద రేలుకోట నాక్రమించుకొని క్రీ. శ. 1348 లో కరౌలియను మఱియొక పట్టణమును గట్టెను. మొదటి కరౌలిరాజధానిని గట్టినవాడితడే యనియు నూఱుసంవత్సర ముల యనంతర మీరాజ్యము మహమ్మదీయులవశమై అగ్బరు

కాలమునాటికి ఢిల్లీసామ్రాజ్యములో జేర్పఁబడియుండి గోపాలదాస్ యను కరాలీపాలకుల సంతతివానికి రెండు వేలతురంగముల కధిపతిజేయఁబడి రాజ్యమొసఁగబడియె. ఈగోపాలదాసు అగ్బరు కోరగా నాగోృటకు శంఖుస్థాపనము జేసెను. కరాలీరాజ్యము మొగలాయివారిచే క్రీ.శ. 1817 లో మహాఘనత జెందిన బ్రిటిష్‌దొరతనమువారి సంరక్షణము క్రిందికి వచ్చెను.

క్రీ. శ. 1852లో భరతపాలుడను దత్తపుత్రుఁడు పాలకుడాయెను. వీరికి జి. సి. ఎస్. ఐ. యను బిరుదులుకలిగి 15 నుండి 17 వఱకు పిరంగీలు గౌరవార్థము కాల్చబడుచుండెను. ఇతని యనంతరము క్రీ. శ. 1912 లో హిజ్‌హైనెస్ మహారాజా సర్‌భాను వరపాల్ దేవబహద్దుర్ యదుకుల చంద్రపాల్ జి. సి. ఐ. ఇ. గారు పాలించుచుండిరి. వీరి కైదుగురు మంత్రులుండిరి. వీరు యాదవవంశీయులలో ఘనకీర్తిపరులు.

నైజాముర్యాజమందలి పానుగంటి (పానుగల్లు)నందు యాదవరాజుల దొకశాసనము గలదు. శాసనస్థాపకుఁడగు శార్ఙ్గపాణిదేవమహారాయలు మిగుల పరాక్రమశాలి వీర పురుషుడు వివిధ బిరుదాభిరాముడు. ఇతడు యాదవవంశజుడైనందున గణపతిదేవచక్రవర్తికుమార్తెయగు రుద్రమదేవి కాలమున నొకశాసనములో

"రాజాన్వయో భూయసి యాదవానామ్
వంశే మహానున్నత వాన్విభాతి."

యని నితఁడు తనవంశమునుగూర్చి పై విధముగా చెప్పు కొనియుండుటచే యాదవవంశమువారు నాకాలమున క్షత్రియ వంశజులుగనే గౌరవింపఁబడినటు లూహింపవచ్చునని యున్న దియేగాక, పై శార్ఙ్గపాణికి "ప్రౌఢప్రతాపవీర"యను బిరుదు గలదు. ఇతఁడు ఛాయా సోమేశ్వరునకు పండ్రెండునివర్తన ముల భూమిని ఉదయసముద్రము వెనుకగల సారవంతమగు చోట దానముగావించెను. నితడు పానుగంటి రాజ్యమునకు రుద్రమదేవిపక్షమున రాజప్రతినిధిగ నుండెననియు నీవీర పురుషుడు దేవగిరియాదవశాఖాసంబంధి యనియేగాక రుద్రమ దేవికాలమున దేవగిరియాదవు లందరు రాజప్రతినిధులుగా నున్నటుల దెలియుచున్నది. శా - ఆశ్వీజ - రక్తాక్షి.

---

# పదవప్రకరణము

## ముదిరాజులు.

ఇంద్రునికూతురయిన జయంతికి శుక్రునివలనఁ బుట్టిన దేవయాన తనతండ్రికి శుశ్రూష జేయుచున్న కచునియం దనురాగము గలిగి యుండెను. కాని యాతఁడు డీయమను చెల్లెలి వలె ప్రేమించుచుండువాఁడు. ఒకనా డీదేవయాన, కచుని భర్తవు గమ్మని గడువినయముతో 'విన్నవించెను. సోదరీ! ఏల యీ కామపిశాచావేశురాలవైతి'వని యతఁడు తిరస్కరించెను. అంత గురుకన్య యీర్ష్యగలిగినదై నీ విచట నేర్చిన విద్య నీ కనుపయోగ మాగాక'యని శపించెను. 'ధర్మవిరుద్ధమైనదాని నొప్పుకొనమిచే శపించితివి, గావున నిన్ను విప్రుఁడు మాత్రము వివాహ మాడకుండుగాక'యని కచుడు ప్రతిశాపమిచ్చెను.

ఒకనాఁ డాదేవయాన వృషపర్వమహారాజుకూతురగు శర్మిష్ఠతో కూడ జలక్రీడ లాడుచుండ, బావిపై వేరువే రుంచియున్నవలువలు వాయువు (గాలి)చే గొట్టుకొనిపోయి స్థానభేదమై శర్మిష్ఠవలువ యుండుచోట దేవయానవలువయున్న కతంబున తన దేయను విశ్వాసముతో శర్మిష్ఠ గట్టుకొనియె. అనంతర మొచ్చిన దేవయాన తనవలువం గానక రాచపట్టెని జూచి 'మతిహీనురాలా! మీకులమునకు గురువులమై నీవు ధరించిన చేలము నే జేలనై గట్టుకొనెద ననుకుంటివా'యనితిరస్కరించెను.

దాన రాచపట్టియగు శర్మిష్ట రాహువు రవిని మ్రింగుచందమున దేవయానపై కేఁ బోయి బలిభిక్షములతో జీవించు యాచకుని పట్టీ! నీ కింత మదమా? యని నూతియందు బడద్రోసి వెళ్లి పోయెను.

వేటకై యచ్చటి కొచ్చిన యయాతి దీనాలాపములన్ విని యచ్చెరువంది నూతం బడియున్న దేవయానను పైకి దీసెను. మత్ ప్రాణమానసరక్షకుఁ డితడే గావున ప్రాణనాథు నిగా వరించితినని మనంబునఁ దలఁచి స్వగృహమున కేతెంచి వృత్తాంత మెల్లయు తండ్రితో విన్నవింప తక్షణమే శుక్రుం డాగ్రహము జెంది చిన్నపంచె చంకనిడుకొని ఛత్రి మెక్కిం చుకొని పిన్నచెంబు చేతంబట్టుకొని నస్యపుబుర్ర నడుమున కెక్కించి రెండవరుద్రుండో యనున ట్లొక కరంబున కూతురు కరం బిడుకొని నాతురతతో నగర మెడలి బోవుచుండ వృష పర్వు డరుదెంచి ముకుళితహస్తుడై 'ఆచార్య! తమయాజ్ఞా నువర్తినై అవిధేయుల శిక్షింప విధేయుడుండ మదీయరాజ్య పౌరోహిత్య వైభవం బెల్లఁ బాసి విపినంబున కరుగుటకు గతం బేమి?'

'రాజా! ఎక్కువమాట లాడజాల. నీకూతురగు శర్మిష్ట చెలికత్తెలతోగూడి మద్ పట్టికి చెలికత్తెయై యుండ నీ వంగీ కరింతువేని, నిపుడే తిరిగి పురప్రవేశమయ్యెద'నన, 'తనుమన ధనంబులు మీకై యుండ తనయ నొసగుటకై నొకశంక యేల? అటులే గావింపుడు. నేడే తమగృహమున కంపెద'నని పంపి వేసెను.

చంద్రవంశ శిరోమణియగు యయాతిమహారాజునకు శుక్రాచార్యుడు శర్మిష్ఠతో గూడ దేవయానను వివాహమొన రించి పంపివేసెను.

యయాతివలన దేవయానకు యదుదుర్వసులను నిరు వురు పుత్రులు బుట్టిరి. అనంతరము యవ్వనముచే మత్తిల్లి యేకాంతమున పరితపించుచు బాలలగన్న భామినులవలె బహు దుర్గంధభరితశరీరురాలుగాక పొద్దుకు మూడుసారులు కురులు దిద్దికొని నద్దంబున ముద్దిడుకొనుచుండుటయే వృత్తిగా గల మారునిశరంబైన శర్మిష్ఠను వరించెనని (అనగా, గాంధర్వవిధిచే వివాహమాడెనని)యు యాశర్మిష్ఠయందు ద్రుహ్యు, అనువు, పూరుడు అను కుమారులు కలిగిరి. దీనిపై దేవయానకు మనస్తా పముగలిగి శుక్రునితో దెలుప నాత డీతక్షణమే యయాతి వృద్ధు డౌగాక యని శపించెను. అనంతర మాయయాతినే వృద్ధుడ నై యుండ తనసుతులకు పట్టము గట్టి తద్సంతోషాతిశయమం దానందపరవశురాలై మదించిన గజమువలె నుండుతరి నీయను గ్రహమున బడసియున్న నీముదిమియే చాలునా యనివిన్నప మంపగానే శుక్రుడు నొకమా రాలోచించి ఓహో! నిజము, స్త్రీల కెన్నిసుఖము లున్నను కుసుమశరుని సాయకములచే నేమియు నపాయము కలుగకుండ రక్షించురక్షకు డీపృథివీశ్వ రుడేయని యయాతి తనకొమారులలో నెవరికైన ముదిమినిచ్చి యవ్వనము బటయున ట్లాజ్ఞాపించెను. దానికి శర్మిష్ఠతృతీయ కుమారుడైన పూరుడు మాత్ర మొప్పుకొని ముదిమిని బడసి ముదిరాజని పిలువఁబడియె. నితడే రాజ్యాభిషిక్తు డయ్యె. ఇతని

పుత్రుడు జనమేజయుఁడు. ఇతఁడశ్వమేధత్రయంబుచేసి ప్రఖ్యాతిఁ నొందె. ప్రాచీశుం డితనికుమారుడు. ఇతడు ఉదయాచల పర్వతమువఱకు దిగ్విజయము చేసెను. వీనిపుత్రుడు సంయాతి. వీని పుత్రుడు అహంయాతి. వీనికి సార్వభౌముడు. ఇతనిభార్య కేకయరాజపుత్రియగు సునంద. సార్వభౌమునకు జయత్సేనుడు. ఇట్లొకరిపిమ్మటనొకరు అవాచీనుడు, అరిహుడు, మహాభౌముడు, అయుతానీకుడు, అక్రోధనుడు, దేవాతిథి, ఋచీకుడు, ఋక్షుడు, మతిసారుడు, ద్రసుడు, (నితడు భారతయుద్ధమున జచ్చెను.) పైచీశుఁడు(ప్రాచీన్వాంసుఁడు)వీనికి పదియైదవతరమువాఁడురైభ్యుడు, వీనికి దుష్యంతుడు, దుష్యంతుని వలన శకుంతలకు భరతుడు, వీనివంశమున పాండవులు, అం దర్జునునకు అభిమన్యుడు, వీనికి పరీక్షిన్మహారాజు, ఇతనికి శతానీకుడు, వీనికి 25 వ తరము వాఁడు క్షేమకుఁడు. ఈ క్షేమకుని వంశజులే చోళరాజులనియు చోళరాజుల సంతతివారీకారణముననే తదనంతరము ముది (ముత్త) రాజు లని పిలువఁబడిరని యొక నుపమాన మిచ్చుచున్నవా రదియేదనగా? కడపమండలములోని ముట్టుకూరు, ప్రొద్దుటూరు, నల్లచెరువు, యందలి మూడవ శాసనమున చోళరాజు, ముత్తరాజునను నిరువురు పేర్కొనంబడియున్నారు. మరియు చోళికముత్తరాజు యనునతడు కండకోటను పాలించుచు క్రీ. శ. 750 లో యున్నారని తెలియుచున్నది. చోళికముత్తరాజుకాలనిర్ణయమునుబట్టి నీవంశజులు ముత్తరాజులని పిలువబడి నేటికి 1186 సంవత్సరములైనను ముదిరాజశబ్దము ముత్తరాచ ముత్తరాజుశబ్దము ముదిరా

జయినను; ముత్త, ముదియను రెండుపదము లేకార్థ మొసగు చుండుటచే యిందెంతమాత్ర మొకపదము రెండవపదమునకు వ్యతిరేకార్థ మొసగుటలేదు.

ఈ ముదిరాజులు పాండ్యరాజుకాలములో ఉన్నతస్థితి యం దుండి చివరకు విజయనగర సామ్రాజ్యమునందు చేరి గొప్పగొప్ప కార్యముల నెరవేర్చి ఉచ్చాధికారులుగను ప్రధానమంత్రులుగ నుండిరి.

వీరు యధికారవర్గములోనివారై నందున పూర్వశాసన ములలో ముడ్లు అనగా 'ముడి' అంటె ఒకఅధికారిఅనేఅర్థము. అప్పుడు ముడియము అనగా ముడియొక్కధర్మము అధికారము. అని యర్థము. ముద్దరాజు ముత్తరాజు ముత్తరసు మొదలయిన వాటిలోని ముద్ద ముత్త ముది శబ్దములున్న ముడితో సంబంధించినవై యున్నవి. ముడి యధికార నామవాచకమై యున్నది. (S. I. I. VOL. IV) 'పంచవదముడి' అని ఒక శాసనములో ఉన్నది.

'ముది' వృద్ధవాచకమేగాక పై ముడిశబ్దమునుండి బుట్టి యధికారవాచకనామమైనను యధికారముగల ముదిరాజనియే అర్థము దేలును. అధికారము ముదిమి నొ్కేరాజును గురించి దెలుపుటచే ముదిరాజని నిశ్చయముగా నిర్ణయింపవలసిదిగా తెలియుచున్న దనిన నెవరు గాదనుదురు?

వీరు ద్రవిడదేశమునుండి వలసవచ్చినవారుగావున నేటికి తిరుచునాపల్లి జిల్లాలోను పుదుకోటసంస్థానమునందును నీవంశ

జులు గలరు. అచట వీరివృత్తి వ్యవసాయము. రక్షకులై యుండుటయుగలదు. అరువదిముగ్గురుశివభక్తులలో నొక్కండగు కన్నప్ప నాయర్ గారినందనుల మనియెదరు. ఇచట వీరిని ముత్తిరియను లనియెదరు. వీరిలో నెన్నియో నాడులు గలవు. ప్రతినాడువివాదమును దీర్చుటకు నొక్కొకసభాపతి యేర్పడి యుండును. ముదిరాజులలో వివాహకాలమందును అంత్యేష్టి (అపరక్రియ) కాలమందును వీరు రాజవంశజులగుటచే యజ్ఞోపవీతము వేసికొనియెదరు.

---

# పదునొకండవ ప్రకరణము

## గాడులు.

ఒకసమయమున కైలాసమున గిరితనయ చింతాక్రాం
తురాలై తనకు సంతాపము కలిగెననుచు యాసంతాప మభి
వృద్ధి జెందకుండ మనోబల మొసగవలయునని పతిని ప్రార్థిం
చుటచే నీశ్వరు డాతక్షణమే కౌండిన్యమహాఋషిని రావించి
హిమగిరితనయసంతాపకారణ మరసి నీ వొకసిద్ధరసంబు సర్వ
సంతాపనివారణకారణమై సమస్తఋషిగణసంభావానుభావ
యోగ్యం బగుదానిని సృజింపుము. నీమూలమున నీసిద్ధౌషధ
రసంబు జగంబున ప్రఖ్యాతి జెందగల దనియె

అపు డామునీశ్వరు డాయాగాత్మజాతమనోరథంబు నెర
వేర్ప నుద్దేశించి తనతపోభూమిం జేరి పద్మాసనాసీనుడై
ప్రాణాప్రాణంబుల నేకంబొనర్చి జగమెల్ల మఱచి త్రివేణీ
సంగమాగ్నేయచక్రాంతరాళవామకరపంచాస్యమధ్య పీఠం
బున నప్పరబ్రహ్మము నిడిన తత్తపోమహిమంబువలన పన్న
గాధిపుబాష్పబిందువుల రావించి తజ్జలబిందువుల మహామహి
మచే 1 ఖర్జూర 2 తాళ 3 హింతాళ 4 నారికేళ 5 మధు
(ఖర్జూర తాటి గిరకతాటి కొబ్బెర ఈత) యను పంచవృక్షము
లను పుట్టించి నత్తరువుల మధురరసంబును (హిహిడా) మంత్ర
నిష్టాగరిష్టత్వమున సృజియించి కరంబున కమండలముఁగొని
కైలాసమును జేరి దాక్షాయణి కొసగి యనంతర మచ్చటి

ప్రమథగణములు మొదలగువారి కెల్ల నొసఁగి సంతుష్టులం జేయ అమరులెల్ల గూడి (గౌడ్) యను బిరు దొసఁగి కౌండిన్యుని కనేక సత్కారములఁ గావించిరి. తదనంతర మాఋషి పుంగవుడు తనతపో యాశ్రమమును జేరి నొకనా డర్ఘ్య మొసఁగుచుండుతరి

హంసవాహనారూఢుడై ఆకాశమార్గమున బ్రహ్మ దేవుఁడు కైలాసము బోవుచుండెను. సూర్యుని అతిప్రకాశ ముచే నలువకు శ్రమబిందువు లుత్పన్నమై మునిహస్తమున నర్ఘ్య మిడుటకు బట్టిన జలమునందు పంచబిందువులు మాత్రము బడియె. తక్షణ మా ఋషిపుంగవుం డాగ్రహము జెంది ఆకాశమార్గమున పోవువా రెవరై యుండవచ్చునని యవలో కించుచుండ బ్రహ్మ కోమలదృష్టిగల కౌండిన్యుని ముఖ ముఖలాపదాలయముగఁ దోప పరాగముచే గప్పఁబడిన పద్మ రాగమువలె ముఖ మతిఖిన్నత నొంద డెందమున కుందుచు కైలాసమునకు బోయి గత కార్య కారణముల కరకంతున కెఱింగించి అపరాధమున కాఋషి క్షమించునటు లేదేని మార్గ మగుపరుప తమరే సమర్థులని విన్నవింప తక్షణ మాబ్రహ్మదేవుని వెంబడఁకుకొని ఋషిసమీపమున కేతెంచి మత్ప్రియనందనా! నలువ నెఱింగి జేసినయపరాధము కాదు గావున క్షమింపుమన వల్లెయని తామసావరణమును దాటి సాత్మికావరణమున నిలచియుండెను. ఋషిఅంజలియందుబడిన పంచబిందువులనుండి పంచగౌడులు పుట్టిరి.

1. బ్రహ్మ చతుర్వేదపారంగతుడు గావున మొదట బుట్టినవానికి వేదగాడ్ యనియు

2. ఈశ్వరుడు తనను రక్షించినవా డవుటచే "బ్రాహ్మణోభగవాన్ రుద్రో" రెండవవానికి విప్రగాడ్‌యనియు

3. తనకంఠమునుండి శ్రమబిందువులుత్పన్నమైనందున మూడవవానికి కంఠమహాగాడ్ యనియు

4. నీలమేఘములనుండి తనశ్రమబిందువులు రాలినవి గనుక నీలమహాగాడ్ యనియు

5. ఋషిపుంగవునియాశ్రమమున జన్మించినందున ఐదవవానికి పుంగమహాగాడ్‌యనియు నామకరణములం జేసి బ్రహ్మ సత్యలోకమును జేరబోయెను.

అనంతర మీఋషి తనకుమారసమానగాడులకు పంచ వృక్షముల సారము తీయు సాధనపరికరము లొసంగి సమస్త విద్యలను గరపి ప్రజల కనుకూలముగనుండుసురను తీసి యొసగు నట్లును కాశీపట్టణమున నివసించియుండున ట్లాజ్ఞ నొసగి పంపెను.

వీరు ప్రథమమున కాశీపట్టణముఁ జేరి యచటినుండి నానారాజ్యములకు జేరిరి. కావున నేటికి నీకులమువారు కాశీ నగరనివాసులైన ఫలానివారికి ఫలానివారని ఉత్తరప్రత్యుత్తరములయందు వ్రాయుదురు.

వీరు పంచవృక్షములే కాక యనేకఫలపుష్పముల మద్యమునహా సిద్ధము చేయ నేర్చిరి.

మద్యము కాళీ(పార్వతీదేవి)యొక్క వ్యసనహరకారణ సంభూతమని శాక్తేయులు దేవిని మద్యయుక్తముగా ఆరాధనము చేసి యట్టిమద్యమును పానముచేసెడివారికి కాళీసంబంధమైన సంకటము లెప్పుడును కలుగకుండును అని బోధించెదరు.

క్షత్రియవీరుల కమితోత్సాహము కలిగించి యుద్ధరంగమందు ధైర్య శౌర్య పరాక్రమము లొసఁగునదియై వ్యసనము దుఃఖము భయము అలసత పోగొట్టి యమితోత్సాహము గల్గించుటకు ఓషధీసమాన మనవచ్చును.

త్రేతాయుగమున శ్రీరామచంద్రమూర్తి పితృయాజ్ఞానుకూలుఁడై చిత్రకూట పర్వతసమీపమున నున్నయపుడు భరతుఁ డయోధ్యకు బిలచుకొనిపోయెదనని మహాదుఃఖముతో సేనలు సేనానాయకులు గజతురంగములెల్ల దుఃఖించుచు భరద్వాజాశ్రమము జేరగ భరద్వాజుడు తన తపోమహిమచే వారిసంతాపమును మాన్పుటకై నొక్కరాత్రియంతయు స్వర్గభోగము లెల్ల తన యాశ్రమమున కలుగ జేసెను. అందు మధుపానాసక్తులకుసహా మధుపాన మొసగినటుల శ్రీమద్వాల్మీకిరామాయణమున అయోధ్యకాండయందు గలదు.

ద్వాపరయుగమున శ్రీకృష్ణబలరామాదులుసహా మాచే తీయఁబడు మద్యమును బుచ్చుకొనిరి.

విష్ణుచిత్తుఁడను పేరుగల పెరియాళ్వారు రచించిన పెరియతిరుమొళి యందలి పూచుట్టల్ యను భాగములో "కుండం

గలేడు త్తేర విట్టుకూత్తాడ వల్లరంగోవై" యను యీపాశురము వ్రాసియున్నది. దీని తాత్పర్యము 'కుండెడు కల్లును యెత్తి త్రాగి కూ యని యరచిన నాపభువా' యని.

మధురకవిసహా నమ్మాళ్వారి యుక్తముగ నున్న సమయమున పరాంకుశదాస్ యను గౌడ్ మద్యకలశమును గొనితెచ్చి నివ్వగ నింద్యవస్తువని సందేహము కలుగగనే దీనిదోషము పోగొట్టుమని నమ్మాళ్వారు భగవంతుని ప్రార్థింపగ నారాయణుడు సాక్షాత్కరించి

శ్లో॥ శృతి॥ మధువాతారు - తాయతే - మధుస్మృత పిత్రు పౌత్రసమాన్వితః రహియత్ర- తత్ర స్యాన్నరకం ధృవమ్॥

అను నీమంత్రమును చదివి తనకు నివేదించిన తన భక్తులలో కలసి పుచ్చుకొనిన దోషము లేదనియు,

శ్లో॥ మధుపృథుమధుద్రవ్యమ్ మద్భక్తస్త్మైక భాజనమ్
శృతి స్మృతి సమాయుక్తం శుక్రశాపవినశ్యతి॥

అను ప్రమాణశ్లోకము చెప్పగ నమ్మాళ్వారు శిష్యులకు మధురకవి శఠగోపదాసులతో సహా భగవన్నివేదిత మద్యమును పుచ్చుకొన్నారనియు మఱియు లోలంబరాజీయమునందు దుఃఖచికిత్సనుగుఱించి,

శ్లో॥ అయిరత్నకలే కురుమాకలహం కలహంసకళత్రసమాన గతే, శృణుమద్వచనం నదవైద్యమణీ మదిరా మదిరాక్షి శుచంశమయేత్.

తాత్పర్యం॥ దుఃఖము నివర్తించుటకై మద్యపానము చేయవలయును. మనోవ్యసనమునకై మద్యమే యౌషధ మవుటచేఁ శరీరపరిశ్రమచే అలసట జెందినవారు, మనోవ్యస నముగలవారు, ధైర్యసాహసములఁ గోరువారు, శరీరబలమనో బలశక్తియుతులై వ్యసనవిముక్తు లగుదురు. అట్టి సురవిక్రి యమే మావృత్తి యనిరి యెదరు.

వీరు సురాజీవి శౌండికె కబ్బిలవారు గౌడ్ - గమడ్ల వారు అని పిలువఁబడుదురు. వీరికి గౌరవనీయమగు బిరుదు గౌడ్ యని గలదు. వీరు సుర విక్రయించుస్థలమునకు శుండ మద్యస్థానము అని పేర్లు.

వీరిలో సురాభాండేశ్వర వరప్రసాదకులమనువారు సహా గలరు. వీరు సురాభాండేశ్వర గోత్రజుల మనియెదరు.

గౌడ్ యను ఏకవచనము బహువచనమందు గౌడ్‌ల గౌండ్ల యని మారి ప్రస్తుతము గౌడ్లయే నిలచియున్నది.

వీరు కౌండిన్య కమండల కారుణ్య శివవంశ శివనామ నిశిల సురాభాండేశ్వరమను ఏడుగోత్రములుగలవా రనియు దెల్పెదరు.

ధైర్య శౌర్య పరాక్రమ యుక్తులై విశ్వేశ్వరారాధిత చరణారవిందపానానందమత్తులై యుండువారు.

---

# పంచ్రెండవ ప్రకరణము



## కురువవారు.

పూర్వము ముప్పదిమూడుకోట్ల దేవతలు దేవలోకము నకు దండనాయకుడు గావలయునని కాలకంఠుని కోరిరి. ఈశ్వరు డాయమరుల మొఱ విని పార్వతితో మన్మధక్రీడ సలుపుచుండ నిది ఇంద్రు డెఱింగి తనను మించు ప్రభావ వంతుడగుపుత్రుడు పుట్టునను భయముచే వారిక్రీడాభంగము నకై యగ్నిని ప్రార్థింపగ నత డంగీకరించి క్రీడించుచున్న వారల కెదురుగ వెళ్లి నిలచెను. అగ్నిని జూచుటతోడనే శివుడు పార్వతి నొదలి నిలుండెను.

పార్వతీదేవి మహాకోపిషై సమక్షమున నున్న యగ్ని యే దీనికి కారణమని తెలిసికొని నీవే యీవీర్యమును ధరింపు మని శాసించెను. అగ్ని భయపడి ధరించెను. కాని యాభా రము సహింపలేక గంగను ప్రార్థింప గంగ యాగర్భమును ధరించెను. ఆమెసహా గర్భభారమును మోయలేక రెల్లు గడ్డియందు దిగవిడచెను. అది వశిష్ఠునిభార్య యరుంధతి దప్ప తక్కిన ఆర్గురుఋషిపత్నులగు షట్ కృత్తికలు ఆరెల్లునందలి రుద్రవీర్యమును గొని అచటికి సమీపమునగల కురువ (కొండ) పై నొకచోట బెట్టి కాపాడుచుండిరి. ఉదయాద్రినుండి వెలువడు సూర్యుని అమృతకిరణములు సోకగనే ఆరుమాపులు తేఃబడిన ఇంద్రియభాగము లేకమై ఆరుముఖములు పంచ్రెండు

చేతులు కలిగిన నొక ముద్దుకుమారు డయ్యె గాన స్కందు డనునామము కలిగెను. ఇతఁడు పుట్టగనే నాకుమారుడు నా కుమారుడనిఋషిపత్నులు వివాదపడుచుండ ఆరుముఖములతో నార్గురియొద్ద పాలు ద్రావెను. ఇతనిని జూచుటకై శివుడు పార్వతి దేవతలు వచ్చి బాలచేష్టలు గనుటకై నెవరివద్దకు వచ్చునోయని జూచుచుండ అందఱివద్ద కన్నిరూపులను దాల్చి వచ్చెను. ఇతని ప్రభావమున కాశ్చర్యము నొందిరి.

పూర్వము అసురసంహార మొనర్చిన ధనుస్సా కొండపైఁబడియుండ బాలక్రీడలాడుచు పోయి ఆధనసు నెత్తినారీ టంకార మొనర్చెను. ఆధనుస్సుయొక్క ధ్వనికి అష్టదిగ్గజము లలోనుండి రెండుగజము లితనిపైఁబడ నాటిచే నాటలాడు చుండెను. మఱియు నొకకొండపై మఱియొకకొండ విసరి వేయుచుండెను. ఇటుల కొండలచే చెండాట లాడుచు నింద్ర లోకముదిక్కు జూచుచుండ వీని దర్పంబునకు భయపడి ఇం ద్రునిపరివారమెల్ల నీపైకి కుమారస్వామి యుద్ధమున కొచ్చు చున్నాడని ఇంద్రునకు విన్నవించిరి. వారిప్రేరేపణచే స్కం దునిపై వజ్రాయుధమును ప్రయోగించెను. అది కుమారస్వామి దక్షిణ పార్శ్వమును దాకి మేషవదనుడను విశాఖు డందుండి పుట్టెను. వానివెంబడే అనేక మేషములు (మేకలు) పుట్టెను. ఆమేకలకుగలుగుఛాగములు మొదలగునవి బుట్టుచు దినదినాభి వృద్ధి గాంచుచు యాకురువపై చరించుచుండెను.

అజ యనగా ఆడుమేక. అజాజీవి (అజవృదు) యనగా, వైదికములుగాని గ్రంథములను చదువుచు మేకలను రక్షించు

వృత్తిగలవాడు. వైదికగ్రంథములెల్ల ఇంద్రపదవి కనుకూలములు గావున ఆయింద్రుడు కురువ (కుమార) స్వామిని నొప్పించినవాడు గావున ఆ ఇంద్రునిపదవియే మాకవసరములేదని కైలాసాభిలాషులై కర్మమార్గము నొదలి జ్ఞానమార్గావలంబకులైన కురువవారిలో నొకఋషి యగు

జాబాలి శ్రీరామచంద్రమూర్తి చిత్రకూట పర్వత సమీపమున పితృకర్మ జేయుచుండ నాస్తికమతానుకూలవచనములచే ఎక్కడి తండ్రి? ఎక్కడి తల్లి? నీవెచట నున్నాడవు? నీతండ్రెచట నున్నాడు? నీచేత నొకపిండము నెగరవేయుము. అది పైకెంతదూరము పోగల్గునో నంతదూరమే నీతండ్రికై నిచ్చు పిండప్రదానము పోగల దనెను.

రామచంద్రుడు తన చేతనున్న కరవస్త్రమును నొక యుఱటిడొల్లయందలి జలమెల్ల యాకర్షించునట్టుల తడిపి ఈ డొల్లయందలి జలమెల్ల నెటు బోయెనని ప్రశ్నింప

జాబాలి గుడ్డయందు గలదని ప్రత్యుత్తర మిచ్చెను.

రామచంద్రుడు ఆగుడ్డను విప్పిపట్టి సూర్యరశ్మిచే తేమ (తడి) లేకుండ పొడిగుడ్డయగునంతవర కుంచి ఇందుగల జలమెటు బోయెనని ప్రశ్నింప

జాబాలి సూర్యకిరణములద్వారా యాకర్షింపఁబడియెనని ప్రత్యుత్తరమిచ్చెను.

రామచంద్రుడు:—ఋషివర్యా! నీకమండలమందలి జల మెగరబోయుము. అది సూర్యలోకమునకు పోగల్గునా?

పోజాలదు. క్రమమగు మార్గమున సూర్యు డాకర్షించగలఁడు. కాని అక్రమమార్గమున పారవేయున దెట్లాకర్షించును?

జాబాలి:—రామచంద్రా! చతుర్వేద వేదాంగ పారీణుడవగు నీకు జ్ఞానోపదేశము చేయ నేనెంతటివాఁడ? అయినను అరాచకంబగు నయోధ్యకు పితృభక్తి నశించినగాని పోజాలవని పితృభక్తిని ఖండింప ప్రయత్నించితిగాని వేరొండు కాదు. ధర్మసంకటకాలములయందు నే నాస్తికమతానుకూలముగ వాదించెద నని తెలియుమని నమస్కరించి వెళ్ళిపోయెను.

అట్టిజాబాలఋషి జాబాల కురవకుల వంశజులలో ఋషియై వీరశైవ మతహితుడై శివుని దప్ప పలుదేవతలఁ బూజించువాఁడు కాడు.

ఈజాబాలి కుమారస్వామిపక్షమున ఇంద్రపదవి కనుకూలమగు యజ్ఞయాగాది క్రతువులు వైదికములు గావున కూడదని వాదించుచుండువాఁడు.

ఈజాబాలి పరతత్వవిషయప్రవీణతగలవాడై అచల మార్గప్రదర్శియగు నీశ్వరునియం దనన్యభక్తివిశ్వాసములుగలవాడై వైదికమార్గనిరాకరు డగుటచే "గొల్లనిసాహిత్యవిద్య" కురువగొల్లలవిద్య వైదికవిద్య గాదనియు అర్థజ్ఞానములేనివారని వైదికాచారముగలవా రాక్షేపించిరి. కాని వీరు నిర్గుణ పరబ్రహ్మోపాసకులని తెలిసికొనుట సమంజసము.

కృతయుగాంతమున చండికాపుర పట్టణమును పాలించుచున్న ఆదిరేడునకు చొక్కమాదేవియందు చండికాదేవి వరంబున 1 పెద్దరెడ్డి, 2 భీమరెడ్డి, 3 ఒద్దిరెడ్డి, 4 రాజురెడ్డి,

5 ఓబిరెడ్డి, 6 శిరివల్లభారెడ్డి, 7 చెండికారెడ్డి, 8 మల్లికార్జునారెడ్డి అను ఎనమండుగురుపుత్రులును గౌరీదేవియను నొక పుత్రికయు బుట్టిరి. అందు

మల్లికార్జునారెడ్డి తనసోదరులతోఁ వివాదముఁ చేసికొని యలిగి వేఱైయుండ ఆదిరెడ్డి దాయాదులపై గల కోపమును శాంతిపఱచి నీసోదరులతో గలసియుండవలసిన యవసరము లేకుండనీకొకవృత్తి జూపెదనని వెంబడిదుకొని స్వగృహమును జేరి

తాను భూమి దున్నుచుండగ "ఆభూమియందు ఘోర తప మాచరించి మరణము లేకుండ వరములఁ బడసిన బ్రహ్మ రక్షసుల రక్తప్రివాహామెల్ల ఘనపదార్థమువలె భూమి కంత ర్గతమున యుండి పైనుండి మట్టి గప్పఁబడియుండెను. ఆభూ భాగము నాదిరేడు నాగేలుచే దున్నునపుడు నాగలికొఱ్ఱునుండి పుట్టెనా యనున ట్లొకదానిపిమ్మట మఱియొకటి రెండుజీవ ములు "గొఱ్ఱెపోతు గొఱ్ఱియ" పుట్టెను. వాటి కొడలెల్ల రోమములు రాక్షసాకారమైన ముఖములు కలిగియుండెను.

అందు పొట్టేలు పెంచువారిపై పొడుచుటకొచ్చుస్వభా వముగలదై యుండెను. ఏలననగా బ్రహ్మరక్షసులు తమకు వరమొసగిన దేవునిపై ధైర్యముచే యుద్ధమునకొచ్చుదురాగ్ర హాభిప్రాయము గలవారు గావున "పేడయందు పురుగు బుట్టి నటుల" వారిరక్తమునుండి పుట్టినవే గనుక పొట్టేలునహా యటిగుణముగలదై యుండును" వాటిని నేటినుండి నీవే మేపుచుండవలయునని నియమించెను.

మల్లికార్జునారెడ్డి వాటిని మేపుటకై ప్రతిదినము బోవు

చుండువాడు. ఒకనాడు కుమారస్వామిజన్మస్థానమయిన కురువకు సహా బోయెను. అచట మేషము (మేక)లు మేకపోతు లగు పడెను. వాటిని జూచి మహాఆశ్చర్యమగున్నడై వాటితోఁగూడ తనగొఱ్ఱెల నొదలి ఈకురువయే వీటి కనుకూలస్థాన మని యచ టొకదొడ్డి గట్టి రేయింబవ లచటనే నివసించి కాపాడు చుండెను.

ఇత డిట్లు కురువపై కొంతకాలము నివసించినపిమ్మట నొకనా డర్ధరాత్రిసమయమున నొక మల్లాసురుడను రాక్షసు డొచ్చి నొకమేక నెత్తుకొనిపోయెను. ఇట్లు ప్రతినిత్య మెత్తు కొనిబోవుచుండ నిత డెఱింగిన నాటిరాత్రియే ఆయుధ పాణియై ధనుర్బాణంబులఁగొని నొకవృక్షముపై నెక్కి దిక్కుల జూచుచుండ నొక్కరాక్షసుం డాతురతతో వచ్చుచున్న రాకం గని వానిపై దివ్యాస్త్రంబులఁ నొకదానిపై నొకటి ప్రయో గింపుచుండ నపు డత డతిదుర్బలుడై హాహాకారంబులచే విల పించుచు ప్రాణంబుల విడచెను.

ఈ రాక్షసుడు కడుసమీపమునగల రెండవ కొండపై నొకగర్భిణియగు నొక బ్రాహ్మణస్త్రీని కొనితెచ్చి ప్రసవా నంతర మాయమను జంపి పుట్టిన శిశువును (౧౬) పదహారు వత్సరములనుండి తనపుత్రికవలె పోషించుచున్న రత్నాంగి యను కన్నియ రాక్షసునియాలాపనము విని నే డీతని యంత మొనరింప యతిబలుం డరుదెంచి చేరువనున్న కొండపై బ్రాణ ముల దీసెగాబోలు నని యాధ్వనినిబట్టి పోయి చూడ రెండవ కొండపై రాక్షసునికళేబరమును వానిసమీపమున రెండవ

మన్మథుండే యనున ట్లసితముఖ వికాసముగల వానిని జూచి మఱియొకమా రాశేషవయవసుందర మెల్ల సందేహనివారణముగ అవలోకించి లోచనము లంతర్గతచింతానలసందర్శనమున నిల్పగ మల్లికార్జునారెడ్డి నక్కన్యయొక్క వినయ విధేయ సుశీలత్వముల కచ్చెరువంది యబలా! నీమహారణ్యమున నిలువ నీయట్టి సుకుమారికకు తగునా? వెన్ననిసతి గన్న వానికన్న మిన్నయగు మేనుగలిగి గడుసురాళ్ళగట్టున దిట్టతనముచే దిరుగుట నొకవింతగా దోచుచున్నది.

రాజా! నీచే హతుడైన రక్కసు డతిబలుఁడు. వీనిచేతఁ జిక్కి శ్రమలఁ బడుచుంటిని. నేడు నీచే హతుడయ్యె. నీవు మాత్రము నాకు పతివైతివి. గాన నిటనే నన్ను వివాహమాడు మన రేడందులకు సమ్మతించి గొట్ట్రరోమములతోఁ గూడిన నొకసూత్రము అనగా నొకదారమువలె పేని ఆయమచేతికి కంకణముగ కట్టి పాణిగ్రహణ మొనర్చెను. ఆ కారణముచే రత్నాంగిసంతతివా రున్నికురువవా రనియు ప్రథమభార్య పుత్రులలోనుండి నొకని రత్నాంగి క్షేమసమాచారములను విచారించుచు ఆయమవద్దనే కురువపైననే యుండున ట్లాజ్ఞాపించెను.

రత్నాంగి యబ్బాలుని స్వగర్భజనిత పుత్రునివలె భావించుచుండెను. అబ్బాలుడు మల్లికార్జునారెడ్డికి "పత్తి వలన వెల్పిన దూదిచే జేయఁబడిన దారపుకంకణము గట్టి చేసి కొన్న భార్యకుమారుఁ డగుటచే ఇతనివంశజులు పత్తికురువ లనియు కురువపై జన్మించినవారు ఉన్నితో పేనిన దారముచే

కంకణము గట్టి వివాహము చేసికొన్న ఆయమసంతతివారు గనుక ఉన్నికురువ లనియు పిలువఁబడుచుండిరి.

ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట వీరిభేద భావమును తొలగించుటకై ఋగ్వేద కాలముననే గొత్త్రోమములు దారముగా బేని యనియే వాడునటుల నియమింపబడియె.

ఋగ్వేద ప్రయోగ రత్నాకరము వివాహ ప్రయోగ మున 468 వ మంత్రము

"తతః కంఠ దేశస్థసూత్రమథో నిష్కాస్య కుంకుమా క్త మూర్నాయు క్తంచ కృత్వా తేన హారిద్రాఖండం బధ్వా మాంగల్యకంకణ పూజాం కారయేత్"

తా॥ కంఠమందు గట్టెడు సూత్రమును క్రిందనుంచి క్రిందనున్న దారమును పైన నుంచి కుంకుమతో పూయఁబడి గొత్త్రోమము(ఉన్ని)తోఁగూడినదారమునకు పసుపుకొమ్మను కట్టి మాంగల్య కంకణపూజ చేయవలయును.

అని ఋగ్వేదకాలముననే ఆదిరేడు నొకశాసనము గావించి యుండెనని తెలియుచున్నది.

శ్రీకృష్ణు డనేకసంవత్సరములు సంతానములేక సాంబ మూర్తిని గురించి యదే కురువపై ద్వాపరమున తపం బాచ రింపగ నీ 'కనేక సంతానము గలుగుగాక'యని వరం బిచ్చెను. ఆవరము గొని పురమునకు జేరు కృష్ణునివెంబడి బోయిన కురువకాపులకు కురువయాదవులని నామాంతరము గలిగెను. కృష్ణునికి సాంబమూర్తి దర్శన మిచ్చునపుడు కన్నులారజూచిరి గాన మహాభయభక్తితో ఈశ్వరుని పూజించెదరు. భేరిడమరు

 

కము త్రిశూలము విభూతి రుద్రాక్షలు ధరించుటయేగాక లోక మాతయైన పార్వతీదేవియందు భక్తిగలవారలై ఆయమసమస్త దేవముని మానవులచే పూజింపఁబడిన పసుపు కుంకుమ మిశ్రిత మైన భండారును ధరించుదురు.

వీరుండు కురువపై కుమారస్వామి జన్మించియుండిన కారణముచే యాగుట్టపై (నొకగుట్టపై) కుమారస్వామిని నిలిపి పూజించెదరు. మఱియు మల్లికార్జునస్వామియొక్క గుడి సహా సమీపమున గట్టి పూజించెదరు.

మల్లికార్జునారెడ్డి యుద్ధవీరు డగుటచే బీరప్పయని అందురు. బీరము = అనగా పరాక్రమము, అప్ప=యనగా పరాక్రమవంతులలో గొప్పయను అర్థము. బీరమునే వీరము యని అందురు. వీరన్నఅనగా వీరులలో అన్నయని అర్థము. గొప్పవాడని యర్థము.

నీగుట్టపై పూర్వము కుమారస్వామి యుండి జగత్తునకు గొలుసువలె చుట్టుకొనియున్న అష్టదిగ్గజములు భయఁ పడి వరుస తెగిపడునట్లు బలపరాక్రమము సురాసురులెల్ల దిగులుజెంద చూపినాడని యుపమానముగ ఇనుపగొలుసున గల వరుస దిగునట్లుగా బలముచే లాగుచు ఈశ్వరునియొక్క ధనుస్సు కుమారస్వామి లేపి నారీటంకారము గావింప యష్ట దిగ్గజములవరుస దెగెనని అతిభయంకరమగు వీరాలాపములు గావించుచు భేరీడమరుకవాద్యములు మోగించెదరు.

మణిమల్లాసురులకు ఈశ్వరుడు నెవరిచే చావు లేకుండ వరమిచ్చి సమస్తజ్ఞానముగల పశుజాతిచే జచ్చునటుల వరమిచ్చి

యుండ వారు లోకాలోకములు పీడించుచుండ ఈశ్వరుడు మల్లికార్జునావతారమెత్తి నాల్గువేదములను నాల్గుశునకములుగా పుట్టించి వాటిచే కరపించి చంపివేసెను. అనంతరము దేవతలు వాటికి పాలుదాగిరి. నేటి కేదైన యాపద గల్గిన వారు మ్రొక్కులిడి పాలు దాగ్రుదురు.

మల్లికార్జునారెడ్డి మేకలను ఘోరమృగము లెత్తికొనిపోకుండ ఈశ్వరుడాశునకములను రేడున కొసగియుండెను. వీటికి జాగిలములని వేరొకపేరు గలదు. వీటిని మల్లన్న బీరప్ప మల్లికార్జున సాంబ భైరవా యని తమ ప్రేమపూర్వక నామములం బెట్టి పిలుచుచుందురు

బ్రహ్మరాక్షసు లెల్ల ఈశ్వరునకు పగవారై ఘోర యుద్ధము గావించినవారి రక్తోత్పన్నములైనవి గొర్లుగావున వాటిఉన్ని (బొచ్చు)తో సిద్ధముచేయుదానికి గొంగడియనినామ మేర్పడెను. గొంగ యనగా పగ అనియు పగతు డనియు యర్థము గావున పగవారి రక్తోత్పన్నమైనవాటి బొచ్చు(ఉన్ని) వలన సిద్ధముచేయఁబడినదానికి గొంగడియను నామ మేర్పడెను.

వీరికి సంస్కృతమున అజాజీవిని జాబాలె (జాబాలః) అనగా గొంగళ్లు సిద్ధము చేయువారనియు.

జాబాలః జపాలః జవాలః యనగా మేకలను రక్షించు వృత్తిగలవా రనియు

అజాజీవి అజ యనగా ఆడుమేక ఛాగము మేక యని అర్థము.

కురువ యనగా కాలితో త్రివగలకొండ.
అజకంగొత్రాలమంద.

ఇట్లు తమ పూర్వోత్తర చారిత్రిక విషయములెల్ల దెల్పుచుండెడి ఆదిరేడు సాంప్రదాయకులైన కురువవారు కాపు వీరుండయిన మల్లికార్జున రెడ్డి నందనులైన కురువకాపులమని తమ కులనామమును దెల్పుదురు.

ఆదిరేడు దేవయోని సంభవు డవుట గంగాసముద్రిల పుత్రుడవుటచే సిద్ధుఁడు అని పిలువబడెను. సిద్ధుఁడనగా దేవ యోనిసంభవుడని యర్థము గావున నే నితనిచారిత్రము సిద్ధ పురాణమున వశిష్ఠునకు నందీశ్వరుండు చెప్పియున్నవాఁడు.

వీరు చండీశ్వర షణ్ముఖేశ్వర సిద్ధరాజేశ్వర భూపాలేశ్వర యనునాల్గుగోత్రములను మాత్రమే దెల్పుదురు.

వీరు కురవలని పిలువబడుచుండుటయేగాక వకారము బకారముగా మారి కురుబలు లేక కురుంబాలు యని సహా పిలువబడిరి. "వకారబకార నభేదయో" వకారము బకారముగ బకారము వకారముగా మారుట సహజము గావున కురువలు కురుబలు లేక కురుంబాలు యని అక్షరరూపము మారుట మనభాషలలో గలమార్పే. బీరము వీరము వాల్మీకి బాల్మీకి మొదలగునవి యని తెలియునది.

సర్ వాల్టర్ ఏలియాట్ గారు ద్రావిడ దేశములో విశేష భాగమునకు పూర్వకాలమున కురుంబభూమి యని పేరు గల దనియు ఈద్రావిడ దేశముయొక్క ప్రాగ్భాగము చోడరాజు

లచే జయింపఁబడిన పిమ్మట తొండై మండలమని పిలువఁబడు చుండెననియు ఇది కురుబలవలన (24) ఇరువదినాలుగు కొట్టములుగా విభాగింపఁబడినదనియు వీరిని కరికాలచోళరాజు జయించె నని దెల్పుచు ఈజాతికై యేశాసనమునందైనను దెల్పియుండలేదనియు వీరు యదువంశజులనియు జైనమతావలంబకులనియు స్థానిక చరిత్రియందు మాత్రము జూపబడిరి. కొన్నినాణెములు మాత్రము కురుంబలవే గలవని నిర్ణయించి వ్రాసియున్నారు.

ఈవిషయమును గుఱించి ఆంధ్రులచరిత్రము 1 వ భా. పూ. యు. క్రీ. శ. 1910 పుట 205 లో చిలుకూరి వీరభద్రరావుగారు కొంతవరకు కురుబలనుగురించి వ్రాసినను వీరికి సంపూర్ణచారిత్రికవిషయములు లభింపమిచే పల్లవులు తప్పక కురుంబాలని నిశ్చయింప వలనుగాదు. యని పల్లవుల చారిత్రికమున వీరిచరిత్రమును వెదకినట్లు తోచుచున్నది. వీరిచారిత్రము అముద్రితమైయున్న కారణముచే నేటివరకు చారిత్రముల యందు సంపూర్ణవిషయములు లేఖకులు వ్రాయక ఉపేక్షించి రనుట సమంజసము.

---

 

# పదమూడవ ప్రకరణము

## పద్మశాలీయులు.

బ్రహ్మదేవుండు సమస్తప్రపంచమును సృష్టించి అందు జ్ఞానప్రదులగు దేవదానవమానవాదులను సృజించెను. గాని వారి కంగరక్షకమగు వస్త్రములను మాత్రము చేయలేక పోయెను. ఆ కారణముచే కొంతకాల మతిచింతాక్రాంతుండై అఖిలలోకరక్షకుడైన శ్లో. అనాదిపరశివేమూర్తి పంచవక్త్రేన సంశయః, అన్యథా శ్రీమదం నాస్తి నాస్తి బ్రహ్మమనన్యథా. తా. అనాదియైన పరశివుడే పంచముఖములుగల బ్రహ్మగాని మరియెవ్వడు? అట్టి అనాదిబ్రహ్మయగు శివునికడకేగి హే పశుపతీ! నే నెల్లయు సృజించితిని. నొకవస్త్రములను మాత్రము తామే సృజింపవలయునని విన్నవింప పంచాననుడు నలువపలుకుల కచ్చెరువొంది నలుదిక్కుల వీక్షించుచు దీక్షాకర వ్రతుడయ్యె. గాన యాపరబ్రహ్మముయొక్క నేత్రగోళమునుండి నొకబిందువు క్రిందబడి యందుండి నొకశక్తిప్రసన్నుడగునాత డుత్పన్నుడయ్యె. ఇతడే భృగుమహారుషి. లోకకల్యాణకరమగు వస్త్రనిర్మాణమునకై పుట్టినవాడు గావున శివుడని కల్యాణకరుడని భావింపబడుచుండెను. అతడు నలువవలన పుట్టినవాడు కాదు. పరబ్రహ్మమగు పంచాననబ్రహ్మకు పుట్టినవాడు. కావున త్రిమూర్తులను పరీక్షించెను. ఇతనిని పంచాననుడు జూచి అతిసంతుష్టుండై 'వత్సా మదాజ్ఞానువర్తివై త్రిలోకముల

యందుగల దేవదానవమానవాదులకెల్లరులకు నాయుల్లము రంజిల్ల వస్త్రములం సిద్ధముచేయు' మనెను.

భృగువు 'దేవా! వస్త్రములను సిద్ధము గావింప తంతువు కావలయుకదా! అది యెచ టుండునో నే నెరుంగను. తా మగుపరచిన యది గొని దానితో సుందరములగు వస్త్రములను జూచువారి కానందము గల్గునటు లసంఖ్యేయముల సిద్ధముజేసెద'

పరబ్రహ్మ - శ్లో॥ సర్వేషాం మానరక్షార్థం, యత్నః కార్యః కథంచన। యువాభ్యాం వస్త్రనిర్మాణం క్రియతామితి చాబ్రవీత్ ॥తా॥ జ్ఞానప్రదులగు దేవదానవమానవాదుల కెల్ల మానరక్షణార్థమై నీకార్యమును గావింపుమన

భృగువు పరబ్రహ్మాజ్ఞానుసారముగ కమలనాభునికడ కేగుచు మార్గమందనేకరాక్షసాదుల శక్తిసహాయంబున హత మొనర్చుచు బోయి యాబ్రహ్మరాక్షసుల జంపినపాపపరిహారార్థము నిజలింగదర్శనుడైన మార్కండేయ మహాముని గావించుచున్న యజ్ఞగుండమునందుండి పవిత్రుడై జన్మించిన తదనంతరముసహా భావనారుషియనియు వేదశీర్షు డనియు నామములను పొంది తిరిగి ఇంద్రాది దేవతలవలనను బ్రహ్మాది త్రిమూర్తుల యభిమతమువలనను త్రిలోకనివాసుల కవశ్యకములగు వస్త్రములకై పరమయోగనిద్రాపరవశుండగు పద్మనాభునిసన్నిధానమునకు వెళ్లి,

భావనారుషి కమలనాభుని ప్రార్థించుట, కమలనాభు
డొసగుట.

శ్లో॥ త్వన్నాభికమలోద్భూతః బ్రహ్మా లోకపితామహః
త్వదాజ్ఞయా జగత్సర్వం సృష్ట్వా న్స్వయమేవ సః
తేషాంహి వస్త్రనిర్మాణే భువనే నాస్తి కేశవ
తత్రతంతూ న్వినా నైవ భవేదేతన్న సంశయః
భవత స్తంతుహరణమేవాం యాచామహేహరే
తత్రప్రసీద దేవేశ తంతుసంధాయకో భవ
ఇత్యుక్తః పరమప్రీతో హరి రాలోక్య వై తదా
స్వనాభిపద్మనాళస్య తంతూ న్తాభ్యాం దదాతతః
మన్నాభిపద్మనాళోత్థతంతుసంపూర్ణ కోశకాః
తతస్తే పద్మశాలీయాః సర్వలోకేషువిశ్రుతాః॥

ఇట్లు భావనారుషి ప్రార్థింపగ కమలనాభుడు ప్రస న్నుడై తననాభికోశమునగల (తంతువను) దారమును నొస గెను. అది పుచ్చుకొని నేతపరికరములకై మేరుపర్వతమార్గమున బోయి దుష్టదానవఘోరమృగములను సంహరించుచు వాటి శాపవిమోచనము గావించుచు తుదకు మయునిపురంబు జేరి మహాదేవుడగుమయుని ప్రార్థించి యతనివలన వస్త్రనిర్మాణ కరపరికరములను జెంది తిరిగి పంచాననుం డగు పరబ్రహ్మము యొక్క రజితగిరికంది జనకునకు వందనము లాచరించి జగన్మో హనవస్త్రములం వివిధాంబరములు సిద్ధము చేసి ప్రథమమున దేవతల కొసగెను. దాన అతివిశాలముగ వ్యాపించి సమస్త

వృక్షరాజములచే శోభించు నుద్యానవనంబులుగల ఆమోద పురమునకు రాజగునట్లు పరబ్రహ్మ యనుగ్రహించెను.

ఇట్టి భృగుమహారుషికి కర్దమప్రజాపతి తనకూతురగు ఖ్యాతి నిచ్చెను. హిరణ్యాకశిపుడు తనపుత్రికయైన దితి నిచ్చెను. దితియే యితనిప్రథమభార్య. ఖ్యాతివలన ధాత విధాత యను నిరువురుపుత్రులు లక్ష్మియను నొకకూతురు పుట్టిరి. ధాత యనువాఁడు మేరుకుమారితయైన అయతిని వివాహమాడెను. ఇతనికి ప్రాణుడను నొకపుత్రుడు బుట్టెను. ప్రాణుడు వశిష్ఠుని పుత్రికయగు పుండరీకను వివాహ మాడి ద్యుతిమంతుండను పుత్రుని బడసెను. ద్యుతిమంతునికి స్వనవాతుఁడు బుట్టెను. ఈద్యుతిమంతుడే మార్కండేయుని పెద్దతండ్రి. రెండవ వాడైన విధాత మేరువుకూతురైన నియతిని వివాహమాడి మృకండుని గనెను. ఇతనికి మార్కండేయమహారుషి నొక్కడే పుత్రుడు. ఇత డతినిష్టాగరిష్టుడై మృత్యువు నెదిరించి పదివేల హాయనంబులు తపం బాచరించి ఇంద్రునిచే పంపబడిన యప్సర సల మోహపాశమునం జిక్కక అనేకయుగములు బ్రతుకునటుల హరుచే వరంబు లొంది కరంబున కాలకంఠుని కలకాలము దర్శించుచుండువాఁడు. ప్రళయకాలంబున పరమపితామహుం డగు హరి వటపత్రశయనుండై జలరాశియగు మున్నీటిపై యోగనిద్రాపరవశుండై యుండుతరి యోగమాయచే యా నారాయణుని చరణకమలముల నాశ్రయించి యుండు వాఁడు. ఇతనిభార్య యగు ధూమ్రావతికి వేదశిరుడను నొకపుత్రుడు పుట్టెను. ఇతడు పీవరిని వివాహమాడెను.

భృగుమహాఋషి సమస్తదేవతల కంగవస్త్ర నిర్మాణ కారణు డగుటచే నితనికి (దేవ అంగ) దేవాంగుడను నొక నామాంతరము గలదు. ఇతనివంశజుడగు దేవాంగుడను మరి యొక దేవలుడు గలడనియు జేండ్రివా రాదేవలుని వంశజుల మనియు దెల్పుదురు.

ఈపద్మశాలీయుల వంశజు డ గు వే ద శి రు డ ను దేవాంగుడు మహాసౌందర్యవంతుడై యుండ రంభ యతనిపై మోహితురాలై తన లావణ్యాతిశయంబులెల్ల అభినయించుచు జూప దృఢమానసుండగు నీ ఋషి తక్షణమే తిరస్కరించెను. ఆకారణముచే ఆయమ అతిచింతాక్రాంత పరితప్త హృదయు రాలై మదీయమనోభీష్టమున కయిష్టుడవై నన్నష్టకష్టము లం బెట్టితివి గావున నిదుగో శపించుట స్పష్టము. నీవు నీ వంశజు లెల్ల నైదు వేల సంవత్సరములు శూద్రాచార పరతంత్రులై పిమ్మట కాలక్రమేణ బ్రాహ్మణాచారపరు లయ్యెద రని శపించెను. అతనిపుత్రుండగు ధవళాంగుడు తద్శాప విమోచ నార్థమై చిత్రకూటపర్వతమున ఘోరతపం బాచ రించెను. ఇత డతిమదాంధులగు రాక్షసాదుల పీచమడంచుటకై తగువిద్య ఉమాపతిచే బొంది యుండెను. దాన రాక్షసాదుల మాయలకు వెరువక వారికి ప్రత్యపకారము చేయునట్టి విద్య కేకయరాజపుత్రికయైన కైకేయికి నేర్పెను. గావున దశ రథచక్రవర్తి రాక్షసులతో యుద్ధము చేయునపుడు రథసార థియై రణరంగమున అతిసాహసమును జూపి పతిప్రాణములను గాపాడి వరత్రియంబులను వాగ్దానంబు గొనియుండెను.

ప్రథమమున పంచాననుండగు పరబ్రహ్మమునుండి పుట్టినవారు గావున 'బ్రాహ్మణో భగవా౯ రుద్రో' యను శృతి ప్రమాణము మొదట బ్రాహ్మణులై యనంతరము శాపకారణముచే శూద్రప్రాయులుగా నెన్నబడిరి.

మార్కండేయమహారుషి కలియుగకైలాసగిరి యనంబడు శ్రీశైలంబున సమస్తదేవతా ప్రీతికరమగు మహాయజ్ఞ మొనర్చెను యజ్ఞగుండమునుండి వైష్ణవమతోద్ధారకులగు ఆళ్వారు ఎంబేరుమానారు జీయరు తిరువాదియను నల్వురు పుట్టి దశదిశలం దండయాత్ర సల్పి దిగ్విజయముం గాంచి మతమతాంతరములను ఖండించివైచి వైష్ణవ మతస్థాపన మొనర్చిరి. గావున వీరుసహా వారిని నాశ్రయించి భక్తిశ్రద్ధలతో పూజించి వారిచే మంత్రమంతార్థ రహస్యత్రయంబుల దెలిసికొని కర్మక్రియంబులం కడకు జిమ్మి అనన్య భక్తి ప్రపన్నులై యున్నవారు.

తంతువే ప్రథమవృత్తికి మూలకారణ మగుటచే తంతువాయకు లనియు

శ్రీమన్నారాయణునియొక్క పద్మనాళమునుండి అనగా గర్భకోశమగు తంతుశాలనుండి తంతువును (దారమును) పొందినవారగుటచే పద్మశాలః యనగా పద్మశాలకులజులని ప్రపంచమున ప్రతినామమును బొందిరి. పద్మ=నాభికోశము కోశమనగా సాలః = శాలః యని యర్థము.

భృగుమహారుషి రెండవజన్మ మెత్తుటచే అనగా

మార్కండేయునియజ్ఞగుండమునుండి తిరిగి పుట్టుటచే యతనికే భావనారుషియని ప్రతినామము గల్గెను.

భావితం = పొందబడ్డ అనగా రెండవజన్మ పొందినవాఁడు.

భావనా = చూచినవస్తువుయొక్క స్మృతి యనగా పూర్వజన్మస్మృతి (జ్ఞానము) గలవాఁడు.

భృగుమహాఋషికి ధాత విధాతలను నిరువురుపుత్రులు (రమ) లక్ష్మి యనునొక పుత్రికయు గలరు. రమను శ్రీమహావిష్ణువగు పద్మనాభుని కిచ్చుటచే యావారికి అత్తింటివారై సిరికి పుట్టింటివారైరని రుషులచే గొనియాడబడి గౌరవనీయులైరి.

భావుకం అనగా భావమఅది. శ్రీమహావిష్ణువునకు భావమరుదు లనియు ఆకారణముచే స్యాలః అదంతః పుంసీ అమరః, పత్నిభ్రాతరి. భార్యసహోదరుడగు భావమరదియని యుండుటచే స్యాలః వారని నామమేర్పడెను. అది పామరోక్తులచే మారి సాలవారని స్థిరపడెను.

శాలః = ఇల్లు కోశము. సాలె ఇతిచ శబ్దలింగార్థచంద్రికే, యోగ్య = యోగ్యుడు. మరియు పత్నిభ్రాతరి = భావమరిది.

పద్మ—పద్మమనగా కమలము సాలః - శాలః యనగా కోశము. అట్టినాభిప్రాకారకోశమునుండి తంతువను దారమును పొందినవారగుటచే పద్మశాలిః పద్మసాలః యనియు నిదియే బహువచనపర మగునపుడు పద్మశాలీయులని పిలువబడుదురు.

---

# పదునాలుగవ ప్రకరణము

## దరిజీవులను మేరువారు.

హేమాద్రియను బంగరు కొండయే మేరుపర్వత మన బడును. త్రిపురాసుర సంహారసమయమున ప్రథమ సంగరమున బాణపరంపరల ప్రయోగించుచు తుద కీధనస్సుగా నుండిన మేరువును దానవులపై ప్రయోగించెను. అపు డా రాక్షసుల శరీరకవచములను జించి చర్మమును గ త్తిరించినటుల గాయము లొనర్చెను. అపు డాయుద్ధరంగమున మహాక్రోధ స్వభావ మును బూని వ్యాఘ్రవాహనము నధిష్ఠించిన పార్వతికి చండికా యని విశేష నామము గల్గెను. ఆ మేరువు యుద్ధసమయమున మహాతీవ్రముగ బోయి రాక్షసులను తాకి శరీరకవచము లెల్ల చిన్నభిన్నములుగ చేయుటచే వారిమద మణంగి వీరకాద్రిము నశించుచుండెను. ఇంతలో పృధివిని రథముగా, వేదములను హయములుగా, సూర్యచంద్రులను చక్రములుగా, బ్రహ్మ రథసారధిగా, విష్ణువు బాణముగా, ఆది శేషుడు నారిగా మొదలగువాటిచే ప్రళయప్రయత్న మొనర్చి అసురుల అంతే మొనరించెను. అంతవర కీమేరువు బోరాడి యలసి విదర్భయను కోరంగి మచిలీబందరు సముద్రమున స్నాన మొనర్చెను. నట్టిసమయమున తనకు శ్రమచే గల్గిన స్వేదమును యాసముద్రమున కడిగికొనియెను. ఆసమయము స్వాతికార్తియై యుండుటచే ముత్యములచిప్పలు తెరవబడి

యుండెను. అం దొక దానియం దీమేరువుశ్రమబిందువులు ప్రవేశించినతోడనె మూతబడి అందుండి తొమ్మిదిఘడియల యనంతర మొకబలవంతు డుద్భవించెను. ఇతనిని హేమా ద్రియుడని పిలుచుచుండిరి. మేరువు యుద్ధముచేసిననాటినుండి ధైర్యముగల బంగరుకొండ యని విశేషనామమును బొందెను. బ్రహ్మోత్తరఖండము రెండవఅధ్యాయమున నీకారణముచేతనె ధైర్యముగల బంగరుకొండ యని వర్ణించియున్నవాఁడు. మరియు నీవంశజులు తమబాలులకు హేమాద్రియని నామ మెక్కువప్రేమతోఁ బెట్టుదురు. హేమాద్రియుఁడు చండికా దేవినిగురించి తపం బాచరించి యనేకవరంబులం బడసి పుత్రపౌత్రసమేతుండై సుఖముగా యుండెను. ఇతనివంశంబున ద్వాపరయుగంబున పంచకోశములవిస్తారము గల్గి శివపురంబని కీర్తిగాంచిన ప్రణవ నాథపురంబు గలిగియుండెను. అందుజడయు శంకరగిరిస్థానముగలదు. అచట అనేకభక్తాగ్రగణ్యు లుందు, రందునాగరీకుం డను నామముగలవా డొక డుండెను. యత నికి సత్పుణ్యావతి యనుభార్యగలదు. వీరిరువురికి పై చండికా దేవి వరప్రసాదమున నొకపుత్రిక గల్గెను. గావున యాపుత్రికకు చండికా యని నామమిడి అతిగారాబముతో బెంచుచుండ నాబాలక తోడిబాలులతో నాడుచు నొక శివాలయమునందు గూర్చొనియుండ వెంబడిగలబాలికలెల్ల లింగమూర్తినిభర్తగా చండికను భార్యగా నలంకరించి లింగమూర్తికి సమక్షమున చండికను గూర్చుండబెట్టి వివాహముచేసి కల్యాణానుకూల పాటలను బాడిరి. అనంతర మచటనే నొకశయ్య నేర్పరచి

నీ భర్త నీవాక్క శయ్యపై శయనించుడని ద్వారముల మూసిరి. అప్పుడా లింగమూర్తి చండికతో కేళీవిహారుడైన యనంతర మంతర్ధాను డయ్యె. అంత చండిక గర్భిణియై ముఖమండలబాలురలో నక్షత్రమండలమందలి చంద్రబింబమునుబోలి ప్రకాశించుచు స్వగృహమును జేరెను. ఈయమ శరీరమధ్యము దినదినాభివృద్ధి జెందుటంజూచి ప్రజ లెల్లరు పలువిధంబుల దోషారోపణానుకూల వచనము లనుకొనుచు గుసగుసలతో ప్రారంభించి దిశదిశలు వ్యాపించి తుద కాయమ తండ్రి కర్ణమునం బడినవాడనే చింతానలపరితప్తహృదయారవిందుడై బిడ్డను పిలిపించి తల్లీ! మాపూర్వదుష్కర్మాచరణానుకూలవిధి నీమది కట్టిచర్య జేయ సమకట్టెనేమోగాని నామనోభావము అపరిమితభక్తివిశ్వాసములచే నిండి దుష్కృత్యముల కిసుమంతయైన చోటీడక శూలిపై యాధారడియుండ నీ కెట్లీగర్భచిహ్నము లగుపడుచున్న వనెను. అందున చండిక దోషార్హములు కాదుగావున ముఖ మతిప్రసన్నత గనుపడ తండ్రీ! ఏల నింద యను మందిరమున గూర్చొని విచారమను తలుపు తెరువక పైశాచికులగు ప్రజలమాటల గూర్చి కోట గట్టుచున్నాడవు నాబోటిబాలులతోఁగూడి శివాలయమున లింగమూర్తిని వివాహముచేసికొంటిని. అతడే నాభర్తారుఁడను నంతలో యచటనున్న వాడిబాలలు ఔనౌననిరి. ఈవిషయమును తెలిసికొనుటకై పరమభక్తు లెల్లరులను పిలిపించెను. వారీగర్భమున సర్వమత ఖండనశైవమతరంజనుండగు శంకరభక్తుం డవతరించగల డనిరి. అనంతరము నవమాసపూరితయైన

పిమ్మట చండిక నొకముద్దుకుమారుని గనెను. భక్తాగ్రిగణ్యు లెల్లరులును చేరి చిన్నవానికి శంకరదాసమయ్య యను నామ కరణము జేసిరి. ఈబాలు డెవ్వనుడై ఈశ్వరునిగురించి తపం బాచరింపగ పరాత్పరుండు ప్రిత్యక్షమై ప్రాణలింగమునకు ప్రికృతిశరీర మెటుల రక్షకమై యున్నదో యటులే మాన వులకెల్ల అంగరక్షక వస్త్రములం గుట్టి జీవింపుచుండుమని పూర్వ మసురేంద్రుండను పేరుగల రాక్షసునిసతి మేరుపర్వ తమున తపం బాచరించుచున్న మాగధుండను పేరుగల మహా రుషితో పతియాజ్ఞానుకూలముగ బొంది ఇంద్రుని జయింపగల బలపరాక్రిమవంతుడగు గజముఖాసురుని గనెను. వాడు దేవ తల నోడించునపుడెల్ల తనహస్తమునగల నిలువుకత్తి కొకరేఖ వేయుచుఇట్లుపదహారుమారులోడించి పదహారు రేఖలు వేసియుం చినయాగజముఖాసురుని సమస్తగణాధిపతియగుగజాననుడు సం హరించి వానిచేత షోడశరేఖలుగల ఖడ్గమును దెచ్చికరకంరున కిచ్చియుండెను. దానిని శంకరదాసమయ్య కిచ్చుటచే బుచ్చు కొనెను. అది గజముఖాసురుని పదహారుబిరుదు రేఖలుగల ఖడ్గము గావున దానికి గజమని పేరు గల్గెను. మరియు అసురులు తమశరీరకవచమును యుద్ధసమయములందు సంకేత ముగ గుట్టుకొనుచు తిరిగి యుద్ధమున కెప్పటివలె వచ్చుచుం డిరి. ఇది ప్రిథమమున పగవారిసహాయిని గావున దీనికి (సూడు) యని పేరు గలిగెను. (సూడు) యనగా పగయని యర్థము. పగవారికి సహాయకారియై తక్షణమే శరీర చర్మమును గుట్టి తిరిగి యుద్ధమునకు సిద్ధముచేయగల దగు

టచే (పగ) సూడుయని దానికి పేరు గల్గెను. ఇట్టిసూడును రాక్షసుల సంహరించి తీసికొనియుండెను. కావున యదిసహా శంకరదాసమయ్య కిచ్చివేసెను. అది సూడుయను పేరుతో పిలువబడుచు యనంతరము సూడు సూదు సూది యని మారెను. ఇది కుట్టునపుడు గుచ్చుకొనుటచే ఆదిశక్తియగు పార్వతీదేవి శంకరదాసమయ్యపై యనుగ్రహముగలదై తన కొప్పునందలి వజ్రఖచితమైన కుప్పెను అంగుష్టముగా పెట్టుకొని కుట్టుటకై నొసగెను. తదనంతర మాజగన్నాయకుండగు రుద్రుడు తనజడలోనుండి నొకనల్లనివిత్తును తీసియిచ్చి దీనిని విత్తిన నొక చెట్టగును. దానికాయ తనకుదానే పగిలి అందుండి తెల్లని తూలమను దూది వెళ్లును. అట్టిదూదిచే సిద్ధముచేయబడు తంతువను దారముచే జగంబునగల సమస్తమానవులకు అలంకారానుకూలవస్త్రములం గుట్టి జీవింపుమని పార్వతీశ్వరులంతర్థానులై పోయిరి. శంకరదాసమయ్యనిమిత్యార్థమై తన జడలోనుండి తీసియిచ్చిన దగుటచే జడపత్తి యని నామము గల్గెను. ఈశ్వరునిచే యనేకవరంబులను పరికరంబులను గొని శంకరదాసమయ్య తన నిజనివాసంబున కరిగి కాలము గడుపుచుండెను. ఇతనిని నెవ రడిగినను ఈశ్వరకులమని లౌకికులకు తెలియజేయుచుండెను.

బంగరుకొండ యను మేరువు బాహుబలముచే అసురులతో యుద్ధముచేసి వీరశాదస్త్రసమును నశింపజేసెను. మే మామేరుసంతతివారమైన మేరువారము సహా బాహుబలసంపన్నయుద్ధశ్రీసన్నుల మనియెదరు. సముద్రపుముత్యపుచిప్ప

యందుండి ఉత్పత్తి గావున చిప్పవారమనియు సముద్రము నకు దరియందు ముత్యపుచిప్పనుండి పుట్టిన జీవుల మగుటచే దరిజీవులమనియు మరియు శ్రీమదశేషచేతనవిశేషసమంచిత లోకకార్యకృచ్ఛ్రముపిహేతుభూతపరచిన్మయదివ్యశరీరిణియగు చండికాదేవివరప్రసాదకుల మనియు దెల్పు దరిజీవులయిన మేరువారుసహా కల్యాణపురంబున గలరు వీరుండు వీధికి మేరు వారివీధి యని నామము. మరియు మేరువునకు ఆయతి నియతి యను నిద్దఱు కూతురులు గలరు. వీరిని భృగువుకుమారులైన ధాత విధాతల కిచ్చెను. అందు విధాత నియతిని పెండ్లియాడి మృకండుని గనెను. ధాత ఆయతిని పెండ్లియాడి ప్రాణుని గనెను. నీప్రాణుడు వసిష్ఠునిపుత్రికయగు పుండరీకను పెండ్లి యాడి ద్యుతిమంతుని గనెను. అతడు స్వనవాతుని గనెను. (పైభృగువు బ్రహ్మహృదయమునుండి పుట్టి హిరణ్యకశిపుని కూతురైన దితిని పెండ్లియాడిన భృగువు కాడు.) కర్దమప్రజా పతిపుత్రి యైన ఖ్యాతిని వివాహమాడి ఆయమవలన ధాత విధాత లను పుత్రుల గన్నవాడు. నీమహానుభావుడు త్రిమూర్తులలో నెవరు ముక్తి యివ్వగలరని బదరికాశ్రమ ఋషులెల్లరును వాదించుకొని వీరిని నిర్ధారణచేయుటకై బంపగ ఇతడు బ్రహ్మలోకమున కేగి బ్రహ్మ గూర్చుండ నియోగింపక ముందే గూర్చుండెను. దానిపై బ్రహ్మ మహాకోపముగలవాడై చూచుచుండ నీవు రజోగుణప్రధాను డవు గావున నీకు పూజ లేకపోవుగాక యని శపించి కైలాసం బున కేగి కఱకంఠుని దర్శింపబోవ నాసమయమున పార్వతీ

శ్వరులు క్రీడించుచుండిరి. దాన ఆజ్ఞలేనిదేల వొచ్చితివని అస మానముగ కోపపడెను. నీవు తమోగుణ ప్రధానుడవు గావున నీరూపమునకు పూజ లేకపోవుగాక యని శపించి వైకుంఠమున కేగినతక్షణమే విష్ణుమూర్తిని జూడ నత డాతక్షణము వక్షస్థలమునుండి లక్ష్మిని దింపి లేచివచ్చి నిమ్మునికి నమస్కరింప నిత డాతనిని దన్నెను. అపు డాదినారాయణుం డామునిపాదములను బట్టి తమ కెట్టిశ్రమ గల్గెనో యని నొత్తుచుండ నీవే మోక్ష మియ్యగలవాడ వని యనేక విధములం ప్రార్థించెను. ఈకారణముచే మేరువారియందు విష్ణుమూర్తిని కడుభక్తితో పూజించు వైష్ణవమతస్థులు సహా గలరు. ఇందు నామదేవుడను నొకపరమభక్తుడు శ్రీపండరి నాథుని స్మరించుచు వైకుంఠప్రాప్తి నొందెను.

---

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 31 | 11 | దేవవాక్కు | వేదవాక్కు |
| 95 | 3 | గుజ్జవేల్పు | గుజ్జువేల్పు |
| 105 | 12 | మాడుచున్నది | మాడుచున్నవి |
| 221 | 12 | Ubbha | Uddha |
| 226 | 1 | మున్నీరరాజ | మున్నీరరాజు |
| 266 | 5 | గ్రంథ సంచయము | గ్రంథ పరిచయము |
| 280 | 3 | మతాచార్యులు | మతాచార్యులు |
| 281 | 2 | నజలం | నచలం |
| 298 | 22 | వజ్రిభేద | వజ్రభేద |
| 302 | 5 | ఊరు జనులును | ఊరుజాలును |
| 313 | 12 | పరిమితితో | పరిమితిలో |
| 315 | 10 | కలాజీ | కరాలి |
| 338 | 18 | దిగునట్లుగా | దెగునట్లుగా |
| 350 | 19 | నాబాలక | నాబాలిక |
| 351 | 14 | అందున | అందుకా |
| 353 | 9 | నల్లని ఎత్తును | నల్లని విత్తును |
| 354 | 15 | ఆయము వలన | ఆయమయందు |

